క్షేమేన్ద్రకృతయః

# ఔచిత్యవిచారచర్చా
# కవికణ్ఠాభరణమ్
# సువృత్తతిలకం చ

బాలానన్దినీవ్యాఖ్యయా

ఆంధ్రభాషావ్యాఖ్యయా

సముల్లసితాః

వ్యాఖ్యాయాః రచయితా

**డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు**

సురభారత్యలంకారగ్రంథమాల : ద్వితీయకుసుమము

క్షేమేన్ద్రకృతయః

# ఔచిత్యవిచారచర్చా
# కవికణ్ఠాభరణమ్
# సువృత్తతిలకం చ

డా॥ పుల్లెల శ్రీరామచంద్రేణ విరచితయా

బాలానన్దిన్యాఖ్యయా

ఆంధ్రభాషావ్యాఖ్యయా

సముల్లసితాః




సురభారతీ సమితి

హైదరాబాదు-500 007

సువృత్త తిలకమ్.

Auchityavicharacharcha
Kavikanthabharanam,
Suvrttatilakam

ప్రథమముద్రణము
జనవరి 1983

First Edition
January 1983.

వెల రూ॥ 21—00

Price Rs. 21–00

పుస్తకాలకు —
కార్యదర్శి,
సురభారతీసమితి,
ఉస్మానియా యూనివర్శిటీ కాంపస్
హైదరాబాద్—500 007

For Copies –
Secretary
Surabharati Samiti,
Osmania University
Campus,
Hyderabad – 500 007.



ముద్రణ ,
మహిళా ప్రెస్,
ఆంధ్ర మహిళా సభ,
విద్యానగర్
హైదరాబాద్—500 044

Printed at:
Mahila Press,
Andhra Mahila Sabha,
Vidyanagar,
Hyderabad – 500 044

**DEDICATED TO**

**Late Dr. N. Ramesan, I. A. S.,**

Whose love for "Surabharati" led to this blossoming
of
Publication Programme.

సమిత్యాం సురభారత్యాః యః శక్తిం సమచీక్ఌపత్
గ్రన్థప్రకాశనీం తస్మై రమేశాయ సమర్ప్యతే.

పుల్లెల శ్రీరామచంద్రుడు

| | | |
|---|---|---|
| 1. | భామహుని కావ్యాలంకారము :<br>తె. వ్యా. డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు | 8-00 |
| 2. | విదురనీతి : తెలుగు ప్రతిపదార్థతా :<br>శ్రీమతి సి. సుజాత | 10-00 |
| 3. | రామాయణంలోని రత్నాలు :<br>ప్ర. తా. డా॥ వి. అనసూయ | 6-50 |
| 4. | సామాన్య ధర్మములు :<br>శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రి | 6-00 |
| 5. | శాంతి పర్వంలోని సూక్తులు :<br>ప్ర తా. డా॥ కె. కమల | 6-00 |
| 6. | ఈశ ఐతరేయ కఠోపనిషత్తులు :<br>ప్ర. తా. శ్రీ వి. సుందరశర్మ | 6-00 |
| 7. | The Unique view Point of a Poet :<br>Sri A. V. Subramanian | 5-00 |
| 8. | శ్రీకృష్ణకర్ణామృతము :<br>డా॥ బి. రామరాజు | 16-00 |
| 9. | భాగవతములోని రత్నాలు :<br>శ్రీ ఎమ్. రంగాచార్యులు | 8-00 |
| 10. | సుందరపాండ్యుని ఆర్యా :<br>డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు | 5-00 |
| 11. | శివానందలహరి - సౌందర్యలహరి<br>డా॥ దివాకర్ల వెంకటావధాని | 10-00 |
| 12. | నీలకంఠదీక్షితుని కలివిడంబన - సభారంజన<br>వైరాగ్యశతకములు :<br>డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు | 6-00 |
| 3. | క్షేమేంద్రుని సేవ్యసేవకోపదేశము :<br>డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు | 1-00 |
| 4. | ఔచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము,<br>సువృత్తతిలకము | 21-00 |

డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు
సురభారతీ సమితి,
హైదరాబాదు-500007

# FOREWORD

In this volume Surabharati Samiti presents to lovers of Sanskrit three works of Kshemendra, a renowned poet of the eleventh century, and the author of many works of which only eighteen are available at present. Out of these the Samiti has chosen to publish in this volume Ouchitya Vichara Charcha, Kavi Kanthabaranam, and Suvritta Tilakam.

The first deals with the important aspect of Ouchitya (propriety) in a kavya. In this work Kshemendra gives 107 examples of verses of various authors including 36 of Kshemendra himself. In order to fully appreciate the importance of Ouchitya, Kshemendra very boldly gives examples of verses suffering from lack of Ouchitya of even such great poets as Kalidasa, Bhavabhuti and Bana.

The second work included in this volume describes how to acquire mastery over the art or science of writing poetry from the most elementary stages to the stage of perfection. Some great poets no doubt are born and not made. But There are many others who by constant effort and application and devotion to the subject succeed in establishing themselves as poets of repute and this work is a valuable asset to them.

The last work of this volume is Suvritta Tilakam which deals with the science of chandas (metre). As Dr. Sri Ramachandrudu points out in his introduction, there has been no other work on this subject comparable to this either before Kshmendra's time or thereafter.

Dr. Sri Ramachandrudu has done a distinct service not only to the Surabharati Samiti of which he is the Secretary but also to all those who are Interested in Sanskrit poetry by giving an excellent translation of these important works along with his Comments. It is hoped that like all prior publications of the Samiti, this volume will earn the appreciation of lovers of Sanskrit literature.

ALLADI KUPPUSWAMI
Chief Justice of A. P. (Retd )
President
Surabharati Samiti.

Hyderabad,
1–1–1983.

# అవతరణిక

అలంకారశాస్త్రచరిత్రలో 10—11 శతాబ్దాలు చాలా ప్రధాన మైనవి. ఈ రెండు శతాబ్దుల కాలంలో, ఎన్నో అలంకార శాస్త్రగ్రంథాలు, ప్రధానంగా కాశ్మీర మాల్వా దేశాల నుంచి వెలువడ్డాయి. అభినవగుప్తుడు, మమ్మటుడు, కుంతకుడు, మహిమభట్టు, ధనంజయుడు, ధనికుడు, హలాయుధుడు, భోజుడు మొదలైన వారు వీరిలో చెప్పుకోదగినవారు. ఈ కాలానికే చెందిన క్షేమేంద్రుడు. మహాకవి, అలంకారికుడూ కూడా.

క్షేమేంద్రుడు క్రీ.శ. 1028 నుండి 1063 వరకూ కాశ్మీరదేశాన్ని పాలించిన అనంతుని ఆస్థానంలోనూ 1063 నుండి 1089 వరకూ రాజ్యం పాలించిన అనంతుని కుమారుడు కలశుని ఆస్థానంలోనూ ఉండేవాడు. ఈతడు బృహత్కథామంజరి 1039 లోనూ, సమయమాతృక 1050 లోనూ, దశావ తారచరితము 1066 లోనూ పూర్తి చేసినట్లు వ్రాసుకున్నాడు. అభినవ గుప్తుని దగ్గర అలంకారశాస్త్రం అభ్యసించినట్లుగా కూడా చెప్పుకున్నాడు. అభినవగుప్తుని గ్రంథరచనాకాలం క్రీ.శ. 990-1020 సంవత్సరాల మధ్య కాలం అని పండితుల నిర్ణయము. అందుచేత క్షేమేంద్రుడు పదకొండవ శతాబ్ది ప్రథమపాదంలో జనించి ద్వితీయ, తృతీయ పాదాలలో గ్రంథరచన సాగించి ఉంటాడని ఊహించవచ్చును.

క్షేమేంద్రుని తండ్రి పేరు ప్రకాశేంద్రుడు. ఈయన గొప్ప శివ భక్తుడు; అనంతైశ్వర్యవంతుడు. దేవతలకోసమూ, బ్రాహ్మణుల దానాల కోసమూ, మఠాలకోసమూ మూడు కోట్లు ఖర్చుపెట్టినాడట ఈ విధంగా క్షేమేంద్రుడు గొప్ప ఐశ్వర్యవంతుల కుటుంబంలో పుట్టినాడు. గంగకోపా ధ్యాయుడు, అభినవగుప్తుడు, సోమాచార్యుడు అను పండితులవద్ద విద్యా భ్యాసం చేసినాడు. క్షేమేంద్రుడు తాను సర్వమనీషిశిష్యుడ నని చెప్పుకున్నాడు.

అందుచేత ఈతని గురువైన అభినవగుప్తుడు దాదాపు ఇరవైమంది పండితుల వద్ద విద్యాభ్యాసం చేసినట్లు ఇతడు కూడా అనేక పండితులవద్ద విద్యాభ్యాసం చేసి ఉండవచ్చును. అభినవగుప్తుని వద్ద దాదాపు 1200 మంది విద్యార్థు లుండేవారట. వారిలో ఒకడు క్షేమేంద్రుడు. ఈతని వద్ద కూడా ఎందరో రాజులూ, రాజకుమారులూ విద్యాభ్యాసం చేసి ఉన్నారు. ఉదయసింహు డనే రాజకుమారునికొరకై ఔచిత్యవిచారచర్చ రచించినట్లు గ్రంథాంతంలో చెప్పి ఉన్నాడు. సజ్జనానందుని కోరికను అనుసరించి, వీర్యభద్రు డనే బౌద్ధపండి తుని సహాయంతో బౌద్ధావదాన కల్పలతలోని 107 పల్లవాలు వ్రాసినాడు. చివరి 108వ పల్లవం క్షేమేంద్రుని కుమారుడు సోమేంద్రుడు పూర్తి చేసినాడు. రామయశస్సు అనే మిత్రుని కోరిక ప్రకారం ఎన్నో గ్రంథాలు రచించాడు. సూర్యసూరి అనేవాడు క్షేమేంద్రుని వద్ద వ్రాయసగాడుగా ఉండే వాడట. ఈతని పేరు, ఈతని తండ్రి-కొడుకుల పేర్లు పట్టిచూడగా ఈ కుటుంబం లోని వారి పేర్లు 'ఇంద్ర' శబ్దాంతములుగా ఉండే వని తోచుచున్నది.

క్షేమేంద్రునికి వ్యాసుని మీద అమిత మైన భక్తి. మహాభారతాన్ని సంక్షిప్తంగా వ్రాసి "భారతమంజరి" అనే గ్రంథం రచించి "వ్యాసదాస" అనే బిరుదం సంపాదించినాడు. (మన వారైతే-"అపరవ్యాస" అనో 'ఆంధ్రవ్యాస' అనో, బిరుదు తగల్చుకొనేవారు!) జన్మతః పరమమాహే శ్వరుడే అయినా సోమపాదు డనే గురువు ప్రభావంచేత విష్ణుభక్తుడై 'దశావతార చరితము' రచించినాడు.

<u>క్షేమేంద్రుని రచనలు:-</u> క్షేమేంద్రుడురచించిన అనేక గ్రంథాలలో పద్దెనిమిది గ్రంథాలు మాత్రమే ఇపుడు లభ్యం అవుతున్నాయి. పదిహేడు గ్రంథాలను ఈతడు అక్కడక్కడ పేర్కొని ఉండడం చేత వాటి స్వరూపాన్ని గూర్చి కొంతవరకు ఊహించడానికి వీలవుతున్నది.

<u>లభ్యమవుతున్న గ్రంథాలు:-</u> ఈసంపుటంలో ఔచిత్య విచారచర్చ, కవి కంఠాభరణము, సువృత్తతిలకము అనే మూడు గ్రంథాలు చేర్చబడి ఉన్నాయి. వాటిని గూర్చి తరువాత చర్చించెదము.

1 బౌద్ధావదాన కల్పలత: - ఇది బుద్ధుని జాతక కథల సంగ్రహము పల్లవాలు అనే పేరుతో 108 అధ్యాయాలు ఉన్నాయి. చివరిది ఈతని కుమారుడైన సోమేంద్రుడు వ్రాసినది. ఇది మిథిలా గ్రంథమాలలో 1958 లో ప్రకటింపబడింది.

2. భారతమంజరి :- హరివంశంతో కూడా కలిపి 19 పర్వాలలో మహాభారతకథ 10692 శ్లోకాలలో సంగ్రహింపబడింది. చాలా కాలంక్రితం కావ్యమాలలో ప్రకటింపబడింది.

3 బృహత్కథామంజరి :- ఇది గుణాఢ్యుని బృహత్కథకు సంగ్రహము. 13 లంబకాలు, 7639 శ్లోకాలు ఉన్నవి. కావ్యమాలలో ప్రకటితము. బృహత్కను క్షేమేంద్రుని సమకాలీను డైన సోమదేవుడు "కథాసరిత్సాగరం" అనే పేరుతోతూ, 900 ప్రాంతంవాడైన బుద్ధస్వామి "బృహత్కథా శ్లోక సంగ్రహము" అనే పేరుతోను సంగ్రహించి ఉన్నారు.

4. దశావతారచరితము :— కావ్యమాలా ప్రచురణము, 1764 శ్లోకాలలో దశావతారవర్ణనాత్మకము.

5. నీతి కల్పతరువు:— "కుసుమములు" అనే 138 అంతర్విభాగాలతో రాజనీతిని బోధించే గ్రంథము. భండార్కర్ ఇన్స్టిట్యూట్, పూనా, 1956లో ప్రకటించినది.

6. రామాయణమంజరి:— ఏడు కాండలలో రామాయణ కథను సంగ్రహించిన 6186 శ్లోకాల గ్రంథము. కావ్యమాల ప్రచురణ.

7. లోకప్రకాశము:- హిందువుల దైనందిన జీవితానికి, కాశ్మీర దేశ పరిపాలనా విధానాదులకీ సంబంధించిన గ్రంథము, దీని కర్తృత్వం విషయంలో అభిప్రాయభేదాలు ఉన్నాయి.

8. చతుర్వర్గసంగ్రహము:- ఇది నాలుగు పరిచ్ఛేదాలలో ధర్మార్థకామ మోక్షాలనే నాలుగుపురుషార్థాలను గూర్చి చక్కగా వర్ణించిన 106 శ్లోకాల గ్రంథము.

9. చారుచర్య:- ఇందు మంచి నడవడికను ఉపదేశించే 101 అనుష్టుప్ శ్లోకాలు ఉన్నాయి. శ్లోకంలోని పూర్వార్థం ఒక నీతిని ప్రతిపాదిస్తుంది. ఉత్తరార్థం, రామాయణ మహాభారతబృహత్కథాదులనుంచి ఉదాహరణగా ఒక కథను నిర్దేశిస్తుంది.

10. దర్పదలనము:- సాధారణంగా మానవునికి దర్పం కలిగించేవి ఏడు- కులము, ధనము, విద్య, రూపము, శౌర్యము, దానము, తపస్సు. వీటి వల్ల ఏ విధంగా దర్పం కలుగుతుందో, జాగర్తగా పరిశీలిస్తే అదంతా ఎంత అర్థవిహీనమో, వ్యర్థమో బోధిస్తూ ఏడు "విచారాల"లో వ్రాసిన 596 శ్లోకాల గ్రంథం ఇది. ఇది నీతిబోధనకై ఉద్దిష్టమైన అధిక్షేపణ కావ్యము (Satire).

11. సేవ్యసేవకోపదేశము:- సేవకుల కష్టాలను వర్ణిస్తూ సేవ్యసేవకుల మధ్య ఎలాంటి సత్సంబంధాలు ఉంటే బాగుంటుందో సూచించే 61 శ్లోకాల లఘుకృతి. సురభారతీ సమితి ప్రచురించింది.

12. కలావిలాసము:- ఇందులో 557 శ్లోకాలు, 10 సర్గలు ఉన్నాయి.

13. దేశోపదేశము:- ఇందులో ఎనిమిది ఉపదేశాలు (విభాగాలు) 300 శ్లోకాలు ఉన్నవి.

14. నర్మమాల:- ఇందులో మూడు "పరిహాసాలు" (విభాగాలు) 386 శ్లోకాలు ఉన్నాయి.

15. సమయమాతృక:- ఇందులో 8 సమయాలు (విభాగాలు) 639 శ్లోకాలు ఉన్నాయి. ఈ నాలుగు రచనలలో క్షేమేంద్రుడు తన కాలంలో ఉన్న దురాచారాలనూ, దుష్ప్రభువులనూ, అధికారుల అన్యాయాలనూ, వర్తకులు, స్వర్ణకారాది వివిధ శిల్పులు, మతగురువులు, వేశ్యలు, గాయకులు, భిక్షుకులు మొదలైన వాళ్ళుచేసే మోసాలను వ్యంగ్యోక్తిభరితమైన శైలిలో చక్కగా చిత్రించినాడు. సంస్కృత కావ్యాలలో ఉండే హాస్యానికీ,

అధిక్షేపానికీ (Satire) ఇవి అత్యుత్తమ మైన ఉదాహరణలు. 'సమయ మాతృక'లో వేశ్యావృత్తికి సంబంధించిన అతివిస్తృతవర్ణనం ఉన్నది. 8-15 సంఖ్యలు గల లఘుకృతులు సంస్కృత అకాడమీ, ఉస్మానియా యూనివర్సిటీవారు ప్రచురించినారు.

లభించని గ్రంథాలు:- 1. అమృతతరంగము: దేవదానవులు చేసిన క్షీర సాగర మథనం వర్ణించే కావ్యమై ఉంటుంది.

2. అవతారసారము:- ఎవరో గొప్పరాజును, బహుశా తనకు ఆశ్రయ మిచ్చిన అనంతరాజును వర్ణించే కావ్యము.

3. చిత్రభారతము:- మహాభారతకథతో వ్రాసిన రూపకము.

4. కనకజానకి;- బహుశా రాముడు అరణ్యవాసంనుంచి తిరిగి వచ్చిన పిమ్మట జరిగిన కథను ఆధారంగా చేసుకొని వ్రాసిన రూపకం అయి ఉంటుంది.

5. కవికర్ణిక:- కవి శిక్షాగ్రంథం అయి ఉంటుంది

6. క్షేమేంద్రప్రకాశము:- కవికంఠాభరణంలోని 10వ శ్లోకంలో చెప్పి నట్లు క్షేమేంద్రత్వాన్ని సంపాదింప గల మంత్రసిద్ధిని గూర్చి చెప్పే గ్రంథం అయి ఉండవచ్చును.

7. లలితరత్నమాల:- రత్నవతీ వత్సరాజుల ప్రణయగాథను చిత్రించే రూపకం అయి ఉంటుంది

8. లావణ్యవతీకావ్యము:- అత్రివసువు అనే శ్రోత్రియుణ్ణి వశం చేసు కోవడంకొరకై ప్రయత్నించిన లావణ్యవతి అనే వేశ్యకథను చిత్రించే కావ్యము.

9 ముక్తావలి:- ఒక యోగీంద్రుని జీవితచరిత్రను వర్ణించే కావ్యము.

10 మునిమతమీమాంస;- వ్యాసుని ఉపదేశాల సారాన్ని సంగ్రహించి వ్రాసిన రచన

11. నీతికల్పలత;- రామాయణంలోని చిన్న కథాంశాలను ఉదాహరణలుగా చూపుతూ వ్రాసిన నీతికావ్యము.

12. నృపవతీ లేదా రాజావతీ;- కాశ్మీరరాజులకు సంబంధించిన ఐతిహాసిక కావ్యము. దీనిని గూర్చి రాజతరంగిణి ద్వారా తెలుస్తూన్నది.

13. పద్యకాదంబరి:- బాణుని కాదంబరికి పద్యరూప సంగ్రహము.

14. పవన పంచాశిక :- వాయువును వర్ణించే 50 శ్లోకాల లఘు కావ్యము.

15 శశివంశము :- చంద్రవంశరాజుల చరిత్రలను వర్ణించే మహాకావ్యం అయి ఉంటుంది.

16. వాత్స్యాయన సూత్రసారము:- వాత్స్యాయసుని కామసూత్రాల విషయ సంగ్రహమై ఉంటుంది.

17. వినయవతీ ;- మహాభారతంలోని ఏదో ఒక కథను ఆధారంగా తీసుకొని వ్రాసిన కావ్యం అయి ఉండవచ్చును.

ఔచిత్య విచారచర్చ ప్రారంభంలో క్షేమేంద్రుడు-
"కృత్వాపి కావ్యాలఙ్కారాం క్షేమేన్ద్రః కవి కర్ణికామ్
తత్కాలఙ్కం వివేకం చ విధాయ విబుధప్రియమ్"

అని వ్రాసి ఉన్నాడు. ఇక్కడ బహుశా 'కావ్యాలఙ్కారాన్' అనే పాఠం ఉండి ఉండాలి. దానిని పొరబాటుచేత "కావ్యాలఙ్కారాం" అని వ్రాసి ఉంటారు. కాని అలఙ్కార శబ్దం నిత్యపుంలింగం అవడం చేత కావ్యాలం కారం". అని ఉండాలి కాని "కావ్యాలంకారాం" అని కాదు. "కావ్యాలం ఙ్కారాన్" అనే పాఠం ఉన్నట్లు అంగీకరిస్తే "కవికర్ణిక" తత్కాలంకము అనగా "కవి కలంకము" "కవి వివేకము" అనే కావ్యాలంకారములను రచించి అని అర్థం చెప్పవచ్చును. ఏ అలంకార గ్రంథానికైనా "కావ్యాలం

కారం" అనేది సాధారణనామధేయంగా వాడడం పరిపాటియే కదా. అందుచేత క్షేమేంద్రుడు పై రెండు అలంకారశాస్త్ర గ్రంథాలు కూడా వ్రాసి ఉండవచ్చును అని నా అభిప్రాయము.

ఈ సంపుటంలో ఔచిత్యవిచారచర్చా, కవికంఠాభరణము, సువృత్తతిలకము అనే మూడు గ్రంథాలు బాలానందిని అనే తెలుగు వ్యాఖ్యతో ప్రచురింపబడుచున్నాయి.

ఔచిత్యవిచారచర్చ - కావ్యంలో ఔచిత్యం చాలా ప్రధానమైనది అనే విషయాన్ని ప్రతిపాదించే గ్రంథం ఇది. కావ్యానికి రసం జీవితం అయితే రసానికి కూడా జీవితం ఔచిత్యము. ఇది లేని పక్షాన గుణాలంకారాదులు ఎన్ని ఉన్నా వ్యర్థమే; రసచర్వణ కూడా సాధ్యం కాదు అని క్షేమేంద్రుని అభిప్రాయము. ఈ విషయమే ఈ గ్రంథంలో సవిస్తరంగా విచారింపబడింది. ఐతే క్షేమేంద్రుడు ఈ గ్రంథానికి ఈ పేరు ఎందుకు పెట్టినాడో స్పష్టం కాదు. "విచారము" అన్నా "చర్చ" అన్నా అర్థం ఒకటే. అందుచేత "ఔచిత్య విచారం" అని కాని "ఔచిత్య చర్చ" అని కాని పేరుపెడితే చాలు. రెండు పదాలప్రయోగం అనావశ్యకము. ఈ పేరు ఈతడు పెట్టినదే కాని ఇతరులు గ్రంథాద్యంతాలలో చేర్చినది కాదు. మూడవ శ్లోకంలో "ఔచిత్యస్య విచారం" అని అన్నా, ఉపసంహారశ్లోకాలలోని మూడవ శ్లోకంలో "ఔచిత్య విచారచర్చామ్" అనే పదం ప్రయోగించి ఉన్నాడు. "చర్చా" అనే పదానికి "విమర్శ" అనే సామాన్యార్థం చెప్పుకొని ఔచిత్యవిచార మనే చర్చ అని అర్థం గ్రహించి ఏదో విధంగా సరిపెట్టుకోవాలి. "సంఖ్యా చర్చా విచారణా" అని అమరంలో కూడా ఈ రెండూ సమానార్థకాలుగానే చెప్పబడ్డాయి.

కావ్యంలో అనౌచిత్యాన్ని మించిన రసభంగహేతువు మరొకటి లేదనీ. రసంలో ఉన్న రహస్యం అంతా ఔచిత్యసంరక్షణమే అనీ ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో స్పష్టీకరించి ఉన్నాడు.

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్.
ఔచిత్యోపనిబన్ధస్తు రసస్యోపనిషత్పరా" (ధ్వ. III. ఉద్యో)

ప్రబంధంలో రసాన్ని ఏ విధంగా నిర్వహించాలి అని చెప్పే ఘట్టంలో ఆనందవర్ధనుడు దీనికి సంబంధించిన ఎన్నో విషయాలు చెప్పి ఉన్నాడు— విభావానుభావ సంచారిభావాలలో ఔచిత్యం పాటించాలి. మూల కథలో ఉన్న, రసానికి అనుగుణంగా లేని విషయాలు త్యజించాలి. సంధి సంధ్యంగాదులు రసానికి అనుగుణంగా ఉన్నంతవరకే కూర్చాలి. శాస్త్రంలో చెప్పినారు కదా అని కూర్చ కూడదు. చేతనౌను కదా అని ఎక్కువ అలంకారాలు గుప్పించ కూడదు. ప్రధానరసాన్ని మర్చిపోకూడదు. సామాన్య మానవుల చరిత్రను చిత్రించే సందర్భాలలో వారికి అలౌకికశక్తు లున్నట్లుగా వర్ణించకూడదు. అన్ని విధాల ఔచిత్యాన్ని పాటిస్తేనే రసనిర్వహణంలో కవి సఫలుడౌతాడు. ఈ విధంగా రసం విషయంలో పాటించదగిన ఔచిత్యాన్ని గూర్చి ఆతడు ప్రతిపాదించినాడు. ఈ విషయం చెప్పిన తరువాత ఆనందవర్ధనుడు-సుప్-తిఙ్ విభక్తి ప్రత్యయాలు, వచనాలు, సంబంధము, కారకాలు, కృత్-తద్ధిత ప్రత్యయాలు, సమాసాలు, నిపాతలు, ఉపసర్గలు, కాలాదులూ కూడా రసాదులను వ్యంజింపచేయడానికి ఉపకరిస్తా యని సోదాహరణంగా నిరూపించినాడు. పద-వాక్య-ప్రబంధాలకి వ్యంజకత్వాన్ని ముందుగానే ప్రతిపాదించి ఉన్నాడు.

క్షేమేంద్రుడు ఈ విషయా న్నంతనీ ఆకళించుకొని తన సిద్ధాంతానికి అనుగుణంగా మలచుకొని మరికొన్ని విషయాలు చేర్చి కావ్యానికి జీవితం ఈ ఔచిత్యమే అనీ, ఇది పద-వాక్య-ప్రబంధార్థ-గుణ-రస-అలంకార-క్రియా-కారక-లింగ-వచన - విశేషణ - ఉపసర్గ -నిపాత - కాల -దేశ -కుల-వ్రత-సత్త్వ - తత్త్వ - అభిప్రాయ - స్వభావ - సారసంగ్రహ - ప్రతిభా - అవస్థా - విచార - నామ - ఆశీస్సులనే 27 కావ్యాంగాలను ఆశ్రయించి ఉంటుం దనీ ప్రతిపాదించాడు. వీటి కన్నింటికీ లక్షణాలు చెప్పి, ఉదాహరణ ప్రత్యుదాహరణలతో విశదీకరించినాడు. ఈ గ్రంథంలో మొత్తం 38 కారికలు, 107 ఉదాహరణ-ప్రత్యుదాహరణ శ్లోకాలు ఉన్నాయి. వీటిలో 36 శ్లోకాలు క్షేమేంద్రునివే తాను ఏ ఔచిత్యాన్ని గూర్చి చెప్పినాడో అదిఉన్న శ్లోకాన్ని ఉదారహణముగా చూపి, అందులో ఉన్న ఔచిత్యాన్ని తన మాట

లలో విశదీకరించి, ఆ ఔచిత్యం లేని శ్లోకం ప్రత్యుదాహరణంగా ఇచ్చి, అందులో, ఔచిత్యం ఏ విధంగా లోపించిందో స్పష్టీకరించడంచేత విషయం అతిస్పష్టంగా తెలుస్తూన్నది. ఆయా ఔచిత్యాలకి ప్రత్యుదాహరణంగా (ఔచిత్యం లేకపోవడానికి ఉదాహరణంగా) అమరుక - కాలిదాస - భవభూతి - బాణ - కుమారదాస - మాఘ - రాజశేఖరాదుల వంటి మహామహుల శ్లోకాలు కూడా చూపడానికి వెనుకాడకపోవడమే కాకుండా తన శ్లోకాలు కూడా చూపించి క్షేమేంద్రుడు తత్త్వనిర్ణయవిషయంలో ఎలాంటి నిష్పాక్షికదృష్టి ఉండవలెనో నిరూపించినాడు. ఐతే ఈ విభేదాలలో కొన్ని చెప్పాలికదా అని చెప్పినట్లు ఉంటాయి. ముఖ్యంగా కారకౌచిత్య కాలౌచిత్య భేదాలలో ఇది కనబడుతుంది. సంప్రదాన-అపాదాన- అధికరణాద్యౌచిత్యాదులకు ఇచ్చిన ఉదాహరణలలో ఆ కారకాలలో విశిష్టమైన ఔచిత్యం ఏమున్నదో సరిగా అర్థం కాదు. అక్కడ ఆ కారకాన్నీ, ఆ విభక్తినీ, తప్ప మరొకటి ఏదీ ప్రయోగించడానికి అవకాశమే లేదు కదా? భూతవర్తమానాదికాలాల విషయంలో కూడా ఇంతే.

మొత్తంమీద ఔచిత్యవిచారచర్చలో ఏదో నూతనత్వం ఉన్నట్లు ఆపాతతః కనబడినా ఇది ఆనందవర్ధనుడు చెప్పిన విషయాల పునఃసంకలనమే అని చెప్పక తప్పదు. అందుచేత ఈ ఔచిత్యసిద్ధాంతానికి అలంకార-ధ్వని సిద్ధాంతాదుల వలె స్వతంత్రప్రతిపత్తి ఇవ్వవలసిన పని లేదని నా అభిప్రాయము. ఇలాంటి విషయా లన్నీ సంగ్రహించి రేపు మరొకరు "వివేక సిద్ధాంతం" వంటి పేర్లతో మరి కొన్ని సిద్ధాంతాలు కూడా లేవదీయవచ్చు. తావన్మాత్రంచేత దానికొక నూతన వైశిష్ట్యం కల్పింపజాలం కదా?

<u>కవికంఠాభరణము:</u>- కవిత్వం వ్రాయదలచినవాళ్లు ఏమేమి చెయ్యాలో ఉపదేశిస్తూ కొన్ని గ్రంథాలు ఉన్నాయి. వీటికి "కవిశిక్ష" లని పేరు. ఇవి అలంకారశాస్త్రగ్రంథాలకి అనుబంధా లని చెప్పవచ్చు. రాజశేఖరుని ప్రసిద్ధ గ్రంథం, కావ్యమీమాంస ఈ కోవకి చెందినదే. జైనపండితులు ఈ రకమైన గ్రంథాలు చాలా వ్రాసినట్లు కనబడుతుంది. ఉదాహరణకి—హేమచంద్రుడు,

ఇద్దరు వాగ్భటులూ కూడా (వీరుముగ్గురూ జైనులే) తమ కావ్యాలంకారాలలో కవిశిక్షకు సంబంధించిన విషయాలు ఎక్కువగా చేర్చినారు. ఐతే ఈ విషయానికి సంబంధించిన స్వతంత్రగ్రంథాలలో జయమంగళాచార్యుని (12వ శతాబ్ది ప్రారంభము) "కవిశిక్ష" మొదటి దని చెప్పవచ్చును. అజ్ఞాతకర్తృక మైన "కవికల్పలతావివేకం" కూడా ప్రాచీనమైనదే. దీని ప్రాచీన లిఖిత ప్రతిలో క్రీ.శ. 1148-49 సంవత్సరానికి సరిపోయే 1205 విక్రమవర్షం గుర్తించబడింది. క్రీ.శ 13 వ శతాబ్దానికి సంబంధించిన అరిసింహుడు, అమరచంద్రసూరి అనే ఇద్దరు పండితులు కలిసి రచించిన "కావ్యకల్పలత" ప్రసిద్ధ మైనది. దీనికి అమరచంద్రసూరి, "కావ్యశిక్షా" అను పేరుతో ఒక వ్యాఖ్య వ్రాసి ఉన్నాడు. ఈ కాలంలోనే వినయచంద్రాచార్యుడు "కావ్యశిక్షా" అనే పేరుతో మరొక గ్రంథం రచించినాడు. 14 వ శతాబ్దం ప్రాంతం వాడైన దేవేశ్వరుడు పైన చెప్పిన కావ్యకల్పలతను అనుకరిస్తూ మరొక కావ్యకల్పలతను రచించినాడు. ఈ శిక్షాగ్రంథా లన్నీ గుజరాతుకు చెందిన జైనపండితులు వ్రాయడం గమనించతగిన విషయము. క్షేమేంద్రుని కవికంఠాభరణం కూడా ఒక "కవిశిక్ష". ఇందులో "సంధి"అనేపేరుతో ఐదు విభాగా లున్నాయి "కవిత్వప్రాప్తి" అనే ప్రథమ సంధిలో కవితాశక్తిని సంపాదించుకొనే దేవతానుగ్రహపురుషప్రయత్నరూపా లైన ఉపాయాలు చెప్పబడ్డాయి. ప్రారంభదశలో వృత్తనిర్మాణంలో చెయ్యి తిరగడం కోసం, లేదా నోరు తిరగడం కోసం, అర్థం ఉన్నా లేకపోయినా ఏవో పదాలు కూర్చి పద్యాలు అల్లుతూ ఉండాలట. (I-21-1) ప్రసిద్ధ మైన కాళిదాసాదిశ్లోకాలు తీసుకొని కొన్ని పదాలు మార్చి కొత్త పదాలు చేరుస్తూ—

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ" — అని ఉంటే
"వాణ్యర్థావివ సంయుక్తౌ వాణ్యర్థప్రతిపత్తయే
జగతో జనకౌ వన్దే శర్వాణీశశిశేఖరౌ"

ఇత్యాదివిధంగా మార్చి వ్రాస్తూ ఉండాలట. కొన్నాళ్ళకి స్వయంగా కవిత్వం వ్రాయడం అలవాటు అవుతుంది.

"శిక్షాకథనమ్" అనే ద్వితీయసంధిలో, ఛాయోపజీవి (పూర్వకవుల కావ్యాలలోని అర్థచ్ఛాయలను ఆధారంగా తీసికొని కవిత్వం వ్రాసేవాడు) పదకోపజీవి (పదాలు తీసుకొనేవాడు) పాదోపజీవి (నాల్గోవంతు తీసుకొనే వాడు) సకలోపజీవి (అంతా ఇతరులనుండే తీసికొనే వాడు) అని నాలుగు విధాల కవులుంటా రని సోదాహరణంగా చెప్పి కవిత్వం నేర్చుకోవడానికి 20 కారికలలో నూరు ఉపాయాలు చెప్పినాడు. "చమత్కారకథనమ్" అనే చతుర్థసంధిలో శబ్ద-అర్థ-అలంకార-రసాదులలో ఉండే చమత్కారాన్ని సోదాహరణంగా విశదీకరించాడు. "గుణదోషవిభాగః" అనే చతుర్థసంధిలో శబ్ద వైమల్యము, అర్థవైమల్యము, రసవైమల్యము అనే మూడు కావ్యగుణాలను, శబ్దకాలుష్యము, అర్థకాలుష్యము, రసకాలుష్యము అనేమూడు కావ్యదోషాలను సోదాహరణంగా విశదీకరించాడు. కవిత్వం వ్రాయయదలచినవానికి ఏయే శాస్త్రాలతో, కళలతో పరిచయం ఉండాలో "పరిచయప్రాప్తి" అనే పంచమ సంధిలో చెప్పినాడు. ఈ విధంగా "కవికంఠాభరణం"లో క్షేమేంద్రుడు ఎన్నో విషయాలు చక్కగా ప్రతిపాదించి ఉన్నాడు.

<u>సువృత్త తిలకము</u>:-ఇది ఛందఃశాస్త్రానికి సంబంధించిన గ్రంథము. ఇందులో వృత్తావచనయము, గుణదోషదర్శనము వృత్తవినియోగము అనేమూడు "విన్యాసాలు" ఉన్నాయి. మహాకవులు తరుచుగా ఉపయోగించే ప్రసిద్ధమైన 26 వృత్తాలు లక్షణ లక్ష్యాలతో విశదీకరింపబడి ఉన్నాయి. ఇవి అనుష్టుభ్, భుజంగశిశుభృత, దోధక, దృతవిలంబిత, హరిణీ, ఇంద్రవజ్రా, కుమార లలితా, మందాక్రాంతా, మాలినీ, నర్కుటక, ప్రహర్షిణీ, ప్రమాణీ, పృథ్వీ, రథోద్ధతా, శాలినీ, శార్దూలవిక్రీడిత శిఖరిణీ, స్రగ్ధరా, స్వాగతా, తనుమధ్యా, తోటక, ఉతజాతి, ఉపేంద్రవజ్రా, విద్యున్మాలా, వంశస్థ, వసంతతిలక వృత్తాలు ఈ వృత్తాలను ఏ విధంగా నడిపిస్తే అందంగా ఉంటుందో ఎలా నడిపించకూడదో, ఏయే రసాలకి ఏ యే వృత్తాలు అనుకూలంగా ఉంటాయో ఉదాహరణ ప్రత్యుదాహరణలతో, నిరూపింపబడింది. పూర్వకవులలో ఏ కవికి ఏ వృత్తం నడిపించడంలో మంచి నేర్పుఉన్నదో క్షేమేంద్రుడు చెప్పి

ఉన్నాడు. అభినందుడు అనుష్టుప్పునీ, పాణినీ ఉపజాతినీ, భారవి వంశస్థ వృత్తాన్నీ, రత్నాకరుడు వసంతతిలకాన్నీ, కాళిదాసు మందాక్రాంతాన్నీ, రాజశేఖరుడు శార్దూలవిక్రీడితాన్నీ నడపడంలో మంచి నేర్పు కలవారట. వృత్తాలను గూర్చి ఇంత సునిశిత దృష్టితో చేసిన పరిశీలన క్షేమేంద్రునికి పూర్వం కాని, తరువాత కాని జరగలేదు. దీనిలో క్షేమేంద్రుని ప్రతిభావిశేషం స్పష్టంగా గోచరిస్తూన్నది.

క్షేమేంద్రుని ఈ మూడు కావ్యశాస్త్రగ్రంథాలనూ సురభారతీసమితి "బాలానందిని" అనే ఆంధ్రభాషా వ్యాఖ్యతో ఆంధ్రలోకానికి అందజేస్తూ వారు దీనిని సాదరంగా పరిగ్రహిస్తారని ఆశిస్తూన్నది. ఈ వ్యాఖ్య వ్రాసే అవకాశం ఇచ్చిన సురభారతీసమితి కార్యవర్గ సభ్యులకూ, ఈ గ్రంథానికి ఆంగ్లభాషలో తొలిపలుకు వ్రాసిన ఆంధ్రప్రదేశ భూతపూర్వ ప్రధానన్యాయమూర్తులూ, సురభారతీ సమిత్యధ్యక్షులూ అయిన శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారికి నా కృతజ్ఞతలను తెలుపుతున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు

కార్యదర్శి-సురభారతీసమితి
రీడర్, సంస్కృత విభాగము;
డైరెక్టర్- సంస్కృత అకాడమీ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు
30-12-1982

# విషయసూచిక

## ఔచిత్యవిచారచర్చ 1-142

శ్రీ మహాగణాధిపతయే నమః

# ఔచిత్యవిచారచర్చా

కృతారివఞ్చనే దృష్టిర్యేనాఞ్జనమలీమసా
అచ్యుతాయ నమస్తస్మై పరమౌచిత్యకారిణే 1

బాలానందినీ వ్యాఖ్యా

నత్వా శ్రీతాతపాదాదీన్ శాస్త్రమంత్రాదిసద్గురూన్
ఔచిత్యసద్విచారస్య చర్చామాంధ్ర్యాం వివృణ్మహే

శత్రువులను వంచించు సమయమున కండ్లను కాటుకతో నల్లగా ఉండునట్లు చేసికొని మంచి ఔచిత్యజ్ఞానము చూపించిన ( మోహినీ రూప ధారియైన) ఆ అచ్యుతునకు నమస్కారము.

వివరణము :- పెద్దవారి విషయమున మలినదృష్టిని ప్రసరింపచేయుటయే ఉచితజ్ఞతకు లక్షణ మని భావము. క్షేమేంద్రుడు తాను రచించిన ఈ ఔచిత్యవిచారచర్చ అను గ్రంథములో, కవి తనకావ్యములో వివిధ విషయాలను వర్ణించు సందర్భములలో ఔచిత్యమును ఎట్లు పాటించవలెనో చెప్పుచున్నాడు. ఈ ఔచిత్యా నౌచిత్యజ్ఞానము చాలావరకు లోకవ్యవహారజ్ఞానమును బట్టి నిర్ణయించ వలసి ఉండును. శత్రువు విషయములో కుటిలముగా ప్రవర్తించుటలోనే ఔచిత్య మున్నది. అట్టి ఔచిత్యమును ప్రదర్శించిన శ్రీ మహావిష్ణువునకు నమస్కారమని చెప్పుచు, గ్రంథ ప్రారంభమున నిర్విఘ్న పరిసమాప్త్యర్థమై చేసిన మంగళ శ్లోకమునందు కూడా ఇతడు ఔచిత్యజ్ఞానమును చూపినాడు.

కృత్వాపి కావ్యాలఙ్కారాం(రం) క్షేమేన్ద్రః కవికర్ణికామ్
తత్కాలఙ్కం వివేకం చ విధాయ విబుధప్రియమ్

ఔచిత్యస్య చమత్కారకారిణశ్చారుచర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా. 3

క్షేమేంద్రుడు కావ్యాలంకారమైన "కవికర్ణికను" పండితులు మెచ్చిన "కవికలంకమును", "కవి వివేకమును" రచించి, ఇపుడు, రసానికి జీవితమైనదియు, (రసమును) బాగా ఆస్వాదించుటలో చమత్కారమును కలిగించునదియు అయిన ఔచిత్యముయొక్క, విచారమును చేయుచున్నాడు.

వి క్షేమేంద్రుడు 'కవికర్ణిక' 'కవికలఙ్కము' "కవివివేకము" అనే గ్రంథాలను కూడా రచించినట్లు దీనిని బట్టి తెలియుచున్నది. కాని అవి లభించుటలేదు. 'చర్వణే' అనగా "రసచర్వణే" అని అర్థము. 'చారువి అనే దానిని క్రియావిశేషణముగా గ్రహించి "చక్కగా చేయుచున్నాడు" అని కూడా అర్థము చెప్పవచ్చును.

కావ్యస్యాలమలఙ్కారైః కిం మిథ్యాగణితైర్గుణైః
యస్య జీవితమౌచిత్యం విచిన్త్యాపి న దృశ్యతే. 4

ఏ కావ్యములోని జీవితమైన ఔచిత్యము ఎంత ఆలోచించినను కనబడదో అట్టి కావ్యమునకు అలంకారములచే ఏమి ప్రయోజనము? వ్యర్థముగా లెక్కింపబడిన గుణాలచేత ఏమి ప్రయోజనము ?

వి. 'విచిన్త్య'కు బదులు 'విచిత్య' అన్న పాఠమున్నచో యుక్తముగా ఉండును. విచిత్యాపి = ఎంత వెదకినను.

అలఙ్కారాస్త్వలఙ్కారా గుణా ఏవ గుణాః సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్. 5

(కావ్యమునకు) అలంకారాలు అలంకారాలే, గుణాలు గుణాలే. రససిద్ధమైన కావ్యమునకు స్థిరమైన జీవితము ఔచిత్యమే.

పరస్పరోపకారకరుచిరశబ్దార్థరూపస్య కావ్యస్య ఉపమోత్ప్రేక్షాదయో యే ప్రచురాలఙ్కారాస్తే కటకకుణ్డలకేయూరహారాదివత్ అలఙ్కారా ఏవ బాహ్యశోభాహేతుత్వాత్. యేపి కావ్యగుణాః కేచన తల్లక్షణ విచక్షణైః సమామ్నాతాః, తేఽపి శ్రుతసత్యశీలాదివత్ గుణా ఏవ, ఆహార్యత్వాత్. ఔచిత్యం త్వగ్రేవక్ష్యమాణలక్షణం స్థిరమవినశ్వరం జీవితం కావ్యస్య, తేన వినాఽస్య గుణాలఙ్కారయుక్తస్యాఽపి నిర్జీవత్వాత్. రసేన శృఙ్గారాదినా సిద్ధస్య ప్రసిద్ధస్య కావ్యస్య ధాతువాదరససిద్ధస్యేవ తజ్జీవితం స్థిరమిత్యర్థః

పరస్పరము ఉపకారకాలుగా ఉండు అందమైన శబ్దార్థములే కావ్యస్వరూపము. అట్టి కావ్యమునకు ఉత్ప్రేక్ష, ఉపమ మొదలైన అధిక సంఖ్యాకములైన లేదా ప్రసిద్ధమైన (ప్రచుర) ఏ అలంకారాలు ఉన్నవో అవి (మనిషికి) కటకకుండల కేయూరహారాదులు వలె అలంకారాలు మాత్రమే. ఏందుచేత ననగా - అవి బాహ్యమైన శోభను మాత్రమే కలిగించును. గుణలక్షణాలు నిరూపించుటలో సమర్థులైన వారు చెప్పిన కావ్యగుణాలుకూడా విద్య, సత్యము, శీలము మొదలైన గుణాలవలె గుణాలు మాత్రమే; అవి ప్రయత్న పూర్వకముగా సంపాదింపదగినవి కదా? (తెచ్చిపెట్టుకున్నవికదా?) ముందు చెప్పబోవు లక్షణముగల ఔచిత్యమో - అది కావ్యానికి, స్థిరమైన, నశించని, జీవితము. అది లేనిచో ఇది (కావ్యము) గుణాలంకారయుక్తమే అయినా నిర్జీవమేకాదా? రససిద్ధస్య శృగారాదిరసముచేత ప్రసిద్ధమైన, కావ్యముయొక్క ఔచిత్యరూపమైన జీవితము (ధాతువాద) రససిద్ధుని జీవితము వలె స్థిరమైనది.

వి. శబ్దార్థములే కావ్యస్వరూపము. అందుచేతనే భామహుడు "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్"—"కలసి ఉన్న శబ్దార్థాలే కావ్యము" అని చెప్పిఉన్నాడు. శబ్దార్థాలు ఎల్లప్పుడూ కలిసియే ఉండునుకదా? ఇట్లు చెప్పుటలో విశేషము ఏమున్నది? అందుచేత దీనికి కొంత వివరణము చేర్చి తరువాతివారు దేనిలో శబ్దము అర్థానికి ఉపకారకముగా ఉంటూ అర్థము శబ్దానికి ఉపకారకముగా

ఉంటూ, అన్యూనానతి రిక్తములుగా అవి (హెచ్చు తగ్గులు లేకుండా) కలిసి మెలిసి ఉంటాయో అది కావ్యము, అని భామహుని వాక్యానికి అర్థం చెప్పినారు. ఆ వివరణము ప్రకారమే క్షేమేంద్రుడు ఇక్కడ "పరస్పరోప కారరుచిరశబ్దార్థరూపస్య" అని వ్రాసినాడు.

పాదరసానికి ధాతువాదములో (ధాతువులకు-లోహ రసాదులకు సంబంధించిన శాస్త్రంలో) చెప్పిన ప్రకారము శుద్ధిచేసి దానిని సేవించినట్లైతే మనిషి స్థిరజీవి అవుతాడు. అట్టివానికి రససిద్ధుడు అని పేరు. దానివలెనే రససిద్ధమైన కావ్యము అనగా శృంగారాది రసములచే ప్రసిద్ధమైన కావ్యము స్థిర జీవితమై ఉండును. ఆ జీవనము ఔచిత్యము.

ఉక్తార్థస్యైవ విశేషమాహ—
ఉచితస్థాన విన్యాసాదలఙ్కృతిరలఙ్కృతిః
ఔచిత్యాదచ్యుతా నిత్యం భవన్త్యేవ గుణా గుణాః. 6

పైన చెప్పిన విషయానికే సంబంధించిన విశేషమును చెప్పుచున్నాడు. "తగిన స్థానములో ఉంచినప్పుడు మాత్రమే అలంకారము అలంకారము అగును. ఔచిత్యమునుంచి భ్రష్టములు కానపుడు మాత్రమే గుణాలు గుణాలగును".

వి. 'ఏవ'ను "అచ్యుతాః" అనుదానితో అన్వయించుకొనవలెను- అచ్యుతాఃఏవ = చ్యుతములు కానప్పుడే అని భావము.

అలఙ్కృతి రుచితస్థాన విన్యాసాదలంకర్తుం క్షమా భవతి అన్యథా త్వలఙ్కృతి వ్యపదేశమేవ న లభతే. తద్వత్ ఔచిత్యాద పరిచ్యుతా గుణా గుణతామాసాదయన్తి; అన్యథా పునరగుణా ఏవ. యదాహ

తగిన స్థానాలలో ఉంచినప్పుడే అలంకారము అలంకరించుటకు సమర్థమైనవి అగును అట్లు కానప్పుడు దానికి అలంకారమనే పేరే లభించదు. అదేవిధముగా ఔచిత్యము ఉన్నంతవరకునే గుణాలు గుణాలుగా

పరిగణింపబడును. ఔచిత్యము లేని పక్షమున అవి గుణాలే కావు. ఈ విష యమే చెప్పుచున్నాడు.

1. కణ్ఠే మేఖలయా నితమ్బఫలకే తారేణ హారేణ వా
పాణౌ నూపురబన్ధనేన చరణే కేయూరపాశేన వా.
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా నాయాన్తి కే హాస్యతామ్
ఔచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతిర్నో గుణాః

కంఠమున వడ్డాణము ధరించుట చేత, ఫలకమువలె విశాలమైన నితంబము మీద మంచి ముత్యాలహారముచేత, చేతిమీద అందలిచేత, పాదము మీద దండకడియముచేత, నమస్కరించినవాని విషయమున శౌర్యము చూపుటచేత. శత్రువుమీద కరుణచూపుటచేత, ఎవరైనా హాస్యాస్పదులు కాకుండా ఉందురా? ఔచిత్యములేని అలంకారాలు గాని, గుణాలు కాని రుచిని కలిగించజాలవు.

కిం తదౌచిత్యమిత్యాహ—
ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్య యత్
ఉచితస్య చ యో భావస్తదౌచిత్యం ప్రచక్షతే 7
యత్కిల యస్యానురూపం తదుచితముచ్యతే తస్య భావ మౌచి త్యం కథయన్తి

వ్యా. ఆ ఔచిత్యము అనగా ఏమో చెప్పుచున్నాడు. "ఏది దేనికి తగి ఉంటుందో దానిని ఉచిత మని ఆచార్యులు చెప్పుదురు. ఉచితమైనదాని ధర్మమే "ఔచిత్యము" అని అందురు.

ఏది దేనికి అనురూపమో అది ఉచితమని చెప్పబడును. దాని ధర్మమును "ఔచిత్యము" అని అందురు.

అధునా సాలంకారస్య శరీరజీవితభూతస్య ఔచిత్యస్య ప్రాధా
న్యేన లక్ష్యస్థితిం దర్శయితుమాహ—

పదే వాక్యే ప్రబన్ధార్థే గుణేఽలఙ్కరణే రసే
క్రియాయాం కారకే లిఙ్గే వచనే చ విశేషణే 8
ఉపసర్గే నిపాతే చ కాలే దేశే కులే వ్రతే
తత్త్వే సత్త్వేఽప్యభిప్రాయే స్వభావే సారసఙ్గ్రహే 9
ప్రతిభాయా మవస్థాయాం విచారే నామ్న్యథాశిషి
కావ్యస్యాఙ్గేషు చ ప్రాహురౌచిత్యం వ్యాపి జీవితమ్ 10

ఏతేషు పదప్రభృతిషు స్థానేషు మర్మస్వివ కావ్యస్య సకలశరీర వ్యాపి జీవితమౌచిత్యం స్థిరత్వేన స్ఫురదవభాసతే

ఇపుడు సకలకావ్యశరీర జీవితమైన ఔచిత్యము ప్రధానముగా ఎక్కడెక్కడ ఉండునో చూపుటకై చెప్పుచున్నాడు.

"ఔచిత్యమనే జీవితము పదములోను, వాక్యములోను, ప్రబంధ కథావస్తువులోను, గుణములోను, అలంకారములోను, రసములోను క్రియలోను, కారకములోను, లింగములోను, వచనములోను, విశేషణములోను, ఉపసర్గలోను, నిపాతములోను, కాలములోను, దేశములోను, కులములోను, వ్రతములోను, తత్త్వములోను, అభిప్రాయములోను, స్వభావములోను, సారసంగ్రహములోను, ప్రతిభలోను, అవస్థలోను, విచారములోను, పేరులోను, ఆశీర్వాదములోను, ఈ విధముగా కావ్యాంగాలన్నింటిలోనూ వ్యాపించి ఉండును అని చెపుదురు".

ఒక ప్రాణి జీవితము కణతలు గుండె మొదలైన మర్మస్థానాలన్నింటిలోనూ వ్యాపించి ఉన్నట్లుగా కావ్యజీవితమైన ఔచిత్యము పదము మొదలైన అన్ని స్థానాలలోనూ, ఉంటూ కావ్యముయొక్క సకల శరీరమును వ్యాపించి స్పష్టముగా స్ఫురించుచు భాసించును.

తేషూదాహరణాని క్రమేణ దర్శయితుమాహ:—

తిలకం బిభ్రతీ సూక్తిర్భాత్యేకముచితం పదమ్
చన్ద్రాననేవ కస్తూరీకృతం శ్యామేవ చాన్దనమ్. 11

ఏకమేవోచితం పదం తిలకాయమానం బిభ్రాణా సూక్తిః సము చిత పరభాగశోభాతిశయేన రుచిరతామావహతి. యథా పరిమలస్య:-

వీటికి వరుసగా ఉదాహరములు చూపుటకై చెప్పుచున్నాడు.

"చంద్రుని వంటి (తెల్లని) ముఖముగల యువతి కస్తూరీతిలకము ధరించినట్లు చామనచాయగల యువతి మంచి గంధపు తిలకము ధరించినట్లు ఉచితమైన తిలకాయమైన ఒక్క పదము ఉన్న సూక్తి అనగా కావ్యము (ఒక్క శ్లోకమైనను, వాక్యమైనను, ఆలంకారికుల లక్షణము ప్రకారము కావ్యమే) మనోహరముగా ఉండును. ఉచితమైన, తిలకాయమైన (నుదుట పెట్టిన బొట్టువలె చక్కగా, స్పష్టముగా కనబడెడు) ఒక్క పదమున్నను ఆ సూక్తి, తగినదియు ఉన్నతస్థాయికి చెందినదియు అయిన శోభాతిశయముతో సౌందర్యము కలిగేటట్లు చేయును. ఉదాహరణకు పరిమలుని శ్లోకము.

2. మగ్నాని ద్విషతాం కులాని సమరే త్వత్ఖడ్గధారాకులే
నాథాస్మిన్నితి బన్దివాచి బహుశో దేవ శ్రుతాయాం పురా.
ముగ్ధా గుర్జరభూమిపాలమహిషీ ప్రత్యాశయా పాథసః
కాన్తారే చకితా విముఞ్చతి ముహుః పత్యుః కృపాణే దృశౌ.

అత్ర 'ముగ్ధా' పదేన అర్థౌచిత్యచమత్కారకారిణా సూక్తిః శరదిన్దువదనేవ శ్యామతిలకేన శ్యామేవ శుభ్రవిశేషకేణ విభూషితా సకలకవికులలలామభూతాం విచ్ఛిత్తి మాతనోతి.

"మహారాజా! నీ ఖడ్గధారచేత వ్యాకులమైన ఈ యుద్ధములో ఎన్నో శత్రువంశాలు మునిగిపోయినవి" అని అనేక పర్యాయాలువంది మాగధుల మాటలు పూర్వము వినబడినవగు చుండగా (వినబడి ఉండుటచేత) ఓ మహా రాజా! ముగ్ధ అయిన గూర్జరాజభార్య అరణ్యములో భయపడుచూ, (దప్పికతో బాపడుచు) ఉదకము లభించుననే ఆశతో మాటి మాటికి భర్త ఖడ్గము వైపు దృష్టిని ప్రసరింపచేయుచున్నది.

వి. 'ధారా' శబ్దానికి 'జలధారా' అనీ 'ఖడ్గము యొక్క పదునైన భాగము' అనీ రెండు అర్థాలు. గూర్జరరాజును వర్ణించుచు పూర్వము వంది మాగధులు "నీ ఖడ్గధారలో శత్రువులు మునిగి పోయినారు" అని అను చుండెడి వారు. ఇపుడా రాజు ప్రస్తుతము కవి వర్ణించుచున్న రాజు చేతిలో ఓడి పోవుటతో అరణ్యాలలో సంచరించుచున్న ఆతని భార్య దప్పికతో బాధ పడుచు వందిమాగధుల మాటలు స్మృతికి వచ్చి ఈ ఖడ్గధారతో దప్పిక తీరు నేమో అను ఆశతో దానిపైపు చూచుచున్నది అని భావము.

ఇక్కడ ప్రయోగించిన 'ముగ్ధా' అను పదము ఇక్కడ చెప్పిన అర్థానికి ఔచిత్యం కల్పించి తద్ద్వారా చమత్కారజనకము అవుతున్నది. అట్టి ఈ ముగ్ధా శబ్దముచేత, ఈ సూక్తి నల్లని తిలకముచేత శరదిందువదన వలె, తెల్లని తిలకముచేత చామనచాయ గల యువతివలె అలంకరింపబడినదై సకలకవికులశ్రేష్ఠమైన సౌందర్యమును, (అనగా ఈ కవికి సకలకవిలలామత్వ మును సంపాదింప గలిగిన) శోభను కూర్చుచున్నది.

వి. ఆమె ముగ్ధ కావుననే ఈ విధముగా వర్ణించుటకు వీలుకలిగినది. ఆ ఒక్కపదము ప్రయోగించని పక్షమున ఈ వర్ణన అర్థవిహీనముగా కనబడి ఉండేది. అందుచేత ఇందులో ఉన్న అర్థ చమత్కారము అంతయు ఒక్క పదము మీదనే ఆధారపడి ఉన్నది గాన ఇది పదౌచిత్యమునకు ఉదాహరణము.

న తు యథా ధర్మకీర్తేః:—

3\. లావణ్యద్రవిణవ్యయో న గణితః క్లేశో మహాన్ స్వీకృతః
స్వచ్ఛన్దస్య సుఖం జనస్య వసతశ్చిన్తాజ్వరో నిర్మితః.
ఏషా పి స్వయమేవ తుల్యరమణాభావాత్ వరాకీ హతా
కోఽర్థశ్చేతసి వేధసా వినిహిత స్తన్వ్యా స్తనుం తన్వతా.

అత్ర 'తన్వ్యా' ఇతి పదం కేవలశబ్దానుప్రాసవ్యసనితయా నిబద్ధం న కాంచిదర్థాచిదత్య చమత్కారకణికా మావిష్కరోతి.

"సున్దర్యాః" ఇత్యత్ర పదమనురూపం స్యాత్. అన్యాని వా నిరతి శయలావణ్యవ్యఞ్జకాని. 'తన్వీ' పదం తు విరహ విధుర రమణీజనే ప్రయుక్తమర్థౌచిత్యశోభాం జనయతి. యథా శ్రీహర్షస్య :-

కాని, ధర్మకీర్తి ప్రయోగించిన విధముగామాత్రము ప్రయోగించ కూడదు.

"లావణ్యధనము వ్యయమైపోవుచున్నదని లెక్క చేయలేదు. చాలా శ్రమ కూడా స్వీకరింపబడినది. స్వేచ్ఛగా హాయిగా ఉంటూన్న వ్యక్తికి చింతాజ్వరము కల్పింపబడింది. సరియైన రమణుడు లేకపోవుటచేత, పాపం! ఈ దీనురాలు బాధింపబడుచున్నది. బ్రహ్మ ఏమి ప్రయోజన మును ఉద్దేశించి (ఎందుకోసం) ఈ తన్వియొక్క శరీరం నిర్మించినాడో తెలియదు".

వి. శ్రమపడి ఇంతటి అతిలోక సౌందర్యవతిని సృష్టించినందుకు ఈమెకు తగిన అతిలోకసుందరుని కూడా సృష్టించి ఉన్నచో బాగుండెడిది అని భావము.

ఇచట "తన్వ్యాః" అనే పదము కేవలము శబ్దానుప్రాస కుదరాలెను అను దృష్టితోడనే ప్రయోగింపబడినది. ఈ పదము అర్థౌచిత్యమునకు ఉపయోగించు చమత్కారలేశమునుకూడా పోషించుటలేదు. ఇక్కడ ప్రయోగించవలసిన పదము "సున్దర్యాః" అనే పదము లేదా నిరతిశయమైన లావణ్యమును వ్యంజింపచేయు అలాంటి పదాలను మరి వేటినైనా ప్రయో గించవచ్చును. విరహముతో బాధపడుచున్న వ్యక్తి విషయంలో ప్రయో గించినట్లైతే 'తన్వీ' పదము అర్థౌచిత్యశోభనుకలిగించును. ఉదాహరణకు. శ్రీహర్షుని శ్లోకము

4. పరిమ్లానం పీనస్తనజఘనసఙ్గాదుభయత
స్తనోర్మధ్యస్యాన్తః పరిమిలనమప్రాప్య హరితమ్.

ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనైః
కృశాఙ్గ్యాః సన్తాపం వదతి బిసినీపత్రశయనమ్ ॥
(రత్నావళీ-2-13)

అత్ర సాగరికాయా విరహావస్థాసూచకం "కృశాఙ్గ్యాః" ఇతి పదం పరమమౌచిత్యం పుష్ణాతి.

"పీనమైన స్తనజఘనాల సంసర్గముచేత రెండు వైపులను (పైనను క్రిందను) వాడిపోయినదియు, నడుముదగ్గర శరీరసంసర్గము కలగకపోవుటచేత (మధ్యభాగములో) ఆకుపచ్చగా ఉన్నదియు, భుజలతలను శిథిలముగా జార్చి వేయుటచేతనూ, ఇటు అటు త్రిప్పుటచేతనూ కదిలిపోయిన (ఆకుల) కూర్పు కలదియు అయిన ఈ తామరాకులతో చేసిన శయనము ఆ కృశాంగియొక్క సంతాపమును చెప్పుచున్నది".

వి. విరహాతుర యైన సాగరిక కొంతసేపు బిసినీపత్ర (తామరాకుల) శయనంమీద శయనించి వెడలిపోయిన తరవాత ఆ శయనమును చూచిన రాజు అన్నమాటలు ఇవి.

ఇక్కడ "కృశాఙ్గ్యాః" అనే పదము సాగరికయొక్క విరహావస్థను సూచించుచు, ఔచిత్యమును చక్కగా పోషించుచున్నది.

ఇలాంటి స్థలాలలో "తన్వ్యాః," "కృశాఙ్గ్యాః" వంటి పదాలు ప్రయోగించిన ఔచిత్యహేతువులుగా ఉండును పై శ్లోకంవంటి సందర్భాలలో కాదు అని భావము.

వాక్యగతమౌచిత్యం దర్శయితుమాహ :-
ఔచిత్యరచితం వాక్యం సతతం సంమతం సతామ్
త్యాగోదగ్రమివైశ్వర్యం శీలోజ్జ్వలమివ శ్రుతమ్ ॥ 12

వాక్యములో ఉండెడి ఔచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు. "ఔచిత్యముతో రచింపబడిన వాక్యము త్యాగముచేత గొప్పదైన ఐశ్వర్యము

పలె, శీలముతో ప్రకాశించే శాస్త్రజ్ఞానమువలె సత్పురుషులకు ఎల్లప్పుడూ అంగీకారయోగ్యముగా ఉండును"

ఔచిత్యరచితం వాక్యం కావ్యవివేకవిచక్షణానామభిమతతమమ్. యథా మమ వినయవల్ల్యామ్ :-

ఔచిత్యంతో రచించిన వాక్యము. కావ్యవివేచనమున సమర్థులైనవారికి చాలా ప్రీతిజనకముగా ఉండును. ఉదాహరణకు నా 'వినయవల్లి' నుంచి:-

5. దేవో దయావాన్ విజయో జితాత్మా
యమౌ మనఃసంయమమాననీయౌ.
ఇతి బ్రువాణః స్వభుజం ప్రమార్ష్టి
యః కీచకాకాలికకాలదణ్డమ్.

6. ధీరః స కిర్మీరజటాసురారిః
కుబేర శౌర్యప్రశమోపదేష్టా.
దృష్టో హిడిమ్బాదయితః కురూణాం
పర్యన్త రేఖాగణనాకృతాన్తః.(యుగమ్)

అత్ర భీమస్య భీమచరితోచిత కీచకాకాలికకాలదణ్డ—హిడిమ్బాదయితాదిభిః పదైరున్నిద్రరౌద్రరసస్య రూపానురూపో వాక్యార్థః సజీవ ఇవావభాసతే.

"అన్నగారు దయగలవాడు; అర్జునుడు ఆత్మనిగ్రహము కలవాడు, కవలలు మనఃసంయమనముచేత గౌరవింపదగినవారు అని పలుకుచూ ఎవ్వడు కీచకుని అకాలయమదండమైన తన భుజమును చరచుచున్నాడో, అట్టి ధీరుడూ, కిర్మీరజటాసురులకు శత్రువూ, కుబేరుని శౌర్యము ఎలా శాంతింపచేయవలెనో ఉపదేశించినవాడూ, హిడింబాప్రియుడూ, కౌరవుల చివరి రేఖను లెక్కించిన యముడూ అయిన భీమసేనుడు చూడబడినాడు."

ఇచట భీముని భయంకర చరిత్రకు తగిన "కీచకాకాలికకాలదణ్డ" "హిడిమ్బా దయిత" మొదలైన పదాలతో వికసించిన రౌద్రరసమునకు అనురూపమైన వాక్యార్థము సజీవమువలె ప్రకాశించుచున్నది.

యథా వా రాజశేఖరస్య :-

7. సమ్బన్ధీ పురుభూభుజాం మనసిజవ్యాపారదీక్షాగురు
ర్గౌరాఙ్గీవదనోపమాపరిచితస్తారావధూవల్లభః.
సద్యోమార్జితదాక్షిణాత్యతరుణీదన్తావదాతద్యుతి
శ్చన్ద్రః సున్దరి దృశ్యతామయమితశ్చణ్డీశచూడామణిః

( బా. రా. 10–41 )

అత్రాపి చన్ద్రమసః శృఙ్గారాన్తరఙ్గైరనఙ్గోద్దీపనైః పదై ర్నిర్వర్తితో వాక్యార్థః సదర్థౌచిత్యసామర్థ్యేనాత్యర్థ మర్థనీయతాం ప్రాప్తః.

లేదా ఉదాహరణకు రాజశేఖరుని శ్లోకము :-

"ఓ సుందరీ! పురుపంశానికి చెందిన రాజుల బంధువూ, మన్మథకార్య కలాపాల విషయమున దీక్ష ఇచ్చే గురువూ, తెల్లటి శరీరముగల యువతుల ముఖానికి ఉపమానంగా సర్వపరిచితుడూ, తారామహిళల వల్లభుడూ, అప్పుడే తోమిన దాక్షిణాత్య స్త్రీల దంతమువలె తెల్లని కాంతి కలవాడూ, పార్వతీ ప్రియుని శిరోభూషణమూ అయిన చంద్రుడు ఇదిగో ఇటు వైపు చూడు."

ఇచట శృంగారానికి చాలా దగ్గరగా ఉండునవీ, మన్మథోద్దీపకాలూ అయిన చంద్రునికి సంబంధించిన (విశేషణాలతో) పదాలతో ఏర్పడిన వాక్యార్థం మంచి అర్థౌచిత్యాన్ని చూపగల సామర్థ్యముచేత ఎంతో కోరదగినదిగా (ప్రశంసనీయంగా) ఉన్నది.

న త యథాఽస్యైవ :-

8. నాలే శౌర్యమహోత్పలస్య విపులే సేతౌ సమిద్వారిధేః
శశ్వత్ ఖడ్గభుజఙ్గచన్దనతరౌ క్రీడోపధానే శ్రియః.
ఆలానే జయకుఞ్జరస్య సుదృశాం కన్దర్పదర్పే పరం
శ్రీదుర్యోధనదోష్ణి విక్రమపరే లీనం జగన్నన్దతు.
( ప్ర. పా. 2-11 )

అత్రాతిశయపర కర్కశసోత్కర్ష సుభట భుజస్తంభస్యాసము చితేన కువలయనాలతులాధిరోపణేన వాక్యార్థః సోపహాసత యేవ నిబద్ధః పరిజ్ఞాయతే.

ఐతే ఈతడే వ్రాసిన మరొక శ్లోకము వలె ఉండకూడదు :-

"శౌర్య మనే పద్మానికి నాలమూ (కాడ). యుద్ధ సముద్రానికి గొప్ప సేతువూ, ఎల్లప్పుడూ ఉండే ఖడ్గమనే సర్పానికి చందనవృక్షమూ, లక్ష్మికి విలాసార్థమైన తలగడా, జయ మనే గజానికి బంధనస్తంభమూ, స్త్రీలకు మన్మథ దర్పమూ, మహాపరాక్రమమూ అయిన దుర్యోధనుని బాహువు మీద లీనమై (నిలచినదై) జగత్తు ఆనందించుగాక"

ఇచట అత్యంతము కర్కశ మైనదీ. ఉత్కర్షతో కూడినదీ అయిన, మహాభటు డైన దుర్యోధనుని భుజస్తంభమును కలువకాడతో పోల్చుట అను చితము ఇట్లు చేయుటచేత వాక్యార్థం ఏదో వేళాకోళంగా కూర్చినట్లు కనబడు తూన్నది.

వి. "వా పుంసి పద్మం నలినమరవిన్దం మహోత్పలమ్" అని అమ రంలో చెప్పిన ప్రకారము 'మహోత్పలము' అనగా పద్మము. అందుచేత 'కువలయనాల' అనే క్షేమేంద్ర వివరణము చింత్యము. 'కువలయం' అనగా కలువ. "స్యాదుత్పలం కువలయమ్" అని అమరుడు.

ప్రబన్ధార్థౌచిత్యం దర్శయితుమాహ:-
ఉచితార్థ విశేషేణ ప్రబన్ధార్థః ప్రకాశ్యతే
గుణప్రభావభవ్యేన విభవేనేవ సజ్జనః. 13

**అమ్లాన**ప్రతిభాప్రకర్షోత్ప్రేక్షితేన సకలప్రబన్ధావ్యాయిపీ-యూష వర్షేణ సముచితార్థ విశేషేణ **మహాకావ్యం** స్ఫురదివచమత్కారితామాపద్యతే. యథా కాలిదాసస్య :-

ప్రబంధార్థము యొక్క ఔచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు :- "గుణాల ప్రభావమునుపట్టి పూజ్యమైన వైభవముచేత సజ్జనుడు ప్రకాశింపచేయబడినట్లుగా, ప్రబంధార్థము ఉచితమైన అర్థవిశేషముచేత ప్రకాశింపచేయుబడును." వసివాడని ప్రతిభాప్రకర్షలచేత ఊహింపబడినదీ, ప్రబంధాన్నంతనీ తృప్తిపరచే అమృతవర్షమూ అయిన సముచితమైన అర్థవిశేషముచేత మహాకావ్యము సజీవమువలె (స్ఫురదివ) చమత్కారజనకము అగును. ఉదాహరణకు కాలిదాసుని శ్లోకము.

9. జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః.
తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబన్ధుర్గతోఽహం
యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా.
(మేఘసందేశం-6)

అత్ర అచేతనస్య చేతనాధ్యారోపేణ మేఘస్య దౌత్యయోగ్యతాధానాయ ప్రథితపుష్కరావర్తకపర్జన్యవంశ్యత్వమ్. అమాత్యప్రకృతిపురుషత్వం చ యదుపన్యస్తం తేన సమస్తగుణబన్ధస్య అభిధానతోత్ప్రేక్షితేతి వృత్తరుచిరతరస్యానిగతిశయమౌచిత్యమ్ ఉద్ద్యోతితమ్.

"నీవు లోకప్రసిద్ధమైన పుష్కరావర్తకమేఘాలవంశములో పుట్టినవాడ వనీ, కామరూపుడ వనీ, దేవేంద్రుని ప్రకృతిపురుషుడ వనీ, నేనెరుగు

దును. అందుచేతనే, దైవవశముచేత బంధువుకు (ప్రియురాలికి) దూరమైన నేను నీ దగ్గరకు సాహాయ్యార్థినై వచ్చినాను. గుణవంతుని యాచించుట, అది ఒకవేళ సఫలము కాకపోయినను, మంచిదే, సఫలమైనాకూడా అధముని యాచించుట మంచిదికాదు".

వి. కామరూపం = ఇష్టమువచ్చిన రూపము ధరించగలిగినవాడు. ప్రకృతిపురుషం = ప్రధానపురుషుడు లేదా అష్టప్రకృతులలో ఒకడైన అమాత్యుడు.

ఇచట అచేతనమైన మేఘానికి దౌత్యయోగ్యత్వమును కల్పించుట కొరకు ఆతనికి చేతనత్వమును ఆరోపించి, ఆతడు ప్రసిద్ధమైన పుష్కరావర్తక మేఘాలవంశములో జన్మించినాడనీ, దేవేంద్రుని అమాత్యరూపుడైన ప్రకృతిపురుషుడనీ చెప్పబడినది. ఇలా చెప్పుటచేత అభిధానంగా (మొత్తం కావ్యానికి 'మేఘదూతం' అనే పేరుగా) ఊహింపబడిన ఇతి వృత్తము చేత చాలా అందంగా ఉన్న మొత్తము ప్రబంధమునకంతకును నిరతిశయమైన (అత్యధికమైన) ఔచిత్యము సూచితమైనది.

యథా వా భవభూతేః :-

(నేపథ్యే) 10. యోఽయమశ్వః పతాకేయమథవా వీరఘోషణా
సప్తలోకైకవీరస్య దశకణ్ఠకులద్విషః.
(ఉ. రా. 4 27)

లవః :- (సగర్వమివ) అహో సన్తాపనాన్యక్షరాణి! భోభోః! కిమక్షత్రియా భూమిః యదేవముద్ఘోష్యతే (విహస్య) ఆః కిం నామ స్ఫురన్తి శస్త్రాణి (ధనురారోపయన్)

11. జ్యాజిహ్వయా వలయితోత్కటకోటిదంష్ట్ర
ముద్గారిఘోరఘనఘర్ఘరఘోషమేతత్.
గ్రాసప్రసక్తహసదన్తకవక్త్రయన్త్ర
జృమ్భావిడమ్బివికటోదరమస్తు చాపమ్
(ఉ. రా. 4 29)

అత్రార్థే రామాయణకథాతిక్రమేణ నూతనోత్ప్రేక్షితా రామ తనయస్య సహజవిక్రమానుసారిణీ శౌర్యోత్కర్షభూమిః పరప్రతాప స్పర్శాసహిష్ణుతా ప్రబన్ధస్య రసబన్ధురామౌచిత్యచ్ఛాయాం ప్రయ చ్ఛతి.

లేదా మరొక ఉదాహరణము భవభూతినుంచి ఎట్లనగా;- " ( నేప థ్యంలో ) "- "ఈ అశ్వము, సప్తలోకాలలో ఏకైక వీరుడును, రావణ వంశానికి శత్రువును, అయిన శ్రీరాముని పతాక; లేదా వీరఘోషణ" లవుడు:- (సగర్వంగా) ఏమిది! ఈ మాటలు చాలా సంతాపకరంగా ఉన్నవి. ఓయీ! భూమిమీద క్షత్రియులే లేకుండా పోయినా రని అనుకొనుచున్నారా ఏమి, ఈ విధముగా చాటించుచున్నారు! (నవ్వి) అహో! ఆయుధాలు అదురు తున్నాయి. ! (ధనస్సును ఎక్కుపెడుతూ)

"నారి అనే నాలుకచే చుట్టబడిన అగ్రభాగము లనే కోఱలుగలదీ, ఘోరమైన మేఘధ్వని వలె ఘర్ఘరధ్వని చేయుచున్నదీ, (అందుచేతనే) త్రేణ్చుచున్నదీ (ఉద్గారి,) (భూతాలను) మ్రింగడానికి ఉపక్రమించిన, అట్ట హాసం చేయుచున్న యముని ముఖయంత్రముయొక్క ఆవులింతను అనుక రించుచున్నదీ అయిన ధనస్సు వికటమైన మధ్యభాగం కలదిగా అగుగాక".

ఇక్కడ, అర్థంలో రామాయణకథను అతిక్రమించి క్రొత్తగా ఊహింపబడినదీ, లవుని సహజపరాక్రమమును అనుసరించునదీ, శౌర్యో త్కర్షకు స్థానమూ అయిన ఇతరుల ప్రతాపాన్ని సహించకపోవుట అనునది ప్రబంధానికి రససుందరమైన ఔచిత్యశోభను సంపాదించుచున్నది.

న తు యథా రాజశేఖరస్య:-

"రావణః-

12. యత్పార్వతీహరకచగ్రహణప్రవీణే
స్థాణౌ స్థితం పురభిదః శరదాం సహస్రమ్.

గీర్వాణసారకణనిర్మితగాత్రమత్ర
తన్మైథిలీక్రయధనం ధనురావిరస్తు. (బా. రా. 1. 39 )

జనకః :- ఆవిరస్తు సమమగర్భసంభవయా సీతయా". అత్ర "ఆవిరస్తు సమం సీతయా" ఇతి జనకరాజేన యదుచ్యతే, తేనాస్య పిశితాశనాయ తనయాప్రతిపాదనమభిమతమివోపలక్ష్యతే. న చైతద్విద్మః కథం భక్ష్యభూతా కుసుమకోమలాఙ్గీ పురుషాదాయ ప్రతిపాద్యతే; ఇత్యనౌచిత్యేన ప్రసిద్ధేం వృత్తవైపరీత్యం పరం హృదయవిసంవాదమాదధాతి.

ఐతే రాజశేఖరునిది మాత్రము ఉదాహరణముగా గ్రహించకూడదు. అది ఎట్లనగా-

"రావణుడు:-

ఏ ధనుస్సు బలాత్కారముగా పార్వతికొప్పు పట్టుకొనకలిగిన పురాంతకుని హస్తములోవేయిసంవత్సరాలపాటు ఉండెనో, ఏది దేవతల సారకణములతో నిర్మింపబడెనో, మైథిలిని కొనే ధన మైన ఆ ధనుస్సు నా ఎదుటకు వచ్చుగాక".

జనకుడు:- అయోనిజ యైన సీతతో కూడా (ఆధనస్సు) ఎదుటకు వచ్చుగాక.

ఇక్కడ జనకుడు "ఆవిరస్తు సమం సీతయా" అని చెప్పుటనుపట్టి, తన కుమార్తెను ఆ పిశితాశనునికి ఇచ్చుట అతనికి అభిమతమే అన్నట్లు కనబడుచున్నది. భక్ష్యమైన కుసుమకోమలాంగి యైన ఆమె ఆ మనుష్యభక్షకునికి భక్ష్యముగా ఎలా సమర్పింపబడుచున్నదో మాకు అర్థము అవడంలేదు. ఈవిధముగా కొట్టవచ్చినట్లు కనపడుచున్న (ప్రసిద్ధేన) అనౌచిత్యముచేత (ఆతని) ప్రవర్తనలోని వైపరీత్యము (లేదా: కథలోని వైపరీత్యము) హృదయానికి ఏమాత్రమూ నచ్చడంలేదు.

యథా వా కాలిదాసస్య:-

13. "ఊరుమూలనఖమార్గపఙ్క్తిభిస్తత్క్షణంహృతవిలోచనో హరః
వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమామవారయత్."
(కు. సం. 8 87)

అత్రామ్బికాసమ్భోగవర్ణనే పామరనారీసముచితనిర్లజ్జసజ్జనఖరాజివిరాజితోరుమూలహృతవిలోచనత్వం త్రిలోచనస్య భగవతస్త్రిజగద్గురోర్యదుక్తం తేనానౌచిత్యమేవ పరం ప్రబన్ధార్థః పుష్ణాతి.

అనౌచిత్యానికి ఉదాహరణముగా కాళిదాసుచేసినవర్ణన ఎట్లనగా:- "ఊరుమూలముపైన ఉన్న నఖక్షతాల పంక్తులచేత అప్పుడే ఆకర్షింపబడిన నేత్రాలు గల శివుడు శిథిలమైన వస్త్రమునుకట్టుకొనుచున్న ప్రియురాలిని నివారించినాడు.

ఈ అంబికాసంభోగవర్ణనఘట్టంలో త్రిజగద్గురువైన భగవంతుడైన త్రిలోచనుని నేత్రాలు పామరస్త్రీల విషయములో మాత్రమే సముచితముగా ఉండే రీతిలో నిర్లజ్జంగా కనబడేటట్లు చేయబడిన, (సజ్జ) నఖరాజులచే ప్రకాశించుచున్న ఊరుమూలముచేత ఆకర్షింపబడినట్లు వర్ణించుటచేత ఈ ప్రబంధారం ఎక్కువ అనౌచిత్యమును మాత్రమే పోషించుచున్నది.

మూ. గుణౌచిత్యం దర్శయితుమాహ:-

ప్రస్తుతార్థోచితః కావ్యే భవ్యః సౌభాగ్యవాన్ గుణః
స్యన్దతీన్దురివానన్దం సంభోగావసరోదితః. 14

ప్రస్తుతస్యార్థస్యౌచిత్యేన ఓజః ప్రసాదమాధుర్యసౌకుమార్యాదిలక్షణో గుణః కావ్యే భవ్యః సౌభాగ్యవత్తామవాప్తః సహృదయానన్దసన్దోహమిన్దురివ

స్యన్దతి, యథా భట్టనారాయణస్య:-

గుణౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు:-
కావ్యములో ప్రస్తుతమైన అర్థానికి అనుగుణముగా ఉండునదీ, (అందుచేతనే) తగినదై సుందరముగాఉండునదీ అయిన గుణము, సంభోగసమయములో ఉదయించిన చంద్రుడువలె ఆనందమును ఒలుకబోయుచున్నది.

ప్రస్తుత మైన అర్థానికి ఉచిత మైన పద్ధతిలో (కూర్చిన) ఓజస్సు, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యమూ ఇత్యాదిరూపంలో ఉండే గుణము కావ్యములో పూజ్యమై (భవ్యః) సౌందర్యమును పొందినదై, చంద్రబింబము వలె, సహృదయులకు ఆనందసందోహమును స్రవింపచేయును. ఉదాహరణకు భట్టనారాయణుని శ్లోకము -

14. మహాప్రలయమారుతక్షుభితపుష్కరావర్తక
ప్రచణ్డఘనగర్జితప్రతిరవానుకారీ ముహుః
రవః శ్రవణభైరవః స్థగితరోదసీకన్దరః
కుతోఽద్య సమరోదధేరయమభూతపూర్వః పురః

(వే. సం. 3 4)

అత్ర ఓజస్వినః భటముకుటమణేరశ్వత్థామ్నః స్ఫూర్జదూర్జితప్రతాపానురూపం వాక్యమోజసా కావ్యగుణేన ఉదగ్రతామవాప్తం సహస్రగుణమివ విక్రమౌచిత్యగౌరవమావహతి.

"మహాప్రలయవాయువుచేత క్షోభపెట్టబడిన పుష్కరావర్తకమేఘాల ప్రచండ మైన గంభీర మైన ఉరుముల ప్రతిధ్వనివలె ఉన్నదీ, వినుటకు భయంకరమైనదీ, భూమ్యాకాశమధ్యగుహను కప్పివేయుచున్నదీ, ఇదివర కెన్నడూలేనిదీ, అయిన ఈ ధ్వని యుద్ధసముద్రమునుంచి బయలుదేరుచున్నది; ఏమి కారణమో!"

ఇచట ఓజఃశాలియు, భటకిరీటరత్నమూ అయిన అశ్వత్థామవాక్యము, విజృంభించుచున్న ఆతని అత్యధికప్రతాపానికి అనుగుణమై ఓజస్సు అనే

కావ్యగుణముతో తీవ్రత్వమును పొంది, వేయి రెట్లుగా విక్రమౌచిత్యరూప మైన గౌరవమును కలిగించుచున్నది.

15. యథా వా బాణభట్టస్య :-
హారో జలార్ద్రవసనం నలినీదలాని
ప్రాలేయశీకరముచస్తుహినాంశుభాసః
యస్యేన్ధనాని సరసాని చ చన్దనాని
నిర్వాణమేష్యతి కథం స మనోభవాగ్నిః. 15

అత్ర విప్రలమ్భభరభగ్నధైర్యాయాః కాదమ్బర్యా విరహవ్యథావర్ణనా మాధుర్యసౌకుమార్యాదిగుణయోగేన, పూర్ణేన్దువదనేవ ప్రియంవదత్వేన హృదయానన్దదాయినీం దయితతమతా మాతనోతి.

మరియొక ఉదాహరణము బాణభట్టుది ఎట్లనగా :-

"హారమూ తడిసిన వస్త్రమూ, తామరాకులూ, మంచుతుంపరలను వర్షించే చంద్రకిరణాలూ, సరస మైన చందనమూ-ఇవన్నీ ఏ మన్మథాగ్నికి ఇంధనాలుగా ఉపయోగపడునో అట్టి మన్మథాగ్ని ఎట్లు శాంతిచగలదు?" ఇక్కడ వియోగభారముచేత ధైర్యము కోల్పోయిన కాదంబరివిరహవ్యథా వర్ణనము పూర్ణేందువదన యైన సుందరి ప్రియంగా కూడా మాటలాడుటచేత హృదయానందమును కలిగించుచు ఏ విధముగా ప్రియతమ అగునో అదే విధముగా మాధుర్యమూ సౌకుమార్యమూ అనే గుణాలు ఉండుటచేత హృదయానందకర మైన ప్రియతమత్వమును కలిగించుచున్నది.

విరహవర్ణనమే సహజముగా మనోహరముగా ఉండును. దానికి తోడు మాధుర్యాదిగుణములు కూడా చేరినట్లైతే ఆవర్ణన అత్యంతమనోహరముగా ఉండును. సహజసౌందర్యవతి యైన లలన ప్రియాలాపనిపుణ కూడా అయినట్లైతే ఆమె మనోహరత్వము నిరతిశయంగా ఉండును కదా?

న తు యథా చన్ద్రకస్య :-

16 యుద్ధేషు భాగ్యచపలేషు న మే ప్రతిజ్ఞా
దైవం నియచ్ఛతి జయం చ పరాజయం చ
ఏషైవ మే రణగతస్య సదా ప్రతిజ్ఞా
పశ్యన్తి యన్న రిపవో జఘనం హయానామ్.

అత్ర క్షత్రవృత్తిరివౌజసా కావ్యగుణేనాస్పృష్టా సుభటోక్తిరుచితార్థాపి తేజోజీవితవిరహితా దుర్గతగృహదీపశిఖేవ మన్దాయమానా న విద్యోతతే.

ఐతే ఈ చంద్రకుని శ్లోకము ఉదాహరణముగా గ్రాహ్యము కాదు:- "అదృష్టాన్ని పట్టి చంచలముగా ఉండే (లేదా అదృష్టము వలె చంచలముగా ఉండే) యుద్ధాల విషయములో (నేనే తప్పక జయించెదనని) నేను ప్రతిజ్ఞ చెయ్యను. జయాన్నైనా, పరాజయాన్నైనా ఇచ్చేది దైవమే యుద్ధభూమిలో ఉన్నప్పుడు నేను ఈ ఒక్క ప్రతిజ్ఞ మాత్రమే చేయుదును. శత్రువులు నా గుఱ్ఱాల వెనకభాగమును ఎన్నటికిని చూడజాలరు. అనగా నేనెన్నడును వెన్నిచ్చి యుద్ధభూమి నుంచి పారిపోవుట అనేది ఉండదు."

ఈ సుభటోక్తిలోని అర్థము ఉచితముగానే ఉన్నను. ఓజస్సు (ప్రతాపం) లేని క్షత్రియవృత్తివలె, ఓజస్సు అనే కావ్యగుణము లేకపోవుటచే దరిద్రుల ఇండ్లలోని దీపమువలె, జీవితమైన తేజస్సు లేక, మిణుకు మిణుకు మంటూ ఉన్నది.

యథా వా రాజశేఖరస్య:-

17. ఏతస్యాః స్మరసంజ్వరః కరతలస్పర్శైః పరీక్ష్యో న యః
స్నిగ్ధేనాపి జనేన దాహభయతః ప్రస్తంపచః పాథసామ్

నిర్వీర్యీకృతచన్దనౌషధవిధౌ తస్మింస్తడత్కారిణో
లాజస్ఫోటమమీ స్ఫుటన్తి మణయః సర్వేఽపి హార
స్రజామ్ 17.
(బా. రా. 5 11.)

అత్రవిరహవిధురరమణీమనోభవావస్థానురూపం మాధుర్య
ముత్సృజ్య "తడత్కారిణో లాజస్ఫోటం స్ఫుటన్తి" ఇత్యోజః
స్ఫూర్జితోర్జితస్వభావాధివాసితా సూక్తిర్లావణ్యపేశలతనుర్లలితలల
నేవ పరుషభాషిణీ ఝటిత్యనౌచిత్యం చేతసి సంచారయతి.

(గుణానౌచిత్యమునకు) మరొక ఉదాహరణముగా రాజశేఖరుని శ్లోకము
ఎట్లనగా:-

"చేతులు ఎక్కడ కాలునో అనే భయముచేత, సఖీజనము కూడా
ఈమె మన్మథతాపమును, చేతులతో స్పృశించి పరీక్షించుటకు భయపడు
తున్నారు. కుంచాల కొలది నీళ్ళను మరిగింపచేసేదిగా ఉన్నది ఈ తాపము.
దీని విషయములో చేసిన చందనౌషధప్రయోగము నిర్వీర్యము అయిపోయి
నది. హారాలలో ఉన్న మణులు పేలాలు పేలినట్లు టపటపా పేలిపోతున్నవి.

ఇక్కడ-విరహముతో బాధపడుచూన్న రమణియొక్క మన్మథావస్థను
వర్ణించుటకై అనురూపమైన మాధుర్యగుణమును విడిచిపెట్టి, "తడత్కారిణః
లాజస్ఫోటం స్ఫుటన్తి" వంటి ఓజః స్ఫూర్జితములైన పదాల ప్రయోగముచేత
ఓజోభరిత మైన ఈ సూక్తి లావణ్యముతో మనోహరమైన శరీరముగల లలిత
లలన పరుషముగా మాటలాడినచో ఏ విధంగా అనుచితముగా కనబడునో
అదే విధముగా ఇది చాలా అనుచితముగా ఉన్నదే అన్న భావమును
మనస్సులో కలిగించుచున్నది.

అలఙ్కారౌచిత్యం దర్శయితుమాహ:-

కా. అర్థౌచిత్యవతా సూక్తిరలఙ్కారేణ శోభతే.
పీనస్తనస్థితేనేవ హారేణ హరిణేక్షణా. 15

ప్రస్తుతార్థస్యౌచిత్యేన ఉపమోత్ప్రేక్షారూపకాదినాలఙ్కా-రేణ సూక్తిశ్చకాస్తి, కామినీవ ఉచ్చకుచచుమ్బినా రుచిరముక్తా-కలాపేన.

అలంకారౌచిత్యమును చూపటకై చెప్పుచున్నాడు:-

"హరిణేక్షణ పీనస్తనాభోగముమీద ఉన్న హారముతో ప్రకాశించినట్లు, సూక్తి అర్థానుగుణముగా కూర్చిన అలంకారముతో శోభించును."

ప్రస్తుత మైన అర్థానికి ఉచితముగా ఉండే పద్ధతిలో కూర్చిన ఉపమా-ఉత్ప్రేక్షా -రూపకాద్యలంకారాలతో, ఉన్నతకుచతటముమీద ఉన్న హారముతో కామిని వలె, సూక్తి చాలా అందముగా ఉండును.

యథా (శ్రీ)హర్షస్య:-

18. అస్తాస్త విగ్రహకథో రతిమాన్ జనస్య,
చిత్తే వసన్ ప్రియవసన్తక ఏవ సాక్షాత్.
పర్యుత్సుకో నిజమహోత్సవదర్శనాయ
వత్సేశ్వరః కుసుమచాప ఇవాభ్యుపైతి. (రత్నా 1 8

అత్ర వత్సేశ్వరస్య కుసుమచాపేన ఉపమా శృఙ్గారావసరస రసచారుతరతావహౌచిత్యేన కామపి చేతశ్చమత్కారిణీమావిష్క-రోతి.

ఉదాహరణముగా శ్రీహర్షుని శ్లోకము ఎట్లనగా:-

విగ్రహకథ అనునది (శత్రువిరోధము) లేనివాడును, ఆనందము కలవాడును, జనులచిత్తాలలో నివసించువాడును, వసంతకుడు మిత్రుడుగా కలవాడును అయిన వత్సరాజు, విగ్రహము, అనగా శరీరములేనివాడును, రతితోకూడినవాడును. జనుల చిత్తములో వసించువాడును. వసంతర్తువు మిత్రుడుగా కలవాడును తన మహోత్సవమును చూచుటకై వేడుకగలవాడును అగు మన్మథుడువలె వచ్చుచున్నాడు.

వి. ఇది మదనోత్సవసమయములో అంతఃపురమునకు వచ్చుచున్న వత్సరాజు వర్ణనము. "విశ్రాన్తవిగ్రహకథః" మొదలైన విశేషణాలు ఇటు వత్సరాజుకు, అటు మన్మథునకు కూడా సంబంధించును.

ఇక్కడ వత్సరాజును కుసుమచాపునితో పోల్చుట చాలా ఉచితముగా ఉన్నదై చిత్తములో చమత్కారమును కలిగించుచు. శృంగారావసరములో సరసమైన చారుత్వమును ఆవిష్కరించుచున్నది. అనగా నాయకుని మన్మథునితో పోల్చుట ప్రకృతమైన శృంగారరసానికి ఎంతో అనుగుణముగా ఉండుటచేత ఇది (ఉపమా) అలంకారౌచిత్యానికి ఉదాహరణ మని అర్థము.

న తు యథా చన్ద్రకస్య:

19. ఖగోత్క్షిప్తై రన్త్రైస్తరుశిరసి దోలేవ రచితా
శివా తృప్తాహారా స్వపితి రతిఖిన్నేవ వనితా.
తృషార్తో గోమాయుః సరుధిరమసిం లేఢి బహుశో
బిలాన్వేషీ సర్పో హతిగజకరాగ్రం ప్రవిశతి

అత్రానుచితస్థానస్థితాయాః పురుషపిశితతృప్తసుప్తాయాః శివాయాః సురతకేలిక్లాన్తకాన్తయా విచ్ఛాయైవోపమా పరం వైపరీత్యం ప్రకాశయతి.

ఐతే - అలంకారౌచిత్యానికి ఉదాహరణము ఈ చందకుని శ్లోకము మాత్రము కాదు.

"పక్షులు ఎగరవేసికొనిపోయిన పేగులచేత చెట్లమీద ఉయ్యాలలు వ్రేలాడతీసినట్లు ఉన్నది. ఆహారముచేత తృప్తి చెందిన ఆడు నక్క రతిచేత అలసట చెందిన వనిత వలె నిద్రపోవుచున్నది. దప్పికొన్న నక్క మాటిమాటికిని రక్తంతో కూడిన కత్తిని నాకుచున్నది కన్నముకొరకై వెదకుచున్న సర్పము చంపబడిన (చచ్చిపడిఉన్న) ఏనుగతొండముయొక్క అగ్రాన్ని (రంధ్రములోనికి) ప్రవేశించుచున్నది.

ఇక్కడ (శృంగారానికి) అనుచితమైన స్థానములో (రణభూమిలో) మనుష్యుల మాంసము తిని తృప్తిచెంది నిద్రపోవుచున్న నక్కను సురత కేళిచేత అలసిన కాంతతో పోల్చుట సౌందర్యవిహీనమై చాలా విపరీతముగా కనబడుచున్నది (అందుచేత ఇది అలంకారానౌచిత్యానికి ఉదాహరణము).

యథా వా మాలవరుద్రస్య :-

20. అభిన వ వధూరోషస్వాదః కరీషతనూనపా
దసకలజనాశ్లేషక్రూర స్తుషారసమీరణః.
గలితవిభవస్యాజ్ఞేవాద్య ద్యుతిర్మసృణా రవే
ర్విరహివనితావక్త్రౌపమ్యం బిభర్తి నిశాకరః.

అత్ర కోమలకామినీకోపేన కరీషకృశానుః సాదృశ్యం శీత సమయస్వాదుతయా హృదయ సంవాదసున్దరమప్యనుచితత్వేన సహ సైవ చేతసః సఙ్కోచమివాదధాతి.

అలంకారానౌచిత్యమునకు మరొక ఉదాహరణముగా మాలవరుద్రుని శ్లోకము; ఎట్లనగా:-

(ఇది హేమంతవర్ణనమై ఉండును) పిడకనిప్పులో నూతనమైన ప్రియాంగనారోషంలోని రుచివంటి రుచి ఉన్నది. మంచుతో కూడిన చల్లని గాలి దుర్జనుల సంబంధమువలె క్రూరముగాఉన్నది. "సూర్యుని కాంతి అధికారము పోయిన వాని ఆజ్ఞవలె తీక్ష్ణత్వము లేకుండాఉన్నది. చంద్రుడు విరహముతో బాధపడుచున్న స్త్రీయొక్క ముఖముతో సామ్యాన్ని వహించు చున్నాడు.

ఇక్కడ, పిడకనిప్పును కోమలకామినీకోపంతో పోల్చుట, శీతకాల-ములో రుచిగా ఉండుటను బట్టి కొంతవరకు హృదయసంవాదంచేత (హృద-యానికి నచ్చుటచేత) సుందరముగానే ఉన్నా అంత ఉచితముగా లేదు. అందుచేత విన్న వెంటనే మనస్సుకు సంకోచమును కలిగించుచున్నట్లున్నది.

యథా వా రాజశేఖరస్య:-

21. చితాచక్రం చన్ద్రః కుసుమశరవీరస్య దగ్ధవపుషః
కలఙ్కస్తత్రత్యః స్పృశతి మలినాఙ్గారకలనామ్.
యదేతత్ సజ్జ్యోతిస్స్ఫుటదలితకర్పూరధవలం
మరుద్భిర్భస్మైతత్ ప్రసరతి ప్రకీర్ణం దిశి దిశి.

అత్రాపూర్వానన్దసుధావర్షస్య సుధాంశోశ్చితాచక్రత్వమనుచిత తయా కర్ణకటుకమాతఙ్కమివాతనోతి.

అలంకారానౌచిత్యమునకు మరొక ఉదాహరణముగా రాజశేఖరుని శ్లోకము; ఎట్లనగా:-

ఈ చంద్రుడు కాల్చబడిన శరీరముగల మన్మథుని చక్రాకారమైన చితి. చంద్రునిలో ఉన్న కలంకము మలినమైన అంగారత్వమును స్పృశించుచున్నది. (అనగా మలినమైన అంగారము.) కాంచెను నలగగొట్టిన కర్పూ-రమువలె తెల్లగా ఉన్న ఈ మంచి కాంతి ఏది ఉన్నదో అది గాలిచే నలు-దిక్కులా ఎగరగొట్టబడిన భస్మము.

వి. "సజ్జ్యోతిః"కి బదులు "తజ్జ్యోతిః" అనే పాఠము ఉన్నచో యుక్తము. "ఆ చంద్రునికాంతి" అని అర్థము.

ఇక్కడ కూడా ఆనందకరమైన అమృతవర్షముచేత సుందరమైన చంద్రుని చితాచక్రముగా చిత్రించుట అనుచితముగా ఉండి, కర్ణకటువై, మనస్సుకు (అమంగళశ్రవణంచేత) ఉద్వేగమును కలిగించుచున్నది.

యోఽర్థస్తు హృదయసంవాదీ స యదనౌచిత్యస్పర్శలేశ రహితస్తదధికతరామలఙ్కారశోభాం పుష్ణాతి; యథా కార్పటికస్య:-

22. శీతేనోద్ధూషితస్య మాషశిమివచ్చిన్తార్ణవే మజ్జతః
శాన్తాగ్నిం స్ఫుటితాధరస్య ధమతః క్షుత్క్షామకణ్ఠస్య మే.

నిద్రా క్వాపి విమానితేవ దయితా సంత్యజ్య దూరం గతా
సత్పాత్రప్రతిపాదితేవ వసుధా న క్షీయతే శర్వరీ

అత్రానౌచిత్యస్పర్శపరిహారేణ కేవలం హృదయసంవాద సౌన్దర్యమేవ స్వాదుతామాదధాతి.

ఐతే-హృదయసంవాది యైన అర్థము మాత్రము అనౌచిత్యస్పర్శ లేశముకూడా లేకపోవుటచేత అలంకారశోభను అత్యధికముగా పోషించును. ఉదాహరణకు కార్పటికుని శ్లోకము:-

"నేను మినపకాయవలె చలిచేత గగుర్పాటు చెందిఉన్నాను. (శీతా కాలంలో పంటకు వచ్చే మినపమొక్కల కాయలు పైన నూగుతో కప్పి ఉన్నట్లు ఉన్నది నాశరీరం. "శిమి" = కంది, మినుము, పెసరమొదలైన (గింజలుండే) కాయలు. చింతాసముద్రములో మునిగిపోవుచున్నాను. ప్రది మెలు పగిలిపోయినవి. ఆరిపోయిన నిప్పును ఊదుచున్నాను. ఆకలికి కంఠము ఎండిపోవుచున్నది. అవమానితురాలైన (కోపగించిన) ప్రియురాలు వలె నిద్ర నన్ను విడచి ఎక్కడికో వెళ్ళిపోయినది .సత్పాత్రకు దానముచేసిన భూమి వలె రాత్రి తరగకుండా ఉన్నది."

ఇక్కడ అనౌచిత్యమేమీ లేకపోవుటచేత కేవలమూ హృదయసంవా దము కలిగిన సౌందర్యమే (ఈవర్ణనలో) రుచిని పుట్టించుచున్నది.

రసౌచిత్యం దర్శయితుమాహ :-

కుర్వన్ సర్వాశయే వ్యాప్తిమౌచిత్యరుచిరో రసః
మధుమాస ఇవాశోకం కరోత్యఙ్కురితం మనః. 16

ఔచిత్యేన భ్రాజిష్ణుః శృఙ్గారాదిలక్షణో రసః సకలజనహృదయ వ్యాపీ వసన్త ఇవాశోకతరుమఙ్కురితం మనః కరోతి.

రసౌచిత్యమును నిరూపించుటకై చెప్పుచున్నాడు:-

ఔచిత్యముచేత రుచిరముగా ఉండే రసము అందరి హృదయాలలోనూ వ్యాప్తిని పొంది, వసంతము అశోకమును అంకురింపచేసినట్లుగా మనస్సును అంకురింపచేయును.

వి. మనస్సును అంకురింపచేయుట అనగా మనస్సులో ఆనందాంకురాలను పుట్టించుట.

యథా శ్రీహర్షస్య :-

23. ఉద్దామోత్కలికాం విపాణ్డురరుచం ప్రారబ్ధజృమ్భాం క్షణా
దాయాసం శ్వసనోద్గమైరవిరలైరాతన్వతీమాత్మనః।
అద్యోద్యానలతామిమాం సమదనాం నారీమివాన్యాం ధ్రువం
పశ్యన్ కోపవిపాటలద్యుతి ముఖం దేవ్యాః కరిష్యామ్యహమ్॥
(రత్నా 2. 4.)

అత్రేర్ష్యావిప్రలమ్భాఖ్యావస్య శృఙ్గారరసస్య వాసవదత్తాయామ వేక్ష్యమాణస్య నవమాలికాలతాయా లలితవనితాతుల్యతయా విరహావస్థారోపణేన నితరామౌచిత్యరుచిరచమత్కారిణీ వ్యక్తిరుపపాదితా

ఉదాహరణము శ్రీహర్షుని శ్లోకము:-

"అధికముగా బయలుదేరిన మొగ్గలు కలదియు, తెల్లనికాంతికలదియు, క్షణములో ప్రారంభించిన (కుసుమ) విజృంభణము కలదియు, అవిచ్ఛిన్నముగా ఉన్న వాయుప్రసారముచేత కదలిపోవుచున్నదియు, అయిన ఈ ఉద్యానలతను- మిక్కుటమైన వలపుకలదియు, పాలిపోయిన శరీరకాంతికలదియు, క్షణకాలంలో ప్రారంభమైన ఆవులింతలు కలదియు, అవిచ్ఛిన్నములైన నిట్టూర్పులచేత తనకు ఆయాసమును కల్పించుకొనుచున్నదియు, మన్మథునితో కూడినదియు, అయిన అన్యయువతిని వలె చూచుచు నేడు, నేను తప్పక దేవిని కోపముచే ఎఱ్ఱవారిన ముఖముకలదానినిగా చేయగలను".

వి. ఈ శ్లోకము రత్నావళిలోనిది. దోహదప్రక్రియచేత పుష్పించిన నవమాలికాలతను చూచుటకై ఉద్యానమునకు వచ్చుచున్న రాజు అంటున్న మాటలు, ఈ శ్లోకములో నవమాలికాలతకూ, అనురాగవతియైన అన్యకాంతకూ సమన్వయించునట్లు విశేషణాలు కూర్చబడినవి. ఈ విధముగా ఉన్న నవమాలికను తదేకదృష్టితో చూచినట్లైతే ఈ విధముగా ఉన్న అన్యకాంతను చూచినట్లు భావించి దేవి కోపించును అని చమత్కారముగా అన్న వాక్యమిది.

ఇచట-నవమాలికాలత లలితవనితవలె ఉండుటచేత దానియందు విరహావస్థను ఆరోపించి, దేవియైన వాసవదత్తలో కలుగనున్నట్లు భావింపబడిన ఈర్ష్యావిప్రలంభశృంగారానికి ఎంతో ఔచిత్యముచేత సుందరమైనదియు, చమత్కారమును, అయిన దీప్తికూర్చబడినది.

వి కవి వాసవదత్త ఈర్ష్యావిప్రలంభముతో బాధపడ నున్నట్లు వర్ణింపనున్నాడు. దానికి నాందిగా ఇక్కడ నవమాలికయందు అన్యనాయికాత్వమును ఆరోపించి చేసిన ఈ వర్ణన ఆ విప్రలంభానికి దీప్తిని కలిగించుచున్నది. అందుచే ఇది రసోచితముగా ఉన్నదని భావము.

యథా వా కాలిదాసస్య :-

24. బాలేన్దువక్రాణ్యవికాసభావాద్బభుః పలాశాన్యతిలోహితాని
సద్యో వసన్తేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనామ్
(కు. సం. 3. 29)

అత్ర పార్వత్యాం పరమేశ్వరస్య అభిలాషశృఙ్గారే వక్ష్యమాణే ప్రథమముద్దీపనవిభావభూతస్య వసన్తస్య వర్ణనాయాం కాముకాధ్యారోపేణ వనస్థలీలలనానాం కుటిలలోహితపలాశకలికాభిర్నవసంగమయోగ్యనఖక్షతాని ఉత్ప్రేక్షితాని పరమాచిత్యచారుతాం ప్రతిపాదయన్తి.

మరియొక ఉదాహరణము కాళిదాసుది, ఎట్లనగా — పూర్తిగా వికసించకపోవుటచేత చంద్రకళవలె వంకరగా ఉన్నవియు, బాగా ఎఱ్ఱనైనవియు అయిన పలాశపుష్పాలు అప్పుడే వసంతునితో సమాగమము చేసిన వనస్థలుల (వనభూముల). నఖక్షతాలవలె ప్రకాశించినవి."

ఇక్కడ పరమేశ్వరునికి పార్వతివిషయములో అభిలాషశృంగారం వర్ణింప నున్నాడు కవి. అంతకు ముందు ఉద్దీపనవిభావమైన వసంతుని వర్ణించే సందర్భములో ఆ వసంతునికి కాముకత్వమును ఆరోపించి, వంకరగాను ఎఱ్ఱగాను ఉన్న మోదుగమొగ్గలను వనస్థలులవల సమసంగమసమయములో ఏర్పడిన నఖక్షతాలుగా ఉత్ప్రేక్షించుట ఔచిత్యముచేత ఎంతో సౌందర్యమును కలిగించుచున్నది.

న తు యథాస్యైవ:-

25. వర్ణప్రకర్షే సతి కర్ణికారం దునోతి నిర్గన్ధతయా స్మ చేతః
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః
ప్రవృత్తిః

(కు సం 3 28)

అత్ర కేవలకర్ణికారకుసుమవర్ణనమాత్రేణ విధాతృవాచ్యతా గర్హ్యైవ ప్రస్తుతశృఙ్గారానుపయోగినా తదుద్దీపనవిభావోచితం న కించిదభిహితమ్.

ఐతే ఈతడే రచించిన మరొక శ్లోకము ఉదాహరణము కాదు. "కర్ణికారపుష్పము మంచి రంగు ఉన్ననూ సువాసన లేకపోవుటచేత మనస్సును బాధించుచున్నది. సాధారణముగా జగత్తును సృజించిన బ్రహ్మయొక్క ప్రవృత్తి గుణాలన్నింటినీ ఒక చోట కూర్చుట విషయంలో పరాఙ్ముఖముగా ఉండును (బ్రహ్మ సాధారణముగా గుణాలన్నింటిని ఒక చోట కూర్చడు)"

ఇక్కడ బ్రహ్మయొక్క నింద గర్భమునందు గల కర్ణికారపుష్ప వర్ణన ప్రస్తుత మైన శృంగారవర్ణనకు అనుపయుక్తము అగుటచేత. ఆ శృంగారము యొక్క ఉద్దీపనవిభావమునకు తగినది ఏదియు చెప్పబడలేదు."

వి. ఇక్కడ శృంగారసవర్ణనము ప్రస్తుతము. దానికి అనుగుణముగా ఉండే విషయ మేమైనా చెప్పవలెను కాని అప్రస్తుత మైన విధాతృనిందను కూర్చుటవల్ల ప్రయోజనములేదు, కాన ఇది రసానౌచిత్యానికి ఉదాహరణము.

హాస్యరసే యథా మమ లావణ్యవతీనామ్ని కావ్యే——

26. సీధుస్పర్శభయాన్న చుమ్బసి ముఖం కిం నాసికాం గూహసే
రే రే శ్రోత్రియతాం తనోషి విషమాం మన్దోఽసి వేశ్యాం వినా,
ఇత్యుక్త్వా మదఘూర్ణమాననయనా వాసన్తికా మాలతీ
లీనస్యాత్రివసోః కరోతి బకులస్యేవాసవాసేచనమ్.

అత్ర శ్రోత్రియస్యాత్రివసోరపవిత్రసీధుస్పర్శశఙ్కాసఙ్కోచ లీనస్య శుష్కవకులవృక్షసేవ్య సరసతాపాదనాయ వేశవిలాసిన్యా యదాసవాసేచనం తదఙ్గభూతశృఙ్గారరసాభాసస్పర్శేన హాస్యరసస్య వరాసవస్యేవ సహకారరసవేధేన సచమత్కారమౌచిత్య మాచినోతి.

హాస్యరసములో (రసౌచిత్యానికి) ఉదాహరణము నేను రచించిన "లావణ్యవతి" అనే కావ్యములో ఎట్లనగా :-

(ఒక వేశ్య తన దగ్గరికి వచ్చిన శ్రోత్రియుని కొంకనికి మధు సంస్కారం చేసిన ఘట్టము అయి ఉండును.) "మద్యస్పర్శ ఎక్కడ కలుగుతుందో అనే భయముచేత నీవు ముఖమును ముద్దుపెట్టుకొనుట లేదు! ఇలా ముక్కు మూసుకొంటా వేమిటి! అరెరే! పెద్దదైన శ్రోత్రియత్వమును చూపుతున్నావు. వేశ్యాసంపర్కము లేకపోవుటచేత శుద్ధ జడుడవుగా ఉన్నావు" అని అంటూ మదముచేత తిరిగి పోవుచున్న కళ్ళుగల వాసన్తిక మాలతీలత క్రింద దాము కుంటూన్న అత్రివసువుకు బకులవృక్షానికి చేసినట్లుగా మద్యాసేచనాన్ని (మద్యంతో తడుపుట) చేయుచున్నది,

ఇక్కడ అపవిత్రమైన మద్యముయొక్క స్పర్శ కలుగుననే శంకచేత సంకోచముతో దాగిఉన్న శ్రోత్రియుడైన అత్రివసువుకే, శుష్కమైన పొగడ చెట్టుకు వలె,సరసత్వమును సంపాదించుటకొరకు వేశవిలాసిని మద్యాసేచనము చేసినది. ఇది, అంగమైన శృంగారరసాధానము యొక్క స్పర్శచేత, సహకార(తీయమామిడి)రసం చిలకరించుటచేత శ్రేష్ఠమైన ఆసవానికి క్రొత్త రుచివచ్చి నట్లు హాస్యరసానికి చమత్కారభరిత మైన ఔచిత్యాన్ని కలిగించు చున్నది.

వి. ఉత్తమమైన పద్మిన్యాదిజాతికి చెందిన స్త్రీ సీధుగండూషసేకం (మద్యమును పుక్కిలిలో గ్రహించి దానితో తడుపుట) చేసినట్లైతే వకుల వృక్షము అకాలములో పుష్పించునని కవిసమయము:-

> "స్త్రీణాం స్పర్శాత్ప్రియఙ్గుర్వికసతి బకులః సీధుగణ్డూషసేకాత్
> పాదాఘాతాదశోకస్తిలకకురబకౌ వీక్షణాలిఙ్గనాభ్యామ్.
> మన్దారో నర్మవాక్యాత్పటుమృదుహసనాచ్చమ్పకో వక్త్రవాతాత్
> చూతో గీతాన్నమేరుర్వికసతి చ పురో నర్తనాత్కర్ణికారః"

యథా వా మమ లావణ్యవత్యామేవ :-

27. మార్గే కేతకసూచిభిన్నచరణా సీత్కారిణీ కేరలీ
రమ్యం రమ్యమహో పునః కురు వి లేసేత్యర్థితా సస్మితా.
కాన్తా దన్తచతుష్కబిమ్బితశశిజ్యోత్స్నాపటేన క్షణం
ధూర్తాలోకనలజ్జితేవ తనుతే మన్యే ముఖాచ్ఛాదనమ్.

అత్రాపి హాస్యరసస్య కుటిలవిటనర్మోక్తివచనే "చిత్యేన శృఙ్గార రసాభాసాధివాసితస్య సచమత్కారః పరః పరిపోషః సమున్మిషతి.

నా లావణ్యవతిలోనే మరియొక ఉదాహరణము, ఎట్లనగా—

"మార్గములో మొగలిముల్లు పాదానికి గ్రుచ్చుకొని "స్స్" అని సీత్కారము చేస్తూన్న ఒక కేరళదేశకాంత —"సెబాస్! చాలా బాగున్నది,

చాలా బాగున్నది; మళ్ళీ ఇంకొకమాటు అను" అని అంటూ ఆ ప్రక్కనే ఉన్న విటుడు కోరగా, చిఱునవ్వు నవ్వుతూ, ఆ ధూర్తుడు చూచుటచేత సిగ్గు పడినదా అన్నట్లు, నాలుగు మునిపళ్ళమీద ప్రసరించిన వెన్నెల అనే వస్త్రంతో, క్షణకాలముపాటు, ముఖము కప్పుకొనుచున్నదని ఇక్కడ కూడా, కుటిలుడైన విటుని నర్మోక్తుల ఔచిత్యముచేత, శృంగారరసాభాసము చేర్చుటచే ఏర్పడిన సువాసన గల హాస్యరసానికి చమత్కారపూర్ణమైన, అధికమైన, పరిపుష్టి కనబడుచున్నది.

న తు యథా శ్యామలస్య:-

28. చుమ్బనసక్తః సోఽస్యా దశనం చ్యుతమూలమాత్మనో వదనాత్
జిహ్వామూలప్రాప్తం ఖాదితి కృత్వా నిరష్ఠీవత్.

అత్ర హాస్యరసస్య బీభత్సరసాధివాసితస్య లశునలిప్తస్యేవ కుసుమశేఖరస్యాతిజుగుప్సితత్వాదనీప్సితస్య పరమనౌచిత్యేన చమత్కారస్తిరోహితః. వృద్ధాపరిచుమ్బనే జిహ్వామూలప్రాప్తస్య చ్యుతదశనస్య కణ్ఠాలోఠినః ష్ఠీవనేన బీభత్సస్యైవ ప్రాధాన్యం న తు హాస్యరసస్య.

ఐతే (హాస్యరసౌచిత్యానికి) శ్యామలుదిడి మాత్రం ఉదాహరణము కాదు.

ఈతడు, ఆవృద్ధురాలిని చుంబించడానికి ఉద్యుక్తుడై మొదలంటా ఊడిపోయి తన అంగుడుదాకా పోయిన ఆమెపన్నును కాండ్రించి ఉమ్మి వేశెను.

ఇక్కడ - పుష్పాలతో తయారుచేసిన శిరోభూషణానికి వెల్లుల్లి పూసినట్లు బీభత్సరసపువాసన అంటించిన హాస్యరసము అభిలషణీయము కాదు,

ఈ అత్యంతానౌచిత్యముచేత దాని (హాస్యరసముయొక్క) చమత్కారము తప్పబడి పోయినది. వృద్ధురాలిని మంచించినప్పుడు ఆంగుడుదాకాపోయి. కంఠంలో దొర్లుతూన్న ఊడిపోయిన పంటిని ఉమ్మివేసినట్లు వర్ణించటంలో బీభత్సానికే ప్రాధాన్య మున్నది కాని హాస్యరసానికి లేదు.

కరుణో యథా మమ మునిమతమీమాంసాయామ్ :–

29. ప్రత్యగ్రోపనతాభిమన్యునిధనే హా వత్స హా పుత్రకే
త్యాక్రన్దాపి సుభద్రయా ప్రలపితం పార్థస్య యత్తత్పురః
యేనోద్బాష్పవిముక్తశష్పకబలైః సేనాతురఙ్గైరపి
న్యఞ్చత్పార్శ్వగతైకకర్ణకుహరైర్నిశ్చేష్టమస్థం స్థితమ్ 29

అత్ర ప్రత్యగ్రోపనతప్రియతరతనయవియోగోపజనితశోకాఖ్యస్థాయిభావోచితం దృషదామపి హృదయద్రావణం సుభద్రయా యత్ప్రలపితం తదర్జునచేతసి ప్రతిఫలితం న కేవలముద్దీప్తతాముపగతం, యావత్తిరశ్చాం తురఙ్గమాణామప్యన్తఃసంక్రాన్తముద్బాష్పవిముక్తశష్పకబలనిశ్చేష్టస్థితాదిభిరనుభావైః ఉద్దీపితేనయా కరుణరసప్రతిపత్తిం కిముపాదధాతి.

కరుణరసములో (ఔచిత్యమునకు) ఉదాహరణము నా మునిమత మీమాంసలో ఎట్లనగా :-

“అప్పుడే పచ్చివడిన అభిమన్యువధనుగూర్చి, సుభద్ర, అర్జునుని ఎదుట, “హా పుత్రకా! హా వత్సా” అని అంటూ రాళ్ళు కూడా కరిగిపోవు విధముగా ఎట్లు ఏడ్చిన దనగా. (అది విని) సేనలోని గుఱ్ఱాలుకూడా కన్నీరు కార్చుచు, నోటిలోని పచ్చగడ్డిని జారవిడుచుచు, చెవిని ఒక ప్రక్కకు త్రిప్పి, నిశ్చలముగా, మందముగా నిలబడిపోయినవి.”

ఇక్కడ హఠాత్తుగా వచ్చిపడిన అభిమన్యు వియోగముచేత కలిగిన శోక మనే స్థాయిభావానికి ఉచితముగా, జాళ్ళ హృదయముకూడా కరిగిపోయే టట్లుగా సుభద్ర ఏడ్చిన ఏడ్పు అర్జునుని చిత్తములో ప్రతిఫలించి, అది ఉద్దీప్తత్వమును పొందుటయే కాక, తిర్యగ్జంతువు లైన గుఱ్ఱాలచిత్తములో కూడా సంక్రమించినదై, కన్నీరు కార్చుట, తృణకబళాలను జారవిడుచుట, నిశ్చలముగా నిలచుట మొదలైన అనుభావాలచేత, మాటలలో వర్ణింపరాని (కిమపి) విధంగా తీవ్రకరుణరసప్రతిపత్తిని కలిగించుచున్నది.

న తు యథా పరిమలస్య :-

30\. హా శృఙ్గారతరఙ్గిణీకులగిరే హా రాజచూడామణే
హా సౌజన్యసుధానిధాన హాహాహా వైదగ్ధ్యదుగ్ధోదధే.
హా దేవోజ్జయినీభుజఙ్గ యువతిప్రత్యక్షకన్దర్ప హా
హా సద్బాన్ధవ హా కలామృతకర క్వాసి ప్రతీక్షస్వ నః .

అత్ర హా హేతి హతమహీపతివిరహే తద్గుణామన్త్రణపదై-ర్వాక్యవక్తృగత ఏవ శోకః కేవలముపలక్ష్యతే. న తు విభావానుభావవ్యభిచారిసంయోగేన శోకాఖ్యస్య స్థాయిభావస్య ఉచితం రసీకరణం కించిన్నిష్పన్నమ్.

"అయ్యో శృంగారనదికి కులపర్వతమా! అయ్యో రాజశిరోరత్నమా! అయ్యో! సౌజన్యామృతానికి నిధియైనవాడా! అయ్యయో! వైదగ్ధ్యక్షీరసాగరమా! అయ్యో! మహారాజా! ఉజ్జయిని అనే నాయికకు విటుడా! అయ్యో! యువతులపాలిటి మూర్తీభవించిన మన్మథుడా! అయ్యో! సద్బాంధవా! అయ్యో! కళలకు చంద్రుడా! ఎక్కడ ఉన్నావు? మమ్మలను నిరీక్షించుము. (మేము కూడా వచ్చేవరకు ఆగుము.)

ఇక్కడ - హతుడైన రాజుయొక్క విరహములో "అయ్యో అయ్యో" అంటూ ఆతని గుణాలను చెప్పే పదాలచేత వక్తయొక్క మాటలలో ఉండే శోకముమాత్రమే సూచింపబడుచున్నది. అంతే కాని విభావానుభావవ్యభిచారుల సంయోగముచేత, శోకమనే స్థాయిభావానికి తగువిధముగా రసత్వ సంపాదనము ఏమియు జరగలేదు. (అందుచేత ఇది రసానౌచిత్యానికి ఉదాహరణము).

రౌద్రే యథా భట్టనారాయణస్య:

31. యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాణ్డవీనాం చమూనాం
యో యః పాఞ్చాలగోత్రే శిశురధికవయా గర్భశయ్యాం గతో వా
యో యస్తత్కర్మసాక్షీ చరతి మయిరణే యశ్చ యశ్చ ప్రతీపం
క్రోధాన్ధస్తస్య తస్య స్వయమపి జగతామన్తకస్యాన్తకోహమ్

(వే. సం. 3.32)

అత్ర క్రూరక్రోధస్థాయిభావాత్మకస్య ఉన్నిద్రరౌద్రరసస్య ఉచితా శిశుస్థవిరగర్భగతపశసనిస్త్రింశకర్మాధ్యవసాయాధిరోహణ సంవాదినీ; ద్రోణవధవిధురామర్ష విషవిషమవ్యథాకశ్మలశిథిలమశ్వత్థామ్నః స్థేమానం ప్రతిజ్ఞా (జ్ఞా)పయతి.

రౌద్రరసములో ఔచిత్యానికి ఉదాహరణముగా భట్టనారాయణుని శ్లోకము, ఎట్లనగా:—

"పాండవసేనలలో ఎవడెవడు అధికమైన భుజమదము కలవాడై శస్త్రము ధరించునో, పాంచాలవంశములో ఎవడెవడు శిశువుగా గాని, వృద్ధుడుగా

గాని, గర్భములో శయనించినగాని, ఉంటాడో, ఎవడెవడు ఆ కర్మకు (నా తండ్రిని చంపుటకు) సాక్షియో, యుద్ధరంగములో ఎవడెవడు నాకు ఎదురుగా తిరుగుతాడో వాళ్ళందరికిని మాత్రమే కాదు సాక్షాత్తు జగదంతకుడైన యమునికి కూడా క్రోధాంధుడనైన నేను అంతకుడను".

ఇక్కడ - శిశువులనూ, వృద్ధులనూ, గర్భములో ఉన్న వారినీ కూడా హింసించుట అనే క్రూర (నిస్త్రింశ) కర్మచేయుటకై చేసిన నిశ్చయానికి అనుకూలముగా ఉన్న ప్రతిజ్ఞ, క్రూరమైన క్రోధము స్థాయిభావముగా గల ఉద్బుద్ధమైన రౌద్రరసానికి ఉచితముగా ఉన్నదై ద్రోణుని వధచే వ్యాకులుడైన అశ్వత్థామయొక్క (మానసిక)స్థైర్యము అమర్షమనే విషమువల్ల కలిగిన విషమవ్యథాకశ్మలముచేత శిథిలమైనట్లు తెలుపుచున్నది.

న తు యథా శ్రీప్రవరసేనస్య :-

32. దణుఇన్దరుహిరలగ్గే జస్స ఫురన్తే ణహప్పహా విచ్ఛడ్డే
గుప్పన్తి విహలాఆ గరిఅవ్వ థణంసుఏ మహాసురలచ్ఛీ. 32
(దనుజేన్ద్రరుధిరలగ్నే యస్య స్ఫురతి నఖప్రభావిచ్ఛర్దే
వ్యాకులా విహలాయితా గలిత ఇవ స్తనాంశుకే మహాసురలక్ష్మీః)

(సే బం. 1 2)

అత్ర క్రోధవ్యఞ్జకపదవిరహితతయా దనుజేన్ద్రరుధిరలగ్నే యస్య నరసింహస్య స్ఫురతి నఖప్రభాసమూహే వ్యాకులీభవన్తి విహలాయితా గలితస్తనాంశుకా మహాసురలక్ష్మీః" ఇతి వర్ణనయా రుధిరలగ్న ఇతి బీభత్సరససంస్పర్శే వ్యాకులీభవన్తి దైత్యశ్రీః విహలాయితా ఇతి భయానకరససఙ్కరేణ ప్రకృతోచితప్రధానభూతస్య రౌద్రరసస్య క్వచిత్ ముఖమపి న దృశ్యతే.

ఏతే ప్రవరసేనుని శ్లోకము ఉదాహరణముగా చూపించకూడదు.

"హిరణ్యకశిపుని రక్తము అంటుకున్న నరసింహుని నఖకాంతిసము దాయము ప్రకాశించునప్పుడు వ్యాకులత చెంది ఆ మహాసురుల లక్ష్మి ఉత్త రీయము జారిపోవుచుండగా, పారిపోయినట్లున్నది".

ఇక్కడ క్రోధవ్యంజకాలైన పదాలు ఏవిము లేవు. దనుజేంద్రుని రక్తము అంటుకొన్న నరసింహుని నఖప్రభాజాలం ప్రకాశించుచుండగా(చూచి) వ్యాకులత చెందిన మహాసురలక్ష్మి ఉత్తరీయము జారిపోవుచుండగా, పారి పోయినది" అని చేసిన ఈ వర్ణనలో "రుధిరలగ్న" అనుటచేత బీభత్సరస స్పర్శ కనబడుచున్నది. "కంగారుపడుచు దైత్యలక్ష్మి పారిపోవుచున్నట్లున్నది." అని చెప్పుటలో భయానకరసముతో సంకీర్ణత్వము (కలయిక) కనబడుచున్నది. ఈ విధముగా ప్రకృతానికి ఉచితమైన, ప్రధానమైన రౌద్రరసముయొక్క ముఖము ఎక్కడను కనబడుట లేదు

వీరే యథా మమ నీతిలతాయామ్

33\. శౌర్యారాధితభర్గభార్గవమునేః శస్త్రగ్రహాన్మార్గిణః
సంక్షేపేణ నివార్య సంక్షయమయీం క్షత్రోచితాం తీక్ష్ణతామ్
ఆకర్ణాయతకృష్టచాపకుటిలభ్రూభఙ్గసంసర్గిణా
యేనాన్యాయనిషేధినా శమమయీ బ్రాహ్మీ ప్రదిష్టా స్థితిః.

వీరరసౌచిత్యము విషయములో నా నీతిలతనుంచి ఉదాహరణము, ఎట్లనగా——

"కర్ణాంతంవరకు లాగబడిన ధనస్సువలె కుటిలమైన కనుబొమ్మల విరుపుతో సంబంధము కలవాడును, (ధనస్సును వంచి, కనుబొమలు విరిచిన వాడును) అన్యాయమార్గమును అడ్డగించువాడును, అయిన ఏ రామునిచేత శస్త్రధారణముచేత చెడుమార్గమును అవలంబించినవాడును శౌర్యముచేత శివుని ఆరాధించినవాడును అయిన పరశురామునియొక్క సంక్షయముతో కూడినదియు క్షత్రియోచితమైనదియు అయిన తీక్ష్ణత్వమును అనాయాసముగా

సహించి (ఆతనికి) శమప్రధానమైన బ్రాహ్మణవృత్తి చూపబడినదో (ఆ రాముడు ఇతడే)"

(శ్రీ)రాముడు సేతువు బంధించి, సముద్రము దాటి సైన్యముతో లంకాతీరాన విడిసి ఉన్నారు. శుకసారణులనే రాక్షసులు గూఢచారులుగా ఆ సైన్యములో ప్రవేశించి కొన్ని విషయాలు తెలుసుకొని వచ్చి, ఎత్తైనప్రాసాద శిఖరము ఎక్కి ఆ సైన్యాన్ని పరీక్షించుచున్న రావణునికి, దూరముగా ఉన్న రాముని చూపించి "ఇతడే రాముడు" అని చెప్పుచున్నారు.

"ఆ రాముడు ఇతడే" అని రావణుని ఎదుట శుకసారణులచేత చూప బడుచున్న రాముడు (కొన్ని ఘడియలలో యుద్ధానికి పాల్పడవలసిన ఆ సమయములో కూడా) ఏ మాత్రమూ కంగారు లేకుండా గంభీరముగా కనబడు చున్నాడు. దానిని పట్టియే అతడు మహాప్రభావశాలి అని వ్యక్తము అవుచున్నది. అట్టివాడు ఆయుధముపట్టి చెడుమార్గాన్ని అవలంబించిన పరశురామునికి స్వజాతిధర్మమును ఉపదేశించుటలో సమర్థు డని సూచించటానికి దానిని గూర్చి చెప్పినట్లుగా చెప్పుచు భ్రూభంగము వర్ణింపబడింది. ఇది భ్రూభంగం స్వభావసిద్ధముగా ఏర్పడిన దన్నట్లు వర్ణింపబడలేదు. ఎందుచేతననగా వీరునికి కోపమువచ్చినను (బాహ్యమైన) వికారాలేవియు ఉండవు. ప్రసన్నముగాను ధీరముగాను మధురముగాను ఉండును వీరుల ప్రవృత్తి దానికి తగువిధము గానే ఇక్కడ చెప్పబడింది. పరశురాముని పరాభవమును వర్ణించుటద్వారా ప్రధాననాయకుని ఉత్కర్ష కూడా సంపాదింపబడినది.

యథా వా రాజశేఖరస్య—

34. స్త్రీణాం మధ్యే సలీలం భ్రమితగురుగదాఘాతనిర్భిష్టసంజ్ఞః
సద్యో వధ్యోభవస్త్వం పశురివ వివశస్తేన రాజ్ఞార్జునేన
తస్యచ్ఛేత్తాపి యోఽసౌ సకలనృపరిపుర్జామదగ్న్యో భుజానాం
జితో స్వైచ్ఛైః సోఽపి యేన ద్విజ ఇతి న హతస్తాపసస్త్వేషరామః

(దూతాఙ్గద–3–78)

అత్ర రావణకార్తవీర్యజామదగ్న్యోత్కృష్టోత్కృష్టతరసోపాన పరమ్పరాధిరోహణక్రమేణ ప్రధాననాయకస్య ప్రతాపః పరాం కోటి మారోపితః.

మరొక ఉదాహరణముగా రాజశేఖరుని శ్లోకము. ఎట్లనగా-

"(అనాడు) ఆ కార్తవీర్యార్జునుడు, త్రిప్పబడిన గొప్ప గదయొక్క ఆఘాతముచేత చేష్టతప్పిన నిన్ను, స్త్రీల మధ్య, కట్టబడిన పశువును చంపి నట్లుగా అనాయాసముగా చంపవలసి ఉండెను. అట్టి కార్తవీర్యార్జునుని భుజాలను ఖండించినవాడును. సకలక్షత్రియులకు శత్రువును అయిన పరశు రాముని జయించి కూడా ఏ రాముడు బ్రాహ్మణు డనే కారణముచేత ఆతనిని చంపలేదో ఆ రాముడు తాపసుడే! నిజమే''.

ఇక్కడ ప్రధాననాయకుని (రాముని) ప్రతాపమును రావణ-కార్త వీర్యార్జున-పరశురాముల, ఉత్కృష్టము, ఉత్కృష్టతరము, ఉత్కృష్టతమము అయిన పరాక్రమముయొక్క సోపానపరంపరను ఎక్కించుటద్వారా, అత్యు త్తమమైన అవధిని చేర్చుట జరిగినది.

వి. ఇక్కడ అర్థమునరిగా కుదురుటకై ఉత్కృష్ట-ఉత్కృష్టతర-ఉత్కృష్టతమ పరాక్రమసోపాన'' అన్న పాఠము లేదా తత్సదృశమైన మరొకపాఠము ఉండిన బాగుండును.

న తు యథా భవభూతేః

35. వృద్ధాస్తే న విచారణీయచరితాస్తిష్ఠన్తు హుం వర్తతాం
యుద్ధం స్త్రీదమనేప్యఖణ్డయశసో లోకే మహాన్తో హి తే
యాని త్రీణి కుతోముఖాన్యపి పదాన్యాసన్ ఖరాయోధనే
యద్వా కౌశలమిన్ద్రసూనుదమనే తత్రాప్యభిజ్ఞో జనః

(ఉ. రా. 5-34)

ఐతే భవభూతిశ్లోకము మాత్రం ఉదాహరణము కాదు.

"వారు వృద్ధులు; వారి చరిత్రను గూర్చి విచారించుట మంచిదికాదు. వారిని అలా ఉండనిమ్ము. యుద్ధము ప్రవర్తించుగాక. స్త్రీని చంపినందుకు కూడా లోకములో అఖండమైన కీర్తిని సంపాదించిన మహాపురుషులు వారు. ఖరునితో యుద్ధము చేసేటప్పుడు ఏ మూడు అడుగులు ఏవైపునకో ప్రస రించినవో వాటిని గూర్చి. ఇంద్రపుత్రుని (వాలిని) సంహరించుటలో చూపిన నేర్పును గూర్చి ప్రజలకు బాగుగనే తెలియును "

ఉత్తరరామచరిత్రలో లక్ష్మణపుత్రుడైన చంద్రకేతువుతో (అశ్వమేధా శ్వమును బంధించిన సందర్భములో) యుద్ధానికి తలబడిన లవుడు రాముని గూర్చి ఆక్షేపించుచు పలికిన మాట లివి.

అత్రాప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపో- త్కర్షాసహిష్ణోర్వీర రసోద్దీపనాయ సకలప్రబన్ధ జీవిత సర్వస్వభూతస్య ప్రధాననాయకగతస్య వీరరసస్య తాడకాదమన ఖరరణాపసరణాన్య రణసంసక్తవాలి వ్యాపాదనాది జనవిహితాపవాద ప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశః కృతః ఇత్యనుచితమేతత్.

పరుల ప్రతాపోత్కర్షను సహించని రామకుమారుడైన లవుడు ఈ నాటకములో ఒక అప్రధానపాత్ర ఆతని వీరరసమును ఉద్దీపింపచేయుటకొరకై కవి, తాడకను సంహరించినందుకు, ఖరునితోయుద్ధము చేసే టప్పుడు(మూడు అడుగులు) వెనక్కి వెళ్ళినందుకు, మరొకరితో యుద్ధముచేయుచున్న వాలిని సంహరించినందుకూ రాముని విషయములో ఉన్న జనాపవాదమును ప్రతిపా దించి, ప్రబంధానికంతటికిని జీవితసర్వస్వమైనదీ ప్రధాననాయకునికీ (రామునికి) సంబంధించినదీ అయిన వీరరసమును పాడుచేసినాడు. అందు చేత ఇది అనుచితము.

భయానకే యథా శ్రీహర్షస్య :-

36. కణ్ఠే కృత్వావశేషం కనకమయమధః శృఙ్ఖలాదామ కర్షన్
క్రాన్త్వా ద్వారాణి హేలాచలచరణరణత్కిఙ్కిణీచక్రవాలః।

దత్తాతఙ్కోఽఙ్గనానామనుసృతసరణిః సంభ్రమాదశ్వపాలైః
ప్రభ్రష్టోఽయం ప్లవఙ్గః ప్రవిశతి నృపతేర్మన్దిరం మన్దురాయాః.
(రత్నా. 2.2)

అపి చ —

37. నష్టం వర్షవరై ర్మనుష్యగణనాభావాదకృత్వా త్రపా
మన్తః కఞ్చుకికఞ్చుకస్య విశతి త్రాసాదయం వామనః.
పర్యన్తా శ్రయిభిర్నిజస్య సదృశం నామ్నః కిరాతైః కృతం
కుబ్జా నీచతయైవ యాన్తి శనకై రాత్మేక్షణాశఙ్కినః
(రత్నా. 2.3)

భయానకరసములో శ్రీహర్షుని శ్లోక ముదాహరణ మెట్లనగా :-

"అశ్వశాలనుంచి తప్పించుకొని వచ్చిన ఈ వానరము, మెడలో తెంపగా మిగిలిన బంగారు గొలుసును నేలమీదు ఈడ్చుచు, ద్వారాలను దాటి, విలాసగా (స్వేచ్ఛగా) కదులుచూన్న పాదాలమీద ధ్వనిచేయుచున్న చిరుగంటల సముదాయము కలదై, స్త్రీలకుభయము కలిగించుచు, అశ్వపాలకులచే తొందరగా అనుసరింపబడిన మార్గముకలదై రాజప్రాసాదము ప్రవేశించుచున్నది."

"మనుష్యులలో పరిగణింపబడకపోవుటచే, వృద్ధులు, సిగ్గు విడిచి పారిపోవుచున్నారు. ఈ మరుగుజ్జు భయముతో కంచుకి చొక్కాక్రింద దాముకొనుచున్నాడు. కిరాతులు ప్రక్కలకుచేరి తమ పేరుకు తగిన విధముగా చేయుచున్నారు. తమను ఎక్కడచూచునో అని భయపడుచు గూనువారు ఇంకనూ వంగి మెల్లిగా వెళ్ళుచున్నారు."

అత్ర అఙ్గనానాం నిశితదశనసఖశిఖాగ్రోల్లేఖాతఙ్కాదానేన, ప్రచురతరవానరాభిసరణభయ సంభ్రాన్తాన్తఃపురిక వృద్ధవామన కిరాత కుబ్జాదీనాం పురుషగణనాహీనతయా ధైర్య విరహాకాతరాణా ముచిత

చేష్టానుభావవర్ణనయా భయానక రససంవాదిరుచిరౌచిత్యమాచకాస్తి.

ఇచట, వాడి యైన దంతములతో కొరుకునేమో అను భయము స్త్రీలకు కలిగి నట్లు చెప్పబడినది. ఆ వానరము వచ్చి ఎక్కడ మీద పడునో అను భయాతిశయముచేత దిక్కు తెలియక, అంతఃపురములోని వృద్ధులు, వామనులు, కుబ్జులు, కిరాతులు మొదలైనవారు, పురుషులలో పరిగణనము లేని వారగుటచే ధైర్యము చెడి అందులకు తగువిధమున ప్రవర్తించిన విధము, వారి చేష్టలరూపమున అనుభావములు చక్కగ వర్ణింపబడినవి. ఈ విధముగ ఈ వర్ణనమంతయు భయానకరసమునకు అనుకూల మగుటచే ఔచిత్య సమంచితమై ఉన్నది.

న తు యథా రాజపుత్రముక్తాపీడస్య—

38 నీవారప్రసరాగ్రముష్టికవలైర్యో వర్ధితః శైశవే
పీతం యేన సరోజపత్రపుటకే హోమావశేషం పయః.
తం దృష్ట్వా మదమన్థరాలివలయవ్యాలోలగణ్డం గజం
సానన్దం సభయం చ పశ్యతి ముహూర్దూరే స్థితస్తాపసః.

అత్ర గజస్యాఘాతక వికృతచేష్టానువర్ణనావిరహితతయా స్థాయి భావస్య భయస్యానుభావవర్జితస్య. కేవలం నామమాత్రోదీరణేన చ భయానకరసోచితసంభ్రమాభావాదుపచిత మనౌచిత్యం న కించి దుపలభ్యతే.

మరి యొక ఉదాహరణము, రాజపుత్రుడైన ముక్తాపీడునిది ఎట్లనగా-

"శైశవములో, ఏ ఏనుగ, అడవి వరిమొక్కల చిగుళ్ళను పిడికిళ్ళతో నోటికి అందించి పెంచబడెనో, తామరాకు దొన్నెలలో, హోమము చేయగా మిగిలిన పాలను ఏ ఏనుగ త్రాగెడిదో, అదియే ఇప్పుడు మదముచే మందముగ నడచుచు, తుమ్మెదలు ముసురుచున్న గండస్థలము కలదై ఉన్నప్పుడు, దానిని, తాపసుడు, దూరముననే నిలిచి, సానందముగాను, సభయముగాను చూచుచున్నాడు."

ఇచట, గజము (తాపసుని) హింసించుటకై వికృతచేష్టలేవియు చేసి నట్లు వర్ణింపబడలేదు. భయానకరసమునకు స్థాయి భావ మైన భయమును ('సభయం' అను పదముచే) పేర్కొన్నంతమాత్రాన భయానకరసమునకు తగిన సంభ్రమమేదియును కలుగదు గాన ఇక్కడ ఔచిత్యమేమియును కనబడుటలేదు.

బీభత్సే యథా మమ మునిమతమీమాంసాయామ్—

39. సర్వాపాయచయాశ్రయస్య నియతం కుత్సానికాయస్య కిం
కాయస్యాస్య విభూషణైః సువసనైరానన్దనైశ్చన్దనైః
అన్త్రస్యస్య శకృద్యకృత్క్రిమికులక్లోమాస్త్రమాలాకులే
క్లేదిన్యస్త దినే ప్రయాన్తి విముఖాః కౌలేయకాకా అపి.

అత్ర వైరాగ్యవాసనాచ్ఛురితబీభత్సరసస్య జుగుప్సాఖ్యస్థాయి భావోచితకాయగతకుత్సితాన్త్రితన్త్ర్యాది సముదీరణేన పరా పరిపుష్టిః నిఃసారశరీరాభిమాననైరస్యజననీ ప్రతిపాదితా.

బీభత్సరసౌచిత్యమునకు ఉదాహరణముగ, నా మునిమత మీమాంస లోని శ్లోక మెట్లనగా:-

"ఈశరీరము తప్పనిసరిగ సమస్తమైన అపాయముల (ఉపద్రవముల) సముదాయమునకు ఆశ్రయము. ఇది అసహ్యాల కుప్ప. దీనికి అలంకారము లెందుకు; మంచి వస్త్రము లెందుకు; ఆనందకరమైన చందనము లెందుకు? మరణించిన పిమ్మట దీని లోపలి భాగము, మలము యకృత్తు (లివర్). కృమిసముదాయము, క్లోమము (ఊపిరితిత్తులు), ప్రేవులు — వీటితో వ్యాకులమై నీళ్ళు కారుచున్నప్పుడు దీనిని విడచి కుక్కలు, కాకులు, కూడ దూరముగ తొలగిపోవును."

ఇచట వైరాగ్యవాసనతో మిశ్రితమైన బీభత్సరసము, స్థాయిభావ మైన జుగుప్సకు తగిన విధముగ శరీరములోని కుత్సితములైన ప్రేవులు మొదలైన వాటిని గూర్చి చెప్పుటచే చక్కగ పోషింపబడినదై నిఃసారమైన శరీరముపై

అభిమానమును తొలగించు విధముగ (వైరస్యజననీ) ప్రతిపాదింపబడినది.

న తు యథా చన్ద్రకస్య:-

40. కృశః కాణః ఖఞ్జః శ్రవణరహితః పుచ్ఛవికలః
క్షుధా క్షామో రూక్షః పిఠరకకపాలార్దితగలః.
వ్రణైః పూతిక్లిన్నైః కృమిపరివృతైరావృతతనుః
శునీమన్వేతి శ్వా తమపి మదయత్యేవ మదనః

అత్ర అశుచిచర్వణరుచేరుపచితవిచికిత్సకుత్సాని కాయ కాయస్య స్వభావజుగుప్సితయోనేః, శునకస్య కిమేతైః బీభత్సవిశేషణైరతిశయ నిర్బన్ధానుబద్ధైరధికముద్భాసితమ్? ఏతైరేవ పురుషగతైర్జుగుప్సా పరం గౌరవమావహతి.

అయితే చందకుని శ్లోకము ఉదాహరణము కాదు:-

"ఆ శునకము చిక్కిపోయినది ఒక కన్ను గ్రుడ్డిది ఒక కాలు కుంటిది. చెవులులేవు. తోక తెగిపోయినది. ఆకలితో శుష్కించి పోయినది. చూచుటకు క్రూరముగా ఉన్నది. కుండమూతి మెడను నొక్కుచున్నది. ఒళ్ళు అంతటను పురుగులతో నిండిన చీము కారుచున్న వ్రణములు ఉన్నవి. ఐనను అది ఒక ఆడకుక్క వెనకబడిపోవుచున్నది. మన్మథుడు దానికి కూడ మదమును కలిగించుచున్నాడు!"

కుక్క అశుద్ధమైన పదార్థములను తినుటయందు ఆసక్తి కలది. అందు చేత దాని శరీరము నింద్యముగనే ఉండును. స్వభావముచేతనే జుగుప్సాకర మైనది. అట్టిదానికి జుగుప్సను ఎక్కువ చేయుటకై చేర్చిన ఈ బీభత్స విశేషణము లన్నియు ఎందుకు? ఐతే ఈ విశేషణములే పురుషునకు ఉప యోగించిన పక్షములో జుగుప్స అత్యధికముగ గలుగును గాన అప్పుడు ఉచితములు కావచ్చును. (ప్రస్తుతము ఈ శునకమునకు మాత్రము అనావశ్య కములగుటచే అనుచితములే.)

అద్భుతే యథా చన్దకస్య—

41. కృష్ణేనాంబ గతేన రన్తుమధునా మృద్ భక్షితా స్వేచ్ఛయా
సత్యం కృష్ణ క ఏవమాహ ముసలీ మిథ్యాంబ పశ్యాననమ్,
వ్యాదేహీతి వికాసితేఽథ వదనే దృష్ట్వా సమస్తం జగ
న్మాతా యస్య జగామ విస్మయపదం పాయాత్ స వః కేశవః.

అత్ర పాణ్డురాఙ్గకరసాక్షిలక్షితమృద్భక్షణాక్షేపోద్యత జననీ భయచకితస్య అపహ్నవకారిణః శిశోర్వ్యాకాసితాస్యస్యాన్తః సమస్తజగద్దర్శనేన మాతుశ్చ తత్ప్రభావానభిజ్ఞాయా వాత్సల్యవిహ్వలాయాః విస్మయగమనేనాత్యుచితోఽయమద్భుతాతిశయః.

అద్భుతరసౌచిత్యమునకు ఉదాహరణముగా చందకునిది ఎట్లనగా—

“అమ్మా! యిప్పుడు ఆడుకొనుటకై వెళ్ళిన కృష్ణుడు, ఇష్టము వచ్చినట్లు, మట్టి తిన్నాడు’. ‘కృష్ణా! నిజమేనా?’ ‘ఇట్లని ఎవరు చెప్పినారు?’ ‘బలరాముడు’! ‘అమ్మా’. అది అసత్యము, (‘నా) నోరు చూడుము’. (‘అయితే నోరు) తెరువుము’ ఇట్లు చెప్పగనే ఆతడు నోరు తెరవగా దానిలో ప్రపంచమునంతను చూచి ఏ శ్రీకృష్ణుని తల్లి ఆశ్చర్యము చెందెనో ఆతడు మిమ్ములను రక్షించుగాక”.

ఇచట—బలరాముడను (‘పాండురాంగక సాక్షి’ అను పాఠమున్న యుక్తము) సాక్షి ద్వారా తెలియబడిన మృద్భక్షణ మనే ఆక్షేపముచే (దండించుటకై) ఉద్యమించిన తల్లి నుండి భయముచే కంగారు పడుచున్న ఆ గోపాలబాలుడు తాను చేసిన పని కప్పిపుచ్చుచు నోరు తెరచిన వెంటనే దానిలో సమస్తజగత్తును చూడగానే తల్లి, అందును ఆతని ప్రభావము నెరుగనిది. వాత్సల్య విహ్వలయై ఆశ్చర్యమును పొందిన దని వర్ణించుటచే ఈ అద్భుతాతిశయము ఎంతయు ఉచితముగ ఉన్నది.

న తు యథా మమ మునిమతమీమాంసాయామ్—

42. సమస్తాశ్చర్యాణాం జలనిధిరపారః న వసతి
స్తతోఽప్యాశ్చర్యం యత్ పిబతి సకలం తం కిల మునిః.

ఇదం త్వత్యాశ్చర్యం లఘుకలశజన్మాపి యదసౌ
పరిచ్ఛేత్తుం కో వా ప్రభవతి తవాశ్చర్యసరణిమ్.

అత్రాపారసరిత్పతిప్రభావేణ మునినా తస్యైకచులుకాచమనేన, మునేశ్చ లఘుకలశజన్మనా క్రమాక్రాన్తిసమారూఢోఽ ప్యసమవిస్మయమయోఽయమద్భుతప్రసరః సంసారస్యైవంవిధైవాశ్చర్యసరణిరపరిచ్ఛిన్నా; న కించిదేతత్కౌతుక మిత్యర్థాన్తరన్యాససామర్థ్యేన సహసైవావరోపిత ఇవ తిరోభూతతాముపగతః.

వ్యా. ఐతే - నా మునిమతమీమాంసలోని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు—

"అపారమైన ఆ సముద్రము సమస్తమైన ఆశ్చర్యములకును నివాసస్థానము. ఆ సముద్రము నంతను ఆ ముని త్రాగివేయుట అంతకంటెను ఆశ్చర్యము ఐతే ఆ ముని చిన్న కలశములో జనించినాడనునది ఇంకను ఆశ్చర్యము. నీ ఆశ్చర్యమార్గమును ఎవడు నిర్ణయించగలడు?"

వి. ఇది పరమేశ్వరుని కాని,సంసారమును కాని ఉద్దేశించి చెప్పినదై యుండును సముద్ర-అగస్త్య- కలశములను చూడగా ఒకదానికంటె ఒకటి ఆశ్చర్య జనకములుగా ఉన్నవి. నీ ఆశ్చర్యరచనావిధానమును ఎవడు ఇదమిత్థ మని నిర్ణయించగలడు అని అర్థాంతరన్యాసము.

ఇచట అపారమైన సముద్రముయొక్క ప్రభావము చేతను, ముని దానిని ఒక్క చులుకముచే ఆచమనముచేయుటచేతను, ఆ ముని చిన్న కలశము నుండి జన్మించుట చేతను అద్భుతరసప్రసారము క్రమక్రమముగ పెంపొందినదై సాటి లేని విస్మయముతో నిండినదై ఉన్నది. కాని ("పరిచ్ఛేత్తుం కో వా ప్రభవతి తవాశ్చర్యసరణిమ్" అను వాక్యము చేర్చి) అర్థాంతరన్యాసము చేయుటతోడనే — సంసారముయొక్క ఆశ్చర్యసరణి ఇట్లే అపరిచ్ఛిన్నముగా ఉండును, ఇందులో అంతగా చెప్పుకొనుటకు ఏమి ఉన్నది అన్నట్లు భావము

కలిగి, ఆ అద్భుత ప్రసరము ఒక్క మారుగా క్రిందికి దించినట్లు అయిపోయి చివరకు అంతర్హిత మైపోయినది. (అందుచే ఈ శ్లోకములో రసౌచిత్యము నకు భంగము కలిగినది. తన శ్లోకములో కూడా దోషమును చూపగలిగిన క్షేమేంద్రుని ఈ నిష్పాక్షికదృష్టిని విమర్శకులందరును ఆదర్శముగ గ్రహింప వలెను.)

శాన్తే యథా మమ చతుర్వర్గసఙ్గ్రహే— (4.7)
భోగే రోగభయం సుఖే క్షయభయం విత్తేఽగ్ని
భూభృద్భయం

43. దాస్యే స్వామిభయం గుణే ఖలభయం వంశే కుయోషిద్భయమ్,
మానే మ్లానిభయం జయే రిపుభయం కాయే కృతాన్తాద్
భయం
సర్వం నామ భవే భవేద్భయమహో వైరాగ్యమేవాభయమ్.

అత్ర సకలజనాభిమతభోగసుఖవిత్తాదీనాం భయానుయతయా హేయతాం ప్రతిపాద్య వైరాగ్యమేవ సకలభయాయాసశమనముపాదేయతయా యదుపన్యస్తం తేన శాన్తరసస్య నిరర్గలమార్గావతరణ ముచితతరముపదిష్టం భవతి.

శాంతరసౌచిత్యమునకు నా చతుర్వర్గ సంగ్రహము నుండి ఉదాహరణ మెట్లనగా—

“భోగమునందు రోగమువలన భయము, సుఖమునందు అది తగ్గి పోవుననే భయము; ధనమునందు అగ్నివలనను, రాజువలనను భయము; దాస్యమునందు స్వామి (యజమాని) వలన భయము; గుణమునందు దుర్మార్గులవలన భయము; వంశమునందు చెడ్డ స్త్రీల వలన భయము; ఆత్మాభిమానమునందు దానికి ఎక్కడ ఆఘాతము తగులునో అను భయము; జయమునందు శత్రువుల వలన భయము; శరీరమునందు యమునివలన భయము;

ఈ విధముగ సంసారములో అంతయు భయమయమై ఉండును. వైరాగ్యము ఒక్కటే భయము లేనిది."

ఇచట అందరికిని ఇష్టమైన భోగములు, సుఖము, ధనము మొదలగు నవన్నియు భయమయములగుటచే పరిత్యజింపతగినవి అని చెప్పి, సమస్తమైన ప్రయాయాసములను తొలగించునదగుటచే వైరాగ్యమొక్కటే ఉపాదేయము (గ్రహింపదగినది) అని చెప్పబడినది. ఇట్లు చెప్పుటచే శాంతరసమునకు నిరర్గళముగ అవకాశము కల్పితమగుటచే దానికి ఎక్కువ ఔచిత్యము చేకూరి నది.

యథా వా మమ మునిమతమీమాంసాయామ్:-

44. కుసుమశయనం పాషాణో వా ప్రియం భవనం వనం
ప్రతను మసృణస్పర్శం వాసస్త్వగప్యథ తారపి.
సరసమశనం కుల్మాషో వా ధనాని తృణాని వా
శమసుఖసుధాపానక్షైబ్యే సమం హి మహాత్మనామ్.

అత్ర సకల వికల్పతల్పరహితాభేదావభాసమానాత్మతత్త్వ విశ్రాన్తిజనిత సర్వసామ్య సముల్లసిత శమసుఖపీయూషపానోదిత నిత్యానన్ద ఘూర్ణమానమానసానాం, ప్రియాప్రియసుఖదుఃఖాదిషు మహాత్మనాం సదృశీప్రతిపత్తిరితి జీవన్ముక్తిసుముచితమభిహితమ్.

మరియొక ఉదాహరణము నా మునిమతమీమాంసలో ఎట్లనగా——

"శమసుఖ మనెడు అమృతమును త్రాగుటచే మత్తు కలిగిన పిమ్మట, మహాత్ములకు, పుష్పశయన మైనను ఱాతిబండ యైనను, ప్రియమైన గృహ మైనను వనమైనను, మెత్తని స్పర్శ గల సన్నని వస్త్ర మైనను నారబట్ట యైనను, సరసమైన భోజనమైనను, గుగ్గిళ్ళైనను ధనమైనను తృణమైనను సమానములేకదా!"

ఎట్టి వికల్పముల (భేదముల) కల్పనలకును అవకాశములేని ("వికల్ప

కల్పనారహిత" అను పాఠమున్న బాగుండును) అభేదరూపమున భాసించు చున్న ఆత్మతత్త్వమునందు విశ్రాంతిని పొందుటచే అన్ని వస్తువులందును సమత్వబుద్ధి కలిగి శమసుఖము లభించును. అట్టి శమసుఖామృతమును త్రాగుటచే కలిగిన నిత్యానందముతో తిరుగుచున్న మనస్సు గల మహాత్ములకు ప్రియ-అప్రియ, సుఖ-దుఃఖాదుల విషయమున ఒకే విధమగు ప్రతిపత్తి (భావన) ఉండును గాన, ఇచట జీవన్ముక్తికి తగిన వి మగ చెప్పబడినది.

న తు యథా శ్రీమదుత్పలరాజస్య:-

45. అహౌ వా హారే వా బలవతి రిపౌ వా సుహృది వా
మణౌ వా లోష్టే వా కుసుమశయనే వా దృషది వా.
తృణే వా స్త్రైణే వా మమ సమదృశోయాన్తు దివసాః
క్వచిత్పుణ్యారణ్యే శివ శివ శివేతి ప్రలపతః.

అత్ర జీవన్ముక్తోదితం ప్రియాప్రియ రాగద్వేషోపశమలక్షణ మోక్షక్షమం సర్వసామ్యమహిహారసుహృదదిసమదృష్టిరూపమభిదధతా క్వచిత్ పుణ్యారణ్యే యదభిహితం తద్వికల్పప్రతిపాదకమ భేదవాసనావిరుద్ధమనుచితమవభాసతే. భావాధిరూఢసర్వసామ్యవిగలిత భేదాభిమానగ్రన్థేర్హి సర్వత్ర సర్వం శివమయం పశ్యత స్తపోవనే నగరావస్కరకూటే చ విమలాత్మలాభతృప్తతయా సమానదృశః క్వచిత్ పుణ్యారణ్యాదివచనమనుచితోచ్చారణమేవ.

ఐతే — శ్రీ మదుత్పలరాజు శ్లోకమును ఉదాహరణముగ చూపగూడదు.

"సర్పమునందు గాని, హారమునందు గాని, బలవంతుడైన శత్రువునందు గాని, మిత్రునియందు గాని, మణియందు గాని, మట్టిబెడ్డమీద గాని, కుసుమశయనమునందు గాని, బండదతాతియందు గాని తృణమునందు గాని,

స్త్రీసముదాయమునందు గాని, సమానమైన దృష్టి గలిగి, ఏదియోయొక పుణ్యా రణ్యమునందు శివ, శివ, శివ అని ఉచ్చరించుచుండగా నా రోజులన్నియు గడచిపోవుగాక."

ప్రియాప్రియములును, రాగద్వేషములును ఉపశమించుటయే మోక్షమునకు లక్షణము. దానిని ఇచ్చుటకు సమర్థమైనదియును, సర్పహారములందును, శత్రుమిత్రులందును, సమదృష్టి రూపమైనదియు, జీవన్ముక్తులకు తగినదియు అగు సర్వసామ్యమును గూర్చి మొదట చెప్పి, మరల "పుణ్యారణ్యములో" అని చెప్పుటలో భేదబుద్ధి (ఒక స్థలము పుణ్యమనియు, మరియొకటి అపుణ్యమనియు, భేదబుద్ధి) కనబడుచున్నది. అది అభేద వాసనకు ప్రతిబంధకము కావున (మొదట చెప్పిన సర్వసామ్యమునకు) అనుచితముగ కన్పట్టుచున్నది. సర్వసామ్యబుద్ధి ఉన్నత స్థాయిలో ఉండి భేదాభిమానగ్రంథి పూర్తిగా సడలిపోయినవాడు అంతను శివమయముగనే చూచును. విశుద్ధాత్మ జ్ఞానతృప్తుడై తపోవనమును గాని, నగరమును గాని, పెంటకుప్పను గాని, సమముగా చూచువాడు "క్వచిత్ పుణ్యారణ్యే" అని చెప్పుట అనుచితమే.

యథా మధురతిక్తాద్యా రసాః కుశలయోజితాః
విచిత్రాాదస్వాతాం యాన్తి శృఙ్గారాద్యాస్తథా మిథః 17
తేషాం పరస్పరాశ్లేషాత్కార్యాదౌచిత్యలక్షణమ్
అనౌచిత్యేన సంస్పృష్టః కస్యేష్టో రససఙ్కరః॥ 18

రసాః కటుకమధురామ్లలవణాద్యాః (యథా) కుశలసూదేన వేసవార పానాదిషు (శుణ్ఠ్యాదిచూర్ణపానాదిషు) యోజితా విచిత్రాస్వాద్వతాముప యాన్తి తథైవ పరస్పరమవిరుద్ధాః శృంగారాదయ ఇతి. తేషామన్యోన్య మఙ్గాఙ్గిభావయోజనాయామౌచిత్యస్య జీవిత సర్వస్వభూతస్య రక్షాం కుర్యాత్ అనౌచిత్యరజసా రససంయోగః స్పృష్టోన కస్య చిదభిమత ఇత్యర్థః.

“మధురము, చేదు మొదలైన రసములు కుశలులచేత కలపబడినవై విచిత్రమైన రుచి నిచ్చును. శృంగారాదిరసములు కూడ కలపబడినవై అట్లే రుచికరములుగ ఉండును.”

“వాటిని ఒకదానితో ఒకటి కలిపి ఔచిత్యమును పరిరక్షించవలెను. అనౌచిత్యముయొక్క స్పర్శగల రససంకరమును (రసముల కలయికను) ఎవరు మెచ్చుకొందురు?”

నేర్పుగల వంటవానిచే, ఖండ చూర్ణము పానీయము మొదలగువాటిలో కలపబడిన చేదు, తీపి పుల్లన ఉప్పన మొదలైన రసములు విచిత్రమైన ఒక క్రొత్త రుచి కలిగించినట్లు పరస్పరవిరోధము లేని శృంగారాది రసములను కలిపినప్పుడు గూడ విచిత్ర సౌందర్యము లభించును. ఒకదానిని అంగిరసముగను, మరికొన్నింటిని అంగరసములుగను పరస్పరము ఈ రసములను కలుపునపుడు (కావ్య) జీవిత సర్వస్వమైన ఔచిత్యము చెబ్బతినకుండునట్లు చూచుకొనవలెను. రససంయోగములో అనౌచిత్యమనెడు రజస్సు ఏ మాత్రమున్నను అట్టి సంయోగమును ఎవ్వరును మెచ్చరని యర్థము.

రససఙ్కరౌచిత్యే శాన్తశృఙ్గారయోరఙ్గాఙ్గిభావో యథా భగవతో మహర్షేః వ్యాసస్య—

46. సత్యం మనోరమా రామాః సత్యం రమ్యా విభూతయః
కిన్తు మత్తాఙ్గనాపాఙ్గభఙ్గలోలం హి జీవితమ్. 46

అత్ర భగవతా జన్తుహితాభినివిష్టేన మోక్షోపదేశే అఙ్గినః శాన్తరసస్య రాగిజనానిష్టత్వాత్ సకలజనమనఃప్రహ్లాదనే బాలగుడజిహ్వికయా శృఙ్గారేఽఙ్గభావముపనీతే పర్యన్తే శాన్తస్యైవ “లోలం జీవితమ్” ఇత్యనిత్యతాప్రతిపాదనపరినిర్వాహేణ పరమౌచిత్యముచ్చైః కృతమ్.

రససంకరౌచిత్యమునకు ఉదాహరణముగ భగవంతుడగు వ్యాస మహర్షి శ్లోకములోని శాంతశృంగారముల అంగాంగిభావము ఎట్లనగా—

“స్త్రీలు మనోహరమైనవారు - నిజమే! ఐశ్వర్యములు చాల రమ్యములుగా ఉండును. నిజమే! కాని జీవితము, మదించిన యువతుల క్రీకంటి చూపులోని విరుపు వలె చంచల మైనది.”

భగవంతుడైన వ్యాసుడు మానవులకు హితము చెప్పవలెనని పట్టుదలతో ఉన్నాడు. ఐతే - మోక్షమునకు తగినఉపదేశములో అంగిగా ఉండవలసిన శాంతరసము రాగవంతులకు అంతగా రుచింపదు. అందుచే బాలగుడజిహ్వికాన్యాయముచేత (చేదు మందు మింగించవలసిన పిల్లలకు ముందుగా నాలుకకు బెల్లము రాసినట్లు) ముందుగా, సకలజనులకును ఆహ్లాదజనకమైన శృంగారమును అంగముగ చేసిన పిమ్మట “లోలం జీవితమ్” అని చెప్పుచు జీవితము అనిత్యమని ప్రతిపాదించి చివరకు శాంతరసమునే నిర్వహించుటచే ఇచట ఎంతయు ఔచిత్యము పోషింపబడినది.

బీభత్సశృఙ్గారయోరఙ్గాఙ్గిభావో యథా మమ బౌద్ధావదాన కల్పలతాయామ్—

47. క్షీబస్యేవాచలస్య ద్రుతహృతహృదయా జమ్బుకీ కణ్ఠసక్తా
రక్తాభివ్యక్తకామా కమపినఖముఖోల్లేఖమాసూత్రయన్తీ.
ఆస్వాద్యాస్వాద్య యూనః క్షణమధరదలం దత్తదన్త
వ్రణాఙ్కం
లగ్నానగ్నక్రియాయామియమతిరభసోత్కర్షమావిష్కరోతి.

బీభత్సశృంగారముల అంగాంగి భావము నా “బౌద్ధావదాన కల్పలతలో” ఎట్లనగా—

[ఈ శ్లోకములో - మరణించిన ఒక యువకుని శవమును పీకికొని తినుచున్న ఒక ఆడునక్క వర్ణింప బడుచున్నది. ప్రయోగించిన పదములు శ్లిష్టము లగుటచే మద్యపానమత్తుడైన యువకునితో రతికేళి సలుపుచున్న ఒక ప్రౌఢనాయిక వృత్తాంతము గమ్యమగుచున్నది ఈ ఆడునక్క అట్టి

నాయికవలె ఉన్న దని గమ్య మగుటచే శ్లేషానుప్రాణిత మైన ఉపమాలంకార మని క్షేమేంద్రుని అభిప్రాయము. ప్రస్తుతము జంబుకీ వృత్తాంతము గాన దానికి సంబధించిన బీభత్సము అంగిరసము నాయికా వృత్తాంతము అప్రస్తుతము గాన దానికి సంబంధించిన శృంగారము అంగరసము. నాయికకు సంబంధించిన రెండవ అర్థము బ్రాకెట్లలో చూపబడుచున్నది.]

"ఆ యువకుడు మద్యపాన మత్తుడు వలె నిశ్చలుడై యుండగా, ఈ జంబుకి, లొందరగా హరింపబడిన హృదయము కలదై (ఆకర్షింపబడిన హృదయము కలదై) కంఠమునందు తగుల్కొన్నదై, రక్తమునందు వ్యక్తముగ తెలియుచున్న కోరిక కలదై (అనురాగముచే స్పష్టముగ తెలియుచున్న కామము కలదై) గోళ్ళతోడను ముఖముతోడను ఏమేమో గీరుచు, (నఖాగ్రములచే ఏమేమో గ్రుచ్చుచు) దంతముల వ్రణములచే చిహ్నితమైన అధరోష్ఠమును క్షణకాలముపాటు ఆస్వాదించి, ఆస్వాదించి, అసంగక్రియలో అనగా శరీరము లేకుండునట్లు చేయుట అను క్రియలో—భక్షణములో (మన్మథక్రీడలో) లగ్నమై, చాల వేగముగా పైకి లాగుటను (గొప్పవేగాతిశయమును) చూపుచున్నది."

అత్ర శ్లేషోపమయా తుల్యకక్ష్యాదిరూఢయోరపి పరస్పర విరుద్ధయోరర్థయోః బీభత్సశృఙ్గా(రయోర) ఙ్గాఙ్గిభావయోజనాయాం జమ్బుకీ తరుణశవస్య క్షీబస్యేవ నిశ్చలస్థితేః సహసైవ హృతహృదయ పద్మాకృష్టచిత్తా వా, కణ్ఠే లగ్నా, శోణితే భృశమభివ్యక్త స్పృహా రక్తాభివ్యక్త కామా వా, నఖోల్లేఖమాస్యాగ్రమస్మి, దత్తదన్తవ్రణమధర మాస్వాద్యాస్వాద్య, అఙ్గచ్ఛేదక్రియాయామనఙ్గభోగక్రియాయాం వా లగ్నా, గాత్రాణామూర్ధ్వగతం కర్షణం రక్తకౌశలోత్కర్షం వా ప్రకాశయతీతి సమానయోః బీభత్సశృఙ్గారయోః కామినీ పద పరిత్యాగేన కేవలం జమ్బుక్యాః కర్తృత్వేన, బీభత్సస్యైవ ప్రాధాన్యే శృఙ్గారేఽఙ్గతాముపగతే, వక్తుర్బోధిసత్త్వస్యాన్తర్గతగాఢవైరాగ్యవాసనాధివాసిత చేతసః కుత్సార్హజుగుప్సయా నితమ్బినీరతివిడమ్బనం

ఔచిత్యరుచిరతా మాదధాతి. యద్యప్యత్ర మహావాక్యే శాన్తస్యైవ ప్రాధాన్యం తథాప్యుదాహరణశ్లోకవాక్యే బీభత్సస్యైవ.

ఇచట శ్లేషోపమచేత (శ్లేషాను ప్రాణితమైన) ఉపమచేత తుల్యకక్షను అధిష్ఠించిన (అనగా ఇది ప్రధానము ఇది అప్రధానము అని చెప్ప వీలులేని) పరస్పర విరుద్ధవిషయములైన బీభత్స శృంగారములకు అంగాంగిభావము కూర్చబడినది. జంబుకి, మత్తెక్కినవాడు వలె నిశ్చలముగానున్న యువక శవము యొక్క హృదయపద్మమును వెంటనే హరించి, లేదా ఆకర్షింపబడిన హృదయము కలదై, కంఠమునందు లగ్నమై, రక్తమునందు చాల ఆసక్తిని చూపుచు, లేదా రాగముచే (లేదా అనురక్తుని యందు) అభివ్యక్తమైన కామము కలదై,) నఖోల్లేఖము చేయుచు, దంతక్షతము లిచ్చిన అధరమును ఆస్వాదించి ఆస్వాదించి, శరీరమును ఛేదించు పనిలో, లేదా మన్మథభోగ క్రియలో, గాత్రములను పైకి లాగుటను లేదా అనురాగవంతులకు ఉండు నేర్పుయొక్క ఉత్కర్షనుచూపుచున్నది — అను అర్థములో బీభత్స శృంగార ములు రెండును సమముగనే ఉన్నవి, కాని ఇచట 'కామినీ' అను పదము ప్రయోగింపబడలేదు కేవలము జంబుకియే కర్తగా చెప్పబడినది. అందుచే బీభత్సమునకే ప్రాధాన్యము లభించినది. శృంగారము దాని కంగమైనది. ఇచ్చట వక్త బోధిసత్త్వుడు. ఈతని చిత్తము ప్రగాఢమైన వైరాగ్యవాసనతో నిండియుండును. అందుచే ఈతడు నితంబినీ రతి వ్యాపారమును కూడ ఈ జంబుకీ వ్యాపారమును వలె జుగుప్సతో చూచునను అంశమును సూచించుటచే, (ఇచట శృంగారమును బీభత్సమునకు అంగముగ చేయుట) ఎతయు ఔచి త్యముతో రుచిరముగ నున్నది. ఇచట ప్రబంధరూపమైన మహావాక్యములో ప్రధానరసము శాంతమేయైనను ఈ ప్రస్తుతోదాహరణ శ్లోకములో ప్రధాన మైన రసము బీభత్సమే.

వి. రామాయణ - భారత - రఘువంశ - బుద్ధచరిత - శిశుపాలవధాది కావ్యములున్నవి. వీటిని మొత్తము ప్రబంధముగా గ్రహించినపుడు దానిని మహావాక్య మందురు. శ్లోకములు అవాంతరవాక్యములు. రామాయణము

మొత్తము ఒక మహావాక్యముగా గ్రహించినప్పుడు అందులో ప్రధానరసము కరుణరసము, మహాభారతమును మహావాక్యముగా తీసికొనినప్పుడు శాంతము ప్రధానరసము. అట్లే రఘువంశ - బుద్ధచరితాదులలోకూడ ప్రధానరసము శాంతము. శిశుపాలవధమున వీరము. ఐతే అవాంతరవాక్యములలో అనగా కొన్ని శ్లోకములలో, లేదా కొన్ని ఘట్టములలో వేరు వేరు రసము లుండవచ్చును. అవి అన్నియు చివరకు ప్రధానరసమునకు అంగములు. ఈదృష్టితో చూచి నపుడు 'బౌద్ధావదానకల్పలత' అనెడు మహావాక్యములో ప్రధానరసము శాంతమే అయినను, ఇక్కడ ఉదాహరించిన ఈ శ్లోకములో అంగిరసము బీభత్సమే అని క్షేమేంద్రుడు చెప్పుచున్నాడు.

వీరకరుణయోర్యథా మమ మునిమతమీమాంసాయామ్—

48 గాణ్డీవస్రువమార్జన ప్రణయినః స్నాతస్య బాష్పామ్బుభి
శ్చణ్డాం ఖాణ్డవపావకాదపి పరం శోకానలం బిభ్రతః.
జిష్ణోర్యౌవనోదయదినచ్ఛిన్నాభిమన్యోశ్చిరం
హా వత్సేతి బభూవ సైన్ధవవధారమ్భాభిచారే జపః.

వీర కరుణముల సంకరము నా మునిమతమీమాంసలో ఎట్లనగా—

"గాండీవ మనెడు స్రువమును(అగ్నిలో నెయ్యి మొదలగు వాటిని హోమము చేయుటకు సాధనము) మార్జించుటయందు (తుడుచుటయందు) ఆసక్తి కలవాడును, బాష్పోదకములచే స్నానము చేసినవాడును ఖాండవాగ్ని కంటె కూడా తీవ్రమైన శోకాగ్నిని ధరించుచున్నవాడును యౌవనము ఉద యించు రోజులలో చంపబడిన కుమారుడు కలవాడును అగు అర్జునునియొక్క "హావత్సా" అను జపము, సైంధవుని చంపుటకై ప్రారంభింపబడిన అభి చారమునందు జరిగెను."

వి. ఎవరినైనను చంపుటకై అభిచారప్రక్రియ చేయువారు స్నానము చేసి, స్రుక్కు-స్రువము మొదలగు వాటిని గ్రహించి, ఏవో మంత్రములను జపిం చుచు, అగ్నిలో హోమము చేయుదురు. ఇపుడు సైంధవుని సంహరించుటకై

ఉద్యుక్తుడైన గాండీవి అట్టి అభిచారమంత్రజపహోమాదులయం దుద్యుక్తుడై నట్లున్న దని భావము.

అత్ర త్రిగర్తసంగ్రామగతస్య గాణ్డీవధన్వనః శత్రుభిర్నవయౌవనోదయసమయనిహతతనయస్య, కార్ముకస్రువమున్మార్జయతః, ప్రసరదశ్రుస్నాతస్య, శోకాగ్నిముద్వహతశ్చిరం హా పుత్రేతి జయద్రథవధారబ్ధాభిచారే జపో బభూవేతి యదుపన్యస్తం తేనారిక్షయే దీక్షాసముచితవ్రతవర్ణనయా శోకాగ్నేశ్చణ్డత్వేన, ఖాణ్డవపదోదీరణేన వీరరసస్యాఙ్గినః సహసైవాగన్తుకే కరుణరసే ప్రజ్వలితే సైన్ధవవధారబ్ధాభిచారాభిధానేన పర్యన్తే శౌర్యనిర్వాహేణ పరమౌచిత్యముజ్జృమ్భతే.

గాండీవి త్రిగర్తులతో యుద్ధము చేయుచున్న సమయమున నూతన యౌవనములో నున్న ఆతని కుమారుని శత్రువులు సంహరించినారు. అది తెలియగనే ఆతడు ధనస్సు అనెడు స్రువమును తుడుచుచు (కార్యసన్నద్ధము చేయుచు), కన్నీళ్ళతో తడిసి, శోకాగ్నిని ధరించి, "హా పుత్ర, హా పుత్ర" అను జపమును, జయద్రథుని సంహరించుటకై ప్రారంభించిన అభిచారమునందు చేసెను అని ఇచట వర్ణించబడినది. ఇట్లు అరిక్షయదీక్షకు తగిన వర్ణనముచేతను, శోకాగ్ని చండముగ నున్నదనుటచేతను, (అర్జునుని పరాక్రమాతిశయమును స్మరింపచేయు) ఖాండవవనము పేరు చెప్పుటచేతను వీరరసము అంగిరసముగా నుండగా, హఠాత్తుగా వచ్చిన కరుణరసము ప్రజ్వలితమైనది. చివరకు సైంధవవధారబ్ధాభిచారమును గూర్చి చెప్పుటచే శౌర్యమే నిర్వహింపబడినది-అనగా శౌర్యవర్ణనముతో ముగింపు చేయుట జరిగినది. అందుచే, ఇచట, (కరుణవీరరసములు అంగాగులుగ కలియుట) ఎంతయు ఔచిత్యసమంచితమై యున్నది.

శాన్తశృఙ్గారకరుణ బీభత్సానాం యథా మమ తత్రైవ—

49. తీక్ష్ణాన్తస్త్రీకటాక్షక్షతహృదయతయా వ్యక్తసంసక్తరక్తాః
క్రోధాదిక్రూరరోగవ్రణగణగణనానీతతీవ్రవ్యథార్తాః.
స్నేహక్లేదాతిలగ్నైః కృమిభిరివ సుతైః స్వాఙ్గజైర్భక్ష్యమాణాః
సంసారక్లేశశయ్యానిపతితతనవః పశ్యసీదన్తి మన్దాః.

అత్ర ముఖ్యస్యాఙ్గినః శాన్తరసస్యోద్దీపనే కారణీభూతాః తీక్ష్ణాన్తస్త్రీకటాక్షక్షతహృదయవ్యథార్త స్నేహక్లేదాతిలగ్నకృమితుల్య తనయాదిపదోపాదానేన శృఙ్గారకరుణబీభత్సాః శాన్తముఖప్రేక్షిణః సంలీనతయా స్తిమితవృత్తయో భృత్యా ఇవ పరమామౌచిత్యం దర్శయన్తి.

శాంతశృంగారకరుణబీభత్సరసముల కలయికకు ఉదాహరణముగ దానిలోనే (మునిమతమీమాంసలోనే) నా శ్లోక మెట్లనగా—

"ఈ మూర్ఖులు, తీక్ష్ణమైన చివరి భాగము గల స్త్రీకటాక్షములచే గాయపరుపబడిన హృదయములు కలవారగుటచే స్పష్టముగ లగ్నమైన వారై, అనురక్తులై (హృదయమునందలి గాయములచే స్పష్టముగ లగ్నమై యున్న రక్తముకలవారై అని రెండవ అర్థము), క్రోధముమొదలైన క్రూరమైన రోగవ్రణముల సముదాయముయొక్క గణనచే ప్రాప్తించిన తీవ్రవ్యథచే పీడితులై, స్నేహమనే (దుర్గంధ) స్రావముచేత ఎక్కువగ తగుల్కొనిన, తన శరీరమునుండియే పుట్టిన సుతులచే, (క్లేదముచే తన శరీరమునుండియే పుట్టిన) కృములచేత వలె, భక్షింపబడుచున్నవారై, సంసారబాధలనే పక్కపై పడియున్న శరీరముకలవారై నశించుచున్నారు; చూడుము."

ఇచట—"తీక్ష్ణమైన కొనలుగల స్త్రీకటాక్షములచే గ్రుచ్చబడిన హృదయము కలవారు" "వ్యథచే ఆర్తులు" "స్నేహక్లేదముచే ఎక్కువగా లగ్నమై

యున్న కృమికులు్యైన తనయులు" మొదలైన మాటలను ప్రయోగించుటచే (వ్యంగ్యములగు) శృంగారకరుణ బీభత్సములు ముఖ్యమైన అంగిరసమైన శాంతమును ఉద్దీపింపచేయుటకు కారణములుగనున్నవి. కాని అవి (అణిగి మణిగి ఉండి ప్రభువు ముఖము వైపే చూచుచు కదలకుండ నున్న) భృత్యుల వలె, శాంతమునే చూచుచు, అణిగి, నిశ్చలముగా నుండుటచే మంచి ఔచిత్యమును చూపుచున్నవి.

రససఙ్కరస్యానౌచిత్యముద్భావయితుమాహ:- శృఙ్గారశాన్తయోః యథా అమరుకస్య—

50. గన్తవ్యం యది నామ నిశ్చితమహో గన్తాసి కేయం త్వరా
ద్విత్రాణ్యేవ పదాని తిష్ఠతు భవాన్ పశ్యామి యావన్ముఖమ్.
సంసారే ఘటికాప్రణాలవిగలద్వారా సమే జీవితే
కో జానాతి పునస్త్వయా సహ మమ స్యాద్వా న వా సంగమః.

రససంకరమునందు ఉండు అనౌచిత్యమును ఊహించుకొనుటకై చెప్పుచున్నాడు:- అమరుకుని శ్లోకములో శృంగార శాంత రసముల సంకరములో నున్న అనౌచిత్యము ఎట్లనగా—

"తప్పకుండగ వెళ్ళవలసి ఉన్నచో వెళ్ళెదవులే, ఇంత తొందర ఎందులకు? రెండు మూడు అడుగులు ఆగుము. నీ ముఖము చూచెదను. ఈ సంసారములో, కుండగొట్టమునుండి కారిపోవుచున్న నీటితో సమానమైన ఈ జీవితములో, నాకు మరల నీతో సమాగమము కలుగునని ఎవరు చెప్పగలరు?"

అత్ర ప్రకరణవర్తినః శృఙ్గారరసస్య "పశ్యామి యావన్ముఖమ్" ఇత్యుత్కణ్ఠోత్కర్షాసముజ్జృమ్భమాణస్య స్వభావవిరోధిని శాన్తే ఉజ్జ్ఞభావముపనీతే విస్తీర్ణతరానిత్యతావర్ణనయా వైరాగ్యేణ రతేః న్యగ్భావమాపాదయన్త్యా అప్రధానరససమ్బన్ధేనాధికమనౌచిత్యముత్పా

హితమ్. నిఃసారాచారుతా శ్రవణేన హి కఠినక్రియా క్రూరచేతసామపి ఉత్సాహభఙ్గాదఙ్గాన్యలసీభవన్తి, కిముతకుసుమసుకుమారశృఙ్గారరస కోమలమనసాం విలాసవతామ్! ప్రాన్తే చ శాన్తపరిపోషసిర్వాహేణ రాగవైరస్యమేవ పర్యవస్యతి. తదుక్తమానన్దవర్ధనేన—

"విరోధీ వావిరోధీ వా రసోఽఙ్గిని రసాన్తరే
పరిపోషం న నేతవ్యస్తథా స్యాదవిరోధితా".
తదేవాత్ర నైపరీత్యేనోపలభ్యతే.

ఇక్కడ ప్రాకరణికమైన శృంగారరసము "వక్త్రాయియాపన్నముఖమ్" అను స్పష్టముగ పైకి కనబడుచున్న (ఉత్కంఠా) ఉత్కంఠచే ఎక్కువగా విజృంభించుచున్నది. ఈ శృంగారమునకు విరుద్ధస్వభావమైన శాంతము అంగముగ చేయబడినది. ఈ శాంతరసమునకు అనుకూలముగ అనిత్యతా వర్ణనము అత్యధికముగ చేయబడినది. దీనివలన కలుగు వైరాగ్యము రతిని పూర్తిగ అణచివేయుచున్నది. ఈ విధముగ అప్రధానమైన (శాంత) రసము నకు ఎక్కువ పరిపుష్టి నిచ్చుటచే, ఎక్కువ అనౌచిత్యము ఏర్పడినది. నిఃసారమైన సంసారముయొక్క సౌందర్యవిహీనత్వమును వినగానే కఠిన క్రియలు చేయగలిగిన క్రూరాత్ములకు కూడ ఉత్సాహము నశించిపోయి, అవ యవములు దుర్బలములై పోవును, కుసుమ సుకుమారమైన శృంగారరస ముతో కోమలమైన మనస్సులుగల విలాసవంతుల మాట చెప్పవలెనా! చివరికి పోషించబడినది శాంతరసమే అగుటచే రాగములో (శృంగారములో) విర సత్వమే ఏర్పడినది. ఆనందవర్ధనుడు ఈ విషయమునే చెప్పి ఉన్నాడు:-

"ఒక రసము అంగిగా ఉన్నప్పుడు, మరొక రసము విరోధిరస మైనను, అవిరోధిరస మైనను, దానిని ఎక్కువ పోషించగూడదు. అట్లు పోషించకుండుటచే(అంగాంగిరసములమధ్య)విరోధము లేకుండ ఉండును."

ఈ ఉదాహరణములో ఆనంద వర్ధనుడు చెప్పిన దానికి విరుద్ధముగా నున్నది.

పరిపోషవిపరీతే స్వభావవిరోధిన్యపి ప్రధానానుపరోధ ఏవ.
యథా రాజశేఖరస్య—

51. మాణం ముంచధ దేహ వల్లహజణే దిట్ఠిం తరంగుత్తరం
తారుణ్ణం దిఅహాఇం పంచ దహ వా పీణత్థణత్థంభణం.
ఇత్థం కోహలిమంజుసింజిణమిసాద్దేవస్స పంచేసుణో
దిణ్ణా చిత్తమహూసవేణ సహసా ఆణబ్బి సబ్బంకసా.

"మానం ముఞ్చత దదత వల్లభజనే దృష్టిం తరఙ్గోత్తరాం
తారుణ్యం దివసాని పఞ్చ దశ వా పీనస్తనస్తమ్భనమ్.
ఇత్థం కోకిలమఞ్జుశిఞ్జిత మిషాద్దేవస్య పఞ్చేషో
ర్దత్తా చైత్రమహోత్సవేన సహసాజ్ఞైవ సర్వఙ్కషా
(క.మ 1. 18)

పరిపోషము లేని స్వభావవిరుద్ధమైన (అంగ) రస మున్నను ప్రధాన రసమునకు ఉపరోధ మేమియు కలుగదు. ఉదాహరణకు రాజశేఖరుని శ్లోకము—

"మానమును విడిచిపెట్టండి. ప్రియులను ప్రేమపూర్ణమైన చూపులతో చూడండి. బలిసిన స్తనములను బిగువుగా ఉంచగలిగిన యౌవనము ఐదు రోజు లుండవచ్చును లేదా పది రోజు లుండవచ్చును". కోకిలల మధురధ్వను లనెడు మిషచే ఈ విధమగు మన్మథాజ్ఞను, చైత్రమహోత్సవము ఎల్లరికిని చాటుచున్నట్లున్నది''.

అత్ర "మానం ముఞ్చత; దదత వల్లభజనే దృష్టిం తరంగితామ్; తారుణ్యం దినాని పఞ్చ దశ వా పీనస్తనస్తమ్భనమ్: ఇత్థం కోకిల మధురధ్వనివ్యాజేన దేవస్య పఞ్చేషోః చైత్రమహోత్సవేన ఆజ్ఞైవ సర్వంకషా దత్తా" ఇతి వాక్యే ముఖ్యః శృఙ్గారరసః ప్రారంభపర్యన్త

వ్యాప్తిశాలీ కతిపయదివసస్థాయి యౌవనమిత్యనిత్యతారూప శాన్త రసబిన్దునా, మధ్యప్రబుడితేనేవ నిరసతాం నీతః విరుద్ధస్య పరిపోషాభావాత్. విరుద్ధవర్ణనోద్ధతేన హ్యనౌచిత్యేన స్థాయీ కుఞ్జర ఇవ శ్వభ్రపాతితః పునరుత్థాతుం నోత్సహత ఇత్యలం విస్తరేణ. అనయా దిశా రససఙ్కరే భేదప్రపఞ్చౌచిత్యం విపశ్చిద్భిః స్వయం విచార్యమ్.

ఇచట— "మానమును విడిచిపెట్టండి; ప్రియులపై (ప్రేమ) తరంగితమైన దృష్టిని ప్రసరింపచేయండి, బలిసిన స్తనములు ఒంటముగా నుండునట్లు చేయు యౌవనము ఐదు లేదా పది రోజులు మాత్రమే ఉండును. ఈ విధముగ, కోకిలల మధురధ్వని యను వ్యాజముచే, చైత్రమహోత్సవము; ప్రభువైన మన్మథుని, అందరికిని వర్తించు ఆజ్ఞను ఘోషించుచున్నట్లున్నది," అను వాక్యములో ముఖ్యమైన శృంగారరసము ప్రారంభమునుండి చివరి వరకును వ్యాపించి ఉన్నది. ఇది, "యౌవనము కొద్ది రోజుల పాటు మాత్రమే ఉండును" అనెడు అనిత్యతారూపమైన శాంతరసబిందువు మధ్య ఒక బుడగ వలె వచ్చినను, దానిచే వైరస్యమును పొందలేదు. ఏలనన—ఇచట విరుద్ధమైన శాంతరసమును పుష్టిపొందించుట జరుగలేదు. విరుద్ధరసమును ఎక్కువగా వర్ణించుటచే కలుగు అనౌచిత్యముచే (ప్రధానరస) స్థాయిభావము, గోతిలోనికి పడద్రోయబడిన ఏనుగ వలె, మరల లేవజాలదు. ఇంక ఈ విషయమును దీనితో ముగించెదము. రససంకరమునందు ఆ యా భిన్న భిన్న రసములను విస్తరింపచేయుటలోని ఔచిత్యమును పండితులు ఈ మార్గముననే ఊహించుకొనవలెను.

## 7. క్రియాపదౌచిత్యమ్

రసౌచిత్యవిచారానన్తరం ఉద్దేశానుసారక్రమేణ క్రమోపగతం క్రియాపదౌచిత్యం దర్శయితుమాహ:—

సగుణత్వం సువృత్తత్వం సాధుతా చ విరాజతే
కావ్యస్య సుజనస్యేవ యద్యౌచిత్యవతీ క్రియా. 19

కావ్యస్య మాధుర్యాది గుణవత్తా, వసన్తతిలకాది సువృత్తతా, పరిపూర్ణలక్షణసాధుతా చ విరాజతే, యద్యౌచిత్యయుక్తం క్రియాపదం భవతి సుజనస్యేవేతి తత్తుల్యత్వం స్పష్టమేవ.

రసౌచిత్యమును గూర్చి విచారించిన పిమ్మట, ఉద్దేశమును అనుసరించిన క్రమముచేత, వరుసలో వచ్చిన క్రియాపదౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు. (చెప్పవలసిన విషయముల పేర్లు మాత్రము ఒక వరుసలో చెప్పుటకు "ఉద్దేశము" అని పేరు).

"గుణములు, మంచి వృత్తములు, సాధుత్వము, ఇవన్నియు కావ్యములో సత్పురుషునియందువలె, క్రియౌచిత్యము కూడ ఉన్నచో ఎక్కువ రాణించును."

వి. ఒక మనుష్యుడున్నాడు. ఆతనికి మంచి గుణము లున్నవి; మంచి నడవడిక ఉన్నది. మంచితన మున్నది. వీటితో పాటు ఆతడు చేయు పనులలో ఔచిత్యము కూడ ఉన్నచో ఆతడు ఇంకను ప్రకాశించును. అట్లే సగుణము, సువృత్తము, సాధువు అగు కావ్యము క్రియాపదౌచిత్యము కూడ ఉన్నచో ఎక్కువ బాగుండును.

కావ్యములోని క్రియాపదము ఔచిత్యయుక్తమై ఉన్నచో అపుడు, అది మాధుర్యాదిగుణములు, వసంతతిలకాదు లగు మంచి వృత్తములు, పరిపూర్ణ లక్షణములు ఉన్నందుకు ఎక్కువ అందముగ ఉండును. అట్టి కావ్యమునకు సుజనులతో పోలిక విస్పష్టమే. ("సుజనస్యేవ" ఇత్యాదికము స్పష్టార్థమే.)

క్రియాపదౌచిత్యం యథా మమ నీతిలతాయామ్-

52 యః ప్రఖ్యాతజవః సదా స్థితివిధౌ సప్తాబ్ధిసన్ధ్యార్చనే
దోర్దర్పేణ నినాయ దున్దుభివపుర్యః కాలకఙ్కాలతామ్.
యః పాతాలమసృఙ్మయం ప్రవిదధే నిష్పిష్య మాయావినం
సుగ్రీవాగ్ర్యవిభూతిలుణ్ఠనపటుర్వాలీ స కిం స్మర్యతే.

క్రియాపదౌచిత్యమునకు ఉదాహరణము నా నీతిలతలలో ఎట్లనగా—

“ఏ వాలి, ఏడు సముద్రముల వద్ద సంధ్యావందనము చేయుట అనెడు మర్యాదను (నియమమును) కాపాడుటయందు ప్రసిద్ధమైన వేగము గలవాడో, బాహుదర్పముచేత దుందుభి శరీరమును నల్లటి మృతశరీరముగా చేసినాడో, మాయావిని నలగగొట్టి పాతాళము నంతనూ రక్తమయము చేసినాడో, సుగ్రీవుని ప్రధానైశ్వర్యమును (భార్యను) దోపిడీచేయుటలో సమర్థుడైన ఆ వాలి స్మరింపబడుచున్నాడా?”

అత్ర సప్తాబ్ధి సన్ధ్యార్చనప్రఖ్యాతజవః. మహిషరూపదుందుభిదానవోన్మాథీ మాయావిదానవనిష్పేషోద్భూతశోణితపూరితపాతాలతలః, స కిం వాలీ స్మర్యత ఇతి క్రియాపదేన శుకసారణాభ్యాం రావణస్య దుర్నయాభినివేశినస్తద్ద్వారా మాయ హితోపదేశేన భవాన్ వసనకోణనియమితతనుః కక్షాయాం నిక్షిప్త ఇత్యుచిత యుక్తియుక్తముక్తం భవతి.

ఇచట— ఏడు సముద్రముల వద్ద సంధ్యావందనము చేయుటచే ప్రసిద్ధమైన వేగము కలవాడు, మహిషరూపముతో వచ్చిన దుందుభి అనే దానవుని చంపినవాడు, మాయావి అనే దానవుని నలగగొట్టుచే పుట్టిన రక్తము చేత నింపబడిన పాతాలముకలవాడు అయిన వాలి గుర్తు ఉన్నాడా (నీచే స్మరింపబడుచున్నాడా) అను వాక్యములో 'స్మర్యతే' అను క్రియాపదము

ప్రయోగింపబడినది. చెడ్డ పట్టుదలను వదలుట మంచిదని రావణునకు హితోపదేశము చేయ దలచిన శుకసారణులు ఈ విధముగ 'స్మర్యతే' అను క్రియాపదమును ప్రయోగించి, వాలి నిన్ను బట్ట చివర చుట్టబెట్టి చంకలో ఉంచుకున్నాడు కదా అను విషయమును కూడా గుర్తు చేయుచున్నారు గాన ఈ క్రియాపద ప్రయోగము చాలా ఉచితముగ నున్నది.

న తు యథా శ్రీప్రవరసేనస్య—

53. సగ్గం అపారిజాఅం కోత్థుహలచ్ఛిరహిఅం మహుమహస్సఉరం
సుమిరామి మహణపురఓ అముద్ధఅన్దం హరజడాపబ్భారం.
"స్వర్గమపారిజాతం కౌస్తుభలక్ష్మీరహితం మధుమథనస్యోరః
స్మరామి మథనపురతో౽ముగ్ధచంద్రం చ హరజటా
ప్రాగ్భారమ్"

అత్ర జామ్బవతాభినీయమానే "స్వర్గమపారిజాతం కౌస్తుభ లక్ష్మీభ్యాం విరహితం మధుమథనస్యోరః స్మరామ్యమృత మథన పురతో౽ప్యబాలచన్ద్రం హరజటా ప్రాగ్భారమ్" ఇతి ప్రగుణాఖ్యాన ప్రసఙ్గే క్రియాపదేన జరాజర్జరశరీరత్వమాత్రమేవ ప్రతిపాదితమ్; న తు పౌరుషోత్కర్ష విశేషాతిశయః కశ్చిదుచితః సంసూచితః.

ఐతే-శ్రీ ప్రవరసేనుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు—

"సముద్రమథనము జరుగుటకు పూర్వము, పారిజాతము లేని స్వర్గమును, కౌస్తుభము లక్ష్మియు లేని విష్ణువక్షఃస్థలమును, బాలచంద్రుడు లేని శివ జటాజూటమును నేను ఎరుగుదును (స్మరించుచున్నాను)" అని జాంబవంతుడు గొప్పగుణమును చెప్పు ప్రసంగమున ప్రయోగించిన స్మరామి అను క్రియాపదము ఆతని జరాజర్జర శరీరతత్వమును మాత్రమే సూచించుచున్నది గాని పౌరుషోత్కర్షవిశేష మేమియు సూచించుటలేదు గాన ఇచట క్రియా పదౌచిత్యము లేదు.

## 8. కారకౌచిత్యమ్

కారకౌచిత్యం దర్శయితుమాహ —
సాన్వయం శోభతే వాక్యముచితైరేవ కారకైః
కులాభరణమైశ్వర్యమౌదార్యచరితైరివ. 20

ఉచితైరేవ కారకైః సదన్వయవత్ వాక్యం విరాజతే సద్వంశభూషితమైశ్వర్యం సచ్చరితైరివ.

కారకౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు:—

"కులమునకు అలంకారమైన ఐశ్వర్యము ఔదార్యముతో కూడిన నడవడికచే ప్రకాశించినట్లు, కారకములతో మంచి అన్వయము గలదై వాక్యము ప్రకాశించును"

సద్వంశముచే అలంకరింపబడిన ఐశ్వర్యము సచ్చరితములతో ప్రకాశించినట్లు, వాక్యము ఉచితములైన కారకములతోడనే మంచి అన్వయమును పొందినదై ప్రకాశించును.

వి. 'కులాభరణం' అనుపదమునకు కులమునకు అలంకారమైన అని అర్థము. కాని క్షేమేంద్రుడు దీనిని బహువ్రీహిగా (కులం ఆభరణం యస్య) గ్రహించి 'సద్వంశ భూషితం'—అనగా సద్వంశముచే అలంకరింపబడిన అని అర్థము చెప్పినాడు.

### కర్తృపదౌచిత్యమ్

కర్తృపదౌచిత్యం యథా భట్టబాణస్య—
స్తనయుగమశ్రుస్నాతం సమీపతరవర్తి హృదయశోకాగ్నేః
చరతి విముక్తాహారం వ్రతమివ భవతో రిపుస్త్రీణామ్.
(కాదంబరి)

అత్ర శత్రుస్త్రియో వ్రతం చరన్తీతి వక్తవ్యే, స్తనయుగం బాష్పసలిలస్నాతం శోకాగ్ని సమీపవర్తి, విముక్తభోజనం, విగత ముక్తాహారం చ సద్ వ్రతం చరతి ఇత్యుక్తే కర్తృపదమౌచిత్య ముపచితం జనయతి.

కర్తృపదౌచిత్యమునకు ఉదాహరణముగా భట్టబాణునిశ్లోక మెట్లనగా:-

"నీ శత్రుస్త్రీల స్తనద్వయము కన్నీళ్ళతో స్నానము చేయుచు, హృద యమునందలి శోకాగ్నికి సమీపమున ఉన్నదై, విముక్తాహారమై (పోయిన ముత్యాలహారము కలది, విడువబడిన ఆహారము గలది అని రెండు అర్థములు) వ్రతమును ఆచరించుచున్న ట్లున్నది".

(తపస్సు చేయువారు వర్షానికి తడియుచు, గ్రీష్మములో అగ్నిసమీప మున కూర్చుండి, ఆహారమును విడచి తపస్సు చేయుదురు. స్తనయుగము కూడ ఆ విధముగ తపస్సు చేయుచున్నట్లున్నది అని భావము)

ఇచట— శత్రుస్త్రీలు వ్రతమును ఆచరించుచున్నారు. —అని చెప్పవలసి యుండగా,(శత్రుస్త్రీలకుబదులు స్తనయుగమును కర్తగచేసి) బాష్పసలిలముతో స్నానము చేసి, శోకాగ్నికి సమీపమున ఉండి, విడువబడిన ఆహారముకలదై పోయిన ముత్యాలహారముకలదై, తపస్సు చేయుచున్నది అని చెప్పుటలో (స్తనయుగం అను) కర్తృపదము అత్యధికమైన ఔచిత్యమును కలిగించు చున్నది. కావున ఇది కర్తృకారకౌచిత్యమునకు ఉదాహరణము.

న తు యథా పరిమలస్య—

55. ఆహారం న కరోతి నామ్బు పిబతి స్త్రైణం న సంసేవతే
శేతే యత్ సికతాసు ముక్తవిషయశ్చణ్డాతపం సేవతే.
త్వత్పాదాబ్జరజఃప్రసాదకణికాలోభోన్ముఖస్తన్మరా
మన్యే మాలవసింహ! గుర్జరపతిస్తీవ్రం తపస్తప్యతే.

ఐతే— పరిమలుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"మాలవదేశసింహమైన ఓ మహారాజా! గుర్జరదేశరాజు మరుప్రదేశము చేరి ఆహారము భుజించుటలేదు. జలము త్రాగుటలేదు; స్త్రీల సముదాయమును సేవించుటలేదు; ఇసుకలో శయనించుచున్నాడు. విషయములను విడచి తీవ్రమైన ఎండను సేవించుచున్నాడు. దీనిని బట్టి శివపాదపద్మమునందలి పరాగకణము ప్రసాదముగ లభింపవలెనని కోరుచు, అతడు తీవ్రమైన తపస్సు చేయుచున్నాడని తలచుచున్నాను."

అత్ర గుర్జరపతిర్వ్యథతో నాథ! మరుం ప్రవిష్టః పరిత్యక్తాహారాదిసమస్తవిషయసుఖస్తీవ్రం తపస్తపతీతి యదుక్తం తత్కర్తృపదస్య విశేషాభిప్రాయోచితం న కించిదుపలభ్యతే. శత్రుత్రాసతరలతయా మరుకాన్తారాన్తర్వసన్ సకలవిషయసుఖభోగపరిభ్రష్టః కిమన్యత్ కరోతు తపః. ప్రస్తుతయుగపతేః కర్తృపదస్య చమత్కారోచితం న కించిదభిహితమ్.

పారిపోయిన గుర్జరదేశరాజు ఎడారిలో ప్రవేశించి, ఆహారాది సమస్త విషయభోగములను విడచి, తీవ్రమైన ఎండలో పడి తపస్సు చేయుచున్నాడు, అని ఇచట చెప్పబడినది. కాని కర్తృపదములో (గుర్జరపతిః అను పదములో) అభిప్రాయవిశేషమునకు ఉచితమైనది ఏదియు కనబడుటలేదు. శత్రుభయముచే మరుభూమిలో పడి క్రుంగిపోవుచు సకలవిషయసుఖములను కోల్పోయినవాడు ఇంక ఏమి చేయగలడు! పై శ్లోకములో ప్రస్తుతయుగమును కర్తగా చేసినప్పుడున్న విధముగ ఇచట కర్తృపదమునకు సంబంధించి చమత్కారోచితముగ ఏమియు చెప్పబడలేదు.

# కర్మపదౌచిత్యమ్

కర్మపదౌచిత్యం యథా మమ లావణ్యవత్యామ్:-
సదాసక్తం శైత్యం విమలజలధారాపరిచితం
ఘనోల్లాసః స్ఫారస్ఫురితకటకపాతీ వహతి యః,
విధత్తే శౌర్యశ్రీశ్రవణనవనీలోత్పలరుచిః
స చిత్రం శత్రూణాం జ్వలదనలతాపం భవదసిః. 56

కర్మపదౌచిత్యానికి ఉదాహరణగా నా లావణ్యవతిలోని శ్లోక మెట్లనగా

"అధిక మైన ఉత్సాహము కలదియు (మేఘమువంటి ప్రకాశము కలది అని రెండవ అర్థము), రాజుల విశాలసైన్యములపై పడునదియు, (పర్వతముల విశాలము లైన చరియలపై బడుచున్నదియు అని అర్థాంతరము) అగు ఏఖడ్గము స్వచ్ఛమైన జలధారను సంబంధించిన, ఎల్లప్పుడును లగ్నమై ఉన్న శైత్యమును (శీతస్య భావః శైత్యం = చల్లదనము; శితస్య భావః శైత్యం = వాడిగా ఉండుట అని రెండర్థములు) వహించుచున్నదో, అట్టి శౌర్యలక్ష్మి చెవిలోని లేతనల్ల కల్వపూవువంటి కాంతి గల నీ ఖడ్గము, శత్రువులకు ప్రజ్వలించుచున్న అగ్నివలన కలుగు తాపమును కలిగించుచున్నది. ఆశ్చర్యము."

వి. 'ధారా' శబ్దమునకు కత్తియొక్క పదునైన భాగము అని కూడా అర్థము. 'విమలజలధారాపరిచితం' అనుపదమునకు "విమలమైనజలము వంటి పదునుతో కూడినది అని రెండవ అర్థము. శైత్యమును వహించునది తాపజనక మగుట ఆశ్చర్యజనకము గాన విరోధాభాసము.

ఇక్కడ—నిశ్చలమైన(సదాసక్తం) అమలజలధారకు సంబంధించిన శైత్యమును, అనగా శీతలత్వమును, తీక్ష్ణత్వమును ఘనోల్లాసమైనది, అనగా అధికమైన ఉత్సాహము కలది, మరియు మేఘముతో తుల్యమైన (ఆవిర్భా

వము) కలది, క్ష్మాభృత్తుల (రాజుల—పర్వతముల) సానువులపై (సైన్య ములపై)పడుచుండెడిది అగు ఏ ఖడ్గము ఫలించుచున్నదో, శౌర్యలక్ష్మియొక్క శ్రవణమునందలి నీలోత్పలముతో సమానమైన అట్టి నీ ఖడ్గము శత్రువులకు సంతాపమును కలిగించుచున్నది. అని చెప్పబడినది. ఇట్లు వర్ణించుటవలన అత్యధిక మైన శిశిరకారణ సామగ్రివలన కలిగినదియు, దానికి ('విధత్తే' అను క్రియకు) కర్మయు అయిన తాపమునకు అత్యధికమైన శైత్యముతో గూడిన ఔచిత్యము చూపబడినది.

“అసిః తాపం విధత్తే” అనునప్పుడు 'తాపం' అనునది కర్మ. అసి తాపమును కలిగించుట విరుద్ధము. అందును శైత్యముతో నిత్యసంబద్ధమైన అసి కలిగించుట అసలే విరుద్ధము. అయినను ఇచట తాపమును కర్మగా చేయుటలో చమత్కారము, ఔచిత్యము ఉన్నదని భావము.

న తు యథా "మమైవావసరసారే" :-

భగ్నాహితశ్వసితవాతవిధూయమానః
కాష్ఠాశ్రయేణ సముపాగతవిప్రకృష్టమూర్తిః।
తాపం తనోతి విహతారినితంబినీనాం
వహ్నిర్ద్యుతిర్భువననాథ భవత్ప్రతాపః॥

అత్ర విద్రుతారాతినిఃశ్వసితానిలప్రబోధ్యమానః, కాష్ఠాశ్రయేణ దిక్చక్రపూరణేన ప్రోత్సాహితాం ప్రాప్తః, పావకతుల్యస్త్వత్ప్రతాపః శత్రుకాన్తానాం తాపమాత్రం తనోతీతి తత్సముచితమ్; ఆశ్చర్యం న కించిత్.

నా అవసరసారములోని శ్లోకముమాత్రము ఉదాహరణము కాదు :-

“ఓ లోకనాథా: పరాజితులైన శత్రువుల నిట్టూర్పులచేత రగుల్పబడు చున్నదియు, దిక్కులను ఆశ్రయించుటచేత (నలుదిక్కులందు వ్యాపించుట

చేత).['కాష్ఠా' శబ్దమునకు స్త్రీలింగములో దిక్కు అని యర్థము. నపుంసక లింగములో కట్టె అని అర్థము. అందుచేత కట్టెలను ఆశ్రయించుటచేత, అనగా కట్టెలు లభించుటచేత అని రెండవ అర్థము] వెంటనే వృద్ధిని పొందినదియు అగు నీ ప్రతాపము, సంహరింపబడిన శత్రువుల స్త్రీలకు తాపమును కలిగించుచున్నది.

ఇచట—పారిపోవుచున్న శత్రువుల నిఃశ్వాసానిలముచే రగుల్కొను నట్లు చేయబడుచున్నదియు, కాష్ఠాశ్రయణముచే, దిక్చక్రమును నింపుటచే ప్రౌఢమైనదియు, అందుచే అగ్నితో సమానమైన నీ ప్రతాపము శత్రుకాంతలకు తాపమును మాత్రమే కలిగించుచున్నది. అని చెప్పబడినది. దానికి (అంతటి తాపమునకు) తగిన ఆశ్చర్యకర మైన దేదియు చెప్పబడలేదు. అందుచే ఇచట కర్మపదౌచిత్యము లేదని అర్థము.

## కరణౌచిత్యమ్

కరణౌచిత్యం యథా గౌడకుమ్భకారస్య—

58. లాఙ్గూలేన గభస్తిమాన్ వలయితః ప్రోతః శశీ మౌలినా
వ్యాఘూర్ణితా జలదాః సటాభిరుడవో దంష్ట్రాభిరుత్తమ్భితాః।
ప్రోత్తీర్ణో జలధిర్దృశైవ హరిణా స్వైరాట్టహాసోర్మిభి।
ర్లఙ్కేశస్య చ లక్షితో దిశి దిశి ప్రాజ్యప్రతాపానలః.

కరణౌచిత్యమునకు ఉదాహరణముగ గౌడకుంభకారుని శ్లోక మెట్లనగా :—

"హనుమంతునిచేత — తోకచే సూర్యుడు చుట్టబడినాడు" శిరస్సుచే చంద్రుడు గ్రుచ్చబడినాడు. జూలుచేత మేఘములు ఎగురగొట్టబడినవి. కోరలచే నక్షత్రములు పొడవబడినవి. చూపుచేతనే సముద్రము దాటబడినది.

అన్ని దిక్కులందును తీవ్రముగా నున్న రావణుని ప్రతాపాగ్ని అట్టహాస తరంగములచే దాటబడినది. (అనగ్రప్రాప్యబడినది)."

అత్ర హరిణా హనూమతా జలనిధిలఙ్ఘనే లాఙ్గూలేన వలయితః, కిరీటప్రాన్తేన శశీ ప్రోతః, చరణాభిఘాతేన మేఘా వ్యాఘూర్ణితాః, తారా దంష్ట్రాభిరాయాసితాః, దృష్ట్యైవ ఉదధిస్తీర్ణ ఇవ, అట్టహాసతరఙ్గైః లఙ్కేశస్య విస్తీర్ణః ప్రతాపాగ్నిః శమిత ఇతి బహుభిః కరణపదైః రుత్సాహాధివాసితైః విస్మయశిఖరారోహణసోపానైరివ రఘుపతిప్రభావారమ్భ విజయధ్వజాయమానస్య పవనసూనో రౌచిత్యాతిశయః ప్రకాశితః.

సముద్రలంఘనసమయమున హనుమంతుడు లాంగూలముతో సూర్యుని చుట్టినాడు. కిరీటప్రాంతముచేత చంద్రుని గ్రుచ్చినాడు; కాలుచేత మేఘములను ఎగురగొట్టినాడు; కోరలచే నక్షత్రములను బాధించినాడు. దృష్టిచేతనే సముద్రమును దాటినాడు అట్టహాసతరంగములచే లంకేశుని అతివిస్తృతమైన ప్రతాపాగ్నిని శాంతింపచేసినాడు అని వర్ణించుచు, ఇచట, ఉత్సాహముతో నిండి ఆశ్చర్యశిఖరమును అధిరోహించుటకై ఉపయుక్తము అగు సోపానముల వలె ఉన్న అనేక కరణపదములచే (ఏదైనా కార్యమును చేయుటకు ఎక్కువ ఉపయోగించు సాధనమునకు కరణ మని పేరు. దానిని బోధించు పదము కరణపదము. తృతీయావిభక్తిలో ప్రయోగింపబడును). శ్రీరాముని ప్రభావప్రారంభమునకు విజయధ్వజమువంటి హనుమంతుని ఔచిత్యాతిశయము ప్రకాశిత మైనది. అందుచే ఇది కరణ కారకౌచిత్యము నకు ఉదాహరణ మని భావము.

న తు భట్టబాణస్య—

59. జయత్యుపేన్ద్రః స చకార దూరతో
బిభిత్సయా యః క్షణలబ్ధలక్ష్యయా.
దృశైవ కోపారుణయా రిపోరురః
స్వయం భయాద్భిన్నమివాస్రపాటలమ్

(కాదంబరీ)

అత్ర భగవతో నృసింహస్య కోపరక్తయా దృష్ట్యైవ క్షణలబ్ధ లక్ష్యయా హిరణ్యకశిపోర్వక్షః స్వయం భయాద్భిన్నమిత్యేతద్యదుక్తం తన్మహోత్సాహపరాక్రమస్య ప్రతినాయకస్య రిపోః ప్రధాననాయక ప్రతాపోద్దీపనకారణీభూతాధిక ధైర్యస్య స్వయం భయవిహ్వలతయా హృదయస్ఫుటన మిత్యనుచిత మనౌచిత్యం "దృష్ట్యైవ" కరణపదస్య శిరసి విన్యస్తమ్.

కాని, భట్టబాణుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"(నరసింహరూపధారి యైన) ఏ ఉపేంద్రుడు, భేదించవలె ననెడు ఇచ్ఛచేత, (ఇచ్ఛగలవాడై), క్షణకాలముపాటు పొందబడిన లక్ష్యముగల దియు, కోపముచేత ఎఱ్ఱనైనదియు అగు చూపుచేతనే, శత్రువుయొక్క వక్షః స్థలమును భయముపలన స్వయముగనే బ్రద్దలై రక్తముచేత ఎఱ్ఱనైనదా అనునట్లు దూరముననుండియే, చేసెనో అట్టి ఉపేంద్రుడు సర్వోత్కృష్టుడై ఉన్నాడు"

కోపముచే రక్తమైన భగవంతుడైన నరసింహుని దృష్టి క్షణకాలము పాటు లక్ష్యమును (శత్రువక్షమును) పొందగనే, ఆ హిరణ్యకశిపుని వక్షః స్థలము, భయముపలన తనంతట తానే బ్రద్దలైనట్లు అయినది అని యిచట వర్ణింపబడినది. కాని, గొప్పఉత్సాహపరాక్రమములు కలవాడును, ప్రధాన నాయకుని (నరసింహుని) ప్రతాప ముద్దీప్త మగుటకు ఉపకరణమైన అధిక ధైర్యము కలవాడును అగు ప్రతి నాయకుడు (హిరణ్యకశిపుడు) భయ విహ్వలుడగుటచే అతని వక్షము స్వయముగనే బ్రద్దలైనదని చెప్పుట అను చితముగా ఉన్నది. ఈ అనౌచిత్య మంతయు "దృష్ట్యైవ" అను కరణవాచక పదము నెత్తిపై ఉన్నది. అందుచే ఇచట కరణపదానౌచిత్య మని భావము.

## సంప్రదానమ్.

సంప్రదానౌచిత్యం యథా భట్టప్రభాకరస్య—

60. దిఙ్మాతఙ్గఘటావిభక్తచతురాఘాటా మహీ సాధ్యతే
సిద్ధా సాపి, వదన్త ఏవ హి వయం రోమాఞ్చితాః పశ్యత.
విప్రాయ ప్రతిపాద్యతే కిమపరం! రామాయ తస్మై నమః
యస్మాదావిరభూత్ కథాద్భుతమిదం యత్రైవచాస్తం గతమ్.

అత్ర దిగ్గజచతురస్రా భూః సాధ్యతే; సా చ సిద్ధా హేలయైవాన్నముష్టిరివైకస్మై విప్రమాత్రాయ ప్రతిపాద్యతే ఇతి నిరతిశయౌదార్యాశ్చర్యచమత్కారరుచిరౌచిత్యచర్వణయా, వయం రోమాఞ్చితాః; పశ్యత; రోమాఞ్చస్య ప్రత్యక్షపరిదృశ్యమానత్వాత్ కిమపరమ్? అపూర్వత్యాగినే భార్గవాయ తస్మై నమ ఇతి విప్రాయ ఇతి సంప్రదానపదగత ఏవ ఉత్కర్షవిశేషః ప్రకాశతే.

సంప్రదానౌచిత్యమునకు ఉదాహరణముగా భట్టప్రభాకరుని శ్లోకమెట్లనగా :—

"దిగ్గజసముదాయముచేత విభక్తమైన (వేరు వేరుగా మోయబడు) నాలుగు కొనలుగల భూమి అతికష్టముచేత సాధింప (సంపాదింప) బడును. అట్టి సిద్ధమైనభూమి కూడా—చూడుడు; ఆమాటలు చెప్పుచుండగనే మాకు గగుర్పాటు కలుగుతున్నది—బ్రాహ్మణునికి ఇచ్చివేయబడుచున్నది. ఇంక ఏమి చెప్పవలె? అట్టి రామునకు నమస్కారము. ఇట్టి ఆశ్చర్యకరమైన విషయము ఆతనియందే (ఇదం ప్రథమముగా) ఆవిర్భవించినది; అతనియందే అస్తమించినది. అనగా పరశురామునకు పూర్వము ఇలాంటి పని చేసినవారెవరును లేరు; తరువాతకూడా పుట్టలేదు అని భావము

వి. ఆంగ్లభాషలో ఒకవాక్యంలో అవాంతరవాక్యము (Peranthetical clause) ప్రయోగించినట్లు వాక్యమధ్యంలో "వదన్తు ఏవ హి వయం రోమాఞ్చితాః పశ్యత" "కిమపరమ్" అను అవాంతరవాక్యాల ప్రయోగము అందముగా ఉన్నది.

దిగ్గజములచే చతురస్రముగా ఉన్న భూమి ప్రయత్నము చేసి సాధింపబడును. సిద్ధమైన దానిని హేలగా బిచ్చగానికి ఒక పిడికెడు అన్నము పెట్టినట్లు, ఒక్క బ్రాహ్మణునికి ఇచ్చినాడు అని వర్ణించునప్పుడే అత్యధికమైన ఔదార్యమువలన కలిగిన ఆశ్చర్యచమత్కారముచే మనోహరమైన ఔచిత్యమును ఆస్వాదించుటచే "మేము రోమాంచితుల మైనాము; చూడుడు" అని చెప్పబడినది. రోమాంచమును ప్రత్యక్షముగ చూడవచ్చును గదా? ఇంకనేమున్నది? అపూర్వ మైన త్యాగమును జూపిన ఆ భార్గవరామునికి నమస్కారము. ఈ విధముగ ఇచట (చమత్కారోత్కర్షకు కారణభూతమైన) ఔచిత్యోత్కర్ష అంతయు 'విప్రాయ' అను సంప్రదానకారకమును ప్రయోగించుటలోనే ఉన్నది.

ఇంత శ్రమపడి సంపాదించవలసిన భూమండలమును అసంఖ్యాకులైన ప్రతిగ్రహీతలకు దానము చేసినను ఆశ్చర్యకరము కాకపోవచ్చును. అంత భూమిని కూడా బిచ్చగానికి ఒక అన్నకబళము వేసినట్లు ఒక బ్రాహ్మణునికి (విప్రాయ) ఇచ్చుటలోనే చమత్కార మంతయు ఉన్న దని భావము

న తు యథా రాజశేఖరస్య.

61. పౌలస్త్యః ప్రణయేన యాచత ఇతి శ్రుత్వా మనో మోదతే
దేయో నైవ హరప్రసాదపరశుస్తేనాధికం తామ్యతి.
తద్వాచ్యః స దశాననో మమ గిరా దత్తా ద్విజేభ్యో మహీ
తుభ్యం బ్రూహి రసాతలత్రిదివయోర్నిర్జిత్య కిం దీయతామ్.
(బా. రా. 2-20)

అత్ర రావణదూతేన పరశుం యాచితో భార్గవో బ్రూతే "నైష హరప్రసాదలబ్ధః పరశుస్స్థానయోగ్యః. తత్తస్మాద్వస్మద్వచనాద్దశగ్రీవో వాచ్యః; పృథ్వీ మయా కశ్యపాయ ప్రతిపాదితా; [illegible] పాతాలత్రిదివయోర్మధ్యాత్ కిం నిర్జిత్య దీయతామ్?" ఇత్యనుచితం మునేర్లోకహిత ప్రవృత్తస్య త్రైలోక్యకణ్టకభూతాయ రాక్షసాయ భువనప్రతిపాదనమ్.

అయితే రాజశేఖరుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"రావణుడు ప్రణయపూర్వకముగా యాచించుచున్నందులకు మనస్సు ఆనందించుచున్నది. కాని ఈశ్వరుడు అనుగ్రహించిన ఈ గండ్రగొడ్డలిని ఇచ్చుటకు వీలులేదు. అందుచే మనస్సు బాధపడుచున్నది. అందుచేత నా మాటగా దశాననునితో చెప్పుము. భూమి బ్రాహ్మణులకు ఇచ్చివేయబడినది. పాతాళస్వర్గలోకములలో దేనిని జయించి నీకు ఇవ్వమందువో చెప్పుము"

రావణుని దూత వచ్చి పరశువు యాచించగా పరశురాముడు పలికిన మాటలివి— "హరప్రసాదలబ్ధమైన ఈ పరశువును ఇచ్చుటకు వీలులేదు. అందువలన నా మాటగా దశగ్రీవునితో చెప్పుము— నేను భూమిని కశ్యపునకు ఇచ్చివేసి ఉన్నాను. పాతాలస్వర్గములలో దేనిని జయించి నీకిమ్మనెదవు?" లోకహితము చేయనున్నట్టి మునికి త్రైలోక్యకంటకభూతుడైన రాక్షసుని భువనము నిచ్చెద ననుట అనుచితము.

## అపాదానౌచిత్యము

అపాదానౌచిత్యం యథా మాలవరుద్రస్య—

62. ఏతస్మాజ్జలధేర్మితామ్బుకణికాః కాశ్చిద్గృహీత్వా తతః
పాథోదాః పరిపూరయన్తి జగతీం దుగ్ధామ్బురాశేర్వారిభిః.
భ్రామ్యన్మన్దరకూటకోటిఘటనాశ్లిష్టభ్రమత్తారకాం
ప్రాప్యైకాం జలమానుషీం త్రిభువనే శ్రీమానభూదచ్యుతః.

అపాదానౌచిత్యమునకు ఉదాహరణముగా మాలవరుద్రుని శ్లోకము ఎట్లనగా—

"మేఘములు ఈ సముద్రమునుండి కొన్ని జలబిందువులను సేకరించి, ఆకాశమును కప్పివేయుచున్నవై భూమిని నింపుచున్నవి. అచ్యుతుడు, తిరుగుచున్న మందరపర్వతపు కొనలు ఎక్కడ తగులునో అను భయముచేత చంచలమైన కనుగ్రుడ్లు గల ఒక జలమనుష్యస్త్రీని (జలకన్యను) ఈ సముద్రమునుండియే పొంది, 'శ్రీమాన్' అను పేరుతో మూడులోకములందును ప్రసిద్ధి పొందినాడు"

అత్ర యదుక్తమేతస్మాన్మహోదధేః పరిమితామ్బుకణికాః ప్రాప్య జలదాః జగత్ పూరయన్తి, తథా భ్రమన్మన్దరకూటకోటి సంఘట్ట త్రాసతరలతారకామేకాం జలమానుషీం స్త్రియం ప్రాప్య శ్రీమానచ్యుతోఽభూదితి తేన సాగరగతనిరతిశయోత్కర్షవిశేషః ప్రదర్శితః. ఏతస్మాజ్జలధేరితి పదమౌచిత్యస్య మూలభూమిః.

"ఈ సముద్రమునుండియే, పరిమితమైన కొన్ని జలబిందువులను గ్రహించి, మేఘములు జగత్తును నింపుచున్న సనియు, మందరపర్వతము తిరుగుచుండగా దాని శిఖరాగ్రములు ఎక్కడ తగులునో అను భయముతో చంచలమైన నేత్రములు గల లక్ష్మి అనే ఒక నీటి ఆడమనిషిని ఈ సముద్రమునుండియే పొంది అచ్యుతుడు శ్రీమంతుడైనా డనియు వర్ణించుటచే ఇచట సముద్రమునకు సంబంధించిన గొప్ప ఉత్కర్ష చూపబడినది "ఏతస్మాత్ జలధేః" అను పదములోనే ఔచిత్య మంతయు ఉన్నది.

న తు యథా భట్టేన్దురాజస్య—

63. ఆదాయ వారి పరితః సరితాం ముఖేభ్యః
కిం నామ సాధితమనేన మహార్ణవేన.

త్క్షారీకృతం చ వడవాదహనే హుతం చ
పాతాలమూలకుహరే వినివేశితం చ.

అత్ర మహార్ణవవ్యపదేశేన అన్యాయోపార్జితద్రవిణదుర్వ్యయకారిణః సత్పాత్రవిభాగవిముఖస్య కస్యచిదుచ్యతే సరితాం ముఖేభ్యః సమన్తాత్తోయమాదాయాపాత్రేభ్యః ప్రతిపాదితం దూషితమ్. యత్త్వత్ర సరిద్భ్యః సమాదాయేతి వక్తవ్యే సరిన్ముఖేభ్యః ఇత్యుక్తం ముఖశబ్దస్యానౌచిత్యమేవ పర్యవస్యతి.

కాని భట్టేందురాజు శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"ఓః మహాసముద్రము నదీముఖములనుండి నలువైపుల, జలమును గ్రహించి ఏమి చేసితివి! ఆ జలమంతయు ఉప్పగా చేయబడినది; వడవాగ్నిలో హోమము చేయబడినది; పాతాళమూలరంధ్రములోనికి నింపబడినది".

ఇక్కడ అన్యాయముగా సంపాదించిన ధనము నంతను దుర్వ్యయము చేయుచు, సత్పురుషులకు దానము చేయుటలో పైముఖ్యమును చూపుచుకనిని గూర్చి మహార్ణవ మను పంకతో చెప్పబడుచున్నది. నలుమూలల, నదుల ముఖములనుండి జలమును గ్రహించి అపాత్రుల కిచ్చుట అనునది దూషింపబడుచున్నది. (అంతయు బాగుగనే ఉన్నది కాని) 'నదులనుండి గ్రహించి' అనుటకు బదులు "నదుల ముఖముల నుండి గ్రహించి" అని చెప్పుటలో "ముఖ" శబ్దము నిరర్థకము గాన చివరకు అపాదానపదానౌచిత్యమే కనబడుచున్నది.

## అధికరణౌచిత్యమ్.

అధికరణౌచిత్యం యథా కున్తేశ్వరదౌత్యే కాలిదాసస్య—

64. ఇహ నివసతి మేరుః శేఖరః క్ష్మాధరాణా—
మిహ వినిహితభారాః సాగరాః సప్త చాన్యే.

ఇదమహిపతిభోగస్తమ్భవిభ్రాజమానం
ధరణితలమిహైవ స్థానమస్మద్విధానామ్.

అత్ర మహారాజదూతోఽపి సామన్తాస్థానే స్వప్రభు సముచిత గౌరవపూజార్హమాసనమనాసాద్య కార్యవశేన భూమావేవోపవిష్టః ప్రాగల్భ్యగామ్భీర్యేణైవం బ్రూతే — యథాఽస్మద్విధానాం వసుధాతల ఏవ భుజగపతి భోగస్తమ్భప్రాగ్భారనిష్కమ్పే ధరాసనే స్థానం యుక్తం; యస్మాదిహైవ మేరురచలచక్రవర్తీ సముపవిష్టః, సప్త మహాబ్ధయశ్చ, తత్తుల్యానామేవాస్మాక మిత్యౌచిత్య మధికరణపద సమ్బద్ధమేవ.

అధికరణౌచిత్యమునకు ఉదాహరణము కాళిదాసుని కున్తేశ్వరదౌత్యములో ఎట్లనగా :-

"పర్వతశ్రేష్ఠమైన మేరుపర్వతము ఇచటనే (ఈ భూమిమీదనే) ఉన్నది సప్తసముద్రములు కూడా ఇచటనే ఉంచబడిన భారములు కలవి ఈ ధరణీ తలమే ఆదిశేషుని పడగలనే స్తంభములపై నిలువబడినది. మా వంటి వారికి తగిన స్థానము ఈ భూమిమీదనే"

ఇచట—(కాళిదాసు) మహారాజుయొక్క దూతగా వెళ్ళినను సామంత రాజు ఆస్థానములో ఆతని ప్రభువుకు తగిన విధముగ (ఆతనికి) పూజాసనాదులు లభించలేదు. కాని పని సాధించవలసి ఉండుటచే భూమిపైననే కూర్చుండి ప్రాగల్భ్యగాంభీర్యముతో ఇట్లు చెప్పుచున్నాడు—" "ఆదిశేషుని పడగల స్తంభములపై నిశ్చలముగ నిలచిన భూమియే మావంటివారు కూర్చుండ తగిన స్థానము. ఏలనన, పర్వతచక్రవర్తియైన మేరుపర్వతము దీనిమీదనే కూర్చున్నది. సప్తసముద్రములకు ఆధారము కూడ ఇదియే. మేము కూడ వాటితో సమానులమే!" ఈ విధముగ ఇచట ఔచిత్యము అధికరణ పదములో ఉన్నది.

ఇచట— నీ భృత్యుడనైన నేను నీ ప్రతాపము ఏ దేశమునందు కంపముచే కదలుచున్న స్త్రీస్తనతటమునందలి హారములు ఊగునట్లు చేయుచున్నదో ఆ దేశమునందు నివసించినాను అని చెప్పుచు శౌర్యముయొక్క శృంగారగుణోత్కర్షమును వర్ణించునపుడు అన్ని దిక్కులందును అవిచ్ఛిన్నమైన ప్రసారము గల ప్రతాపమునకు పరిమితత్వమును (ఏదో ఒక దేశమునందు మాత్రమే ప్రసరించుట అనునది) చెప్పినట్లైనది. నీ ప్రతాపము తరుణీస్తనతటహారములను కదల్చు ఒక పరిచ్ఛిన్న దేశములో నేనుంటిని అని చెప్పగనే తదితరదేశములో (ప్రతాపము) కనబడకపోవుటను (విలక్షణం) చెప్పినట్లేకదా ? ప్రతాపము సర్వగతమైన పక్షమున "నేను అంతటను ఉంటిని" అని చెప్పవలసి యుండగా ఒక ప్రదేశమును మాత్రము చెప్పు పదమును ఉపయోగించుట యుక్తము కాదు. ఏదో ఒక ప్రదేశములో చోరుని ప్రతాపము కూడ విజృంభించవచ్చును. అందుచేత ఇచట అధికరణ పదమునందు (తత్ర) అనౌచిత్యము కనబడుచున్నది. స్తుతికి ఉచితముగ చెప్పవలెనన్నచో నీ ప్రతాపము ఎక్కడెక్కడ ఉండెనో నేను కూడ ఆ ప్రతి ప్రదేశమునందును ఉంటిని అని చెప్పినచో యుక్తముగా ఉండెడిది.

వి. ఇక్కడ అస్మచ్ఛబ్దవాచ్యు డెవ్వడో తెలియదు. ప్రకరణము సరిగ స్పష్టము కాకుండుటచే ఈ ఉచితానుచిత చింత అస్పష్టముగ నున్నది.

## 9 లిఙ్గౌచిత్యమ్.

లిఙ్గౌచిత్యం దర్శయితుమాహ—
ఉచితేనైవ లిఙ్గేన కావ్యమాయాతి భవ్యతామ్
సామ్రాజ్యసూచకేనేవ శరీరం శుభలక్ష్మణా. 21.

ప్రస్తుతార్థోచితేన లిఙ్గేన కావ్యం భవ్యతాముపయాతి, రాజలక్షణేనేవ శరీరమ్ యథా మమ లలితరత్నమాలాయామ్.

లింగౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు.

“సామ్రాజ్యమును సూచించు శుభలక్షణముచే శరీరము వలె, కావ్యము ఉచితమైన లింగముచేతను, పూజ్యత్వమును (సౌందర్యమును) పొందును.”

రాజలక్షణముచేత శరీరము వలె, ప్రస్తుతార్థోచితమైన లింగముచేత కావ్యము భవ్యత్వమును పొందును. నా లలితరత్నమాలలో ఉదాహరణ మెట్లనగా—

66. నిద్రాం న స్పృశతి త్యజత్యపి ధృతిం ధత్తే స్థితిం న క్వచిత్
దీర్ఘాం వేత్తి కథాం వ్యథాం న భజతే సర్వాత్మనా నిర్వృతిమ్.
తేనారాధయతా గుణస్తుతిజపధ్యానేన రత్నావళిం
నిఃసఙ్గేన వరాఙ్గనా పరిగతిః నామాపి నో సహ్యతే.

అత్ర వత్సేశ్వరస్య రత్నావళీ విరహావిధుర చేతసః స్మరావస్థాసముచితం విదూషకేణ సుసంగతార్థాయై యదభిహితం, నిద్రాం న స్పృశతి. ధృతిం త్యజతి. స్థితిం న ధత్తే. దీర్ఘాం కథాం వ్యథామివ వేత్తి. నిర్వృతిం న భజతే. తాం వినా కేన సద్గుణజాపినా, తద్ధ్యాన నిత్యేన జనసఙ్గత్యాగినాన్యాసామఙ్గనానాం నామమాత్రమపి న సహ్యతే. స్థితిధృతి కథానిర్వృతీనాం స్త్రీలిఙ్గాభిధానేన అఙ్గనాత్వాధ్యారోపేణ పరమౌచిత్యం ప్రతిపాదితమ్.

“నిద్రను స్పృశించుట లేదు; ధృతిని (ధైర్యము) విడిచివేయుచున్నాడు; ఎచ్చటనూ స్థితిని (నిలకడను) పొందుటలేదు. దీర్ఘమైన కథను వ్యథగా భావించుచున్నాడు; సర్వవిధముల, నిర్వృతిని (సుఖమును) భజించుట లేదు. (పొందుటలేదు). ఇతరసంగములన్నియు విడిచి, గుణముల స్తవము చేతను, జపముచేతను ధ్యానముచేతను రత్నావళిని ఆరాధించుచున్న అతడు ఇతరస్త్రీల పేరును కూడ సహింపజాలకున్నాడు.”

ఇచట – రత్నావళీవిరహముచే వ్యాకులమైన చిత్తముగల వత్సేశ్వరుని మన్మథావస్థను సముచితమగు రీతిలో విదూషకుడు సుసంగతతో చెప్పు చున్నాడు "నిద్రను స్పృశించుట లేదు; ధృతిని విడచినాడు. స్థితిని ధరించుట లేదు. దీర్ఘకథను వ్యథగా భావించుచున్నాడు. నిర్వృతిని భజించుటలేదు ఆమె లేకపోవుటచే ఆమె గుణములను జపించుచు నిత్యము ఆమెను ధ్యానిం చుచు ఇతరజనుల సంపర్కమును విడచిన ఇతడు ఇతరస్త్రీల పేరు కూడ సహింపజాలకున్నాడు." ఈ విధముగ స్థితి–ధృతి–కథా–నిర్వృతి–నిద్రా శబ్దములను స్త్రీలింగములో ప్రయోగించుటచే వాటియందు స్త్రీత్వమును ఆరో పింప వీలగుచున్నది. గాన ఎక్కువ ఔచిత్యము ప్రతిపాదింపబడినది.

నతు యథా మమ నీతిలతాయామ్.

67. వరుణరణసమర్థా స్వర్గభఙ్గైః కృతార్థా
యమనియమనశక్తా మారుతోన్మాథసక్తా.
ధనద నిధన సజ్జా లజ్జతే మర్త్యయుద్ధే
దహనదలనచణ్డా మణ్డలీ మద్భుజానామ్.

అత్ర రావణః కపినికారామర్ష విషమవికారావిష్కారోచితం బ్రూతే—వరుణాదిలోకపాల విశాలబలావలేప విప్లవకారణే మర్త్య మాత్రయుద్ధే లజ్జతే ప్రచణ్డా మద్భుజమణ్డలీ ఇతి స్త్రీలిఙ్గేన నిర్దేశ-స్త్రైలోక్యవిజయోర్జితస్య ప్రతాపస్య కఠోరతా మపహారన్ అనౌ చిత్యం సూచయతి.

కాని నా నీతిలతలోని శ్లోకము ఉదాహరణము కాదు.

"వరుణునితో యుద్ధము చేయుటయందు సమర్థమైనదియు, స్వర్గమును (అనేకపర్యాయములు) ఓడించుటచే కృతార్థమైనదియు, యముని నియమిం

చుటలో సమర్థమైనదియు, వాయువును పీడించుటలో, ఆసక్తి కలదియు కుబేరుని నశింపచేయుటకు సన్నద్ధమైనదియు, అగ్నిని చీల్చివేయుటలో తీవ్రమైనదియు అగు నా భుజమండలి మనుష్యునితో యుద్ధము చేయుటకు సిగ్గుపడుచున్నది.

ఇచట— రావణుడు కపియొక్క అవమానముచే కలిగిన అమర్షముచే విషమయమైన వికారమును ఆవిష్కరించుటకు తగినవిధముగ పలుకుచున్నాడు- వరుణుడు మొదలైన లోకపాలుల విశాలబలగర్వమునకు ఉపద్రవమును కలిగించిన ప్రచండమైన నా భుజమండలి మర్త్యునితో యుద్ధము చేయుటకు సిగ్గుపడుచున్నది. కాని "మద్భుజమణ్డలీ" అని స్త్రీలింగములో నిర్దేశము చేయుట (స్త్రీలింగము సుకుమారత్వమును సూచించునుగాన) మూడు లోకములను జయించుటచే తీవ్రమైన ప్రతాపములోని కఠోరత్వమును తొలగించివేసి అనౌచిత్యమును సూచించుచున్నది.

## 10. వచనౌచిత్యమ్.

వచనౌచిత్యం దర్శయితుమాహ—

కా. ఉచితైరేవ వచనైః కావ్యమాయాతి చారుతామ్
అదైన్యధన్యమనసాం వదనం విదుషామివ . ౨౨

ఉచితైరేకవచనద్వివచనబహువచనైః కావ్యం చారుతామాయాతి. అదైన్యోదారచేతసాం విదుషామివ వదనమయాచారుచితౌచిత్యచారుభిర్వచోభిః, యథా మమ నీతిలతాయామ్—

వచనౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు:-

"దైన్యము లేకపోవుటచే ధన్యమైన మనస్సుగల విద్వాంసుల ముఖము వలె, కావ్యము ఉచితమైన వచనములచేత (ఏకవచనాదులచేత, మాటలచేత అని రెండు అర్థములు) చారుత్వమును పొందును."

ఉచితములైన ఏకవచన—ద్వివచన—బహువచనములచే కావ్యము, దైన్యము లేకపోవుటచే ఉదారమైన చిత్తము గల పండితుల ముఖము, యాచన చేయకపోవుటచే రుచిరమైనవియు, ఔచిత్యముతో సుందరమైనవియు అగు వాక్యములతో వలె, సౌందర్యము కలిగియుండును. నా నీతిలతలో ఉదాహరణ మెట్లనగా—

68. త్రైలోక్యాక్రమణైర్వరాహవిజయైర్నిస్సంఖ్యరత్నాప్తిభిః
ప్రఖ్యాతః స్వరసస్వయంవరశతైర్యుద్ధాబ్ధిమధ్యే శ్రియః.
పాశ్చాత్యైర్బలిబన్ధనైశ్చ బహుభిర్నిత్యం హసత్యూర్జితః
పౌలస్త్యః సకృదుద్యమశ్రమవశాద్వ్యాప్తనిద్రం హరిమ్. 68

అత్ర శుకసారణాభ్యాం రఘుపతేరగ్రే దశగ్రీవ పరాక్రమే౽భిధీయమానే యదుక్తం పౌలస్త్యః శేషశాయినం హరిమేకవారోద్యోగశ్రమవశేన సంసక్తాలస్యనిద్రమనేకత్రైలోక్యాక్రమణైర్వరాహవిజయినాం సుభటానాం జయైరనేకరత్నప్రాప్తిభిః సమరసముద్రమధ్యే బహువారవిహితైః శ్రియః స్వయంవరశతైః బలినాం చ లోకపాలానాం బన్ధనైః ప్రఖ్యాతః సహాసోర్జితః సోత్సాహః సతతం హసతి ఇతి బహువచనైరేవ హరిర్గ్లాలక్షణ్యా లక్షణముపచితమౌచిత్యముదఞ్చితమ్.

త్రిలోకముల ఆక్రమణములచేతను, (విష్ణువు త్రివిక్రమావతారమున త్రిలోకములను ఒక్కమారు మాత్రమే ఆక్రమించెను; రావణుడు అనేక పర్యాయము లాక్రమించెను అని భావము), వరాహవిజయములచేతను (వరాహరూపమున విజయము సంపాదించుట అని విష్ణుపక్షమునను, "వర + ఆహవ + జయైః" అను పదచ్ఛేదముచే, గొప్ప యోధుల జయములచేత అని రావణపక్షమున అర్థము), అనంతరత్నములను సంపాదించుటలచేతను (విష్ణువు కౌస్తుభ మొక్కదానినే సంపాదించెను). యుద్ధసముద్రమధ్యమున

లక్ష్మీస్వయంవరితములచేతను అనేక దాక్షిణ్యవంతమైన బలిబంధనముల చేతను (బలిచక్రవర్తి బంధనము, బలవంతుల బంధనములు అని రెండర్థములు) ఎల్లప్పుడును ఉద్దీప్తుడైన (కార్యోద్యుక్తుడు: మేల్కొని యుండువాడు అని రెండర్థములు) రావణుడు, ఒక్కమారు ప్రయత్నము చేయుటవలన కలిగిన శ్రమవలన నిద్రాపరవశుడైన విష్ణువును చూచి నవ్వు చున్నాడు”.

శుకసారణులు రాముని ఎదుట రావణుని పరాక్రమమును వర్ణించుచు ఇట్లు చెప్పుచున్నారు.—అనేకపర్యాయములు సముద్రములను అతిక్రమించుట చేతను, సుభటులను జయించుటచేతను, అనేకరత్నముల ప్రాప్తిచేతను, యుద్ధసముద్రమధ్యమున లక్ష్మీ స్వయంవరితములచేతను. బలవంతులైన లోకపాలురను బంధించుటచేతను ప్రసిద్ధుడును, ఎల్లప్పుడును ఉద్ధతుడు అనగా ఉత్సాహవంతుడును అగు పౌలస్త్యుడు, ఒక్కమారు ప్రయత్నము చేసిన శ్రమకు నిద్రపోవుచున్న హరిని పరిహసించుచున్నాడు.” ఈ విధముగ బహువచనముల ప్రయోగముచే హరికంటె పౌలస్త్యుడు వైలక్షణ్యము కలవాడు అను విషయమునందలి ఔచిత్యము చెప్పబడినది.

న తు యథా మాతృగుప్తస్య

69. నాయం నిశాముఖసరోరుహరాజహంసః
కీరీ కపోలతలకాన్తతనుః శశాఙ్కః।
ఆభాతి నాథ తదిదం దివి దుగ్ధసిన్ధు
డిణ్డీరపిణ్డపరిపాణ్డు యశస్త్వదీయమ్॥

అత్ర నాయం శశీ; త్వదీయమిదం దుగ్ధసిన్ధుడిణ్డీరపిణ్డపాణ్డురం యశ ఇతి యదభిహితం తదవిచ్ఛిన్నప్రసారాణాం యశసాం బహువచనేన వర్ణనాయాం సముచితాయామేకవచనోపన్యాసః చన్ద్రబిమ్బాకారేణ పిణ్డమాత్రపరిచ్ఛిన్నతయా సఙ్కుచద్రూపమనౌచిత్యముద్భావయతి.

కాని మాతృగుప్తుని శ్లోకము ఉదాహరణము కాదు.

"ఓరాజా : కేరళస్త్రీయొక్క కపోలము వలె మనోహరమైన శరీరము గల ఇది, రాత్రియొక్క ముఖపద్మసమీపమునందలి రాజహంస యైన శశాంకుడు కాదు. పాలసముద్రమునందలి నురుగు ముద్దవలె తెల్ల నైన నీ కీర్తి ఈ విధముగ ఆకాశమున ప్రకాశించుచున్నది.

వి. 'కీరీకపోల' అనుటకు బదులు "చేరీకపోల" అను పాఠము ఉండియుండును. 'కీరీ' అనగా ఆడచిలుక. ఈ అర్థము ఇకడ అసంగతము.

ఇచట- ఇది చంద్రుడు కాదు; పాలసముద్రపు నురుగు ముద్ద వలె తెల్ల నైన నీకీర్తి అనిచెప్పబడినది. కాని అవిచ్ఛిన్నప్రసారము గల కీర్తులను బహువచనముచే వర్ణించుట యుక్తము. అట్లు చేయుటకు బదులు ఏకవచనము ప్రయోగించుటచే, కీర్తి చంద్రబింబాకారమునపిండీకృతమైసంకుచితమై పోయిన దన్నట్లు అనౌచిత్యము భాసించుచున్నది.

## 11. విశేషణౌచిత్యమ్

విశేషణౌచిత్యం దర్శయితు మాహ—

విశేషణైః సముచితైర్విశేష్యోఽర్థః ప్రకాశతే
గుణాధికైర్గుణోదారః సుహృద్భిరివ సజ్జనః 23

కావ్యే విశేష్యోఽర్థః సముచితైరేవ విశేషణైః శోభాం లభతే గుణోదారః సాధుర్యథా భ్యధికగుణైః సుహృద్భిః. యథా మమ మునిమతమీమాంసాయామ్—

"కావ్యములో" విశేష్యమైన అర్థము, సముచితములైన విశేషణములచేత, గుణములచేత ఉదారుడైన (సద్గుణవంతుడైన) సజ్జనుడు ఉత్తమ గుణవంతు లగు మిత్రులచేత వలె, ప్రకాశించును.''

(ఒకదానితో ఉన్న విశేషమును చెప్పునది విశేషము. దేనియందలి విశేషము చెప్పబడునో అది విశేష్యము.) గుణోదారుడైన సజ్జనుడు గుణాధికు లగు మిత్రులతో ఎట్లు ప్రకాశించునో, అట్లే, కావ్యములోని విశేష్యార్థము తగిన విశేషణములతో ప్రకాశించును.

ఉదాహరణమునకు నా మునిమతమీమాంసలోని శ్లోకమెట్లనగా—

70. చైత్రే సఞ్చితయౌవనాన్యుపవనాన్యామోదినీ పద్మినీ
జ్యోత్స్నాప్రావరణాని రత్నవలభీహర్మ్యాణి రమ్యాః స్త్రియః.
సర్వం చారుతరం స కస్య దయితం యస్మింస్తు తద్భుజ్యతే
తస్మాన్మృన్మయమామభాజనమివ క్షిప్రక్షయం జీవితమ్. 70.

అత్ర యుధిష్ఠిరస్యాసాదితమహావిభూతేః మయనిర్మితమణిమయ సభాభిమానినో విభవప్రభావే వర్ణ్యమానే సకలభావానామనస్థిర రూపా భావనోపదేశినో మహామునే [illegible] యదుక్తం కుసుమ సమయ సముపచితయౌవనాన్యుపవనాని, మకరన్దామోదసుస్థిరారవిస్తరిణీ పద్మినీ, జ్యోత్స్నా పటప్రావృతాని రత్నవలభీహర్మ్యాణి, రమణీయా రమణ్యశ్చేతి సర్వమేతచ్చారుతరం సర్వస్యాభిమతమ్ కిన్తు యస్మిన్ భుజ్యతే తజ్జీవిత మాయుర్మృత్పాత్రనిఃసారం క్షిప్రక్షయ మితి తద్విశేష్యపదోత్కర్షకారి విశేషణ పదోదితసౌన్దర్యేణ పర్యన్తనిఃసారతా నిర్వేదసంవాది స్ఫురదౌచిత్యమాతనోతి.

"చైత్రమాసమునందు ఉపవనములు అంతటను వ్యాపించిన యౌవనముగలవి. పద్మలత సువాసనతో కూడినది. రత్నాలు పొదిగిన పైభాగములు గల (వలభీ = డాబా) మేడలు వెన్నెల అనే ఆవరణము కలవి. స్త్రీలు రమ్యమైనవారు అంతయు చాల సుందరముగనే ఉన్నది. ఇది ఎవరికి

ఇష్టము కాకుండును? అది అంతయు దేనియందు అనుభవించబడునో ఆ జీవితము వచ్చి మట్టికుండ వలె శీఘ్రముగ నశించునది."

మహావైభవమును సంపాదించి, మయుడు నిర్మించిన మణిమయసభను చూచుకొని అహంకారమును పొందిన యుధిష్ఠిరుని వైభవప్రభావమును వర్ణించు ఘట్టమున—భావరూపములును అభావరూపములును అగు అన్ని పదార్థములును చివరకు అభావరూపమునే పొందును (నశించును) అని ఉప దేశించు మహామునియొక్క ఆశయమును విశదీకరించుచు, ఇట్లు చెప్పబడినది. "ఉద్యానవనములు వసంతాగమనముచే పెంపొందిన యౌవనము గలవి; పద్మ లత మకరందసుగంధముతో నిండిన పద్మములతో కూడియున్నది, రత్నాలతో నిండిన పై కప్పులు గల ప్రాసాదములు వెన్నెల అనెడు వస్త్రముతో కప్ప బడినవి. రమణులు రమణీయముగా ఉన్నారు. అతిమనోహరమైన ఇది అంతయు అందరికిని ఇష్టమైనదే, కాని ఏ జీవితములో (చే) ఇది అంతయు అనుభవించబడునో అట్టి జీవితము పచ్చిమట్టి కుండ వలె నిస్సారమైనది. శీఘ్రముగ నశించిపోవును" ఈ విధముగ విశేష్యపదమునకు (జీవితం అను పదమునకు) ఉత్కర్షను (సర్వరమైనది అను అంశములో ఉత్కర్షను) కలి గించు విశేషణపదముచేత (మృన్మిర్మిత మామభాజనమివ అనుపదముచే) కలి గిన సౌందర్యముచే, చివరకు అంతయు నిఃస్సారమే అనెడు నిర్వేదమునకు (వైరాగ్యమునకు) అనుగుణ మైన ప్రకాశించుచున్న ఔచిత్యము ఏర్పడినది.

న తు యథా భట్టలట్టనస్య—

71. గ్రీష్మం ద్విషన్ను జలదాగమమర్థయన్తాం
తే సఙ్కటప్రకృతయో వికటాః స్తడాగాః।
అర్థేస్తు ముగ్ధశఫరీచటులాచ లేర్ద్ర
నిష్కామ్పకుక్షిపయసో ద్వయమప్యచిన్త్యమ్.

అత్ర గ్రీష్మం ద్విషన్ను, మేఘాగమం సఙ్కటస్వభావా వికటా

విస్తీర్ణాశ్చ తటాకాః ప్రార్థయన్తామ్. మహోఘేస్తు బాలశఫరీలోలా చలేన్ద్రి నిశ్చలకుక్షిపయసో గ్రీష్మఘనాగమావప్యగణనీయా" ఇతి యదుక్తం, తత్ర తడాగ విశేషణయోః సంకటవికటపదయోః పరస్పరవిరుద్ధార్థయోః అనౌచిత్యం స్పష్టమవభాసతే. సఙ్కటస్వభావస్యహి వికటత్వం విస్తీర్ణత్వం నోపపద్యతే. అథస్వభావే సంకటత్వమాకారే విపులత్వం చ తదపి నిశ్చేతనస్య స్వభావాభావాత్ అనుపపన్నమేవ.

కాని భట్టలట్టుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"సంకట స్వభావము కలవియు, వికటములును అగు చెరువులు గీష్మర్తువును ద్వేషించుగాక, వర్షర్తువు కొరకు ఎదురుచూచుగాక. చేపపిల్ల వలె ఇటు అటు కదిలిన మందరపర్వతముచే (మందరపర్వతము కదిలినను) నిశ్చలముగా ఉన్న గర్భమునందలి జలముగల సముద్రమునకు ఈ రెండింటిని గూర్చి కూడా ఆలోచించవలసిన పని లేదు."

వి. "సంకటప్రకృతయః = ఇరుకైన స్వభావము కలవి, అనగా సహజముగా ఇరుకైనవి. వికటాః = విస్తృతమైనవి

సంకట స్వభావములును, వికటములును, అనగా విస్తీర్ణములును అగు తటాకములు గ్రీష్మర్తువును ద్వేషించుగాక, వర్షర్తువును అభినందించుగాక; మందర పర్వతము ఒక చిరుచేప వలె ఇటు నటు కదిలినను కదలకుండ నున్న జలగర్భము గల సముద్రమునకు మాత్రము గ్రీష్మర్తువైనను, వర్షర్తువైనను ఒకటే - అని ఇచట చెప్పబడుచున్నది. కాని ఇచట పరస్పరవిరుద్ధార్థములైన 'సంకట', 'వికట' పదములను ప్రయోగించుటచేవిశేషణానౌచిత్యము స్పష్టముగ కనబడుచున్నది. సంకటస్వభావము కలది, చిన్నగా అనగా ఇరుకుగా, ఉండునది, వికటముగా అనగా విస్తీర్ణముగా ఉండుట అనుపపన్నము కదా? "అట్లు కాదు, తటాకములు స్వభావముచే సంకటములు (సంకుచితస్వభావము కలవి) ఆకారముచే విపులములు అని అర్థము" అనికూడ చెప్పుటకు వీలు లేదు. నిశ్చేతనమైన తటాకమునకు స్వభావ మనునది ఉండదు కదా?

## 12. ఉపసర్గౌచిత్యమ్

ఉపసర్గౌచిత్యం దర్శయితుమాహ—

యోగ్యోపసర్గసంసర్గైర్నిరర్గలగుణోచితా
సూక్తిర్వివర్ధతే సమ్పత్ సన్మార్గగమనైరివ. 24.

ఉచితైః ప్రాదిభిరుపసర్గైః సూక్తిరున్నతిమాసాదయతి; విభూతిరివ సన్మార్గగమనైః.

యథా మమ మునిమతమీమాంసాయామ్—

ఉపసర్గౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు—

అడ్డులేని గుణములచే ఉచితమైన సూక్తి (పద్యము లేదా కావ్యము) యోగ్యమైన ఉపసర్గల సంబంధముచేత, నిరర్గలములైన గుణములచేత, ఉచితమైన సంపద మంచి నడవడికచేత వలె వృద్ధిపొందును. లేదా "నిరర్గలగుణోచితమై వృద్ధిపొందును" అని అర్థము.

ఐశ్వర్యము సన్మార్గమునందు ప్రవర్తించుటచేత వలె సూక్తి ఉచితములైన ప్రాద్యుపసర్గలచే ఉన్నతిని పొందును. ఉదాహరణము నా ముని మత మీమాంసనుండి ఎట్లనగా—

ఆచారం భజతే త్యజత్యసి మదం వైరాగ్యమాలమ్బతే
కర్తుం వాఞ్ఛతి సఙ్గభఙ్గగలితోత్తుఙ్గాభిమానం తపః.
దైవస్యాస్త విపర్యయేషు సుఖశిఖాభ్రష్టః ప్రణష్టో జనః
ప్రాయస్తాపవిలీనలోహసదృశీమాయాతి కర్మణ్యతామ్. 72.

అత్ర దుర్యోధనస్య ఘోషయాత్రాయాం గన్ధర్వబన్ధపరాభవభగ్నాభిమానస్య ప్రాజ్యసామ్రాజ్యముత్సృజ్య తపః ప్రయత్నాభిని విష్టస్య దుర్గ్రహే వక్ష్యమాణే యదుక్తం—సర్వో జనః సుఖభ్రష్టః

ప్రణష్టవిభవః సదాచారం భజతే, మదంత్యజతి, వైరాగ్యమాశ్రయతి, సఙ్గభఙ్గేన విగలితోత్తుఙ్గాభిమానం తపః కర్తుం వాఞ్ఛతి, ప్రాయో బాహుల్యేన తాప విగలితలోహపిణ్డసదృశీం కర్మణ్యతామాయాతి. అత్రోత్పూర్వతయా సోపసర్గస్య తుఙ్గస్య స్వభావోన్నతిః ద్విగుణతాముపయాతా దుర్మదాభిమానస్యౌచిత్యముచ్చైః కరోతి.

"వైభవముచే ప్రాప్తించిన విపరీతపరిస్థితులవలన సుఖదుఃఖములనుండి క్రిందికి జారిపోయి, వైభవము కోల్పోయినవాడు సదాచారమును అవలంబించును. మదమును విడచును, వైరాగ్యమును పొందును. సంగము లేకపోవుటచే తొలగిపోయిన ఉత్తుంగమైన (అత్యున్నతమైన) అభిమానముగల తపస్సు చేయదలపెట్టును. ఈ విధముగా సాధారణముగ వేడికి కరిగిన లోహముతో సమానమైన కర్మణ్యత్వమును పొందును". వేడికి మెత్తబడిన ఇనుము ఎటు త్రిప్పిన అటు వంగునట్లు ఇతడు కూడ ఏ పనినైనను చేయుటకు సిద్ధపడును అని అర్థము.

ఘోషయాత్రకు బయలుదేరిన దుర్యోధనుడు గంధర్వునిచే బంధింపబడి, ఆ పరాభవముచే అభిమానమంతయు భగ్నముకాగా, తన సామ్రాజ్య వైభవమునంతను విడచి తపస్సు చేయగోరెదనని మొండి పట్టుదలతో చేసిన ప్రయత్నము ఇచట వర్ణింపబడుచున్నది "సుఖమునుండి భ్రష్టుడై ఐశ్వర్యమునంతను పోగొట్టుకొనిన ప్రతివాడును సదాచారమును అవలంబించును; మదమును విడచును; వైరాగ్యము నాశ్రయించును; సర్వసంగములు తొలగిపోవుటచే అంతవరకును ఉన్న అత్యున్నతమైన అభిమాన మంతయు నశింపగా తపస్సు చేయవలెనని అభిలషించును. చాల వరకు వేడికి కరగిన లోహపిండముతో సమానమైన కర్మణ్యత్వమును పొందును." ఇచట 'తుంగ' శబ్దమునకు "ఉత్" అను ఉపసర్గ చేర్చుటతో ఆ శబ్దమునే బోధింపబడిన ఉన్నతి రెట్టింపు అయినదై దుర్మదము వలన కలుగు అభిమానము (అహంకారము) యొక్క ఆధిక్యమును సూచించుచు ఔచిత్యమును పెంపొందించుచున్నది.

న తు యథా కుమారదాసస్య

73. అయి విజహీహి దృఢోపగూహనం
త్యజ నవసంగమభీరు వల్లభమ్.
అరుణకరోద్గమ ఏష వర్తతే
వరతను సంప్రవదన్తి కుక్కుటాః.

అత్ర అభినవానఙ్గసఙ్గమ గాఢ మాలిఙ్గన నిశ్చలాఙ్గచ్ఛన్నాఙ్గనా ప్రబోధనే సఖ్యా యదుక్తం — వల్లభం ముఞ్చ ప్రభాతసన్ధ్యాయా మరుణ కిరణోద్గమో వర్తతే; కుక్కుటాశ్చ సంప్రవదన్తి ఇతి, తత్ర సంప్రోపసర్గయో ర్వ్యర్థయోః పూరణమాత్రేణ నిరర్థకత్వాదనుచితమేవ.

కాని కుమారదాసుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"నవసంగమమునందు భయపడు ఓ సఖీ! గాఢాలింగనమును విడువుము. ప్రియుని వదలింపుము ఇదిగో సూర్యకిరణాలు పైకి వచ్చుచున్నవి. ఓ సుందర మైన దేహము కలదానా! కోళ్ళు కూయుచున్నవి".

ఇక్కడ - క్రొత్తగా జరిగిన అనంగసంగమమునందు గాఢముగా ఆలింగనము చేసికొనుటచే నిశ్చలమైన (ప్రియ) శరీరముచే కప్పబడిన నాయికను బోధించు సఖి ఇట్లు అనుచున్నది. "ప్రియుని విడువుము (ప్రభాత సంధ్య యందు) సూర్యకిరణాలు పైకి వచ్చుచున్నవి. కోళ్ళు కూడా కూయుచున్నవి". ఇచట — "సంప్రవదన్తి" అనునపుడు 'సం' 'ప్ర' అను శూన్యములైన (అర్థము లేని) శబ్దములను నింపినంత మాత్రముచే, ప్రయోజన మేమియు (అర్థములో విశేష మేమియు లేనపోవుటచే) ఇది అనుచితమే.

## 13. నిపాతౌచిత్యమ్.

నిపాతౌచిత్యం దర్శయితు మాహ—
ఉచితస్థానవిన్యస్తై ర్నిపాతై రర్థసఙ్గతిః
ఉపాదేయైర్భవత్యేవ సచివైరివ నిశ్చలా. 25.

ప్రణష్టవిభవః సదాచారం భజతే, మదంత్యజతి, వైరాగ్యమాశ్రయతి, సఙ్గభఙ్గేన విగలితోత్తుఙ్గాభిమానం తపః కర్తుం వాఞ్ఛతి, ప్రాయో బాహుల్యేన తాప విగలితలోహపిణ్డసదృశీం కర్మణ్యతామాయాతి. అత్రోత్పూర్వతయా సోపసర్గస్య తుఙ్గశబ్దస్య స్వభావోన్నతిః ద్విగుణతాముపయాతా దుర్మదాభిమానార్థౌచిత్యముచ్చైః కరోతి.

“దైవముచే ప్రాప్తించిన విపరీతపరిస్థితులచేత సుఖశిఖరములనుండి క్రిందికి జారిపోయి, వైభవము కోల్పోయినవాడు సదాచారమును అవలంబించును. మదమును విడచును, వైరాగ్యమును పొందును. సంగము లేకపోవుటచే తొలగిపోయిన ఉత్తుంగమైన (అత్యున్నతమైన) అభిమానముగల తపస్సు చేయదలపెట్టును. ఈ విధముగా సాధారణముగ వేడికి కరిగిన లోహముతో సమానమైన కర్మణ్యత్వమును పొందును”. వేడికి మెత్తబడిన ఇనుము ఎటు త్రిప్పిన అటు వంగునట్లు ఈతడు గూడ ఏ పనినైనను చేయుటకు సిద్ధమగును అని అర్థము.

ఘోషయాత్రకు బయలుదేరిన దుర్యోధనుడు గంధర్వునిచే బంధింపబడి, ఆ పరాభవముచే అభిమానమంతయు భగ్నముకాగా, తన సామ్రాజ్య వైభవమునంతను విడచి తపస్సు చేసుకొందునని మొండి పట్టుదలతో చేసిన ప్రయత్నము ఇచట వర్ణింపబడుచున్నది “సుఖమునుండి భ్రష్టుడై ఐశ్వర్యమునంతను పోగొట్టుకొనిన ప్రతివాడును సదాచారమును అవలంబించును; మదమును విడచును; వైరాగ్యము నాశ్రయించును; సర్వసంగములు తొలగిపోవుటచే అంతవరకును ఉన్న అత్యున్నతమైన అభిమాన మంతయు నశింపగా తపస్సు చేయవలెనని అభిలషించును. చాల వరకు వేడికి కరగిన లోహపిండముతో సమానమైన కర్మణ్యత్వమును పొందును.” ఇచట ‘తుంగ’ శబ్దమునకు “ఉత్” అను ఉపసర్గ చేర్చుటతో ఆ శబ్దముచే బోధింపబడిన ఉన్నతి రెట్టింపు అయినదై దుర్మదము వలన కలుగు అభిమానము (అహంకారము) యొక్క ఆధిక్యమును సూచించుచు ఔచిత్యమును పెంపొందించుచున్నది.

న తు యథా కుమారదాసస్య

73. అయి విజహీహి దృఢోపగూహనం
త్యజ నవసంగమభీరు వల్లభమ్.
అరుణకరోద్గమ ఏష వర్తతే
వరతను సంప్రవదన్తి కుక్కుటాః.

అత్ర అభినవానఙ్గసఙ్గమ గాఢ మాలిఙ్గన నిశ్చలాఙ్గచ్ఛన్నాఙ్గినా ప్రబోధనే సఖ్యా యదుక్తం — వల్లభం ముఞ్చ ప్రభాతసన్ధ్యాయా మరుణ కిరణోద్గమో వర్తతే; కుక్కుటాశ్చ సమ్ప్రవదన్తి ఇతి, తత్ర సంప్రోపసర్గశూన్యశబ్దాపూరణమాత్రేణ నిరర్థకత్వాదనుచితమేవ.

కాని కుమారదాసుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

“నవసంగమునందు భయపడు ఓ సఖీ! గాఢాలింగనమును విడువుము. ప్రియుని త్యజింపుము ఇదిగో సూర్యకిరణాలు పైకి వచ్చుచున్నవి. ఓ సుందర మైన దేహము కలదానా! కోళ్ళు కూయుచున్నవి”.

ఇక్కడ - క్రొత్తగా జరిగిన అనంగసంగమమునందు గాఢముగా ఆలింగనము చేసికొనుటచే నిశ్చలమైన (ప్రియ) శరీరముచే కప్పబడిన నాయి కను బోధించు సఖి ఇట్లు అనుచున్నది. “ప్రియుని విడువుము (ప్రభాత సంధ్య యందు) సూర్యకిరణాలు పైకి వచ్చుచున్నవి. కోళ్ళు కూడా కూయుచున్నవి”. ఇచట — “సంప్రవదన్తి” అనునపుడు ‘సం’ ‘ప్ర’ అను శూన్యములైన (అర్థము లేని) శబ్దములను నింపినంత మాత్రముచే, ప్రయోజన మేమియు (అర్థములో విశేష మేమియు లేకపోవుటచే) ఇది అనుచితమే.

## 13. నిపాతౌచిత్యమ్.

నిపాతౌచిత్యం దర్శయితు మాహ—
ఉచితస్థానవిన్యస్తైర్నిపాతైరర్థసఙ్గతిః
ఉపాదేయైర్భవత్యేవ సచివైరివ నిశ్చలా. 25.

ఉపాదేయైశ్చాదిభిర్నిపాతై రుచితపదవినివేశితైః కావ్యస్య అర్థసఙ్గతిరసన్దిగ్ధా సత్సహాయైరివ భవతి.

నిపాతౌచిత్యమును చెప్పుచున్నాడు—

"తగిన స్థానమునందు ఉంచబడినవియు, ఉపాదేయములును (గ్రహింపదగినవి) అయిన నిపాతలచేత, తగిన స్థానములందు నియుక్తులును, గ్రహింపనర్హులును అగు సచివుల చేత వలె, అర్థసంగతి నిశ్చలమై ఉండును." ('అర్థ సంగతి' అనగా అర్థము తగు విధముగా ఉండుట అనియు, ధనప్రాప్తి అనియు రెండర్థములు).

ఉపాదేయము లైన "చ" "తు" మొదలగు నిపాతలను తగిన స్థానములలో ప్రయోగించినపుడు, ఉత్తములైన సహాయులచేత వలె, అర్థసంగతి అసందిగ్ధముగా ఉండును.

యథా మమ మునిమతమీమాంసాయామ్—

74. సర్వే స్వర్గసుఖార్థినః క్రతుశతైః ప్రాజ్యై ర్యజన్తే జడా
స్తేషాం నాకపురే ప్రయాతి విపులః కాలః క్షణార్ధం చ తత్.
క్షీణే పుణ్యధనే స్థితిర్న తు యథా వేశ్యాగృహే కామినాం
తస్మాన్మోక్షసుఖం సమాశ్రయత భోః సత్యం చ నిత్యం చ యత్.

అత్ర స్వర్గసుఖస్య వేశ్యాభోగవదపసానవిరసచపలతాయాం ప్రతిపాదితాయాం నిశ్చలమోక్షసుఖస్య నిస్సన్దేహానిశ్చితా ప్రతిపత్తిః నిపాతపదోపబృంహితా వాక్యార్థౌచిత్యం జనయతి.

"మూఢు లందరును స్వర్గసుఖమును కోరుచు ఆడంబరపూర్ణములైన వందల కొలది యజ్ఞములను చేయుచున్నారు. దీర్ఘమైన వారి కాలము

స్వర్గములో క్షణార్థము వలె గడచిపోవును. అటు పిమ్మట, పుణ్యధనము క్షీణించిన దగుచుండగా, కాముకులు ధనము క్షీణించిన పిదప వేశ్యా గృహములో ఎట్లు ఉండజాలరో అట్లే, వీరు స్వర్గములో ఉండజాలరు అందువలన - ఏ మోక్షసుఖము సత్యమైనదో, నిత్య మైనదో అట్టి మోక్షసుఖమును ఆశ్రయించుడు."

స్వర్గసుఖము వేశ్యాభోగము వలె అవసానమునందు విరసమైనది, చపలమైనది అను విషయమును ప్రతిపాదించు ఈ వాక్యమున నిశ్చల మైన మోక్షసుఖము యొక్క నిస్సందేహమును, నిశ్చితమును అయిన జ్ఞానము నిపాత పదములచే పోషింపబడినదై వాక్యార్థముయొక్క ఔచిత్యమును కలిగించుచున్నది.

న తు యథా శ్రీచక్రస్య—

75. దేవో జానాతి సర్వం యదపి చ తదపి బ్రూమహే నీతినిష్ఠం
సార్ధం సన్ధాయ జాలాన్తరధరణిభుజా నిర్వృతో బాన్ధవేన.
మ్లేచ్ఛానుచ్ఛిన్ధి భిన్ధి ప్రతిదినమయశో రున్ధి విశ్వం యశోభిః
సోదన్వన్మేఖలాయాం పరికలయ కరం కిం చ
విశ్వమ్భరాయామ్ 75.

అత్ర క్షితిపతిస్తుతిప్రస్తావే "దేవో జానాతి సర్వం యదపి చ తదపి" ఇతి యదుక్తం తత్ర పూర్వాపరపదయో రసమ్బద్ధత్వేన నిరర్థక ఏవ నిరుపయోగశ్చకారః ప్రతతోత్సవ బహుజనభోజనపఙ్క్తౌ అపరిజ్ఞాతః స్వయమేవ మధ్యే సముపవిష్టః పశ్చాదభివ్యక్తః పరం లజ్జాదుర్మనా ఇవానౌచిత్యం ప్రతనోతి.

కాని శ్రీచక్రుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"ప్రభువుగారు అన్నియు ఎరిగియే యున్నను, అట్లయినను, నీతికి

సంబంధించిన విషయమును చెప్పుచున్నాము. బంధువైన జాలాంతరరాజుతో సంధి చేసికొని సుఖముగా నుండుము. మ్లేచ్ఛులను నశింపచేయుము. ప్రతి దినము అపకీర్తిని తొలగించుము. ప్రపంచమును కీర్తులతో కప్పివేయుము. మరియు, సముద్రము వడ్డాణముగా గల భూవలయముపై వన్నును సంపాదింపుము".

వి. "యదపి" అనునది "యద్యపి" అనగా అయినను అను అర్థములో ప్రయోగింపబడినది. 'తదపి' అనగా అట్లయినను అని అర్థము. అందుచే ఇచట నున్న ఈ యచ్ఛబ్దతచ్ఛబ్దములు పరస్పరాన్వితములు కావు. "జాలాన్తరధరణిభుజా" అనుదాని అర్థము తెలియరేదు. పాఠాంతరమేమైన ఉన్నదేమో? 'అంతర' అనుదానికి 'సరిహద్దులో' ఉన్న అని అర్థము చెప్పవచ్చును.

ఇచ్చట రాజును స్తుతించు సందర్భమున ప్రయోగించిన "దేవో జానాతి సర్వం యదపి చ తదపి" అనుదానిలోని 'యదపి' 'తదపి' అనునవి సంబంధము కల పదములు కావు. (దేనిని తెలుసుకొనుచున్నాడో దానిని అను విధమున సంబద్ధపదములు కావు) అందుచే వాటి మధ్య ప్రయోగించిన 'చ' అను నిపాతము నిరర్థక మైనది. గొప్ప ఉత్సవములో జరుగుచున్న విందులోని బహుజన పంక్తిలో పిలవకుండగనే వచ్చి కూర్చున్న ఒక అజ్ఞాతవ్యక్తి, అందరికి తెలిసిపోయినతోడనే సిగ్గు పడునట్లు ఉన్నది ఇక్కడ ఈ నిపాతము వచ్చి కూర్చుండుట!

## 14. కాలౌచిత్యమ్.

కాలౌచిత్యం దర్శయితుమాహ—

కాలౌచిత్యేన యాత్యేవ వాక్యమర్థేన చారుతామ్
జనావర్జనరమ్యేణ వేషేణేవ సతాం వపుః. 26

కాలౌచిత్యప్రయుక్తేనార్థేన వాక్యం చారుతామేతి వేషపరిగ్రహేణేవ కాలయోగ్యేన సతామవసరజ్ఞానాం వపుః.

కాలౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు—

"కాలౌచిత్యముతో కూడిన అర్థముచేత వాక్యము, జనులను ఆవర్జించుటచే రమ్యమైన వేషముచేత సత్పురుషుల శరీరము వలె ప్రకాశించును".

సమయ మెరిగి మసలుకొను సత్పురుషుల శరీరము కాలమునకు తగిన వేషగ్రహణముచేత వలె, వాక్యము కాలముచే ఏర్పడిన ఔచిత్యముతో కూడిన అర్థముచే సౌందర్యమును పొందును.

యథా మమ మునిమతమీమాంసాయామ్—

76. యోఽభూద్గోపశిశుః పయోదధి శిరశ్చోరః కరీషంకష
స్తస్యైవాద్య జగత్పతే ఖగపతే శౌరే మురారే హరే.
శ్రీవత్సాఙ్క జనార్దనేతి స్తుతిపదైః కర్ణౌ నృణాం పూరితౌ
హా కాలస్య విపర్యయ ప్రణయినీ పాకక్రియాశ్చర్యభూః.

అత్ర అమర్షవిషవిషమా విష్కారముమూర్ఛనా శిశు పాలేనాభిధీయమానే యత్ కిల గోపాలబాలః పయోదధిశిరశ్చోరః కరీషంకషోఽభూత్ తస్యైవాద్య జగన్నాథాదిభిః స్తుతిపదైర్నృణాం కర్ణౌ పూరితౌ, హా బత కాలస్య విపర్యయకారిణీ పాకక్రియా శ్చర్యభూమిరితి, తత్రా భూదితి భూతకాలేన ఆశ్చర్యపరిపోషరుచిరమార బ్ధాధిక్షేప లక్షణం వాక్యౌచిత్యం కృతమ్.

వ్యా. నా మునిమత మీమాంసలో ఉదాహరణ మెట్లనగా—

"ఏ గొల్లపిల్లవాడు పాలు, పెరుగు, వెన్న అపహరించుచు, పేడ మోయుచు ఉండేవాడో ఆతనినే స్తుతించుచు పలకబడుచున్న జగత్పతే! ఖగపతే! శౌరే! మురారే! హరే! శ్రీవత్సాంక!, అను పదములచేత ఈనాడు జనుల చెవులు మూర్ఖులచేత నింపివేయబడుచున్నవి. అహో! విపర్యయమును కలిగించే (తలక్రిందులుగచేసే) కాలముయొక్క పరిపాకము ఎంత ఆశ్చర్యకర మైనది!"

ఇచట-అమర్ష మనెడు విషమును విషమరీతిలో ఆవిష్కరించుట ద్వారా మరణించదలచిన శిశుపాలుడు ఇట్లనుచున్నాడు. ఏ గోపాలబాలకుడు పాలు, పెరుగు, వెన్నదొంగిలించుచు పేడ మోసికొనుచు ఉండెడివాడో ఆతనినే స్తుతించుచు పలికిన "జగన్నాథ" వంటి పదములచే మనుష్యుల చెవులు నింపబడుచున్నవి. ఆహా! ఇంతటి విపరీతపరిణామములను కలిగించు కాలము యొక్క పాకక్రియ ఎంత ఆశ్చర్యకర మైనది." "అభూత్" అను భూతకాల ప్రయోగముచే ఆరంభించిన అధిక్షేపమునకు లక్షణమైన వాక్యౌచిత్యము ఆశ్చర్యపరిపుష్టిచే రుచిర మైనదిగా చేయబడినది.

యథా వా మాలవకువలయస్య—

చ్యుతసుమనసః కున్దాః పుష్పోద్గమైరలసా ద్రుమా
మనసి చ గిరం గృహ్ణన్తీమే కిరన్తి న కోకిలాః,
అథ చ సవితుః శీతోల్లాసం లునన్తి మరీచయో
న చ జరఠతామాలమ్బన్తే క్లమోదయదాయినీమ్.

అత్ర శిశుతరవసన్తకాన్తోపవన నవరసోల్లాస సూచ్యమాన మనసిజోత్కణ్ఠావర్ణనాయామ్ ఋతుసన్ధిసముచితాః కున్దాః కుసుమావసానశూన్యతనవః, కింశుకాశోకాః కలికోద్గమభరాలసాః, మనసి కోకిలాః కలకూజితాని అనుసన్దధతి; రవేర్మరీచయః శీతోల్లాస మథ చ నివారయన్తి, న చ సన్తాపదాయినీం ప్రౌఢతామాలమ్బన్తే ఇత్యుక్తే వర్తమానకాలపదేష్వేవ హృదయసంవాదసున్దరమౌచిత్యం కిమపి మోదతే.

మరియొక ఉదాహరణము మాలవకువలయునిది ఎట్లనగా—

"కుందలతలు (మొల్లలు) పుష్పశూన్యముగా ఉన్నవి. వృక్షములు పుష్పాల ఆవిర్భావముచే బరువెక్కినవి, ఈ కోకిలలు మనస్సులో ధ్వనిని గ్రహించి

నను పైకి వ్యక్తీకరించుట లేదు. మరియు సూర్యుని కిరణములు చలిని తగ్గించుచున్నవి. కాని అలసటను కలిగించు తీవ్రత్వమును ధరించుటలేదు."

ఇచట — ప్రారంభావస్థలో ఉన్న వసంతర్తువుచేత మనోహరమైన ఉద్యానముల నూతన రసముచే సూచింపబడుచున్న మన్మథోత్కంఠను వర్ణించు సందర్భమున "ఋతు సంధికి అనుగుణముగా కుందలతలు పుష్పములు పూయుట మానివేయుటచే అవి శూన్యములుగా ఉన్నవి; కింశుకాశోకాదివృక్షములు పుష్పములు బయలుదేరుటచే బరువెక్కియున్నవి. కోకిలలు మనస్సులో కూజితములను అనుసంధానము చేసికొనుచున్నవి; సూర్యకిరణములు చలిని తగ్గించుచున్నవి గాని సంతాపము కలిగించునంతగా తీక్ష్ణముగ లేవు; అని వర్తమాన పదములను ప్రయోగించుటలో హృదయ సంవాదముచే (హృదయమునకు హత్తుకొనుటచే) సుందరమైన ఒక విధమైన ఔచిత్యము పరిమళించుచున్నది.

యథా వా భట్టభల్లటస్య—

78. మృత్యోరాస్యమివాతతం ధనురిదం మూర్ఛద్విషాశ్చేషవః
శిక్షా సా విజితార్జునా ప్రతిలయం సర్వాఙ్గలగ్నా గతిః.
అన్తః క్రౌర్యమహో శరస్య మధురం హా హారి గీతం ముఖే
వ్యాధస్యాస్య యథా భవిష్యతి తథా మన్యే వనం నిర్మృగమ్.

అత్ర లుబ్ధకస్య ధనుః సాయకశిక్షాగతి క్రౌర్యగీతాని తథా యథా వనం నిర్మృగం భవిష్యతీతి భవిష్యత్కాలః ప్రకృతార్థ పరిపోషేణ హృదయసంవాదౌచిత్యమాదధాతి.

ఈ ధనస్సు తెరచుకొనిన మృత్యుదేవత ముఖము వలె నున్నది. బాణములు విషమును వెదజల్లుచున్నవి. శిక్ష (శస్త్రాభ్యాసము) అర్జునుని మించి ఉన్నది. ప్రతిలయమునందును (అడుగడుగున) వీని నడక అన్ని

అంగములను సంబంధించి ఉన్నది. శరుడైన ఈ వ్యాధుని హృదయములో క్రూరత్వము ఉన్నది. ముఖమునందు మాత్రము మనోహరమైన గానము లేళ్ళను ఆవర్జించుటకు ఉన్నది. ఇదంతయు చూడగా వనము మృగశూన్యము కాగల దని తలచెదను."

"యుద్ధకుని ధనస్సు, బాణములు శిక్ష, గతి, క్రూరత్వము, గీతము ఇవన్నియు ఎట్లున్నవనగా, వనము మృగశూన్యము కాగలదు"—అని భవిష్యత్కాలప్రయోగము ప్రకృతార్థమునకు పుష్టి చేకూర్చుటచే హృదయ సంవాదౌచిత్యమును కలిగించుచున్నది. (మూడు కాలములకు మూడు ఉదాహరణములు చూపబడినవి).

న తు యథా వరాహమిహిరస్య—

79. క్షీణశ్చన్ద్రో విశతి తరణేర్మణ్డలం మాసి మాసి
లబ్ధ్వా కాంచిత్ పునరపి కలాం దూరదూరానువర్తీ.
సమ్పూర్ణశ్చేత్ కథమపి తదా స్పర్ధయోదేతి భానో
ర్నో దార్జన్యాద్విరమతి జడో నాపి దైన్యాద్ వ్యరంసీత్.

అత్ర రవేర్మణ్డలం క్షీణః శశీ ప్రతిమాసం ప్రవిశతి తతః కాంచిదాప్యాయికాం కలాం ప్రాప్య దూరే దూరే భవతి, పరిపూర్ణశ్చ తస్యైవ స్పర్ధయాభ్యుదేతి. దార్జన్యాత్ న విరమతి, న చ దైన్యాద్ వ్యరంసీత్ ఇతి, ఏతౌ 'విరమతి' 'వ్యరంసీత్' ఇతి పరస్పరాసంగతం కాలపదద్వయం చన్ద్రస్య సదృశయోః దార్జన్యదైన్యయోః సర్వకాలమభినిర్వృత్తయోః యదుపన్యస్తం త వ్యరంసీత్ తత్ ఇతి విరుద్ధార్థత్వాదనుచితమేవ.

కాని వరాహమిహిరుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు—

"క్షీణుడైన (ధనము కోల్పోయిన అని మరియొకఅర్థము) చంద్రుడు.

ప్రతిమాసమునందును సూర్యమండలమును ప్రవేశించును. మరల ఏదో ఒక కలను (స్వల్పధన మని మరియొక అర్థము) పొంది దూరదూరముగా (సూర్యుని) అనుసరించును. ఏదియో విధముగ సంపూర్ణుడైనచో అపుడు సూర్యునితో స్పర్థ చేయుచు (పోటీపడుచు) ఉదయించును. (సూర్యుడస్తమించు సమయమున తాను ఉదయించును.) ఈజడుడు (జడస్వభావంగల దుష్టుడు, చల్లనివాడు అని రెండర్థములు) దౌర్జన్యము నుంచి విరమించడు; దైన్యమునుండికూడ విరమించలేదు"

"చంద్రుడు క్షీణించినపుడు ప్రతిమాసమునందును సూర్య మండలమును ప్రవేశించును. వానినుంచి ఒక ఆప్యాయిక కళను (తృప్తిని కలిగించు లేదా నింపు కళను) పొంది దూరదూరముగా తిరుగును. పరిపూర్ణుడై ఆ సూర్యునికే పోటీగా ఉదయించును. ఈ విధముగ దౌర్జన్యమునుంచి విరమించుటలేదు". అని చెప్పిన ఈ వాక్యమునందు "విరమతి" (వర్తమాన కాలక్రియ) "వ్యరంసీత్" (భూతకాలక్రియ) అను పరస్పర విరుద్ధకాలములను బోధించు పదద్వయము ప్రయోగింపబడినది. చంద్రుని దౌర్జన్య దైన్యములు సర్వకాలములందును కొనసాగుచునే ఉండగా 'వ్యరంసీత్' అను భూతకాలప్రయోగము విరుద్ధార్థబోధకమగుటచే అనుచితమే. (ఇచట క్షేమేంద్రుని వాక్యనిర్మాణము విసంష్ఠులముగ ఉన్నది. పాఠలోపమేదైన ఉండవచ్చును).

## 15. దేశౌచిత్యమ్.

దేశౌచిత్యం దర్శయితు మాహ—
దేశౌచిత్యేన కావ్యార్థః ససంవాదేన శోభతే
పరం పరిచయాశంసీ వ్యవహారః సతామివ.

దేశవిషయౌచిత్యేన హృదయసంవాదినా కావ్యార్థః సతాం వ్యవహార ఇవ పరిచయసూచకః శోభతే. యథా భట్టభవభూతేః—

దేశౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు—

"సంవాదముతో కూడిన దేశౌచిత్యముచేత, కావ్యార్థ పరిచయము సంవాదముతో కూడిన దేశౌచిత్యముచేత పరిచయమును సూచించు, సత్పురుషుల వ్యవహారము వలె ఎక్కువ ప్రకాశించును."

హృదయసంవాది యైన దేశ విషయకమగు ఔచిత్యము చేత, కావ్యార్థము, పరిచయ సూచకమగు సత్పురుషుల వ్యవహారము వలె (లేదా సత్పురుషులవ్యవహారము వలె పరిచయసూచకమై) శోభించును.

వి. సంవాద మనగా హృదయమునకు సరిగా (అంగీకారయోగ్యముగా) ఉండుట. దేశానుగుణముగ వర్ణించినచో, వర్ణింపబడుచున్న దేశముతో కవికి పరిచయమున్నట్లు తెలియును. సత్పురుషుల వ్యవహారము కూడ దేశానుకూలముగ నుండి పరిచయమును సూచించును.

ఉదాహరణమునకు భట్టభవభూతి శ్లోక మెట్లనగా—

80. పురా యత్ర స్రోతః పులినమధునా తత్ర సరితాం
విపర్యాసం యాతో ఘనవిరలభావః క్షితిరుహామ్.
బహోర్దృష్టం కాలాదపరమివ మన్యే వనమిదం
నివేశః శైలానాం తదిదమితి బుద్ధిం ద్రఢయతి (ఉ.రా. 2.27

అత్ర బహుభిర్వర్షసహస్రైరతిక్రాన్తైః శమ్బూకవధప్రసఙ్గేన దణ్డకారణ్యం రామః పూర్వపరిచితం పునః ప్రవిష్టః సమన్తాదవలోక్య ఏవం బ్రూతే "పురా యత్ర నదీనాం ప్రవాహస్తత్రేదానీం తటమ్, వృక్షాణాం ఘనవిరలత్వే విపర్యయశ్చిరాద్దృష్టం వనమిదమపూర్వమివ మన్యేపర్వతసన్నివేశస్తు తదేవైతదితి బుద్ధిం స్థిరీకరోతి" ఇత్యుక్తే చిరకాలవిపర్యయ పరివృత్త సంస్థానకాననవర్ణనయా హృదయ సంవాదీ దేశస్వభావః పరమౌచిత్యం ప్రద్యోతయతి.

"పూర్వము నదీప్రవాహ మున్న చోట ఇపుడు ఇసుక తిన్నె ఉన్నది.

వృక్షములు దట్టముగాను, పల్చగాను ఉండుటలో మార్పు వచ్చినది. చాల కాలము తరవాత చూడబడిన ఈ వనము మరియొక వనమా అన్నట్లున్నది. కాని పర్వతముల స్థితి మాత్రము ఆ వనమే ఇది అను బుద్ధిని దృఢీకరించు చున్నది."

అనేకవర్షసహస్రములు గడచిన పిమ్మట శ్రీరాముడు శంబూకవధ ప్రసంగముచే పూర్వ పరిచిత మైన దండకారణ్యమును ప్రవేశించి, నలు మూలల పరికించి, ఇట్లనుచున్నాడు- "పూర్వము నదీప్రవాహ మున్న చోట ఇపుడు ఇసుక తిన్నెలు ఏర్పడినవి. వృక్షముల ఘనత్వవిరలత్వములలో మార్పు వచ్చినది. చిరకాలమునకు చూచిన ఈ వనము క్రొత్తదని అను కొనుచున్నాను. కాని పర్వతముల సంనివేశము (స్థితి) ఇది ఆదియే అన్న బుద్ధిని స్థిరముచేయుచున్నది." ఈ విధముగ చాల కాలము గడచిపోవుటచే మారిపోయిన సంస్థానము (వస్తువుల స్థితి) గల కాననమును వర్ణించుటచే హృదయ సంవాది యైన దేశస్వభావము ఎక్కువ ఔచిత్యమును ప్రకాశింప చేయుచున్నది.

న తు యథా రాజశేఖరస్య—

81. కర్ణాటీదశనాఙ్కితః శితమహారాష్ట్రీకటాక్షాహతః
ప్రౌఢాన్ధ్రీస్తనపీడితః ప్రణయినీ భ్రూభఙ్గవిత్రాసితః ।
లాటీ బాహువివేష్టితశ్చ మలయస్త్రీతర్జనీ తర్జితః
సోఽయం సంప్రతి రాజశేఖరకవిర్వారాణసీం వాఞ్ఛతి ॥

అత్ర కర్ణాటమహారాష్ట్రాన్ధ్రలాటమలయలలనాసంభోగసుభగః కాలేన గలితరాగమోహః సంప్రతి రాజశేఖరకవిః వారాణసీం గన్తుమిచ్ఛతీత్యుక్తే శృఙ్గారరసతరఙ్గితవరాఙ్గనాప్రసఙ్గేఽనఙ్గనిరర్గల దక్షిణాపథదేశోద్దేశమధ్యే ప్రణయినీభ్రూభఙ్గ విత్రాసిత ఇతి దేశోపలక్షణవిరహితకేవలప్రణయినీపదేన దేశౌచిత్యముపచితమప్యను చితతాం నీతమ్.

కాని రాజశేఖరుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"కర్ణాటకామినుల దంతములచే చిహ్నితుడును, మహారాష్ట్రమహిళల వాడియైన క్రీకంటిచూపులచే గ్రుచ్చబడినవాడును, ప్రౌఢలైన ఆంధ్రదేశ యువతుల స్తనములచే పీడింపబడినవాడును, ప్రియురాండ్ర కనుబొమ్మల విరుపుచే భయపెట్టబడినవాడును, లాటదేశ యువతుల బాహువులచే చుట్టబడిన వాడును, మలయప్రాంతీయస్త్రీల తర్జనులచే (చూపుడు వ్రేలు. దాని అసలు అర్థము జడిపించు వ్రేలు అని) జడిపించబడినవాడును అగు ఆ రాజశేఖర కవి ఈ నాడు వారాణసీనివాసమును కోరుచున్నాడు".

కర్ణాట-మహారాష్ట్ర-ఆంధ్ర-లాట-మలయప్రాంతీయ యువతుల సంభోగ భాగ్యమును పొందిన రాజశేఖరకవి కాలక్రమమున రాగమోహము లుడిగి పోవుటతో, ఇపు డిక వారణాసికి పోవలెనని కోరుచున్నాడు అని చెప్పు ఈ సందర్భమున శృంగారరసతరంగితవరాంగనలను గూర్చి చెప్పుచు, నిర్దే శించిన, మన్మథవ్యాపారమున అడ్డు లేని దక్షిణాపథమునకు చెందిన దేశముల పేర్ల మధ్య "పణయినీ భ్రూభఙ్గవిత్రాసిత;" అని, దేశము పేరేదియు చెప్ప కుండగా కేవలప్రణయినీపదమును ప్రయోగించుటచే, అంతవరకును పెంపొం దిన దేశౌచిత్యమునకు అనుచితత్వము ఏర్పడినది.

వి. "ప్రణయినీభ్రూభఙ్గవిత్రాసితః" అనుటకుబదులు మరి యొక దేశము పేరేదైనచెప్పి, అచటి స్త్రీల భ్రూభంగముచే భయపెట్టబడినవాడు అని చెప్పినచో దేశౌచిత్యము బాగుండెడిది అని భావము.

## 16. కులౌచిత్యమ్

కులౌచిత్యం దర్శయితు మాహ—

కులోపచితమౌచిత్యం విశేషోత్కర్షకారణమ్

కావ్యస్య పురుషస్యేవ ప్రియం ప్రాయః సచేతసామ్. 28.

పురుషస్యేవ కావ్యస్య కులోన్నతమౌచిత్యం సవిశేషోత్కర్ష జనకం ప్రాయేణ బాహుల్యేన సహృదయానామభిమతమ్.

కులౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు.

"పురుషునకు వలె, కావ్యమునకు విశేషోత్కర్షను కలిగించుటకు కారణ మైన కులముచే కలిగింపబడిన ఔచిత్యము, సాధారణముగా సహృదయులకు ప్రియ మగును."

కులోన్నత మైన ఔచిత్యము. పురుషునకు వలె కావ్యమునకు అతి విశిష్ట మైన ఉత్కర్షను కలిగించుచు, చాలవరకు. సహృదయులకు ప్రియ ముగా నుండును.

యథా కాలిదాసస్య—

82. అథ స విషయవ్యావృత్తాత్మా యథావిధి సూనవే
నృపతికకుదం దత్త్వా యూనే సితాతపవారణమ్,
మునివనతరుచ్ఛాయాం దేవ్యా తయా సహ శిశ్రియే
గలితవయసామిక్ష్వాకూణామిదం హి కులవ్రతమ్

(రఘు. 3–70)

అత్ర "స రాజా వృద్ధస్తరుణాయ సూనవే రాజ్యం ప్రతిపాద్య తయా దేవ్యా సహ తపోవనం భేజే. విరక్తచేతసామిక్ష్వాకూణా మాస్తే హి కులవ్రతమిదమేవ" ఇత్యుక్తే భూతవర్తమానభావినాం తద్వంశ్యానామౌచిత్యమున్మీలితమ్.

ఉదాహరణమునకు కాళిదాసుని శ్లోక మెట్లనగా—

"పిమ్మట ఆదిలీపమహారాజు, యువకు డైన కుమారునకు రాజచిహ్న మైన శ్వేతచ్ఛత్రమును యథాశాస్త్రముగా ఇచ్చి, ఆ సుదక్షిణాదేవితో కూడ తపోవనములలోని వృక్షముల చ్ఛాయను ఆశ్రయించెను. వయస్సు గడచిన ఇక్ష్వాకువంశరాజులు ఆచరించు కులవ్రత మిదియే కదా."

ఇచట— "వృద్ధు డైన ఆ రాజు, యువకుడైన కుమారునకు రాజ్యము

నిచ్చి ఆ దేవితో కూడ తపోవనమును చేరెను; విరక్త మైన మనస్సు గల ఇక్ష్వాకువంశరాజులు చివరకు అనుసరించు కులవ్రతము ఇదియే కదా?" అని చెప్పుటలో భూతవర్తమానభవిష్యత్కాలములకు చెందిన ఆ ఇక్ష్వాకువంశ రాజుల ఔచిత్యము ప్రకాశిత మగుచున్నది.

న తు యథా యశోవర్మదేవస్య—

83. ఉత్పత్తిర్భణ్డకులే యదభీష్టం తత్పదం సమాక్రాన్తమ్
భోగాస్తథాపి దైవాత్ సకృదపి భోక్తుం న లభ్యన్తే.

అత్ర మమోత్పత్తిర్భణ్డకులే, సమీహితపదాక్రమణం చ నిష్పన్నమ్. తథాపి దైవార్పితప్రియావిప్రయోగాద్ భోగా భోక్తుం న లభ్యన్తే ఇత్యభిహితే స్వసంవేద్యమేవ భణ్డకులమన్యత్రా ప్రసిద్ధం స్వయమేవ నిర్దిశ్యమానముత్కర్షవిశేషణవిరహితకేవలపదో పాదానేన నిరర్థకతయా నిరౌచిత్యమేవ, ఇక్ష్వాకుకులస్య తు నిర్విశేష ణత్వముపపద్యత ఏవ త్రిభువనప్రసిద్ధౌచిత్యచరిత్రత్వాత్.

కాని యశోవర్మదేవుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"పుట్టినది భండకులములో. ఇష్టమైన పదవి పొందబడినది ఐనను, భోగములు ఒక్కమారైనను అనుభవించుటకు కుదురుట లేదు."

ఇచట- నేను భండకులంలో పుట్టినాను. కావలెననుకొన్న పదవి లభించినది ఐనను, దైవవశముచే కలిగిన ప్రియావియోగమువలన, భోగా లను అనుభవించుటకు కుదురుట లేదు" అని చెప్పబడినది. భండకులమును గూర్చి తనకు తప్ప ఇతరుల కెవ్వరికిని తెలియదు. ఆ కులమునకు సంబం ధించిన ఉత్కర్షను చెప్పగలిగిన విశేషణపద మేదియు ప్రయోగించలేదు. అందుచే విశేషణరహిత మగు ఈ భండపదము నిరర్థకము; అనుచితము.

ఇక్ష్వాకుకులచరిత్ర త్రిభువనప్రసిద్ధ మగుటచే విశేషణ మేదియు ప్రయోగింపక పోయినను యుక్తమే.

## 17. వ్రతౌచిత్యమ్

వ్రతౌచిత్యం దర్శయితుమాహ—

కావ్యార్థః సాధువాదార్హః సద్వ్రతౌచిత్యగౌరవాత్
సన్తోషనిర్భరం భక్త్యా కరోతి జనమానసమ్. 29

కావ్యార్థః సముచితవ్రతగౌరవాత్ సాధువాదయోగ్యః సన్తోష పూర్ణం జనమనః కరోతి. భక్తిః విచ్ఛిత్తిః.

వ్రతౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు—

"మంచి వ్రతౌచిత్యముయొక్క గౌరవమువలన కావ్యార్థము సాధువాదమునకు ('బాగున్నది' అను మాటకు) తగినదై, సౌందర్యముచే, జనుల మనస్సును సంతోషపూర్ణమును చేయును"

కావ్యార్థము, తగిన వ్రతగౌరవమువలన, సాధువాదమునకు తగినదై, జనుల మనస్సును సంతోషముతో నింపును. 'భక్తి' అనగా విచ్ఛిత్తి (సౌందర్యము).

యథా మమ ముక్తావలీకావ్యే—

84\. అత్ర వల్కలజుషః పలాశినః
పుష్పరేణుభరభస్మభూషితాః
లోలభృఙ్గవలయాక్షమాలికాః
తాపసా ఇవ విభాన్తి పాదపాః.

అత్ర తపోధనోచితవ్రతవ్యఞ్జకవల్కల భస్మాక్షసూత్రప్రణయి

పాదపవర్ణనాయామచేతనానామపి శమసమయవిమలచిత్తవృత్తిః ఔచిత్యముపజపయతి

ఉదాహరణముగా నా ముక్తావలీకావ్యములోని శ్లోక మెట్లనగా—

"వల్కలములను (బెరడు, నారచీర అని రెండర్థములు) ధరించినవి, పలాశములు (పలాశవృక్షములు, పలాశసమిధలు లేదా దండములు) కలవి, పుష్పపరాగముల ధార మనెడు భస్మముచే పూయబడినవి, చంచల మైన తుమ్మెదల వలయములే జపమాలగా కలవి అయిన వృక్షములు తాపసుల వలె ప్రకాశించుచున్నవి."

ఇచట- తపోధనులకు ఉచితమైన వ్రతమును త్యజింపచేయు వల్కలములందును భస్మమునందును, అక్షసూత్రమునందును ప్రణయముగల వృక్షములను వర్ణించునపుడు అచేతనము లగు వృక్షములకు కూడ శమసమయమున నిర్మల మగు చిత్తవృత్తి యున్నట్లు చెప్పుట ఔచిత్యమును కలిగించుచున్నది

న తు యథా దీపకస్య—

85. పుష్ట్యై గ్రామే వనే వా మహతి సితపటచ్ఛన్నపాలీకపాలీమాదాయ న్యాయగర్భద్విజహుతహుతభుగ్ధూమధూమ్రోపకణ్ఠమ్. ద్వారం ద్వారం ప్రవృత్తో వరముదరదరీపూరణాయ క్షుధార్తో మానీ ప్రాణీ సనాథో న పునరనుదినం తుల్యకుల్యేషు దీనః.

అత్ర వైరాగ్యనిరర్గలవర్ణనాయాం భిక్షాకపాలీమాదాయ క్షుత్క్షామః కుక్షిపూరణాయ ప్రవృత్తో మానీ వరం, ద్వారం ద్వారం యష్టినివిష్టపాణిః పరిభ్రాన్తో న పునరనిశం తుల్యకుల్యేషు దీన ఇత్యుక్తే సహజప్రశమవిమలమానసవిశ్రాన్తిసన్తోషముత్సృజ్య తుల్యకుల్యద్వేషవిజిగీషాపరమేవ వాక్యం భృశమనౌచిత్యముద్భావయతి.

వరమేతేత్ తీవ్రతరకష్టం న తు స్వజనదైన్యయాచనమితి సంసార గ్రస్థిబన్ధాభిమానోపన్యాసః.

కాని దీపకుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"ఆత్మాభిమానము కలవాడు, ఆకలితో బాధపడుచున్నప్పుడు, పుణ్య మైన గ్రామమునందుగాని, పెద్ద వనము నందు గాని, తెల్లని బట్టచే కప్ప బడిన అంచులు గల కపాలమును చేతిలో ధరించి, న్యాయము గర్భమునందు గల (ధర్మప్రవర్తనగల) ద్విజులు హోమము చేయగా ఆ ధూమముచే ధూమ్ర వర్ణ మైన సమీపప్రాంతము గల ప్రతీద్వారమువద్దకును తిరిగి తన పొట్ట నింపుకొనుట మంచిది కాని, ఎవరో పోషించే వాడున్నను, సమాన కులము నకు చెందినవారి మధ్య దీనుడై జీవించుట తగినదికాదు."

వైరాగ్యమును నిరర్గలముగా వర్ణించు ఈ ఘట్టమున, ఆకలితో బాధ పడుచు పొట్టనింపుకొనుటకై ఉద్యుక్తుడైన మానవంతుడు భిక్షాకపాలమును ధరించి, దండమును చేత బట్టుకొని, ప్రతిగుమ్మమువద్దను తిరుగుట మంచిది కాని తనవారిలో దీనుడుగా ఉండుట మంచిది కాదు అని చెప్పబడుచున్నది. కాని ఈ వాక్యము సహజమైన ప్రశమముచేత నిర్మలమైన మనస్సుయొక్క విశ్రాంతి సంతోషమును చెప్పుటకు బదులు, తన కులమువారి యెడ ద్వేష ముచే దానిని తప్పించుకొను ప్రయత్నమును మాత్రమే బోధించుచున్నది. గాన ఎక్కువ అనౌచిత్యమును కలిగించుచున్నది. దైన్యముతో స్వజనమును యాచించుటకు బదులు ఈ తీవ్రకష్టమును అనుభవించుటయే మంచిది అని చెప్పుటలో సాంసారిక బంధముచే అభిమానమునే ప్రకటించి నట్లైనది. (కాని వైరాగ్యము దృఢీకరించినట్లు కాదు అని భావము. అందుచే ఈత డవలం బించదలచిన వ్రతములో ఔచిత్యమేమియు లేదు గాన ఇది వ్రతానౌచిత్యమున కుదాహరణము).

## 18. తత్త్వౌచిత్యమ్

తత్త్వౌచిత్యం దర్శయితుమాహ—

కావ్యం హృదయసంవాది సత్యప్రత్యయనిశ్చయాత్
తత్త్వోచితాభిధానేన యాత్యుపాదేయతాం కవేః ॥ 30

తత్త్వోచితాఖ్యానేన కవేః సూక్తం సత్యప్రత్యయస్థైర్యాత్ సంవాది గ్రాహ్యతాం యాతి.

తత్త్వౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు—

"తత్త్వమునకు (యథార్థస్థితికి) ఉచితమైన రీతిలో చెప్పుటచే, సత్యమనే నిశ్చయజ్ఞానమువలన. కవియొక్క కావ్యము హృదయమునకు నచ్చినదై ఉపాదేయ మగును.

తత్త్వమునకు ఉచితముగ చెప్పుటచే కవియొక్క సూక్తము (కావ్యము) సత్య మనెడు జ్ఞానము స్థిర మగుట వలన, హృదయసంవాదియై గ్రాహ్యముగ ఉండును.

యథా మమ బౌద్ధావదానలతికాయామ్—

85. దివి భువి ఫణిలోకే శైశవే యౌవనే వా
జరసి నిధనకాలే గర్భశయ్యాశ్రయే వా
సహగమనసహిష్ణోః సర్వథా దేహభాజాం
న హి భవతి వినాశః కర్మణః ప్రాక్తనస్య.

ప్రాక్తనస్య కర్మణః త్రైలోక్యే, శైశవయౌవనవృద్ధత్వావస్థాసు దేహినాం సహగమనే సమర్థత్వాత్ న వినాశోఽస్తి ఇత్యుక్తే నిఃసంశయసకలజనహృదయ సంవాదితత్త్వాఖ్యానమౌచిత్యం ఖ్యాపయతి.

నా బౌద్ధావదానలతికలో ఎట్లనగా—

ప్రాణుల పూర్వజన్మసంచిత మైన కర్మ స్వర్గములో కాని, భూలోకములో

కాని పాతాళములో కాని, బాల్యములో కాని, యౌవనములో కాని, వార్ధకములో కాని, మరణసమయములో కాని, గర్భశయ్యలో ఉన్నప్పుడు గాని సహాగమనముచేయ (అనుసరింప) సమర్థమైనది. అట్టి కర్మ ఏ విధముననైనను నశించదు".

ఇచట—పూర్వజన్మలో చేసిన కర్మ మూడు లోకములలో కాని, శైశవ యౌవనవృద్ధావస్థలలో కాని ప్రాణులను వెన్నంటుచునే ఉండుటకు సమర్థమైనది. దానికి (అనుభవించవలసినదే కాని) వినాశము లేదు అని చెప్పుట సకలమానవుల హృదయములకును నిస్సంశయముగా అంగీకారయోగ్యమైన తత్త్వమును ప్రతిపాదించుచు ఔచిత్యము కలదిగ ఉన్నది.

న తు యథా మాఘస్య—

87. బుభుక్షితైర్వ్యాకరణం న భుజ్యతే.
పిపాసితైః కావ్యరసో న పీయతే.
న విద్యయా కేంచిదుద్ధృతం కులం
హిరణ్యమేవార్జయ నిష్ఫలాః కలాః.

అత్ర అర్థార్థితాపరత్వేన ధనమేవార్జయ, క్షుధితైర్వ్యాకరణం న భుజ్యతే, న కావ్యరసః పిపాసితైః పీయతే; న విద్యయా కులం కేన చిదుద్ధృతమిత్యుక్తే సర్వమేతద్దారిద్ర్యదైన్యవిద్రుతద్దైర్యకాతరతయా తత్త్వవిరహితం విపరీతము పన్యస్తమ్. అనౌచిత్యం సువ్యక్తమేవ. విద్యానామేవ సర్వసంపత్ప్రసవినీనాం కులోద్ధరణక్షమత్వ నాన్యస్య.

కాని మాఘుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు—

"ఆకలికొన్నవారు వ్యాకరణము తినరు. దప్పికొన్నవారు కావ్యరసమును త్రాగరు విద్యచేత ఎవ్వరును కులమును ఉద్ధరించలేదు. బంగారమునే

సంపాదించుము. కళలన్నియు వ్యర్థములు".

ఇచట—ధనసంపాదనమే ఉత్తమము అని చెప్పుచు, "ఆకలిగొన్న వారు వ్యాకరణమును తినరు; దప్పికొన్నవారు కావ్యరసమును త్రాగరు విద్యచేత కులమును ఉద్ధరించినవారెవరును లేరు ధనమునే సంపాదించుము' అని చేయు ఈ బోధ అంతయు దారిద్ర్యమువలన కలిగిన దైన్యముచే ధైర్యము తొలగిపోయిన పిరికివానిచే చేయబడినది. తత్త్వశూన్య మైనది. విపరీతమైనది అందుచేత అనౌచిత్యము స్పష్టమే కులమును ఉద్ధరించు శక్తి సర్వసంపదలను ఇవ్వగలిగిన విద్యలకు మాత్రమే ఉన్నది

## 19. సత్త్వౌచిత్యమ్

సత్త్వౌచిత్యం దర్శయితుమాహ—

చమత్కారం కరోత్యేవ వచః సత్త్వోచితం కవేః
విచారరుచిరోదారచరితం సుమతేరివ. 31

సత్త్వోచితం కవేర్వచశ్చమత్కారం కరోతి సుమతేరివ విచార్యమాణం రుచిరముదారచరితమ్.

సత్త్వౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు—

"సత్త్వమునకు తగిన విధముగా ఉన్న కవియొక్క వాక్కు, బుద్ధి మంతుని యొక్క ఆలోచనచే అందమైన ఉదారచరితము వలె. చమత్కార మును కలిగించును."

ఆలోచించినకొలది రుచిరముగా ఉండు బుద్ధిమంతుని ఉదారచరితము వలె సత్త్వోచితమైన కవివాక్కు చమత్కారమును కలిగించును.

వి. సత్త్వ మనగా ఎట్టి పరిస్థితులందును చలించని స్థైర్యము.

యథా మమ చిత్రభారతే నాటకే—

88. నదీవృన్దోద్దామ ప్రసరసలిలాపూరితతనుః
స్ఫురత్స్ఫీతజ్వాలా నిబిడ బడబాగ్నిక్షతజలః.
న దర్పం నో దైన్యం స్పృశతి బహుసత్త్వః పతిరపా
మవస్థానాం భేదాద్ భవతి వికృతిర్నైవ మహతామ్.

అత్ర పయోధివ్యపదేశేన యుధిష్ఠిరస్య సత్త్వోత్కర్షేఽభిధీయమానే సరిత్పూరప్రవర్ధితతనుర్వడబాగ్నినిష్పీతశ్చ, నోత్సేకం న సంకోచమబ్ధిర్విపులసత్త్వః స్పృశతి, న హ్యవస్థానాం భేదాన్మహాశయానాం వికారో భవతీత్యుక్తే గమ్భీరధీరా సత్త్వవృత్తిరౌచిత్యమాతనోతి.

నా చిత్రభారతనాటకములో ఎట్లనగా—

“అనేకనదుల జలసముదాయముచే నింపబడిన శరీరముగలవాడును, ప్రకాశించుచున్న. అతివిశాలమైనజ్వాలలతో నిండిన బడబాగ్నిచే త్రాగివేయ బడు జలముకలవాడునుఅగు గొప్ప శక్తిగల సముద్రుడు, గర్వమును కాని, దైన్యమును కాని పొందుటలేదు. అవస్థాభేదముచే మహాత్ములు వికారమును చెందరు.”

ఇచట సముద్ర మనెడు మిషచే యుధిష్ఠిరుని సర్వోత్కర్ష వర్ణించుటకై, నదీప్రవాహములచే వృద్ధిపొందించబడిన శరీరము కలదియు, బడబాగ్నిచే త్రాగివేయబడిన నీరు కలదియు అగు సముద్రము. అత్యధికసత్త్వము కలది కావున, గర్వపడుటలేదు; దైన్యము చెందుట లేదు; అవస్థలు మారినను మహాత్ములలో వికారము కలుగదు కదా అని చెప్పుటలో గంభీరమును ధీర మును అయిన సత్త్వవృత్తి ఔచిత్యమును పెంపొందించు చున్నది.

న తు యథా భట్టేన్దురాజస్య—

89. ఆశ్చర్యం వడవానలః స భగవానాశ్చర్యమమ్భోనిధి
ర్యత్కర్మాతిశయం విచిన్త్య మనసః కమ్పః సముత్పద్యతే.
ఏకస్యాశయఘస్మరస్య పిబతస్తృప్తిర్న జాతా జలై
రన్యస్యాపి మహాత్మనో న వపుషి స్వల్పోఽపి జాతః శ్రమః.

అత్ర వడవానల సముద్రయోః సత్త్వమహత్త్వే వక్ష్యమాణే అతివిపులాశయత్వాదేకస్య పిబతః పయోభిస్తృప్తిర్న జాతా, ద్వితీయస్య తదుపజీవ్యమానస్య న మనాగపి ఖేదః; తదేతదుభయమాశ్చర్యమిత్యుక్తే నిఃసన్తోషతయా సతతయాచకస్య న బడబాగ్నేః లజ్జా, న చ జలనిధేరాశ్రితైకార్థిపూరణసామర్థ్యమిత్యసత్త్వే సత్త్వస్తుతిః అనౌచిత్యమావహతి.

కాని భట్టేందురాజు శ్లోకముమాత్రము దాహరణముకాదు.

"బడబాగ్ని ఒక ఆశ్చర్యము. పూజ్యమైన ఆ సముద్రము (మరొక) ఆశ్చర్యము. ఈ రెండును చేయు పనుల అతిశయమును ఆలోచించగనే మనస్సులో కంపము బయలుదేరుతున్నది. గర్భములో నే ఉండి తినివేసే ఒకదానికి (బడబానలమునకు) ఎంతత్రాగినను జలములచేత తృప్తియే కలుగుట లేదు. రెండవ మహాత్మునికి (మహాశరీరముగల రెండవవానికి) శరీరములో స్వల్పమైనను శ్రమ కలుగుటలేదు."

ఇచట-బడబానలసముద్రముల సత్త్వమహత్త్వమును వర్ణించవలెననెడు అభిప్రాయముతో-అతివిశాలమైన గర్భము కలదగుటచే ఒకదానికి ఎన్ని నీళ్ళు త్రాగినను తృప్తి కలుగుటలేదు; దానిచే ఉపజీవ్యమాన మైన (ఒకరు జీవించుటకు ఆధారమైనది ఉపజీవ్యమానము) రెండవదానికి కొంచెమైనను ఖేదము లేదు. ఈ రెండును చాల ఆశ్చర్యకరము లైన విషయములు అని చెప్పబడుచున్నది. ఇట్లు చెప్పుటలో, సంతృప్తి లేకపోవుటచే ఎల్లప్పుడును యాచకుడుగనే ఉన్న బడబాగ్నికి సిగ్గు లేదు, తనను ఆశ్రయించిన

ఆ ఒక్క యాచకుని సంతృప్తిపరచు శక్తి సముద్రమునకు లేదు అని పర్యవ సించుటచే సత్త్వము లేని పరిస్థితులలో సత్త్వమున్నట్లు స్తుతించుట ఈ అనౌచిత్య మును కలిగించుచున్నది.

## 20. అభిప్రాయౌచిత్యమ్.

అభిప్రాయౌచిత్యం దర్శయితుమాహ—
అకదర్థనయా సూక్తమభిప్రాయసమర్పకమ్.
చిత్త మావర్జయత్యేవ సతాం స్వస్థమివార్జవమ్. 32.

అక్లేశేనాభిప్రాయసమర్పకం కావ్యం హృదయమావర్జయతి సజ్జనానాం నిర్మల మార్జవమివ.

అభిప్రాయౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు—

"శ్రమకలిగించకుండగా అభిప్రాయమును వ్యక్తము చేయు కావ్యము, నిశ్చలమైన సత్పురుషుల ఆర్జవము వలె, చిత్తమును ఆకర్షించితీరును."

క్లేశము లేకుండగ అభిప్రాయమును తెలుపు కావ్యము. సజ్జనులలో ఉండు నిర్మలమైన ఆర్జవము వలె, హృదయమును వశము చేసికొనును.

యథా దీపకస్య—

90. శ్యేనాక్షి త్రిగ్రహదారితోత్తరకరో జ్యాఘాతప్రకోష్ఠాన్తర
శ్యామాతామ్రాధరపాణిపాదనయనప్రాన్తః పృథూరస్స్థలః.
మన్యేఽయం ద్విజమధ్యగో నృపసుతః కోఽప్యత్ర నిఃశబ్దలః
పుత్త్రైవం యది కోష్ఠమేతు సుకృతైః ప్రాప్తో విశేషాశిభిః.

అత్ర స్వైరరమణీ రమణీయం దివసావసానే యువానం పథికమాలోక్య అభిప్రాయసూచకం జననీమేవం బ్రూతే—యదసౌ

రాజపుత్రాకృతిః, శ్యేనగ్రహనారాచ పరిచయోచితః, సాయం సమయే ప్రాప్తః ఇత్యుక్తే మాత్రాపి అభిప్రాయపూరక మభిహితమ్-పుత్రి యద్యేవం తత్కోష్ఠాభ్యంతరం ప్రవిశతు; సుకృతైర్విశేషాతిథిః ప్రాప్తః పూజ్యః ఇత్యనేన స్ఫుటాభిప్రాయసూచకమౌచిత్యముపచితం చకాస్తి.

ఉదాహరణముగా దీపకుని శ్లోకము ఎట్లనగా—

"తల్లీ డేగలను (వాటి) కాళ్ళతో పట్టుకొనుటచే చీల్చబడిన చేతి పై భాగము కలవాడును; నారి గుర్తులు గల ముంజేయి కలవాడును, ఎఱ్ఱని అధరము, హస్తములు పాదములు నేత్రాంతములు కలవాడును, విశాలమైన వక్షఃస్థలము కలవాడును. బ్రాహ్మణుల మధ్య నున్న ఈత డెవడో దారి బత్తెము లేని రాజ కుమారుడు వలె నున్నాడు. పుత్రీ! అటు లైనచో పుణ్యములచే లభించిన ఈ విశేషాతిథి గదిలోనికి వచ్చు గాక."

ఇచట—ఒక స్వైరిణి, సాయంకాలమున ఒక సుందరుడైన పాంథ యువకుని జూచి అభిప్రాయసూచకముగా తల్లితో ఇట్లు చెప్పుచున్నది.—"డేగలను పట్టుకొనుట నారాచబాణముల ప్రయోగము వంటి పనులు చేయుటకు అలవాటు పడినవాడును, రాజపుత్రాకారముగలవాడును అగు ఇతడెవడో సాయంసమయమున వచ్చినాడు." ఆ మాట విని తల్లి కూడ ఆమె అభిప్రాయమును పూరించునట్లు — "పుత్రీ! అట్లైనచో ఆతనిని గదిలోనికి ప్రవేశ పెట్టుము. పుణ్యములచే లభించిన విశేషాతిథిని పూజించవలెను" అని పల్కెను. ఈ విధముగా (ఆ ఇరువురి) అభిప్రాయములను స్పష్టముగ సూచించు విధమున ఔచిత్యము పెంపొంది ప్రకాశించుచున్నది.

న తు యథా అస్యైవ—

91. అయి విరహవిచిత్తే భర్తురర్థే తథార్తా
సపది నిపతితా త్వం పాదయోశ్చణ్డికాయాః,

స్వయముపహితె ధూపస్థాలకచ్ఛత్రశృఙ్గో
ద్దలితమపి లలాటం యేన నైవాలలక్షే.

అత్ర (అ) వినయవత్యాః సుచిరాత్ప్రత్యాగతే లలాటన ఖోల్లేఖాపహ్నవవచనే సఖ్యా సముపదిశ్యమానే, హే విరహోన్మత్తే, భర్తురర్థే చణ్డికాపాదపతనే స్వయంస్థాపితధూపస్థాలకకోటి క్షతమపి న లక్షితం భవత్యా లలాటమిత్యుక్త్యా స్వైరాపహ్నవశిక్షామాత్ర మేవోపలక్ష్యతే. న తు తస్యాః సఖ్యా వా కశ్చిదభిప్రాయవిశేషః.

కాని ఇతనిదే మరి యొక శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు.

"విరహముచే పని చేయకుండా ఉన్న మనస్సుకలదానా! భర్తకొరకై అంతగా బెంగపెట్టుకొనిన నీవు చండికాపాదములపై ఎట్లు పడితివనగా, నీవే ఉంచిన ధూపపాత్రయొక్క శిఖరము తగిలి చీలిపోయిన లలాటమును కూడ గుర్తించలేదు".

ఇచట — ఒక స్వైరిణియొక్క భర్త చాలాకాలము తరువాత వచ్చినపుడు ఆమె లలాటముపై ఉన్న గీరులను ఎట్లు కప్పిపుచ్చుకొనవలెనో ఉపదేశించుచు, సఖురాలు -"ఓ విరహోన్మత్తురాలా! భర్తకొరకై చండికకు పాదములపైబడి నమస్కారము చేయు సమయమున నీ లలాటమునకు, అచట నీవే ఉంచిన ధూపపాత్రశిఖరము తగిలిన విషయము కూడ నీవు గుర్తించలేదు" అని చెప్పుటలో స్వైరవిహారమును ఎట్లు కప్పిపుచ్చుకొనవలెనో నేర్పినట్లు మాత్రమే కనబడుచున్నది గాని, ఆ నాయిక యొక్క గాని, సఖురాలి యొక్క గాని అభిప్రాయవిశేష మేమియు తెలియుటలేదు"

## 21. స్వభావౌచిత్యమ్.

స్వభావౌచిత్యం దర్శయితు మాహ—

స్వభావౌచిత్యమాభాతి సూక్తీనాం చారుభూషణమ్
అకృత్రిమమసామాన్యం లావణ్యమివ యోషితామ్. 33.

స్వభావోచితత్వం కవివాచా మాభరణమాభాతి, అకృత్రిమనన్యసామాన్యం లావణ్యమివ లలనానామ్.

"కృత్రిమము కానిదియు, సామాన్యము కానిదియు అగు లావణ్యము స్త్రీలకు వలె, స్వభావౌచిత్యము, కావ్యములకు మంచిభూషణమై ప్రకాశించుచున్నది".

సహజమును, అనితరసాధారణమును అగు లావణ్యము స్త్రీలకు భూషణముగా నున్నట్లు స్వభావోచితత్వము కవివాక్కులకు ఆభరణమై ప్రకాశించుచున్నది.

యథా మమ మునిమతమీమాంసాయామ్—

92 కర్ణోత్తాలితకున్తలాన్తనిపతత్తోయక్షణాసఙ్గినా
హారేణేవ వృతస్తనీ పులకితా శీతేన సీత్కారిణీ.
నిర్ధౌతాఞ్జన శోణకోణనయనా స్నానావసానేఽఙ్గనా
ప్రస్యన్దత్కబరీభరా న కురుతే కస్య స్పృహార్ద్రం మనః.

అత్ర వ్యాససూనోః శుకస్య గాఢవైరాగ్య నిస్సఙ్గస్య గగనగఙ్గాతీరే స్నానోత్తీర్ణాః త్రిదశయోషితో వివసనాః తద్దర్శననిఃసఙ్కోచాః పశ్యతః ప్రశమవిమలమనసః స్మరవ్యతికరనిర్వికారతాయాం ప్రతిపాద్యమానాయాం కర్ణమూలోత్క్షిప్తాలకపర్యన్త నిపతత్తోయకణసన్తానేన స్తనయోః కృతముక్తాహారవిభ్రమా, శీతేన రోమాఞ్చసీత్కారిణీ, ధౌతాఞ్జనారుణనయనాన్తా, ప్రస్రవన్ముక్తకేశకలాపా. స్నానోత్తీర్ణా తరుణీ కస్య స్పృహార్ద్రం న మనః కరోతి ఇత్యుక్తే స్వయమార్ద్రస్వభావః పరమప్యార్ద్రంకరోతీత్యుచితమేతత్.

నా మునిమతమీమాంసలో ఉదాహరణ మెట్లనగా—

"స్నానాంతమున చెవుల వెనుకకు జొనిపిన ముంగురుల చివరినుండి జారుచున్న జలబిందువులచే క్షణకాలముపాటు హారముతో కూడిన స్తనములు కలదివలె ఉన్నదియు, చలిచే గగుర్పొడిచి స్స్ అను ధ్వని చేయుచున్న దియు, కాటుక కడిగివేయబడుటచే ఎఱ్ఱగా నున్న నేత్రాంతములుకలదియు, నీళ్ళు కారుచున్న కేశపాశము కలదియుఅగు అంగన ఎవని మనస్సును కోరికతో ఆర్ద్రమైనదానిగా చేయదు?"

ఇచట గాఢమైన వైరాగ్యముచే సంగరహితుడును, ఆకాశగంగాతీరమున స్నానముచేసి లేచి దిగంబరలుగా ఉండియు ఆతని దర్శనముచే ఏమాత్రము, సంకోచించని దేవస్త్రీలను చూచికూడ శాంతముతో నిర్మలమైన మనస్సుకలవాడును అగు వ్యాసకుమారుడైన శుకుని మన్మథవికారరాహిత్యమును ప్రతిపాదించు సందర్భమున, ఈ విధముగ చెప్పబడుచున్నది- "చెవి వెనుకకు త్రిప్పబడిన ముంగురుల అగ్రభాగమునుండి నిరంతరముగ పడుచున్న జలకణములచే, స్తనములపై క్షణకాలముపాటు హార మున్నట్లు భ్రాంతిని కలిగించునదియు, చలిచేత రోమాంచసీత్కారములు కలదియు, కాటుక తొలగిపోవుటచే ఎఱ్ఱనైన నేత్రాంతములు కలదియు, విడిపోయి జలబిందువులు స్రవించుచున్న కేశపాశము కలదియు, స్నానముచేసి అప్పుడే తీరమునకు వచ్చిన తరుణి ఎవరి మనస్సును స్పృహచే (కోరికచే) ఆర్ద్రమైనదానినిగ చేయదు." తాను ఆర్ద్రముగ నున్నది పరులను గూడ ఆర్ద్రులను చేయు నని చెప్పుటలో ఔచిత్య మున్నది.

న తు యథా మమ తత్త్రైవ—

93. భక్తిః కాతరతాం క్షమా సభయతాం పూజ్యస్తుతిర్దీనతాం
ధైర్యం దారుణతాం మతిః కుటిలతాం విద్యాబలం క్లీబతామ్.
ధ్యానం వఞ్చకతాం తపః కుహకతాం శీలవ్రతం షణ్ఢతాం
పైశున్యవ్రతినాం గిరాం కిమివ వా నాయాతి దోషార్ద్రతామ్,

అత్ర పిశునస్వభావే వర్ణ్యమానే భక్త్యాదీనాం గుణానాం వైపరీత్యే ప్రతిపాదితే, పిశునానాం వచసాం కిం వా దోషార్ద్రతాం నాయాతి ఇత్యభిహితే స్వయమనార్ద్రస్వభావస్య పరార్ద్రీకరణమనుచిత మేవ.

కాని దానియందే (మునిమతమీమాంసలోనే) నా మరియొక శ్లోకము ఉదాహరణము రాదు.

"భక్తి పిరికితనమును పొందును. (పిరికితనముగా పరిగణింప బడును). ఓర్పు భయమును పూజ్యులను స్తుతించుట దీనత్వమును, ధైర్యము క్రూరత్వమును, బుద్ధి వక్రత్వమును, విద్యాబలము మత్తత్వమును (గర్వ మును), ధ్యానము వంచకత్వమును, తపస్సు డాంబికమును, మంచిశీలము కలిగియుండుట అను నియమము నపుంసకత్వమును (అసామర్థ్యమును) పొందును. పైశున్యమనెడు వ్రతముకలవారి వాక్కులలో ఏది దోషార్ద్రత్వ మును పొందదు.?"

వి. పైశున్య మనగా చాడీలుచెప్పుట. ఇచటదోషారోపణ మనిఅర్థము.

ఇచట-పిశానుల స్వభావమును వర్ణించునపుడు భక్త్యాదిసద్గుణములకు వైపరీత్యము ప్రతిపాదింపబడినది. పిశునుల మాటలకు దోషార్ద్రత్వమును పొందనిది ఏది అని చెప్పినపుడు, తాను ఆర్ద్రము కానిది ఇతరములను ఆర్ద్రములను చేయుట అనునది అనుచితమే.

వి. కావున ఇది స్వభావానౌచిత్యమునకు ఉదాహరణము.

## 22. సారసంగ్రహౌచిత్యమ్.

సారసంగ్రహౌచిత్యం దర్శయితుమాహ—
సారసఙ్గ్రహవాక్యేన కావ్యార్థః ఫలనిశ్చితః
అదీర్ఘసూత్రవ్యాపార ఇవ కస్య న సంమతః. 34

సారసంగ్రహవాక్యేన కావ్యార్థః సునిశ్చితఫలః శీఘ్రకారిణ ఇవ వ్యాపారః కస్య నాభిమతః?.

సారసంగ్రహౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు—

"సారసంగ్రహవాక్యముచేత (సారమును సంగ్రహించి చెప్పువాక్యము చేత) నిశ్చితమైన ఫలము గల కావ్యార్థము దీర్ఘసూత్రుడు కానివాని పని వలె (దీర్ఘసూత్రు డనగా ఏ పనీ చేయజాలక దీర్ఘముగా ఆలోచన చేయుచూ జాగు చేయువాడు) ఎవరికి సంమతముగాఉండదు?"

సారసంగ్రహవాక్యముచేతకావ్యార్థము సునిశ్చితమైన ఫలము కలదై శీఘ్రముగా పనిచేయువాని వ్యాపారము (కార్యము) వలె ఎవరికి అభిమతము కాదు?.

యథా మమ మునిమతమీమాంసాయామ్—

94. వివిధగహనగర్భ గ్రంథ సంభారభారై
ర్మునిభిరభినివిష్టైస్తత్త్వముక్తం న కించిత్.
కృతరుచిర విచారం సారమేతన్మహార్థే –
రహమితి భవభూమిర్నాహమిత్యేవ మోక్షః.

అత్ర భగవద్గీతార్థవిచారే సారసంగ్రహోఽభిహితః. యత్ కిల మునిభిరనేక భేదభిన్నశాస్త్రజడై రభినివిష్టమతిభిస్తత్త్వ ముపాదేయం న కించిత్ కథితమ్. భగవతో మహర్షేర్వ్యాసస్య సుమతేర్విమలవిచారోత్తీర్ణం నిశ్చితమేతదేవ యదహంకారః సంసార మూలభూమిః, మమతాపరిత్యాగ ఏవ మోక్ష ఇతి తత్సంక్షేపేణ భవక్షయోపదేశః పరమౌచిత్యం పుష్ణాతి.

నా మునిమతమీమాంసయందు (నుండి) ఉదాహరణ మెట్లనగా—

"అర్థము చేసికొనుటకు కూడ కష్టమైన అనేక గ్రంథముల కట్టలను ప్రోగుచేసిన ఎంతో పట్టుదల గల మును లెవ్వరును, ఏ తత్త్వమును (సరిగ) చెప్పలేదు. మంచి విచారము చేయగా లభించిన మహర్షి (వ్యాసుడు) చెప్పిన సారమిదియే-"అహమ్" అనునదియే (అహంకారమే) సంసార హేతువు. 'నాహం' అనునదియే (అహంకారము; దానినిపట్టి వచ్చిన మమ కారము లేకపోవుటయే) మోక్షము "

ఇచట-భగవద్గీతార్థవిచారసందర్భమున సారముయొక్క సంగ్రహము చెప్పబడినది. ఏమనగా-అనేకభేదభిన్నము లైన, అనేకవిధములైన శాస్త్రములచే జడులైన , మొండి పట్టుదల గల మునులెవ్వరను ఉపాదేయ మైన తత్త్వమును దేనిని చెప్పలేదు. మహాబుద్ధిశాలి యైన భగవంతుడైన' వ్యాసమహర్షియొక్క ఉత్తమ విచారముల ద్వారా తేలిన, నిశ్చితమైన విష యము ఇదియే-ఏమనగా సంసారమూలము అహంకారమే. మమకారము నశించుటయే మోక్షము. ఈ విధముగ సంక్షేపముగ సంసారవినాశోపదేశము ప్రకృతవిషయమునకు ఎక్కువ ఔచిత్యమును పోషించుచున్నది.

న తు యథా పరివ్రాజకస్య—

95. తపో న తప్తం వయమేవ తప్తాః
భోగా న భుక్తా వయమేవ భుక్తాః.
జరా న జీర్ణా వయమేవ జీర్ణా
స్తృష్ణా న యాతా వయమేవ యాతాః.

అత్ర వయమేవ తప్తా భుక్తా జీర్ణా యాతా ఇత్యుక్తే నిః సారాచారుత్వాదపర్యవసితో వాక్యార్థః ఫలశూన్యతయా సార సంగ్రహోచితం న కించిత్, ప్రతిపాదయతి.

కాని పరివ్రాజకుని శ్లోకము మాత్రము ఉదాహరణము కాదు |

"తపస్సు తప్తము కాదు (తపస్సు చేయబడలేదు); మేమే తప్తుల మైనాము. భోగములు భుక్తములు కాదు (అనుభవింపబడలేదు) మేమే భుక్తుల మైనాము (తినివేయబడినాము). ముసలితనము జీర్ణము కాలేదు; మేమే జీర్ణుల మైపోయినాము ఆశ పోలేదు, మేమే పోయినాము."

ఇచట-మేమే తప్తులమైనాము, భుక్తుల మైనాము, జీర్ణ మైనాము, యాతుల మైనాము అని చెప్పుటలో సారముకాని, చారుత్వము కాని లేకపోవు టచే వాక్యార్థము పర్యవసితము కాలేదు (ఏమి చెప్పదలచుకున్నదీ చక్కగ చెప్పలేదు) అందుచే ఫలశూన్య మగుటచే సారసంగ్రహమునకు తగిన విధ ముగ దేనినీ ప్రతిపాదించుటలేదు.

## 23. ప్రతిభౌచిత్యమ్.

ప్రతిభౌచిత్యం దర్శయితు మాహ—

ప్రతిభాభరణం కావ్యముచితం శోభతే కవేః
**నిర్మలం సుగుణస్యేవ కులం భూతివిభూషితమ్.** 35

ప్రతిభాలఙ్కృతకవేః కావ్యముచితం గుణవతః కులమివ విమలం లక్ష్మ్యా ప్రకాశితం శోభతే.

ప్రతిభౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు—

"కవియొక్క ప్రతిభ ఆభరణముగా గల కావ్యము ఉచితమైనదై, సుగుణవంతుని నిర్మలమైనకులము ఐశ్వర్యముచే భూషితమై ప్రకాశించునట్లు ప్రకాశించును"

గుణవంతుని నిర్మలమైన కులము లక్ష్మిచే ప్రకాశితమై శోభించునట్లు ప్రతిభచే అలంకృతమై కవియొక్క కావ్యము ఉచితమైనదై ప్రకాశించును.

యథా మమ లావణ్యవత్యామ్—

96. అదయ దశసి కిం త్వం బిమ్బబుద్ధ్యాధరం మే
భవ చపల నిరాశః పక్వజమ్బూఫలానామ్.
ఇతి దయితమవేత్య ద్వారదేశాప్తమన్యా
నిగదతి శుకముచ్చైః కాన్తద న్తక్షతోష్ఠీ.

అత్ర కయాపి ద్వారదేశాప్తం ప్రియం జ్ఞాత్వా అన్యకాముక దశనఖణ్డితోష్ఠ్యా సంప్రతి తదాగమనానభిజ్ఞయేవ శుకముద్దిశ్య యదుక్తం—నిర్దయ కిం త్వం బిమ్బఫలలోభాదధరం మమ విదారయసి? పక్వానాం జమ్బూఫలానా మిదానీం చపల నిరాశో భవ. కుపితా తుభ్యం నో దాస్యామి ఇతి తేనోచ్చైః ప్రత్యాయనాపహ్నవనవోన్మేష ప్రజ్ఞాచాతుర్యచారువచనమౌచిత్య చమత్కారం కరోతి. యదాహ భట్టతౌతః కావ్యకౌతుకే:—“ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా” ఇతి.

ఉదాహరణమునకు నా లావణ్యవతిలోని శ్లోక మెట్లనగా—

“ఉపపతియొక్క దంతములచే గ్రుచ్చబడిన ఓష్ఠములు గల మరియొకతె భర్త ద్వారముదగ్గరకు వచ్చినట్లు గ్రహించి చిలుకతో బిగ్గరగ ఇట్లనుచున్నది— “దయలేనిదానా, దొండ పండు అనుకొని నా అధరోష్ఠమును ఎందుకు కొరుకుచున్నావు. ఓ చపలస్వభావముగలదానా! ఇక ముగ్గిన నేరేడు పండ్లమీద ఆశ వదలుకొనుము.”

అన్యకాముకునిచే ఖండితమైన అధరోష్ఠము గల ఒకానొకతె భర్త ద్వారముదగ్గరకు వచ్చినట్లు తెలుసుకొని, ఆతడు వచ్చినట్లు తెలియనిది వలె చిలుకతో ఇట్లు పలికినది— “ఓ దయారహితమా దొండపండుమీద ఆసక్తిచే నా అధరమును ఏల కొరికెదవు? కోపగించిన నేను నీకిక ముగ్గిన నేరేడు పండ్లను ఇవ్వను, వాటిపై ఆశ వదలికొనుము.” ఇట్లు బిగ్గరగా చెప్పుట (భర్తకు) నమ్మకమును కలిగించుటయందును, (రహస్యమును) కప్పిపుచ్చుట

యందును క్రొంగ్రొత్తగా వికసించుచున్న బుద్ధిచాతుర్యముచే సుందరమైనదై చమత్కారమును కలిగించుచున్నది. "క్రొత్తక్రొత్తవిధముల వికసించు ప్రజ్ఞ ప్రతిభ" అని కావ్యకౌతుకములో, భట్టతౌతుడు చెప్పినాడు.

న తు యథా మమ తత్రైవ—

97. నిర్యాతే దయితే గృహే విశయనే నిర్మాల్యమాల్యే హృతే
ప్రాప్తే ప్రాతరసహ్యరాగిణి పరే వారాపహారేఽన్యయా।
ద్వారాలీనవిలోచనా వ్యసనినీ సుప్తాహమేకాకినీ—
త్యుక్త్వా నీవివికర్షణైః స చరణాఘాతైరశోకీకృతః॥

అత్ర వేశ్యా వ్యాలగ్నకాముకస్య వారాపహారం విధాయ, నవకాముకేన సహ క్షపాయాం, నీతాయాం, ప్రభాతే తస్మిన్నిర్యాతే, శయ్యాకుసుమాదిసంభోగలక్షణే నివారితే, వారవశ్చన కుపితే గాఢానురాగగ్రస్తమతౌ పూర్వకాముకే ప్రాప్తే, "త్వదాలోకనకాంక్షిణీ వ్యసనినీ ద్వారన్యస్తనయనా అహమేకాకినీ సుప్తా" ఇతి ప్రత్యాయనావచనవిలీనమన్యుః, సరభసపరసనీవికర్షణోద్యతాకృతిః కృతేర్ష్యాకోపయా చరణనలినప్రహారైః అశోకీకృతః, శజ్కాశల్యోన్మూలనాన్నిఃశోకః సంపాదితః, స స్తవపులకాజ్కురత్వాత్ అశోకతుల్యతాం నీత ఇతి వా వాక్యార్థః, కేవలసత్యవిప్రలమ్భప్రాగల్భ్యమాత్రమేవ గణికాయా గాఢరాగమూలతాం చ ప్రతిపాదయతి, న తు ప్రతిభోద్భూతామౌచిత్యకణికాం సూచయతి.

కాని నా లావణ్యవతిలోనే మరి యొక శ్లోక ముదాహరణము కాదు.

"ప్రియుడు వెళ్ళిపోయిన పిమ్మట గదిలో నిశయనము తీసివేయబడినది. నిర్మాల్యమైన మాల త్యజింపబడినది. ఇంతలో, వారావహారము జరిగిన మరియొక ప్రియుడు భరింపరాని రాగముతో ప్రాతఃకాలమున వచ్చి

చేరగా, మరియొకతె, నీవిని (వస్త్రగ్రంథిని) లాగుచున్న ఆతనితో—“ఎంతో విచారించుచు, ద్వారము పైపై చూపుల నుంచి నేను వంటరిగా పండుకొని ఉంటిని” అని పల్కుచు పాదాఘాతములచే వానిని అశోకత్వమును పొందించెను”.

వి. వారావహారము అనగా వంతును ఎగవేయుట, వంతు ప్రకారము కలవవలసిన కాముకుని కలియకుండుట. స్త్రీల పాదాఘాతముచే అశోకవృక్షము పుష్పించునని కవిసమయము. ఈతడు ఈవేశ్యపాదాఘాతములచే అశోకీకృతుడయ్యెను అనగా అశోకవృక్షము వలె అయినాడు; శోకము, శంక లేని వాడయినాడు అని అర్థము.

ఇచట—ఒక వేశ్య తనను పూర్వమునుండి తగుల్కొని యున్న కాముకునికి (వ్యాలగ్నకాముకస్య) వారావహారముచేసి క్రొత్త కాముకునితో రాత్రి గడిపినది. ప్రాతఃకాలమున ఆతడు వెళ్ళిపోయిన పిమ్మట శయ్య, కుసుమములు మొదలైన సంభోగచిహ్నము లన్నియు తీసివేయబడినవి. ఇంతలో వంతు ఎగవేసి మోసముచేయుటచే కోపించిన పూర్వకాముకుడు గాఢానురాగముతో నిండిన మనస్సుతో వచ్చినాడు. “నీ దర్శనమును కోరుచు, చింతించుచు, చూపులు ద్వారము పైపై ఉంచి నేను వంటరిగ పండుకొంటిని” అను నమ్మకమును కలిగించు ఆమె మాటలచే కోపమంతయు పోయి ఆతడు తొందరగా నీవిని విదల్ప ఉద్యుక్తుడైనాడు, అపుడు ఈర్ష్యాకోపమును అభినయించుచు, ఆమె పాదపద్మప్రహారములు ఇవ్వగనే ఆతడు అశోకీకృతుడైనాడు - శంకాశల్యము తొలగిపోవుటచే శోకరహితుడైనాడు. లేదా పులకాంకురములు నిరంతరముగ ఆవిర్భవించుటచే అశోకవృక్ష సమానుడైనాడు. అను ఈ వాక్యార్థము మోసము చేయుటలో గణికకు ఉన్నప్రాగల్భ్యమును గాఢరాగమును మాత్రమే ప్రతిపాదించుచున్నది; అంతేకాని; ప్రతిభచే కలిగిన ఔచిత్యలేశమును కూడ సూచించుట లేదు.

## 24. అవస్థౌచిత్యమ్.

అవస్థౌచిత్యం దర్శయితుమాహ—

అవస్థోచితమాధత్తే కావ్యం జగతి పూజ్యతామ్.
విచార్యమాణరుచిరం కర్తవ్యమివ ధీమతామ్. 36

అవస్థోచితతయా కావ్యం జగతి శ్లాఘ్యతామాయాతి మతిమతామివ కృత్యం విచారనిర్ఘృష్టరుచిరమ్.

అవస్థౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు.

"ఆలోచించినకొలదీ అందముగాకనబడు, లేదా ఆలోచనచే అందమైన, బుద్ధిమంతుల కార్యము వలె, అవస్థకు తగిన కావ్యము, జగత్తునందు పూజ్యత్వమును కలిగించును."

ఆలోచన అనెడు ఒఱపిడి ఱాయిపై ఱాయుటచే అందమైన బుద్ధిమంతుల కృత్యము వలె. కావ్యము అవస్థౌచిత్యముచే, శ్లాఘ్యత్వమును పొందును.

యథా మమ లావణ్యవత్యామ్.

98. ముక్తః కన్దుకవిభ్రమస్తరలతా త్యక్తైవ బాల్యోచితా
మౌగ్ధ్యం నిర్ధుతమాశ్రితా గజగతిర్భ్రూలాస్యమభ్యస్యతే.
యన్నర్మోక్తిషు నిర్మితం మృగదృశా వైదగ్ధ్యదివ్యం వచ-
స్తద్విద్మః సుభగాభిమానలటభాభావే నిబద్ధో భరః.

అత్ర యదుక్తం కన్దుకక్రీడా త్యక్తా, బాలచాపల్యం పరిహృతం, మౌగ్ధ్యం నిరస్తం, గజగతిరఙ్గీకృతా, భ్రూలతాలాస్యాభ్యాసః క్రియతే; నర్మోక్తిషు వచనవైచిత్ర్యమాసూత్రితమ్, తేన జానీమహే శైశవావస్థాం సముత్సృజన్త్యా యౌవనమాశ్రయన్త్యా ప్రౌఢతామనారూఢయాపి నవసంభోగగౌరవగర్భేణ సుభగాభిమానేన లటభాభావే బాలయా భరో నిబద్ధ ఇత్యభిహితే స్ఫుటమృదు

సమ్భృద్ధాయాం వయోవస్థామధ్య సన్ధివర్ణనాయామౌచిత్యం స్ఫురది వావభాసతే.

ఉదాహరణమునకు నా లావణ్యవతికోని శ్లోకమెట్లన్గా—

"ఈ మృగాక్షిచేత కందుకక్రీడ విడువబడినది. బాల్యోచితమైన చపలత్వము త్యజింపబడినది. ముగ్ధత్వము దూరముగా ఉంచబడినది. గజగమనము ఆశ్రయింపబడినది. కనుబొమ్మల లాస్యము అభ్యసింపబడుచున్నది. పరిహాస వచనములందు నేర్పుతో సుందరమైన మాటలు కూర్పబడుచున్నవి. దీని నంతను బట్టి ఈమెచే సౌభాగ్యముచే కలిగిన అభిమానముతో కూడిన ప్రౌఢత్వము నందు భారము కట్టబడినది - (ఈమె సౌభాగ్యము వలన కలిగిన అభిమానముతో అనగా గర్వముతో ప్రౌఢత్వమును చూప నిశ్చయించుకొనినది) అని తెలుసుకొనుచున్నాము."

ఇచట - "కందుకక్రీడవిడువబడినది; బాలచాపల్యము పరిహరింపబడినది. మౌగ్ధ్యము నిరస్తమైనది. గజగమనము స్వీకరింపబడినది. భ్రూలతాలాస్యాభ్యాసము చేయబడుచున్నది. పరిహాసప్రసంగములలో నేర్పుతో కూడిన మాటలు చేర్చబడుచున్నవి. దీనిని బట్టి శైశవావస్థను దాటి యౌవనమును ఆశ్రయించుచు, ఇంకను పూర్తిగ ప్రౌఢత్వమును ఆశ్రయింపకపోయినను, ఈ బాల నూతనసంభోగమువలన కలిగిన గౌరవభావముతో కూడిన సౌభాగ్యాభిమానముచే, ప్రౌఢత్వమున ( "లటభ" ప్రౌఢయగు సుందర యువతి ) భారము కట్టుచున్నదని తెలుసుకొనుచున్నాను అని చెప్పుటలో, స్ఫుటముగను, మృదువుగను సంబంధించిన బాల్యయౌవనములను వయోవస్థల సంధి వర్ణనములో ఔచిత్యము మెఱయుచున్నట్లు కనబడుచున్నది.

న తు యథా రాజశేఖరస్య—

99. జ్యాయాన్ ధన్వీ నవధృతధనుస్త్రామహాస్త్రోదరేణ
క్షత్రక్షోద వ్యతికర పటుస్త్రారకాతాడకేన.

కర్ణాభ్యర్ణ స్ఫురితపలితః క్షీరకణ్ఠేన సార్ధం
యోద్ధుం వాఞ్ఛన్ న కథమమునా లజ్జతే జామదగ్న్యః.
(బా. రా. 4. 1.)

అత్ర భార్గవః స్థవిరావస్థాస్థితః. స్థిరతరపరాక్రమకర్కశ ప్రౌఢో ధనుర్ధరః శిశునా రామేణ ధనుర్గ్రహణారుణిత కోమలకర కమలతలేన, క్షత్రియ క్షయ సంరమ్భప్రగల్భః తాటకాతాడకేన. స్ఫురదాకర్ణపలితః సమ్భావ్యమాన జననీస్తనక్షీరకణ్ఠేన అమునా యుయుత్సుః కథం న లజ్జతే ఇత్యుక్తే పేశలతయా రాఘవావస్థాయాం జామదగ్న్యావస్థావిపరీతాయాం ప్రతిపాద్యమానాయాం తాటకాతాడకేన ఇతి విరుద్ధాభిధాసోఽర్థః కిమప్యనౌచిత్యేన చేతసి సంకోచమాదధాతి.

కాని రాజశేఖరుని శ్లోకము వలె మాత్రము కాదు.

"వయస్సుచే పెద్దవాడును, ధనుర్ధరుడును, క్షత్రియులను సంహరించుటయందు సమర్థుడును, చెవి దగ్గర కనబడుచున్న నెరపు కలవాడును, అగు పరశురాముడు, ధనస్సును ధరించుటచే ఎఱ్ఱనైన హస్తము కలవాడును, తాటకను కొట్టినవాడును, పాలు కంఠమునందు గలవాడును (పాల బుగ్గలవాడును) అగు ఈ శ్రీ రామునితో యుద్ధము చేయగోరుచు ఎట్లు సిగ్గుపడుటలేదో":

ఇచట వృద్ధావస్థను పొందినవాడును, స్థిరతరమైన పరాక్రమముచేత కఠినుడును, ప్రౌఢుడును, ధనుర్ధరుడును, క్షత్రియులను నశింపచేయుట అను సంరంభమున (కార్యమున) ప్రగల్భుడును, చెవివరకును స్పష్టముగా కనబడుచున్న జుట్టునెరపు కలవాడును అగు పరశురాముడు, ధనస్సు పట్టుకొనుటచే కందిపోయిన కరకమలములు కలవాడును, తాడకను సంహరించినవాడును, ఇంకను కంఠమునందు తల్లి చనుబాలు ఉండవచ్చునేమో అని అనిపించువాడును అగు శిశువైన రామునితో యుద్ధము చేయదలచుచున్నందులకు ఎట్లు సిగ్గుపడకుండా ఉన్నాడు అని చెప్పినపుడు, జామదగ్న్యుని వయో

వస్థకు విరుద్ధముగ శ్రీరాముని వయోవస్థ సుకుమారమైనదని ప్రతిపాదింప వలసి యున్నప్పుడు "తాటకాతాడకేన" (తాటకాసంహారము చేసినవాడు) అని చెప్పుట విరుద్ధార్థమై ఆనౌచిత్యముచే మనస్సులో ఒకానొకవిధ మగు సంకోచమును కలిగించుచున్నది.

వి. రాముని తాటకాసంహారమును చేసిన వాడుగ పేర్కొనుటచే, అది మహావీరుడు మాత్రమే చేయవలసిన పని అగుటచే, అట్టిరామునితో పరశురాముడు యుద్ధము చేయ సమకట్టుట యుక్తమే గాన అందులో సిగ్గుపడవలసినదేమియు లేదు. ఈ ఒక్క విశేషణము చేయకున్నచో శ్రీరామ పరశురాముల అవస్థాభేదమును వర్ణించుటలో ఔచిత్య ముండెడిది అని భావము.

## 25. విచారౌచిత్యమ్.

విచారౌచిత్యం దర్శయితు మాహ—

ఉచితేన విచారేణ చారుతాం యాన్తి సూక్తయః
వేద్యతత్త్వావబోధేన విద్యా ఇవ మనీషిణామ్. 37.

విచారౌచిత్యేన సూక్తయశ్చారుతాం యాన్తి జ్ఞేయస్వరూపజ్ఞానేన విద్యా ఇవ విదుషామ్.

విచారౌచిత్యమును చూపుటకు చెప్పుచున్నాడు—

"తెలియదగిన తత్త్వమును గ్రహించుటచే పండితుల విద్యల వలె, తగిన విచారముచేత కావ్యములు సౌందర్యమును పొందును"

తెలియదగినదాని యథార్థస్వరూపమును తెలిసికొనుటచే విద్వాంసుల విద్యల వలె, విచారౌచిత్యముచేత కావ్యములు సౌందర్యమును పొందును.

యథా మమ మునిమతమీమాంసాయామ్:—

100. అశ్వత్థామవధాభిధానసమయే సత్యవ్రతోత్సాహినా

మిథ్యా ధర్మసుతేన జిహ్మవచసా హస్తీతి యద్వ్యాహృతమ్.
సా సత్యామృతరశ్మివైరమసమం సంసూచయన్త్యాః సదా
శఙ్కే పఙ్కజసంశ్రయేణ మలినారమ్భా విజృమ్భా శ్రియః.

అత్ర ద్రోణ(ద్రౌణి)నిధనాఖ్యానే సత్యవ్రతోత్సాహవతా ధర్మతనయేనాపి మిథ్యాలఘువచసా కుఞ్జర ఇతి యదుక్తం సా సతతం సత్యచన్ద్రిద్వేషం సూచయన్త్యాః శ్రియః శఙ్కే పఙ్కజసంశ్రయేణ మలినవ్యాపారా విజృమ్భా ఇత్యభిహితే ససంవాదలక్ష్మీస్వభావ పరిభావనయా తత్త్వావబోధేన మూలవిశ్రాన్త్యా ఫలపర్యవసాయీ విచారః సహృదయసంవేద్య మౌచిత్యం వ్యనక్తి.

ఉదాహరణమునకు నా మునిమత మీమాంసలోని శ్లోకము ఎట్లనగా—

"అశ్వత్థామయొక్క వధను గూర్చి చెప్పు సమయమున సత్యవ్రతోత్సాహవంతుడైన ధర్మసుతుడు, వక్రమైన వాక్కుగలవాడై "హస్తి" అని అసత్యముగ పలికినాడనునది, పద్మమును ఆశ్రయించుటచే సత్య మనెడు చంద్రునితో అధికమైన వైరమును సూచించు లక్ష్మియొక్క మలిన మైన ఆరంభము గల విజృంభణ మని తలచెదను"

వి. ధర్మనందనుడు సత్యవ్రతోత్సాహి యైనను లక్ష్మి ఆతనిచేత కూడ అసత్యము పలికించినది. ఇందుకు కారణ మేమనగా లక్ష్మి చంద్రునితో ద్వేషము గల పంకజమును ఆశ్రయించుటచే ఆమెకు కూడ సత్యమనెడు చంద్రునిపై ద్వేషము బయలుదేరిన దని భావము. ధర్మజుడు రాజ్యలక్ష్మి కొరకు లేదా జయలక్ష్మికొరకు అసత్య మాడినాడు గాన లక్ష్మియే ఆతనిచే అసత్య మాడించిన దని చెప్పబడినది.

ఇచట ద్రోణకుమారుని (ద్రౌణి అను పాఠముండవలెనని తోచుచున్నది.) మరణమును చెప్పునపుడు సత్యవ్రతోత్సాహవంతుడగు ధర్మరాజు

కూడ అసత్యవాక్కు కలవాడై, 'కుంజరః' అని మెల్లగా చెప్పుట, పంకజ మును ఆశ్రయించుటచే సత్యచంద్రునిపై ద్వేషమును సూచించుచున్న లక్ష్మి యొక్క మలినవ్యాపార విజృంభణము అని వర్ణించుటలో, సంవాదముతో కూడిన (యుక్తియుక్తమైన) లక్ష్మీ స్వభావమును ఊహించి తత్త్వమును బోధించుటచే, మూలమును పరామర్శించి ఫలమువరకును పర్యవసన్నమైన విచారము సహృదయసంసేవ్యమైన ఔచిత్యము ప్రకటిత మగుచున్నది.

న తు యథా మమ· తత్రైవ—

101. ప్రమ్లానే చిరకాలవృత్తతాయిదకేశామ్బరాకర్షణే
క్రూరం రాక్షసవైశసం యది కృతం భీమేన దుఃశాసనే.
తత్కాలక్షమిణా కుశాశ్మపరుషారణ్యప్రవాసే చిరం
కిం పీతం తత(ప)తాపమగ్నమహిషస్వేదామ్బుపృక్తం పయః.

అత్ర భీమసేనచరితే విచార్యమాణే త్రయోదశవర్షపర్యుషితే కృష్ణాకేశాకర్షణపరాభవే భీమేన భీమం రాక్షసకర్మ దుఃశాసనే యది కృతం తత్ సద్యః కృతార్ద్రాపరాధకాలక్షమిణా సుచిరం దర్భసూచీవిషమాశ్మపరుషవనవాసే కిం గ్రీష్మతాప నిమగ్నమహిషస్వేదస్మృతిపృక్తం పయః పీతమ్ ఇత్యనుపపన్నకృత్యే అభిహితే కారణవిచారాభావాత్ నిర్మూలోపాలమ్భమాత్రమనౌచిత్యమనుబధ్నాతి.

కాని నా మునిమతమీమాంసలోనే మరి యొక శ్లోకము ఉదాహరణము కాదు.

"చాలకాలము క్రితము జరిగిన భార్యాకేశవస్త్రాకర్షణము వాడిపోయిన తరువాత (ఎన్నడో జరుగుటచే విస్మృతప్రాయమైన తరువాత) భీముడు దుఃశాసనుని విషయమున రాక్షసక్రౌర్యము నాచరించినాడు. ఆ కాలమున (కేశాంబరాకర్షణము జరిగిన సమయము) ఓర్పు వహించి దర్భ గడ్డితోడను,

ఱాళ్ళతోడను పరుష మైన అరణ్యము నందు ప్రవాసము చేయు నపుడు గ్రీష్మ (తప) తాపములో మునిగిన మహిషముల చెమటతో కూడిన జలము ఎందుచే త్రాగబడినది?"

వి. దుఃశాసనుని విషయములో రాక్షసకృత్యమును ఆ నాడే చేయ వచ్చును కదా; ఈ అరణ్యవాసాదిదుఃఖము లన్నియు అనుభవించుట ఎందు లకు అని భావము.

ఇచట భీమసేనుని చరితమును విచారించు సందర్భమున—కృష్ణాకేశాం బరాకర్షణమువలన జరిగిన పరాభవము పదమూడు సంవత్సరాలకు మాసి పోయిన తరువాత ఈ నాడు దుఃశాసనుని విషయమున రాక్షసకృత్యము నాచ రించిన భీమసేనుడు, ఆ అపరాధము జరిగిన క్రొత్త రోజులలో ఓర్పు వహించి, దర్భముళ్ళచేతను విషమమైన రాళ్ళచేతను పరుష మైన వనవాసము నందు చాలా కాలము పాటు గ్రీష్మతాపముచే మునిగిన దున్నపోతుల స్వేద జలములతో కలసిన నీళ్ళను ఎందుకు తాగినట్లు అని తగని పని చేసినట్లు చెప్పబడుచున్నది. కాని కారణమును గూర్చిన విచారము లేకపోవుటచే, నిర్మూ లముగ నిందామాత్రము చేయుట అనౌచిత్యహేతు వగుచున్నది.

## 26. నామౌచిత్యమ్

నామౌచిత్యం దర్శయితు మాహ—

నామ్నా కర్మానురూపేణ జ్ఞాయతే గుణదోషయోః

కావ్యస్య పురుషస్యేవ వ్యక్తిః సంవాదపాతినీ. 38.

కావ్యస్య కర్మ ఔచిత్యం; తేన నామ్నా పురుషస్యేవ గుణ దోష వ్యక్తిః సంవాదినీ జాయతే.

నామౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు—

"కర్మకు (ఔచిత్యమునకు) అనురూప మైన పేరుచేత, కర్మకు (పనికి) తగిన పేరుచే పురుషుని గుణదోషముల అభివ్యక్తి వలె, కావ్యము యొక్క-

గుణదోషముల అభివ్యక్తి, సంవాదమును చెందుచు తెలియబడును."

కావ్యముయొక్క కర్మ అనగా ఔచిత్యము. దానికి (ఆ ఔచిత్యమునకు తగిన పేరుచేత, పురుషుని గుణదోషాభివ్యక్తి వలె, కావ్యముయొక్క గుణ దోషాభివ్యక్తి సంవాదినియై (హృదయానుకూలమై) తెలియబడును.

యథా కాలిదాసస్య—

102. ఇదమసులభవస్తుప్రార్థనాదుర్నివారః
ప్రథమమపి మనో మే పఞ్చబాణః క్షిణోతి.
కిముత మలయవాతాన్దోలితాపాణ్డుపత్రై
రుపవనసహకారైర్దర్శితేష్వఙ్కురేషు. వి. ఊ. 26.

అత్ర—ప్రారమ్భ ఏవ మమేదం మనః పఞ్చబాణః సుదుర్ల భవస్తుప్రార్థనాదుర్నివారః శకలీకరోతి; కిముత లీలోద్యానసహ కారైర్మలయానిలాన్దోలిత బాలపల్లవైరఙ్కురేషు దర్శితేషు ఇత్యుక్తే మదనస్య పంచబాణాభిధానముచితమేవ.

ఉదాహరణమునకు కాళిదాసుని శ్లోక మెట్లనగా—

"ఈ నా మనస్సును సులభము కాని వస్తువును కోరుటచే ఏ విధముగను నివారింప శక్యము కాని పంచబాణుడు బాధించుచున్నాడు, మలయవాయువుచే కదల్చబడిన ఎండుటాకులు గల ఉద్యానవనమునందలి సహకారవృక్షముల మీద అంకురములు కనబడినతరువాత ఇంక చెప్పవలెనా?"

ఇచట — "నా మనస్సును, మొదటనే, దుర్లభవస్తువుపై కోరిక కలుగుటచే నివారింప శక్యము కాని పంచబాణుడు బాధించుచున్నాడు. మలయ వాయువుచే కదల్చబడిన లేత చిగుళ్ళు గల (కాని 'పాండు పత్ర' శబ్దమునకు క్షేమేంద్రుడు బాలపల్లవము లని అర్థమెట్లు వ్రాసెనో తెలియదు) లీలోద్యాన సహకారవృక్షములపై అంకురములు కనబడిన తరువాత చెప్పవలెనా" అని

చెప్పునపుడు మన్మథునికి పేరుగా పంచబాణః అనుపదము ప్రయోగించుట యుక్తమే.

వి. ఐదు పుష్పములు బాణములుగా కలవాడు పంచబాణుడు. సహకారములు పుష్పించుటతో ఆతనికి కొరత లేకుండ బాణములు లభించిన వని భావము.

యథా వా మమ బౌద్ధావదానలతాయామ్—

103. తారుణ్యేన నిపీతశైశవతయా సానఙ్గశృఙ్గారిణీ
తన్వఙ్గ్యా సకలాఙ్గసఙ్గమసఖీ భఙ్గిర్నవాఙ్గీకృతా ।
నిఃసరమ్భపరాక్రమః పృథుతరారమ్భాభియోగం వినా
సామ్రాజ్యే జగతాం యయా విజయతే దేవో విలాసాయుధః ॥

అత్ర యౌవనసపీత శైశవతయా తన్వఙ్గ్యానఙ్గశృఙ్గారవతీ సర్వాఙ్గసఙ్గమసఖీ సాకాప్యభినవా భఙ్గిరఙ్గీకృతా యయా నిష్ప్రయత్న పరాక్రమః ప్రభూతతరారమ్భసంభారం విహాయ త్రిభువన సామ్రాజ్యే జయతి దేవో విలాసాయుధ ఇత్యుక్తే కామస్య విలాసాయుధ ఇతి నామోపపన్నమేవ. తన్వఙ్గీభఙ్గ్యైవ సిద్ధత్రైలోక్యాధిపత్య విజిగీషాయాం కామసాయకాదీనాం నైరర్థక్యాత్.

ఉదాహరణముగ నా బౌద్ధావదానలతలోని శ్లోక మెట్లనగా:—

"తారుణ్యముచే త్రాగివేయబడిన శైశవము కలదగుటచే ఆ తన్వంగి, మన్మథశోభతో కూడినదియు, సమస్త శరీరముతో సంబంధించిన సఖియు అయిన నూతన భంగిని స్వీకరించినది. దానిచే, దేవుడైన విలాసాయుధుడు (స్త్రీ విలాసములే ఆయుధములుగా గల మన్మథుడు) పరాక్రమమువిషయములో ఎట్టి సంరంభము లేనివాడై, అధికప్రయత్న మేమియు లేకుండనే జగత్తులో సామ్రాజ్యమును ఏలుచున్నాడు",

ఇచట — యౌవనముచే త్రాగివేయబడిన (తొలగింపబడిన) శైశవము కలదగుటచే ఆ తన్వంగిచే, అనంగ శృంగారము కలదియు, సర్వాంగ సంగమసఖియు అగు ఒకానొక నూతనభంగి స్వీకరింపబడినది. దానితో దేవుడైన విలాసాయుధుడు అప్రయత్నముగ సిద్ధించిన పరాక్రమముకలవాడై, అత్యధిక మైన ఆరంభసంరంభము నంతను విడచి త్రిభువనసామ్రాజ్యము నేలుచున్నాడు అని చెప్పునపుడు మన్మథ వాచకముగ ప్రయుక్తమైన "విలాసాయుధః" అను పదము యుక్తముగ ఉన్నది. ఆ తన్వంగియొక్క భంగి చేతనే ఆతని త్రైలోక్య విజిగీష (త్రిలోకములను జయించవలె ననెడు ఇచ్ఛ) సిద్ధించినపుడు మన్మథబాణాదులు నిరర్థకములు కదా?

104. న తు యథా కాలిదాసస్య:—

క్రోధం ప్రభో సంహర సంహరేతి
యావద్ గిరః ఖే మరుతాం చరన్తి।
తావత్స వహ్నిర్భవనేత్రజన్మా
భస్మావశేషం మదనం చకార. (కు. సం. 3-72)

అత్ర పశ్యతో భగవతః త్రినేత్రస్య స్మరశర నిపాతక్షోభ వర్ణ్యభేమానే తన్నికారకోపశమాయ "సంహర సంహర ప్రభో క్రోధమ్" ఇతి యావద్వచః ఖే దేవానాం చరతి తావత్ భవనేత్రోద్భవః స వహ్నిః మదనం భస్మరాశిశేషమకార్షీదిత్యుక్తే సంహారావసరే రుద్రస్య భవాభిధాన మనుచితమేవ.

కాని కాళిదాసు శ్లోకము మాత్ర ముదాహరణము కాదు—

"ఓ ప్రభూ! క్రోధమును ఉపసంహరించుము, ఉపసంహరించుము" అని ఆకాశముపై దేవతల మాటలు వ్యాపించునంతలోనే, భవుని నేత్రము నుండి జన్మించిన ఆ అగ్ని మన్మథుని భస్మమాత్రావశిష్టునిగా చేసినది."

ఇచట - భగవంతుడైన త్రినేత్రుడు చూచుచుండగా మన్మథబాణములు

వడుటచే కలిగిన క్షోభమును వర్ణించునప్పుడు ఆ శివుని ప్రతిక్రియను శాంతింప చేయుటకై "ఓ ప్రభూ! క్రోధమును ఉపసంహరింపుము ఉపసంహరింపుము, అని ఆకాశమున దేవతల వాక్కు ప్రసరించునంతలోనే శివుని నేత్రములనుండి జనించిన ఆ అగ్ని మన్మథుని భస్మరాశి మాత్రమే మిగిలి నట్లు చేసెను" అని చెప్పునపుడు సంహారావసరమున 'రుద్ర' శబ్దమును ప్రయోగించుటకు బదులు, 'భవ' శబ్దమును (సృజించువాడు అని భవశబ్దమునకు అర్థము) ప్రయోగించుటచే అనుచితమే.

## 27. ఆశీర్వచనౌచిత్యమ్.

ఆశీర్వచనౌచిత్యం దర్శయితుమాహ—
పూర్ణార్థదాతుః కావ్యస్య సన్తోషిత మనీషిణః
ఉచితాశీర్నృపస్యేవ భవత్యభ్యుదయావహా. 39.

సంపూర్ణార్థసమర్పకస్య సన్తోషితవిదుషః కావ్యస్య నృపతేరివోచితమాశీః పదమభ్యుదయావహం భవతి.

ఆశీర్వచనౌచిత్యమును చూపుటకై చెప్పుచున్నాడు.

"పూర్ణమైన అర్థమును ఇచ్చునదియు, పండితులను సంతోషింప చేయునదియు అగు కావ్యమునకు పూర్ణమైన ధనమును ఇచ్చువాడును పండితులను సంతోషపెట్టువాడును అగు రాజునకు వలె, ఉచితమైన ఆశీస్సు అభ్యుదయమును కలిగించును".

సంపూర్ణార్థప్రతిపాదకమును, విద్వాంసులకు సంతోషము కలిగించునదియు అగు కావ్యమునకు, రాజునకు వలె, ఉచితమైన ఆశీఃపదము అభ్యుదయహేతువగును.

యథా అస్మదుపాధ్యాయగఙ్గకస్య—
105. స కోఽపి ప్రేమార్ద్రైః ప్రణయపరిపాక ప్రచలితో
విలాసోఽక్ష్ణాం దేయాత్ సుఖమనుపమం వో మృగదృశామ్,

యదాకూతం దృష్ట్వా పిదధతి ముఖం తూణవివరే
విరతవ్యాపారా భువనజయినః పఞ్చ విశిఖాః.

అత్ర సకోఽపత్యసామాన్య ప్రేమప్రణయవిశ్రాన్తిప్రగల్భకురఙ్గదృశాం నిరుపమో నయనవిలాసః సుఖం వో దేయాత్. యదభిప్రాయమాలోక్య భువనవిజయినః కామస్య పఞ్చ సాయకాః సమాప్తవ్యాపారాః తూణీరవివరే లజ్జయేవ ముఖం పిదధతి ఇత్యుక్తే సుఖం వో దేయాత్ ఇత్యాశీఃపదముచితమేవ. ప్రియానయనవిభ్రమస్య సుఖార్పణ యోగ్యత్వాత్.

ఉదాహరణమునకు మా ఉపాధ్యాయుడైన గాంగకుని శ్లోక మెట్లనగా.

"వర్ణింప శక్యము కానిదియు, ప్రేమచే ఆర్ద్రమైనదియు, ప్రేమ పరిపాకముచే చంచలమైనదియు, అయిన మృగనయనల నేత్ర విలాసము నీకు సాటిలేని సుఖమును ఇచ్చుగాక; ఏ విలాసముయొక్క ఆకూతమును (నిగూఢభావమును) చూచిన పిమ్మట భువన విజేత యైన మన్మథుని ఐదు బాణములను చేయవలసిన పని ఏమియు లేక, అంబులపొదుల రంధ్రములలో ముఖమును దాచుకొనుచున్నవో".

"అసామాన్య మైన ప్రేమ ప్రణయముల విశ్రాంతిచే ప్రగల్భము లైన కురంగనయనల సాటి లేని నేత్రవిలాసము మీకు సుఖము నిచ్చుగాక; వేటి అభి ప్రాయము చూచి భువన విజేత యైన మన్మథుని ఐదు బాణములును వ్యాపారమును విరమించినవై, సిగ్గుతో వలె అంబులపొది వివరమున ముఖమును దాచుకొనుచున్నవో" అని చెప్పునపుడు — "సుఖం వో దేయాత్" అను ఆశీఃపదము ఉచితముగ నున్నది. ప్రియురాలి నేత్రవిలాస సుఖమును కలిగించుటకు యోగ్యము కదా?

యథా వా మమ వాత్స్యాయన సూత్రసారే—

106. కామః కామం కమలవదనా నేత్రపర్యన్తవాసీ
దాసీభూత త్రిభువనజనః ప్రీతయే జాయతాం వః.

దగ్ధస్యాపి త్రిపురరిపుణా సర్వలోకస్పృహార్హా
యస్యాధిక్యం రుచిరతితరామఞ్జనస్యేవ యాతా.

అత్ర కామః ప్రీతయే వో జాయతాం యస్య దగ్ధస్యాప్యఞ్జనస్యేవ ఆధిక్యం రుచిర్యాతా ఇత్యుక్తే, ప్రీతయే జాయతామిత్యుచితం కామస్య ప్రీత్యాత్మకత్వాత్.

వా వాత్స్యాయనసూత్రసారమునుండి మరి యొక ఉదాహరణ మెట్లనగా—

"కమలవదనలనేత్రాంతములందు నివసించువాడును, త్రిభువనములందలి జనులను దాసులనుగా చేసికొన్నవాడును అగు మన్మథుడు మీకు అత్యంతము ప్రీతిని కలిగించుగాక. త్రిపురారిచే కాల్చివేయబడినను ఏ కాముని యొక్క కాంతి, అంజనము యొక్క కాంతి వలె సర్వలోకములచే కోరబడుటకు తగినదై చాల ఆధిక్యమును పొందినదో."

దగ్ధుడైనను ఎవని కాంతి, అంజనము కాంతి వలె, ఆధిక్యమును పొందినచో, అట్టి కాముడు మీకు ప్రీతిని కలిగించు గాక అని ఇట చెప్పబడుచున్నది. మన్మథుడు ప్రీతి స్వరూపుడే గాన 'ప్రీతయే జాయతామ్' అనునది ఎంతయు యుక్తముగా నున్నది.

న తు యథా అమరుకస్య—

107. ఆలోలామలకావలీం విలులితాం బిభ్రచ్చలత్కుణ్డలం
కించిన్మృష్టవిశేషకం తనుతరైః స్వేదామ్భసాం సీకరైః.
తన్వ్యాః సుతరాం రతాన్తసమయే వక్త్రం రతివ్యత్యయే
తత్ త్వాం పాతు చిరాయ కిం హరిహరస్కన్దాదిభిర్దైవతైః.

(అ. శ. 3)

అత్ర తన్వ్యా రతివ్యత్యయే లోలాలకం చలత్కుణ్డలం స్వేద

సలిలేన కించిదున్మృష్టతిలకం యద్ ముఖం తత్ త్వాం పాతు. కిం హరిహరస్కన్దాదిభిర్దేవతైః ఇత్యుక్తే పాతు త్వామిత్యనుచితమ్; ఆనన్దయతు త్వామిత్యుచితం స్యాత్.

అన్యేషు కావ్యాఙ్గేషు అనయైవ దిశా స్వయమౌచిత్యముత్ప్రేక్షణీయమ్. తదుదాహరణాన్యానన్త్యాన్న ప్రదర్శితానీత్యలమతిప్రసఙ్గేన.

కాని అమరుకుని శ్లోకము మాత్ర ముదాహరణము కాదు—

"పురుషాయితమునందు, రతాంతసమయమున, చెరిగిపోయి కదలు చున్న ముంగురులను ధరించుచున్నదియు, కదలుచున్న కుండలములు కల దియు, అతిసూక్ష్మములైన చెమటతుంపురులచే కొంచెము చెరిగిన తిలకము కలదియు అగు తన్వంగియొక్క ముఖము చాలాకాలము నిన్ను రక్షించు గాక. విష్ణువు శివుడు, స్కందుడు మొదలైన దేవతలచేత ఏమి ప్రయోజనము?"

"రతివ్యత్యయమున కదలుచున్న ముంగురులు కలదియు చలించుచున్న కుండలములు గలదియు స్వేదోదకముచేత కొంచెము తుడిచివేయబడిన తిలకము గలదియు అగు తన్వియొక్క ముఖము నిన్ను రక్షించుగాక; హరి హరస్కందాదిదేవత లందరును ఎందులకు?" అని చెప్పిన ఈ శ్లోకమున "పాతుత్వామ్" అనుట అనుచితము. "త్వామ్ ఆనన్దయతు" నీకు ఆనందము కలిగించుగాక అని అనుట యుక్తము.

ఇతర కావ్యాంగములలో కూడ ఇట్లే ఔచిత్యమును స్వయముగ ఊహింపకొనవలెను వాటి ఉదాహరణములు అనంతము లగుటచే చూపబడ లేదు. ఇంక అతిప్రసంగము చేయకుండ ముగించెదము.

## ఉపసంహారః

ఆసీత్ ప్రకాశేన్ద్ర ఇతి ప్రకాశః
కాశ్మీరదేశే త్రిదశేశ్వరశ్రీః.శ్వ

అభూద్ గృహే యస్య పవిత్ర సత్ర
మచ్ఛిన్న మగ్రాసన మగ్రజానామ్. 1

కాశ్మీరదేశములో దేవేంద్రుని వంటి ఐశ్వర్యము గల ప్రకాశేంద్రు డను ఒక ప్రసిద్ధపురుషుడు ఉండెడివాడు. ఆతని గృహమున అగ్రజులకు అగ్రాసనము ఇచ్చెడి ఒక అవిచ్ఛిన్న మైన పవిత్రసత్రము (అన్నదాన సత్రము) ఉండెడిది.

యః శ్రీస్వయంభూభవనే విచిత్రే
లేప్యప్రతిష్ఠాపిత మాతృచక్రః.
గోభూమికృష్ణాజిన వేశ్మదాతా
తత్రైవ కాలే తను ముత్ససర్జ. 2

ఆతడు విచిత్ర మైన స్వయంభూదేవాలయమున సున్నముతో (లేప్య) మాతృచక్రప్రతిష్ఠ చేసి, గోవులను, భూమిని కృష్ణాజినమును, గృహమును దానము చేసి ఆ సమయముననే దేహత్యాగము చేసెను.

తస్యాత్మజః సర్వమనీషిశిష్యః
శ్రీవ్యాసదాసాపరపుణ్యనామా.
క్షేమేన్ద్ర ఇత్యక్షయ కావ్యకీర్తి —
శ్చక్రే నవౌచిత్య విచారచర్చామ్. 3.

ఆతని కుమారుడును, సర్వపడింతులకు శిష్యుడును, "శ్రీవ్యాసదాసుడు" అను మరి యొక పుణ్యనామధేయము కలవాడును, అక్షయ మైన కావ్య కీర్తిని గడించిన వాడును అగు క్షేమేంద్రుడు 'ఔచిత్యవిచారచర్చా' అను ఈ క్రొత్త గ్రంథమును రచించెను.

శ్రీరత్నసింహే సుహృది ప్రయాతే
శార్వం పురం (శ్రీ) విజయేశరాజ్ఞి (జ్ఞే).
తస్యాత్మజస్యోదయసింహనామ్నః
కృతే కృతస్తేన గిరాం విచారః. 4.

విజయేశపురమునకు (?) రాజైన, మిత్రుడైన శ్రీరత్నసింహుడు కైలాసమునకు పోయిన పిమ్మట, ఆతని కుమారుడైన ఉదయసింహుని కొరకై ఆతనిచే కావ్యములకు సంబంధించిన ఈ విచారము చేయబడినది.

యస్యాసిః పరివారకృత్త్రిభువనప్రఖ్యాతశీలశ్రుతేః
సర్వస్యావనతేన యేన నితరాం ప్రాప్తా విశేషోన్నతిః.
ఆశాః శీతలతాం నయత్యవిరతం యస్య ప్రతాపానల-
స్తస్య శ్రీమదనన్తరాజనృపతేః కాలే కిలాయం కృతః. 5

ఇతి శ్రీప్రకాశేన్ద్రాత్మజ వ్యాసదాసాపరాఖ్యశ్రీక్షేమేన్ద్ర
కృతా ఔచిత్యవిచారచర్చా సమాప్తా.

మూడు లోకములందును ప్రసిద్ధమైన శీలము శాస్త్రపాండిత్యము గల ఎవనికి ఖడ్గము కేవలము పరివారముగా మాత్రమే ఉండునో (దానిని ఉపయోగించు అవసరము లేకపోవుటచే అది కేవలము చిహ్నము మాత్రమే అని అర్థము) అందరి విషయమునను నమ్రుడైన ఎవనిచే అధికమైన ఔన్నత్యము సంపాదింపబడినదో, ఎవని ప్రతాపాగ్ని ఎల్లప్పుడును దిక్కులను చల్లగా చేయునో, అట్టి శ్రీమదనంతరాజు పరిపాలనాకాలములో ఈ గ్రంథము రచింపబడినది.

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన
ఔచిత్యవిచారచర్చా వ్యాఖ్య
బాలానందిని
సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః

# కవికణ్ఠాభరణమ్

కవిత్వప్రాప్తిర్నామ ప్రథమః సంధిః.

జయతి జితసుధామ్భఃసంభవద్వాగ్భవశ్రీ—
రథ సరససముద్యత్కామతత్త్వానుభావా.
తదను పరమధా మధ్యాన స లబ్ధమోక్షా
రవిశశిశిఖిరూపా త్రైపురీ మన్త్రశక్తిః. 1.

## బాలానన్దిని వ్యాఖ్యా

నత్వా శ్రీ తాతపాదాదీన్ శాస్త్రమన్త్రాదిసద్గురూన్.
కవికణ్ఠాభరణకం వ్యాకరోమ్యాన్ధ్రభాషయా.

క్షేమేంద్రు డను మహాకవిపండితుడు కవితాశక్తిని ఎట్లు సంపాదింపవలెనో, కవిత్వ మెట్లు వ్రాయవలెనో బోధించు కవికంఠాభరణ మను గ్రంథమును రచింప బూని, నిర్విఘ్న సమాప్తిని కోరుచు పరమేశ్వరీ సంస్మరణరూప మగు మంగళాచరణము నాచరించుచున్నాడు--.

"త్రికూటాత్మక మైన మంత్రశక్తి సూర్యచంద్రఅగ్నిరూప మైనది. వాటిలో మొదటి కూటము వాగ్భవకూటము, రెండవది కామకలాకూటము, మూడవది ఆనందకూటము. ఈ విధముగ త్రికూటాత్మ మగు ఆ త్రిపుర మంత్రశక్తి సర్వోత్కర్షతో ఉన్నది."

ఈశ్లోకములోని విషయము మంత్రశాస్త్రమునకు సంబంధించినది. దానినుండియే గ్రహింపదగినది.

శిష్యాణాముపదేశాయ విశేషాయ విపశ్చితామ్
అయం సరస్వతీసారః క్షేమేన్ద్రేణ ప్రదర్శ్యతే 2.

"శిష్యుల ఉపదేశము కొరకును, పండితుల విశేషవిజ్ఞానము కొరకును క్షేమేంద్రునిచే ఈ సరస్వతీ సారము చూపబడుచున్నది".

వి. సరస్వతి సకలవాఙ్మయస్వరూపిణి. వాఙ్మయమున కంతకును సారము వంటిది కావ్యము. అందుచే కావ్యము నెట్లు నిర్మింపవలెనో ఉపదేశించు ఈ గ్రంథము సరస్వతీసారము వంటిది.

తత్రాకవేః కవిత్వాప్తిః శిక్షా ప్రాప్తగిరః కవేః
చమత్కృతిశ్చ శిక్షాప్తౌ గుణదోషోద్గతిస్తతః. 3.
పశ్చాత్ పరిచయప్రాప్తిరిత్యేతే పఞ్చ సన్ధయః
సముద్దిష్టాః క్రమేణైషాం లక్ష్యలక్షణముచ్యతే 4.

"అందు మొదట (1) కవి కానివాడు కవిత్వమును సంపాదించుట, (2) వాక్కును (కవిత్వమును) సంపాదించుకున్నవానికి అందులో ఇంకను కొంత శిక్షణము, (3) శిక్షణము పొందిన తరువాత చమత్కారము (4) అటు పిమ్మట గుణదోషముల జ్ఞానము, దాని తరువాత (5) పరిచయప్రాప్తి అని ఐదు సంధులు (ప్రకరణములు) ఉద్దిష్టము లైనవి. క్రమముగ వాటి లక్షణ లక్ష్యములు చెప్పబడుచున్నవి.

వి. ఈ గ్రంథములో (1) కవిత్వప్రాప్తి (2) శిక్షాకథనము (3) చమత్కారకథనము (4) గుణదోషవిభాగము, (5) పరిచయప్రాప్తి అను ఐదు ప్రకరణములున్నవి. ఈ గ్రంథమునకు కంఠాభరణ మని పేరుపెట్టినాడు గాన, క్షేమేంద్రుడు, ఇందులోని ప్రకరణములు, కంఠాభరణములోని సంధుల (అతుకుల)వంటివి అను అభిప్రాయముతో వీటికి సంధు లని పేరు పెట్టి ఉండును.

సువిభక్తిసమన్వితం బుద్ధై
ర్గుణసంయుక్తమముక్తసౌష్ఠవైః.

రచితం పద్మకైః సువర్ణవత్
కవికణ్ఠాభరణం విచార్యతామ్. 5

వి. గ్రంథమునకును అలంకారమునకును అన్వయించు శ్లిష్ట విశేషణములను ప్రయోగించి ఈ గ్రంథములోని వైశిష్ట్యమును సూచించుచున్నాడు.

"మంచి విభక్తులు కలదియు (అలంకారము పక్షమున మంచి విభాగములు కలదియు), చక్కని కూర్పు కలదియు, గుణములతో (త్రాడుతో) కూడినదియు, సౌష్ఠవమును వీడని పదములతో (పదకములతో-చిన్న చిన్న బిళ్ళలతో) రచింపబడినదియు మంచి వర్ణములు (బంగారము) కలదియు అగు ఈ కవికంఠాభరణమును పండితులు విమర్శింతురుగాక"

అథేదానీ మకవేః కవిత్వశక్తిరుపదిశ్యతే—
ప్రథమం తావద్దివ్యః ప్రయత్నః, తతః పౌరుషః.

ఇపుడు కవి కానివాడు కవిత్వశక్తి నెట్లు సంపాదింపవలెనో చెప్పబడుచున్నది. ముందుగా దివ్యప్రయత్నము, తరువాత పౌరుషప్రయత్నము.

వి. దేవతాప్రసాదము ద్వారా కవిత్వమును సంపాదించుటకై చేయు ప్రయత్నము - దేవతోపాసనాదికము - దివ్య ప్రయత్నము. లోకజ్ఞాన శాస్త్రజ్ఞానాదులను సంపాదించి, తద్ద్వారా కవితాశక్తిని పెంపొందించుకొనుటకై చేయు ప్రయత్నము పౌరుషప్రయత్నము. ముందుగా ఆ దివ్యప్రయత్నమును గూర్చి చెప్పుచున్నామని అర్థము.

ఓం స్వస్త్యఙ్కం స్తుమః సిద్ధమన్తరాద్యమితీప్సితమ్
ఉద్యదూర్జప్రదం దేవ్యా ఋ ఋూ ఌ ౡ నిగూహనమ్. 6.

ఏకమైశ్వర్యసంయుక్త మోజోవర్ధనమౌషధమ్
అన్తరాన్తఃకలాఖణ్డ గలధ్ఘనసుధాఙ్కితమ్. 7.

చన్ద్రోచ్చలజ్జలం ప్రోజ్ఝద్ జ్ఞానం టరసయుతమ్
దమ్భరప్రౌఢికిరణం తథ తాం దధదున్నతమ్. 8.

పరం ఫలప్రదం బద్ధమూలోద్భవమయం వపుః
రమ్యం లఘువరం శర్మ వర్ధత్సర్వసహోక్షరమ్. 9.

ఆరవ శ్లోకమునుండి 9వ శ్లోకమువరకు క్షేమేంద్రుడు ఒక సరస్వతీ మంత్రమును సాంకేతికపద్ధతిలో చెప్పి యున్నాడు. మంత్రములను గురువు ద్వారా తెలిసికొని జపాదులు చేయవలెను గాని పుస్తకాదుల ద్వారా గ్రహింప గూడదు. అట్లు చేసినచో ఆ జపాదులు నిష్ఫలములగుటయే కాక ప్రత్య వాయహేతువులు కూడ అగు నని సంప్రదాయము. అందుచే మంత్రాక్షర ములను ప్రత్యక్షముగ గ్రంథరూపమున చూపక సంకేతములద్వారా చూపుట ఆచారము. ఆ ఆచారమునే క్షేమేంద్రు డనుసరించినాడు.

ఏతాం నమః సర్వత్ర యః క్రియామాతృకాం జపేత్
క్షేమమైన్ద్రిం స లభతే భవ్యోఽభినవవాగ్భవమ్. 10.

శ్వేతాం సరస్వతీం మూర్ధ్ని చంద్రమండలమధ్యగామ్
అక్షరాభరణాం ధ్యాయేద్వాఙ్మయామృతవర్షిణీమ్. 11.

త్రికోణయుగమధ్యే తు తడిత్తుల్యాం ప్రమోదినీమ్
స్వర్గమార్గోద్యతాం ధ్యాయేత్ పరమామృత వాహినీమ్ 12.

నిర్వికారాం నిరాకారాం శక్తిం ధ్యాయేత్పరాత్పరామ్
ఏషా బీజత్రయీ వాచ్యా త్రయీవాక్కామముక్తిసూః. 13

కావ్యక్రియేచ్ఛాజ్కురమూలభూమి
మస్యైష్య విశ్రాన్తిలవేన మోక్షః.
అస్యావధానే మదనస్య మోక్షః
తృతీయబీజే సకలేఽస్తి మోక్షః. 14.

ఈ ఐదు శ్లోకములలో కూడ ఉపాసనావిధానము, తత్ఫలితాలు చెప్ప బడినవి. ఇవియు మంత్రశాస్త్రగతములే.

10వ శ్లోకములో క్రియామాతృకాజపము చేసినవాడు ఇంద్రునికి సంబంధించిన క్షేమమును (క్షేమమైన్ద్రం) పొందును అని చెప్పుటలో తానీ ఉపాసన చేసి ("క్షేమేంద్ర") సంజ్ఞను పొందినట్లు క్షేమేంద్రుడు సూచించు చున్నాడు. బహుశా క్షేమేంద్రుడు అనునది దీక్షానామము అయి ఉండును. వ్యాసదాసు డనునది కవి అసలు పేరై ఉండును. పుష్పికలలో "వ్యాసదాసా పరాఖ్య క్షేమేంద్ర" అని అనుటచే 'వ్యాసదాస' అనునదికూడా భారతమంజ ర్యాదులు రచించుటచే తరువాత వచ్చిన పేరైన పక్షాన అసలు పేరు ఈ రెండును కాక మరియొకటి ఏదియో అయి ఉండవచ్చును.

అథ పౌరుషః — తత్ర త్రయః శిష్యాః, కావ్య క్రియా యాముపదేశ్యాః — అల్పప్రయత్న సాధ్యః, కృచ్ఛ్ర సాధ్యః, అసాధ్యశ్చేతి.

ఇక పౌరుషప్రయత్నము చెప్పబడుచున్నది. అల్పప్రయత్నసాధ్యుడు, కృచ్ఛ్రసాధ్యుడు, అసాధ్యుడు అని శిష్యులు, అనగా కావ్యరచనను గూర్చి ఉపదేశించుటకు తగినవారు, మూడు విధములుగా నుందురు.

వి. కొంచెము ప్రయత్నము చేసినచో కవిత్వము నేర్వగలిగినవాడు అల్పప్రయత్నసాధ్యుడు. శ్రమపడినచో కవిత్వము నేర్వగలిగినవాడు కృచ్ఛ్ర సాధ్యుడు. ఎంతప్రయత్నము చేసినను నేర్వజాలని వాడు అసాధ్యుడు. సాధ్యుడు అనగా నేర్పుటకు తగినవాడు. ఈ పేర్లు ఆయుర్వేదములో ఉన్న రోగవిభాగాలను అనుసరించి చేయబడిన ట్లున్నవి.

తత్ర ప్రథమః—

కుర్వీత సాహిత్యవిదః సకాశే
శ్రుతార్జనం కావ్యసముద్భవాయ.

న తార్కికం కేవలశాబ్దికం వా
కుర్యాద్గురుం సూక్తివికాసవిఘ్నమ్ 15.

అందు మొదటివాడు - అల్పప్రయత్నసాధ్యుడు-చేయవలసిన ప్రయత్నము చెప్పబడుచున్నది—

కావ్యరచన చేయవలె ననుకొనువాడు సాహిత్యవేత్త దగ్గర శాస్త్రాభ్యాసమును (కావ్యరచనావిధానాభ్యాసమును) చేయవలెను. తార్కికుని గాని, కేవలము వ్యాకరణ శాస్త్రమునందు మాత్రము పాండిత్యము కలవానిని గాని, గురువుగా చేసికొనగూడదు. వీరిరువురును కావ్యవికాసమునకు విఘ్నహేతువులు.

విజ్ఞాతశబ్దాగమనామధాతు
శ్ఛన్దోవిధానే విహితశ్రమశ్చ
కావ్యేషు మాధుర్యమనోరమేషు
కుర్యాదఖిన్నః శ్రవణాభియోగమ్. 16.

శబ్దశాస్త్రమును, నామవాచకములను, ధాతువులను బాగుగా తెలిసికొని, ఛందోవిధానమునందు పరిశ్రమచేసి, మాధుర్యముచే మనోహరములైన కావ్యములను సాహ్లాదమైన మనస్సుతో నిరంతరము వినవలెను.

వి. అభియోగ మనగా ఒక కార్యమును సాధించుటకై పట్టుదల. శ్రవణాభియోగం = పట్టుదలతో వినుటను.

గీతేషు గాథాస్వథ దేశభాషా
కావ్యేషు దద్యాత్సరసేషు కర్ణమ్,
వాచాం చమత్కారవిధాయినీనాం
నవార్థచర్చాసు రుచిం విదధ్యాత్. 71

గీతములను, గాథలను (గాథలనగా ప్రాకృతభాషలో ఆర్యాఛందస్సు

వంటి ఛందస్సులలో గ్రథితములైన, పద్యములు) సరసమైన దేశభాషాకావ్యము లను చెవి ఒగ్గి వినవలెను. చమత్కారకరములైన వాక్కుల నూతనార్థములను గూర్చిన చర్చలయందు అభిరుచిని చూపవలెను.

రసే రసే తన్మయతాం గతస్య
గుణే గుణే హార్ష వశీకృతస్య
వివేక సేకస్వక పాకభిన్నం
మనః ప్రసూతేఽఙ్కురవత్కవిత్వమ్ 18

ప్రతిరసమునందును తన్మయత్వమును పొందుచు, ప్రతి గుణము నందును ఆనందముచే వశీకృతుడైనవాని మనస్సు, వివేకము యొక్క సేకముచే సహజమైన పాకముచే భిన్నమైనదై, అంకురమును వలె కవిత్వ మును ఆవిర్భవింపచేయును.

వి. నీళ్ళచే తడపబడిన బీజము బ్రద్దలై అంకురమును పుట్టించినట్లు మనస్సు వివేక మనెడు సేకముచేత (నీటి తడుపుచేత) భిన్నమై (వికసించి నదై) కవిత్వ మను అంకురమును తొడుగును. మొదటి తరగతికి చెందినవా డీ విధముగ అల్పప్రయత్నముచేతనే కావ్యరచనాసామర్థ్యమును సంపాదింప గలుగును.

అథ ద్వితీయః—
పఠేత్సమస్తాన్ కిల కాలిదాస
కృతప్రబన్ధానితిహాసదర్శీ.
కావ్యాధివాసప్రథమోద్గమస్య
రక్షేత్పరస్తార్కికగన్ధముగ్రమ్. 19.

ఇంక రెండవవాడు, అనగా కృచ్ఛ్రసాధ్యుడు—

ఇతిహాసములను పరిశీలించుచు, కాళిదాసు రచించిన ప్రబంధముల

నన్నింటిని పఠించవలెను. కావ్యసుగంధ ప్రథమాంకురముయొక్క ఎదుట ఉగ్రమైన తార్కికగంధము రక్షించవలెను.

సున్నితమైన సువాసనను తీవ్ర మైన దుర్గంధము అణచివేసి నట్లు కవితాసుగంధమును తార్కికోగ్రగంధము అణచివేయును. అందుచే ఆ ఉగ్రగంధమునుండి కవితాగంధమును సంరక్షించుకొనవలెను. కఠినమైన తర్కశాస్త్రమును అభ్యసించెడువారికి కవితాశక్తి అబ్బుట కష్టము గాన కవిత్వము వ్రాయదలచినవాడు ఆ తర్కశాస్త్రము వైపు పోకూడదని భావము. ఈ విషయమున సుప్రసిద్ధశ్లోక మొకటి కలదు——

నైవ వ్యాకరణజ్ఞమేతి పితరంన భ్రాతరం తార్కికం
దూరాత్సంకుచితైవ గచ్ఛతి పురశ్చణ్డాలవచ్ఛాన్దసాత్.
మీమాంసానిపుణం నపుంసకమితి జ్ఞాత్వా నిరస్తాదరా
కావ్యాలఙ్కరణజ్ఞమేవ కవితాకన్యా వృణీతే స్వయమ్.

నేడు కూడా విజ్ఞానశాస్త్రము, గణితము, భాషాశాస్త్రము మొదలైన శాస్త్రములను మాత్రమే ఎక్కువ అధ్యయనము చేయువారు సాధారణముగా సాహిత్యవిముఖులుగా కనబడుచున్నారు.

మహాకవేః కావ్యనవక్రియార్థే
తదేకచిత్తః పరిచారకః స్యాత్
పదే చ పాదే చ పదావశేష
సంపూరణేచ్ఛాం ముహురాదదీత. 20.

క్రొత్తగ కావ్యరచనాభ్యాసము చేయువాడు, తదేకచిత్తతతో మహాకవికి పరిచారకుడుగా ఉండవలెను. పదమునందును. పాదమునందును పదశేషమును పూరించుటకు కోరికను మాటిమాటికిని చూపవలెను.

వి. మహాకవి దగ్గర శుశ్రూష చేయుచు అతడు రచనావ్యాసంగమును

జరుపునపుడు అవకాశము కలిగినపు డెల్లా అవసరమైన పదమును గాని, పాదమును గాని పూరించుచుండవలెను అని అర్థము.

అభ్యాసహేతోః పదసంనివేశై
ర్వాక్యార్థశూన్యైర్విరచీత వృత్తమ్.
శ్లోకం పరావృత్తిపదైః పురాణం
యథాస్థితార్థం పరిపూరయేచ్చ 21.

కవిత్వము (వృత్తరచన) అలవరుచుకొనుటకై ప్రారంభదశలో వాక్యార్థ మేమియు లేకపోయినను. ఏవేవో పదములు కూర్చి వృత్తమును పూర్తిచేయవలెను. అట్లే ప్రాచీన శ్లోక మేదైన తీసికొని, అర్థము మారి పోకుండగా, ఉన్న పదములకు బదులు వేరు పదములను ప్రయోగించి శ్లోకమును పూర్తిచేయవలెను.

తత్ర వాక్యార్థశూన్యం యథా—
ఆనన్దసన్దోహపదారవిన్దకున్దేన్దుకన్దోదితబిన్దుబృన్దమ్
ఇన్దిన్దిరాన్దోలితమన్దమన్దనిష్యన్దనన్దత్మకరన్దవన్ద్యమ్.

వి. పై శ్లోకములో ఉపజాతివృత్తమునకు కావలసిన విధముగా పదములు కూర్చబడినవే కాని వాక్యార్థ మేమియు లేదు. ప్రారంభదశలో ఈ విధంగా నిరర్థక శ్లోకములు వ్రాయగా వ్రాయగా సార్థక శ్లోకములు వ్రాయు అలవాటు ఏర్పడు నని భావము.

పరావృత్తిపదైర్యథా—
వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ. (రఘు 1-1)
వాణ్యర్థావివ సంయుక్తౌ వాణ్యర్థప్రతిపత్తయే
జగతో జనకౌ వన్దే శర్వాణీశశిశేఖరౌ.

పదములనుమార్చి శ్లోకములను రచించుటఎట్లనగా- "వాగర్థావివ"మొ.

వి. ఇచట ప్రసిద్ధ మైన శ్లోకమును తీసికొని, దాని అర్థములో మాత్రము మార్పు లేకుండ, ఉన్న పదములకు బదులు వేరు పదములు ఉపయోగించి శ్లోకము రచింపబడినది.

అథ తృతీయం—

యస్తు ప్రకృత్యాశ్మసమాన ఏవ కష్టేన వా వ్యాకరణేన నష్టః
తర్కేణ దగ్ధోఽనలధూమినా వా హ్యవిద్ధకర్ణః సుకవిప్రబన్ధైః 22

న తస్య వక్తృత్వసముద్భవః స్యాచ్ఛిక్షావిశేషైరపి
సుప్రయుక్తైః
న గర్దభో గాయతి శిక్షితోఽపి
సన్దర్శితం పశ్యతి నార్క మన్ధః.

ఇంకా మూడవ తరగతికి చెందినవాడు—

ఎవడు స్వభావము చేత బండరాయివంటి వాడో, లేదా, కష్టమైన వ్యాకరణము చదివి చదివి చెడిపోయినాడో, లేదా నిప్పుతోటి పొగతోటి నిండిన తర్కముచేత దహింపబడినాడో, లేదా సత్కవుల ప్రబంధములను ఎప్పుడును చెవిలో పడనీయలేదో, వానికి ఎన్ని శిక్షావిశేషములు చక్కగ ప్రయోగించినను, వక్తృత్వము కలుగనే కలుగదు. ఎంతనేర్పినను గార్ధభము గానము చేయజాలదు. గ్రుడ్డివానికి సూర్యుని చూపించినను చూడజాలడు.

వి. తర్కశాస్త్రములో "పర్వతో వహ్నిమాన్ ధూమాత్" వంటి అనుమాన ప్రయోగములు ఉండును గాన "అనలధూమినా తర్కేణ" అని పరిహాస వచనము.

ఇతి శతసుకృతానాం ప్రాక్తనానాం విపాకే
భవతి శుభమతీనాం మన్త్రసిద్ధం కవిత్వమ్.
తదనుపురుషయత్నైర్ధీమతామభ్యుదేతి
స్ఫురతి జడధియాం (శ్రీ) శారదాసాధనేన. 24

ఇతి వ్యాసదాసాపరాఖ్యక్షేమేన్ద్రకృతే కవికణ్ఠాభరణే
కవిత్వప్రాప్తిః ప్రథమః సంధిః

ఈ విధముగ ప్రాచీనములైన (పూర్వజన్మకృతములైన) విస్తృత పుణ్యములు ఫలోన్ముఖములైనపుడు, శుభమైన మతికలవారికి మంత్ర సిద్ధమైన కవిత్వము లభించును. అటుపిమ్మట బుద్ధిమంతులకు పురుషప్రయత్నముచే కవిత్వము అభివృద్ధిచెందును. జడబుద్ధులకు శ్రీశారద సాధనముచే స్ఫురించును.

వి మొదటి మూడుపాదములలో చెప్పినవారు అల్పప్రయత్నసాధ్యులు. నాల్గవ పాదములో చెప్పినవారు కృచ్ఛ్రసాధ్యులు.

కవికంఠాభరణవ్యాఖ్య యగు బాలానందినిలో
కవిత్వప్రాప్తి యను
ప్రథమసంధి సమాప్తము

ప్రాప్తగిరః కవేః శిక్షాకథనం నామ ద్వితీయః సంధిః

ఛాయోపజీవీ పదకోపజీవీ పాదోపజీవీ సకలోపజీవీ
భవేదథ ప్రాప్తకవిత్వజీవీ స్వోన్మేషతో వా భువనోపజీవ్యః

ఛాయోపజీవి, పదకోపజీవి, పాదోపజీవి, సకలోపజీవి, అని కవులు నాలుగు విధములుగా ఉందురు. కొంతకాలము తరువాత లభించిన స్వీయ కవిత్వమునే ఆధారముగా గొనువాడుగా అయి, లేదా స్వీయప్రతిభావిశేషముచేత; భువనోపజీవ్యు డగును.

వి. పూర్వకవుల కవిత్వచ్ఛాయలను స్వీకరించి కవిత్వము చెప్పువాడు ఛాయోపజీవి పూర్వకవుల శ్లోకములలోని కొన్ని పదములు గ్రహించి కవిత్వము చెప్పువాడు పదకోపజీవి. పాదములను గ్రహించువాడు పాదోపజీవి. పదాలను అర్థచ్ఛాయను కూడ ప్రాచీనకవులనుండి గ్రహించినవాడు సకలోప

జీవి. ఇట్లు ప్రయత్నము చేయగా చేయగా కవితాశక్తి లభించినవాడు, లేదా ఛాయోపజీవిత్వాదులు లేకుండగనే స్వప్రతిభావిశేషముచే కవిత్వము చెప్ప గలిగినవాడు భువనోపజీవ్యు డగును. అనగా ప్రపంచములో కవిత్వము చెప్ప దలచినవా రందరును ఈతనిపై ఆధారపడి యుందురు. ఇతరులపై ఆధార పడి జీవించువాడు ఉపజీవి. ఇతరులు జీవించుటకు ఆధారమైనవాడు ఉప జీవ్యుడు.

ఛాయోపజీవీ యథా భట్టభల్లటస్య—

4. నన్వాశ్రయస్థితిరియం తవ కాలకూట
కేనోత్తరోత్తరవిశిష్టపదోపదిష్టా.
ప్రాగర్ణవస్య హృదయే వృషలక్ష్మణోఽథ
కణ్ఠేఽధునా వససి వాచి పునః ఖలానామ్.

యథా చ శ్రీమదుత్పలరాజదేవస్య—

5. మాత్సర్యతీవ్రతిమిరవృతదృష్టయో యే
తే కస్య నామ న ఖలా వ్యథయన్తి చేతః.
మన్యే విముచ్య గలకన్దరమిన్దుమౌలే
ర్యేషాం సదా వచసి వల్గతి కాలకూటః.

ఛాయోపజీవికి ఉదాహరణమును చూపుటకు భట్ట భల్లటుని శ్లోకము, శ్రీమదుత్పలరాజదేవుని శ్లోకము ఎట్లనగా—

"ఓ కాలకూటమా! ఉత్తరోత్తరము వైశిష్ట్యముతో కూడిన ఈ వివిధా శ్రయములందు స్థితి నీకు ఎవరు ఉపదేశించినారు? మొదట సముద్రగర్భము నను, తరువాత శివుని కంఠమునందును నివసించి ఇపుడు దుర్మార్గుల వాక్కు నందు నివసించుచున్నావు."

"మాత్సర్యమనెడు తీవ్రమైన తిమిరముచే కప్పబడిన దృష్టి గల దుర్మార్గులు ఎవరి మనస్సుకు బాధ కలిగించరు? కాలకూటము శివుని

కంఠమును వదలిపెట్టి సర్వదా ఈ దుర్మార్గుల వాక్కులలోనే విహరించుచున్నదని నా అభిప్రాయము."

వి. ఉత్పల రాజదేవుడు భట్టలల్లటుని శ్లోకములోని భావమును కొంత వరకు గ్రహించినాడు గాన ఉతడు ఛాయోపజీవి.

పదకోపజీవీ యథా ముక్తాకణస్య—

6. యథా రన్ధ్రం వ్యోమ్నశ్చలజలదధూమః స్థగయతి
స్ఫులిఙ్గానాం రూపం దధతి చ।యథా కీటమణయః।
యథా విద్యుజ్జ్వాలోల్లసనపరిపిఙ్గాశ్చ కకుభ
స్తథా మన్యే లగ్నః పథికతరుఖణ్డే స్మరదవః।
యథా చైతద్భ్రాతుశ్చక్రపాలస్య—

7. సరస్యామేతస్యాముదరబలివీచీవిలులిత-
యథా లావణ్యామ్భో జఘనపులినోల్లఙ్ఘనకరమ్।
యథా లక్ష్యశ్చాయం చలనయన మీనవ్యతికర-
స్తథా మన్యే మగ్నః ప్రకటకుచకుమ్భః స్మరగజః।

పదకోపజీవికి ఉదాహరణమును చూపుటకు ముక్తాకణుని శ్లోకము, ఆతని సోదరుడైన చక్రపాలుని శ్లోకము ఎట్లనగా—

"కదలుచున్న మేఘములనే ధూమము ఆకాశరంధ్రమును కప్పివేయుచున్నది. ఎఱ్ఱటి పురుగులు అగ్నికణముల రూపమును ధరించుచున్నవి. (అగ్నికణముల వలె నున్నవి). మెరపు లనెడు జ్వాలలు మెరియుటచే దిక్కులు పచ్చగా కనబడుచున్నవి. ఇదంతయుచూడగా పాంథులనెడు వృక్షసముదాయమునందు మన్మథు డనెడు దావాగ్ని రగుల్కొన్నదని తలచెదను."

"ఉదరమునందలి వళు లనెడు తరంగములచే కదల్చివేయబడిన లావణ్య మనెడు జలము జఘన మనెడు పులినమును (ఇసుకతిన్నె) ముంచెత్తు

చున్నది. చంచలములైన నేత్రములనెడు మీనముల సంబంధము కానవచ్చు చున్నది. ఇదంతయు చూడగా ప్రకటమైన కుచకుంభములు గల స్మరగజము ఈ సరస్సులో (ఈ శరీరమున) మునిగిన దని అనుకొనుచున్నాను."

వి సంస్కృతములో 'యథా' 'తథా' ల ప్రయోగము చాల అందమైన ప్రయోగము. "యథా ధూమః వ్యోమరంధ్రం స్థగయతి తథా స్మరదవః పథికతరుఖండే లగ్నః ఇతి మన్యే" ఇత్యాది ప్రయోగములలో ఇది "ఎట్లు జరిగెనో అది కూడ అట్లు జరిగెను" అని మామూలుగా అర్థము చెప్పకూడదు. "ఇది ఈ విధముగా ఉండుట చూడగా అది అట్లైనట్లు తోచుచున్నది" అని దీని అర్థము. ముక్తాకణుడు ఎట్లు 'యథా' 'తథా' 'మన్యే' అను పదములను ప్రయోగించి చక్కని కావ్యము రచించెనో అట్లే ఆతని సోదరుడు ఆ పదములను గ్రహించి మరి యొక కావ్యమును వ్రాయుటచే ఇతడు పదకోపజీవి.

పాదోపజీవి యథాఽమరకస్య—

8. గన్తవ్యం యది నామ నిశ్చితమహో గన్తాసి కేయం త్వరా
ద్విత్రాణ్యేవ దినాని తిష్ఠతు భవాన్ పశ్యామి యావన్ముఖమ్.
సంసారే ఘటికాప్రణాల విగలద్వారా సమే జీవితే
కో జానాతి పునస్త్వయా సహ మమ స్యాద్వా న వా సంగమః.

యథా మమ—

9. హంహో! స్నిగ్ధ సఖే! వివేక! బహుభిః ప్రాప్తోఽసి పుణ్యైర్మయా
గన్తవ్యం కతిచిద్దినాని భవతా నాస్మత్సకాశాత్క్వచిత్.
త్వత్సఙ్గేన కరోమి జన్మమరణోచ్ఛేదం గృహీతత్వరః
కో జానాతి పునస్త్వయా సహ మమ స్యాద్వా న వా సంగమః.

పాదోపజీవికి ఉదాహరణము చూపుటకు అమరకుని శ్లోకము నా (క్షేమేంద్రుని) శ్లోకము ఎట్లనగా—

"గన్తవ్యం" ఇత్యాదిశ్లోకము ఔచిత్యవిచారచర్చలో 50వ శ్లోకముగా వచ్చినది.

"హంహో" ఇత్యాదిశ్లోకము —" ఓ ప్రియమిత్రమా! వివేకమా! నేను ఎన్నో పుణ్యములు చేయుటచేత ఇన్నాళ్ళకు నాకు లభించినావు. కొన్ని నాళ్ళ పాటు, నీవు నా దగ్గరనుండి ఎచటికిని వెళ్ళిపోకుము. నీ సంగము చేత తొందరగా జన్మమరణములను నశింప చేసికొందును. నీవు మరల నాకు దొరికెదవో లేదో ఎవ డెరుగును?"

వి. అమరుకుని శ్లోకములోని నాల్గవపాదమును క్షేమేంద్రుడు యథాతథముగా గ్రహించినాడు గాన ఇతడు పాదోపజీవి.

సకలోపజీవీ యథార్యభట్టస్య—

10. శబ్దైర్విసర్గకటుభిర్మలినస్వభావాః
శ్రోత్రం ఖలా నిగడవత్ పరితస్తుదన్తి.
శ్రవ్యైరలుప్తపదబన్ధతయాతిమఞ్జు
మఞ్జీరవత్ తు సుజనా జనయన్తి మోదమ్.

యథా చ భట్టబాణస్య—

11. కటు క్వణన్తో మలదాయకాః ఖలా –
స్తుదన్త్యలం బన్ధనశృఙ్ఖలా ఇవ.
మనస్తు సాధుధ్వనిభిః పదే పదే
హరన్తి సన్తో మణినూపురా ఇవ. (కాదం. 6.)

సకలోపజీవికి ఉదాహరణము చూపుటకు ఆర్యభట్టుని శ్లోకము. భట్టబాణుని శ్లోకము ఎట్లనగా—

"చెడ్డ స్వభావము గల దుర్మార్గులు కటువుగా నుండు శబ్దములతో చెవులకు పీడ కలిగింతురు. సుజనులు లోపించని పదబంధముకల వగుటచే శ్రవ్యములైన శబ్దములతో సుందరమైన అందెళ్ళ వలె ఆనందమును కలిగింతురు."

వి. సంకెళ్ళు ఇనుపవగుటచే సహజముగా నల్లగా ఉండును. దుర్మా

ర్జుల స్వభావము చెడ్డదగుటచే వారు మలిన స్వభావులు. సుజనుల మాటలలో పదబంధములు చక్కగా ఉండును. అందుచే అవి లోపించని పదబంధములు గలవి. మంజీరములు కూడ ఎల్లప్పుడును పదములకు బంధింపబడి యుండును".

"దుర్మార్గులు సంకెళ్ళ వలె తీవ్రముగా ధ్వనిచేయుచు, మలమును, (చిత్తమాలిన్యము, మురికి అని రెండర్థములు) కలిగించుచు ఎక్కువగా పీడింతురు. సత్పురుషులు, మణినూపురముల వలె, ప్రతి మాటలోను, (ప్రతి అడుగునందును) మంచి ధ్వనులచేత మనస్సును ఆకర్షింతురు."

వి. ఇచట బాణభట్టు పూర్వకవినుండి భావమును, చాలావరకుపదములను గూడ సంగ్రహించి కావ్యము రచించినాడు గాన ఇతడు సకలోపజీవి.

భువనోపజీవ్యో యథా భగవాన్ వ్యాసః. తథా చోక్తమ్:-

12. ఇదం కవివరైః సర్వైరాఖ్యానముపజీవ్యతే
ఉదయం ప్రేప్సుభిర్భృత్యైరభిజాత ఇవేశ్వరః.

భువనోపజీవ్యు డగు కవికి ఉదాహరణము. వ్యాసభగవానుడు. అందుచేతనే ఈ విధముగ చెప్పబడినది—

"అభివృద్ధిని పొందగోరెడు భృత్యులు ఉత్తమవంశ సంజాతుడైన సత్ప్రభువును సేంవిచినట్లు ఈ ఆఖ్యానమును (మహాభారతమును) కవివరు లందరును సేవించి లాభము పొందుదురు."

ప్రాప్తగిరః కవేః శిక్షాస్తావదాహ—
వ్రతం సారస్వతో యాగః పూర్వం విఘ్నేశపూజనమ్
వివేకశక్తిరభ్యాసః సంధానం ప్రౌఢిరశ్రమః. 2.

ఇపు డిక వాక్కును స్వాధీనము చేసికొనిన కవి చేయవలసిన పనులను చెప్పుచున్నాడు.

"వ్రతము, (సరస్వతీ ప్రసాదము నిమిత్తము చేయు) సారస్వత

యాగము, ముందుగా విఘ్నేశ్వర పూజనము, వివేకశక్తి (మంచి చెడుగుల జ్ఞానము) అభ్యాసము, కావ్యమును కూర్చుటకై ప్రయత్నము, ప్రౌఢత్వము (ఆత్మవిశ్వాసము) ఎక్కువ శ్రమ పడకుండుట." (1-8)

వృత్తపూరణముద్యోగః పాఠః పరకృతస్య చ
కావ్యాఙ్గవిద్యాధిగమః సమస్యాపరిపూరణమ్ 3.

"వృత్తమును పూరించుటకై ప్రయత్నము, పరుల కవితలను చదువు చుండుట, కావ్యాంగము లైన విద్యలను సంపాదించుట, సమస్యా పూరణము" (9-12)

సహవాసః కవివరై ర్మహాకావ్యార్థచర్వణమ్
ఆర్యత్వం సుజనై ర్మైత్రీ సౌమనస్యం సువేషతా. 4.

"కవివరులతో కలిసిమెలిసి ఉండుట, మహాకావ్యముల అర్థము నాస్వాదించుట, ఆర్యత్వము (ఇతరులు దగ్గరకు చేరదగినవాడుగా ఉండుట), సత్పురుషులతో స్నేహము, మంచి మనస్సు, మంచి వేషమును ధరించుట". (13-18)

నాటకాభినయప్రేక్షా శృఙ్గారాలిఙ్గితా మతిః
కవీనాం సంభవే దానం గీతేనాత్మాధివాసనమ్. 5.

"నాటకాభినయమును చూచుట, శృంగారముతో కూడిన (సరసమైన) బుద్ధి, వీలును అనుసరించి కవులకు ధనము నిచ్చుచుండుట, గీతముచే ఆత్మకు అధివాసనము." (19-22)

వి సుంగధద్రవ్యధూపాదులచే వస్త్రాదులకు సువాసన కలుగునట్లు చేయుటకు అధివాసన మని పేరు. గీతాభ్యాసము ఆత్మకు ఒక విధమైన అధివాసనము వంటిది.

లోకాచారపరిజ్ఞానం వివిక్తాఖ్యాయికారసః
ఇతిహాసానుసరణం చారుచిత్రనిరీక్షణమ్. 6.

లోకాచారముల జ్ఞానము, పరిశుద్ధములైన (వివిక్త) ఆఖ్యాయికల యందు ఆసక్తి, ఇతిహాసములను అనుసరించుట (పరిశీలించుట), సుందర మైన చిత్తరవులను చూచుట". (23-26)

శిల్పినాం కౌశలప్రేక్షా వీరయుద్ధావలోకనమ్
శోక ప్రలాపశ్రవణం శ్మశానారణ్యదర్శనమ్. 7.

"ఆయా కళలలో ప్రవీణులైన శిల్పుల నేర్పును పరిశీలించుట, వీరుల యుద్ధమును చూచుట, శోకముతో చేయు ప్రలాపములను వినుట, శ్మశానము లను అరణ్యములను చూచుట". (27-30)

వ్రతినాం పర్యుపాసా చ నీడాయతనసేవనమ్
మధురస్నిగ్ధమశనం ధాతుసామ్యమశోకతా. 8.

"వ్రతముల నాచరించు వారిని సేవించుట, నీడములను ఆయతనము లను సేవించుట మధురము రుచికరము అగు భోజనము, ధాతుసామ్యము, శోకము లేకుండుట" (31-35)

వి. నీడ మనగా పక్షుల గూడు, ఆయతనము అనగా దేవాలయమని అర్థము చెప్పవచ్చును. నీడసేవన మనగా పక్షులు ఎట్లు గూళ్ళు కట్టుకొనునో పరిశీలించుట అయి ఉండవచ్చును. 'నీడాయతన' అను దానికే వేరేదైన అర్థమున్నదేమో తెలియదు. ధాతుసామ్యమనగా శరీరములోని వివిధధాతువు లకు ప్రకోపము లేకుండ ఆరోగ్యమును పరిరక్షించుకొనుట అని అర్థము.

నిశాశేషే ప్రబోధశ్చ ప్రతిభా స్మృతిరాదరః
సుఖాసనం దివాశయ్యా శిశిరోష్ణప్రతిక్రియా. 9.

"తెల్లవారుజామున మేల్కొనుట, ప్రతిభ, స్మరణశక్తి, ఆదరము, సుఖ మైన ఆసనము, పగలు నిద్రించుట, చలికిని వేడికిని ప్రతిక్రియ చేసి కొనుట," (36-42)

ఆలోక్య పత్రలేఖ్యాదౌ గోష్ఠీప్రహాసనజ్ఞతా
ప్రేక్షా ప్రాణిస్వభావానాం సముద్రాదిస్థితీక్షణమ్. 10.

పత్రలేఖనాదుల జ్ఞానము, గోష్ఠుల జ్ఞానము పరిహాసాలాపముల జ్ఞానము, ప్రాణుల స్వభావములను పరిశీలించుట, సముద్రాదుల స్థితిని (స్వభావాదులను) చూచుచుండుట. (43-47)—

రవీన్దుతారాకలనం సర్వర్తుపరిభావనమ్
జనసంఘాభిగమనం దేశభాషోపజీవనమ్. 11.

"సూర్య-చంద్ర-నక్షత్రముల పరిశీలనము, అన్ని ఋతువులను గమనించుట, జనసమూహముతో కలిసి తిరుగుట, దేశభాషల సాహాయ్యమును తీసికొనుచుండుట." (48-51)—

ఆధానోద్ధరణప్రజ్ఞా కృతసంశోధనం ముహుః
అపరాధీనతా యజ్ఞసభావిద్యాగృహస్థితిః. 12

"ఆధానమునందును ఉద్ధరణమునందును ప్రజ్ఞ, చేసిన దానిని (వ్రాసిన కావ్యమును) మాటిమాటికి శోధించుకొనుట, పరాధీనుడు కాకుండుట, యజ్ఞగృహ-సభాగృహ-విద్యాగృహములందు స్థితి". (52-57)—

వి. శ్లోకములోని ఒక స్థానములో తగిన పదమును ప్రయోగించుట 'ఆధానము' తాను ప్రయోగించిన పదము ఆ స్థానములో సరిగా లేదని తోచినచో దానిని తీసివేయుట 'ఉద్ధరణము'. అపరాధీనత అనగా భావస్వాతంత్ర్యము. ఒకరి మెప్పుకై ఏవేవో భావాలు కవితావస్తువుగ తీసికొనకుండుట.

అతృష్ణతా నిజోత్కర్షే పరోత్కర్ష విమర్శనమ్
ఆత్మశ్లాఘాశ్రుతౌ లజ్జా పరశ్లాఘానుభాషణమ్. 13.

తనకు ఉత్కర్ష రావలెనని ఆశలేకుండుట. పరులకు కలిగిన ఉత్కర్షను పరిశీలించుట (వారి కవితలో అట్టి వైశిష్ట్యమునకు కారణ మేమి అని

పరిశీలించుట) తన నెవరైనను ప్రశంసించునపుడు సిగ్గుపడుట, ఇతరులను ఎవరైన శ్లాఘించు నపుడు దానిని అనుసరించి మాటలాడుట (58-61)—

సదా స్వకావ్యవ్యాఖ్యానం వైరమత్సరవర్జనమ్
పరోన్నమజిగీషా చ వ్యుత్పత్త్యై సర్వశిష్యతా. 14.

"ఎల్లప్పుడును తన కావ్యములను వ్యాఖ్యానించుచుండుట, వైరమును మాత్సర్యమును విడుచుట, పరుల ఆధిక్యమును జయించవలె ననెడు అభిలాష వ్యుత్పత్తి సంపాదించుకొనుటకై అందరికిని శిష్యుడుగా ఉండుట"

(62-65)—

పాఠస్యావసరజ్ఞత్వం శ్రోతృచిత్తానువర్తనమ్
ఇఙ్గితాకారవేదిత్వముపాదేయనిబన్ధనమ్. 15.

"కవితాపఠనము చేయు నపుడు సమయౌచిత్యమును గుర్తించుట, శ్రోతల చిత్తమును అనువర్తించుట, ఇతరుల ముఖచేష్టాదులను బట్టి వారి భావమును గ్రహింపగల్గి యుండుట, పరిగ్రహింపదగిన (సర్వామోదయోగ్యమైన) విషయమునే కావ్యములో కూర్చుట" (66-69)—

ఉపదేశవిశేషోక్తిరదీర్ఘరససంగతిః
స్వసూక్తప్రేషణం దిక్షు పరసూక్తపరిగ్రహః. 16

విశిష్టమైన ఉపదేశమును చెప్పుట, అతిదీర్ఘము కాని రససంబంధము (ఒకే రసమును అతిదీర్ఘముగ కూర్పకుండుట), తన కవిత్వమును నలు దిక్కులకు పంపుట, పరుల కవిత్వమును స్వీకరించుట (పఠించుచుండుట).

(70-73)—

వైదగ్ధ్యం పటుతా భఙ్గిర్నిస్సఙ్గైకాన్తనిర్వృతిః
ఆశాపాశపరిత్యాగః సంతోషః సత్త్వశీలతా. 17.

"నేర్పు, సమర్థత్వము, విచిత్రమైన పద్ధతి (భఙ్గిః), ఎవ్వరి సాంగత్య

మును లేని ఏకాంతప్రదేశమునందు ఆనందించుట, ఆశాపాశమును విడనాడుట, సంతోషము, సాత్త్వికస్వభావము." (74-79)—

అయాచకత్వమగ్రామ్యపదాలాపః కథాస్వపి
కావ్యక్రియాసు నిర్బన్ధో విశ్రాన్తిశ్చాన్తరాన్తరా. 18.

"యాచించకుండుట, పరిహాసాలాపములలో గూడ గ్రామ్యపదములను ప్రయోగించకుండుట, కావ్యరచనలయందు పట్టుదల, మధ్య మధ్య విశ్రాంతి తీసికొనుట." (80-83)—

నూతనోత్పాదనే యత్నః సామ్యం సర్వసురస్తుతౌ
పరాక్షేపసహిష్ణుత్వం గాంభీర్యం నిర్వికారతా. 19.

"నూతనకావ్యనిర్మాణమునందు ప్రయత్నము, అందరు దేవతలను స్తుతించుటయందు పక్షపాతము లేకుండుట, ఇతరులు చేయు ఆక్షేపములను సహించకలిగియుండుట, గాంభీర్యము,(మనస్సున) వికారము చెందకుండుట. (84-88)—

అవికత్థనతాఽదైన్యం పరేషాం నష్టయోజనమ్
పరాభిప్రాయకథనం పరసాదృశ్యభాషణమ్. 20.

"తన గొప్పతనమును చెప్పుకొనకుండుట,దైన్యము లేకపోవుట, పరుల కవితలలో నష్టమైన భాగమును పూరించుట, పరుల అభిప్రాయమును చెప్పుట, పరుల సాదృశ్యమును (ఒకరి కవితను పరిశీలించు నపుడు ఇతరుల కవితలతో దానికి ఉన్న సామ్యమును గూర్చి) చెప్పుట." (89-93)—

సప్రసాదపదన్యాసః ససంవాదార్థసంగతిః
నిర్విరోధరసవ్యక్తిర్వ్యక్తిర్వ్యాసమాసయోః. 21.

"ప్రసాదముతో కూడిన పదముల ప్రయోగము, సంవాదముతో కూడిన అర్థముయొక్క కూర్పు, విరోధము లేని రసమును కూర్చుట, వ్యాససమాసములను చేర్చుచుండుట."

వి. సంవాద మనగా హృదయసంవాదము అనగా హృదయమునకు నచ్చుట, ఇది సరిగనే ఉన్న దని నచ్చెడు విషయములను కూర్చుట ససంవాదార్థ సంగతి. పూర్వకవులు చెప్పిన విషయముతో పోలిక గల విషయమును కూర్చుట అని కూడ అర్థము చెప్పవచ్చును. ఒక విషయమును విస్తృతముగ చెప్పుట వ్యాసము, సంక్షిప్తముగ చెప్పుట సమాసము (94-98)–

ప్రారబ్ధకావ్యనిర్వాహః ప్రవాహశ్చతురో గిరామ్.
శిక్షాణాం శతమిత్యుక్తం యుక్తం ప్రాప్తగిరః కవేః 22.

ప్రారంభించిన కావ్యమును చివరివరకును కొనసాగించుట, చాతుర్య ముతో కూడిన వాక్ప్రవాహము, ఈ విధముగ వాక్కు-నువశము చేసికొనిన కవికి నూరు శిక్షణములు చెప్పబడినవి. (99-100)–

ఇతి బహుతరశిక్షా లక్షణక్షీణదోషే
ప్రభవతి గతనిద్రే ప్రాతిభే సుప్రభాతే.
కవిరవిరవిలుప్తవ్యాప్తిభిః సూక్తపాదై —
ర్నయతి నవనవత్వం భావభావస్వభావమ్. 23.

ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్యక్షేమేన్ద్రకృతే కవికణ్ఠాభరణే
ప్రాప్తగిరః కవే శిక్షాకథనం నామ ద్వితీయః సన్ధిః.

ఈ విధముగా అధిక మైన శిక్షలను లక్షించుట చేత (గుర్తించుటచేత) క్షీణించిన దోషములు గల (ప్రభాతపక్షమున-క్షీణించిన రాత్రి గల అని అర్థము), తొలగిపోయిన నిద్ర గల ప్రతిభారూపమైన (ప్రతిభకు సంబం ధించిన) సుప్రభాతము ఆవిర్భవించిన దగుచుండగా, కవిసూర్యుడు, అడ్డులేని వ్యాప్తిగల కావ్యము లనెడు కిరణములచేత, భావము లనెడు పదార్థముల స్వభావము నూత్ననూత్నముగ ఉండునట్లు చేయును.

వ్యాసదాసు డను నామాంతరము గల క్షేమేంద్రుడు రచించిన కవి

కంఠాభరణమున వాక్కును వశము చేసికొనిన కవికి శిక్షణమును చెప్పుట అను రెండవ సంధి సమాప్తము.

## చమత్కారకథనం నామ తృతీయః సంధిః

అథ శిక్షితస్య కవేః సూక్తి చమత్కారమాహ-
సుకవిరతిశయార్థీ వాక్చమత్కారలోభా
దభిసరతి మనోజ్ఞే వస్తుశబ్దార్థసార్థే.
భ్రమర ఇవ వసన్తే పుష్పకాన్తే వనాన్తే
నవకుసుమ విశేషామోదమాస్వాదలోలః 1

ఇపుడిక శిక్షితు డైన కవికి సూక్తిచమత్కారమును (కవిత్వములో చమత్కార మెట్లు సంపాదింపవలెనో) చెప్పుచున్నాడు.

వసంతమున పుష్పములచే మనోహర మైన వనమధ్యమున, ఆస్వాదమునందు ఆసక్తి గల తుమ్మెద నూతనకుసుమముల ఆమోదవిశేషమును వలె, సుకవి, అతిశయమును (వైశిష్ట్యమును) కోరుచున్నవాడై, వాక్కులోని చమత్కారమునందు లోభమువలన మనోహర మైన విషయముల, శబ్దముల, అర్థముల సముదాయమునందు (సముదాయమును సంపాదించుకొనుటకై) తిరుగుచుండును (ప్రవర్తించును).

న హి చమత్కారవిరహితస్య కవేః కవిత్వం కావ్యస్య వా కావ్యత్వమ్.
ఏకేన కేన చిదనర్ఘమణిప్రభేణ
కావ్యం చమత్కృతిపదేన వినా సువర్ణమ్
నిర్దోషలేశమపి రోహతి కస్య చిత్తే
లావణ్యహీనమివ యౌవనమఙ్గనానామ్. 2.

చమత్కారము లేని కవి కవి కాడు; కావ్యము కావ్యము కాదు.

"మంచి వర్ణములు కలదైనను, దోషలేశము కూడ లేనిదైనను కావ్యము అమూల్యమైన మాణిక్యమువంటి కాంతి గల ఒక చమత్కారజనక మగు పదము లేకున్నచో, లావణ్యవిహీన మైన స్త్రీల యౌవనము వలె ఎవని చిత్తమునందు ప్రవేశించును (ఆనందకర మగును?)".

వి. "పరిశుద్ధ మైన బంగారము కూడ అమూల మైన మణుల కాంతి గల చమత్కారజనక మగు పదకము లేనిచో మనోహరము కాజాలనట్లు" అను అర్థము కూడ విశేషణ బలముచే తెలియవచ్చుచున్నది.

చమత్కారవిరహో యథా మాలవరుద్రస్య—
వేల్లత్పల్లవ సంమిలల్లత లసత్పుష్ప స్ఫుటత్కుడ్మల
స్ఫూర్జద్గుచ్ఛభర క్వణన్మధుకరక్రీడా వినోదాకర.
రక్తాశోక సఖే దయాం కురు హర ప్రారబ్ధమాడమ్బరం
ప్రాణాః కణ్ఠముపాగతాః ప్రియతమో దూరే
త్వామేవంవిధః. 13.

చమత్కారము లేకుండుటకు ఉదాహరణముగ మాలవరుద్రుని శ్లోక మెట్లనగా—

"బయలుదేరుతున్న చిగుళ్ళు గల కలియుచున్న లతలు గల ప్రకాశించు చున్న పుష్పములు గల వికసించుచున్న మొగ్గలు గల విజృంభించుచున్న గుత్తుల భారము గల ధ్వని చేయుచున్న తుమ్మెదల క్రీడావినోదమునకు స్థాన మైన మిత్రుడ వైన ఓ రక్తాశోకమా! దయ చూపుము; ప్రారంభించిన ఆడంబరమును ఉపసంహరించుము ప్రాణములు కంఠముదగ్గరకి చేరినవి; ప్రియుడు దూరమున నున్నాడు; నిన్ను చూడగా ఇట్లున్నావు."

వి వర్ణనలో చమత్కార మేదియు లేదుగాద ఇది చమత్కారశూన్య కవితకు ఉదాహరణము.

చమత్కారో యథా యశోవర్మణః—

రక్తస్త్వం నవపల్లవైరహమపి శ్లాఘ్యైః ప్రియాయా గుణై
స్త్వామాయాన్తి శిలీముఖాః స్మరధనుర్ముక్తాః సఖే మామపి.
కాన్తాపాదతలాహతి స్తవముదే తద్వన్మమాప్యావయోః
సర్వం తుల్యమశోక కేవలమహం ధాత్రా సశోకః కృతః. 14.

చమత్కారమునకు ఉదాహరణముగ యశోవర్మ శ్లోక మెట్లనగా—

"ఓ మిత్రమా! అశోకమా! క్రొత్త చిగుళ్ళతో నీవు రక్తుడవు (ఎఱ్ఱగానున్నావు); నేను శ్లాఘ్యములైన ప్రియురాలి గుణములచే రక్తుడను (అనురాగము కలవాడును). శిలీముఖములు (తుమ్మెదలు) నిన్ను చేరుచున్నవి; మన్మథుని ధనుస్సుచే విడువబడిన శిలీముఖములు (బాణములు) నన్ను చేరుచున్నవి. కాన్తయొక్క పాదతలముచేత తన్నుట నీకు ఆనందకరము; నాకును అంతే. ఈ విధముగ మన ఇరువురికిని అన్నియు తుల్యముగనే ఉన్నవి. కాని ఒక్క భేద మేమనగా బ్రహ్మ (నిన్ను అశోకునిగా చేసి) నన్ను మాత్రము సశోకునిగా (దుఃఖము కలవానినిగా) చేసినాడు"

వి. ఉత్తమ (పద్మినీ) జాతికి చెందిన స్త్రీ తన్నినచో అశోక వృక్షము అకాలమునందు గూడ పుష్పించునని కవిసమయము. రెండవ శ్లోకములోని చమత్కారము స్పష్ట సంవేద్యము.

దశవిధశ్చమత్కారః —అవిచారితరమణీయః, విచార్యమాణరమణీయః, సమస్తసూక్తవ్యాపీ. సూక్తైకదేశదృశ్యః శబ్దగతః, అర్థగతః, శబ్దార్థగతః, అలంకారగతః, రసగతః, ప్రఖ్యాతవృత్తిగతశ్చ.

అవిచారితరమణీయో యథా మమ శశివంశే—

శూరాః సన్తి సహస్రశః సుచరితైః పూర్ణం జగత్ పణ్డితైః
సంఖ్యా నాస్తి కలావతాం బహుతరైః శాన్తైర్వనాన్తాః శ్రితాః,
త్యక్తుం యః కిల విత్తముత్తమమతిః శక్నోతి జీవాధికం
సోఽస్మిన్ భూమివిభూషణం శుభనిధిర్భవ్యో భవే దుర్లభః 15

అవిచారితరమణీయము, విచార్యమాణరమణీయము, సమస్తసూక్తవ్యాపి, సూక్తైకదేశదృశ్యము, శబ్దగతము, అర్థగతము, శబ్దార్థగతము, అలంకారగతము, రసగతము, ప్రఖ్యాత వృత్తిగతము అని చమత్కారము పది విధములు.

వి. అవిచారితరమణీయ మనగా బాగా పట్టి విచారణ చేయనంత వరకు రమణీయముగా కన్పట్టునది; ఆపాతరమణీయము అని అర్థము.

అవిచారితరమణీయమునకు నా శశివంశమునుండి ఉదాహరణ మెట్లనగా

"వేలకొలది శూరు లున్నారు. మంచి చరిత్రగల పండితులతో జగత్తు నిండి యున్నది. కలావంతులకు లెక్కయే లేదు. తపోవనము లెందరో శాంత స్వభావులచే ఆశ్రయింపబడినవి. ఉత్తమమైన బుద్ధి గల యెవడు ప్రాణముకంటె అధికమైన ధనమును త్యజించగలడో, అట్టి, భూమికి అలంకారభూతుడైన, శుభములకు నిధియైన పూజ్యుడు ఈ సంసారములో దుర్లభుడు."

వి. మహాసంరంభంతో ప్రారంభించిన ఇంతటి పెద్ద శ్లోకములో చెప్పి విషయ మేమనగా — ఈ భూలోకములోన త్యాగగుణము కలవారు అరుదు అని మాత్రమే. అందుచే పైకి చూచుట కెంతయో రమణీయత్వ మున్నట్లు కనబడినను, పట్టి పరిశీలింపగా అంత, రమణీయత్వము లేదని భావము.

విచార్యమాణరమణీయో యథా మమ పద్యకాదమ్బర్యామ్:-
అఙ్గేఽనఙ్గజ్వరహుతవహశ్చక్షుషి ధ్యానముద్రా
కణ్ఠే జీవః కరకిసలయే దీర్ఘశాయీ కపోలః.

అంసే వీణా కుచపరిసరే చన్దనం వాచి మౌనం
తస్యాః సర్వం స్థితమితి న తు త్వాం వినా క్వాపి చేతః. 16.

విచార్యమాణ రమణీయమునకు (అనగా ఆలోచించినకొలది రమణీయముగ ఉండుదానికి) ఉదాహరణముగ నా పద్యకాదంబరిలో ఎట్లనగా—

"ఆమె శరీరమున మన్మథాగ్ని, దృష్టియందు ధ్యానముద్ర, కంఠమునందు జీవుడు (విరహముచే ప్రాణములు కంఠగతములైన వని అర్థము) ఈ చిగురాకు వంటి చేతిలో దీర్ఘకాలము శయనించు కపోలము, భుజముపై వీణ, కుచప్రాంతమున చందనము, వాక్కునందు మౌనము, ఈ విధముగ ఆమెకు సంబంధించిన అన్నియు (అచ్చటచ్చట ఆ విధముగ ఆమె శరీరమునందు) ఉన్నవి. చిత్తము మాత్రము నిన్ను విడిచి మరెచ్చటను లేదు".

సమస్తసూక్తవ్యాపీ యథా మమ శశివంశే—

మాధుర్యానుభవేఽపి తే సువదనే తీక్ష్ణాః కటాక్షాః పరం
పర్యన్తస్థితతారకా అపి నృణాం రాగానుబన్ధోద్యతాః.
నైవోజ్ఝన్తి వివేకినశ్చపలతాముత్సేక సంవాదినీ
మాశ్చర్యం శ్రవణౌ స్పృశన్తి చ పునర్మారం చ
కుర్వన్త్యమీ. 17

"ఓ సుందరవదనా! నీ కటాక్షములు మాధుర్యముయొక్క అనుభవమును ఇచ్చుచున్నను చాల తీక్ష్ణములుగా ఉన్నవి. (మాధుర్యకరములు తీక్ష్ణముగా ఉండుట విరుద్ధము). ప్రాంతములం దున్న తారకలు (నల్లగ్రుడ్లు, నక్షత్రములు అని రెండర్థములు) కలవైనను, పురుషులకు రాగానుబంధమును (ఎరుపుతో సంబంధము, నిరంతరమైన అనురాగము అని రెండర్థములు) కలిగించుటకు ఉద్యమించుచున్నవి. (సంధ్యాసమయమున ఆకాశాంతమునందు నక్షత్రములు కనిపించగనే సంధ్యారాగము పోవలెను. అట్లు పోకుండుట విరుద్ధము). వివేకము కలవైనను (వివేక మనగా నేత్రపక్షమున తెలుపు లేదా స్పష్టములుగా వికసించి యుండుట అని అర్థము. నిత్యానిత్యవివేకము, సద

సద్వివేకము అని రెండవ అర్థము) గర్వముతో కలిసిన చాపల్యమును విడ చుట లేదు, (వివేకవంతులకు గర్వము, చాపల్యము ఉండుట విరుద్ధము). ఇవి (కటాక్షములు) చెవులను స్పృశించుచున్నవి. (చెవివరకు వ్యాపించి విశాలముగ ఉన్నవి. వ్రతపూజాదులు చేయు నపుడు పవిత్రత్వము కొరకై చెవులు పట్టు కొనుచున్నవి, అని రెండర్థములు), ఐనను మారకరములై (మన్మ థుని కలిగించునవి; మరణము కలిగించునవి అని రెండర్థములు) ఉన్నవి. ఇది చాలా ఆశ్చర్యము."

వి. ఇచట చమత్కారము శ్లోకమునందు అంతటను ఉన్నదని భావము.

సూక్త్యైకదేశదృశ్యో యథా మమ పద్యకాదమ్బర్యామ్:—

నిత్యార్చా హృదయస్థితస్య భవతః పద్మోత్పలైశ్చన్దనై
స్త్వద్భక్తిస్త్వదనుస్మృతిశ్చ మనసి త్వన్నామమన్త్రో జపః।
సర్వత్రైవ ఘనానుబన్ధకలనా త్వద్భావనా సుభ్రువ
స్తస్యా జీవవిముక్తిరేవ దివసైర్దేవ త్వదారాధనాత్॥

చమత్కారము కావ్యములోని ఒక భాగములో ఉండుటకు ఉదాహర ణము నా పద్యకాదంబరిలో ఎట్లనగా—

"ఓ దేవా! హృదయములో నున్న నీకు, నిత్యము, పద్మోత్పలచంద నములతో పూజ జరుగుతున్నది. (శీతలోపచారములకై పద్మాదులు వక్షమున ఉంచబడుటచే అదియే ఆమె హృదయములోనున్న ఆతనికి పూజ యని అర్థము) మనస్సులో నీ భక్తియు, నీ స్మృతియు జరుగుచున్నవి. నీ నామ మంత్రము జపింపబడుచున్నది. ఆమెకు అంతటను నీ భావనయే ఉండుటచే అంతటను నీవేకనబడుచున్నావు. ఈ విధముగ నీ ఆరాధన చేయుచుండుటచే ఆమెకు కొద్దిరోజులలో జీవవిముక్తి తప్పదు".

వి. జీవవిముక్తి అనగా జీవించి ఉండగనే ముక్తి (జీవన్ముక్తి) అని అర్థము. నిరంతరపరమేశ్వరారాధన జేయువానికి జీవన్ముక్తి లభించును.

ఉన్నట్టే నీ విరహముతో బాధపడు చున్న ఆమె నిరంతరము నీ ఆరాధన చేయు చుండుటచే కొద్ది రోజులలో ఆమెకు జీవవిముక్తి తప్పదని భావము. కాని నాయికాపక్షమున జీవవిముక్తి అనగా ప్రాణాలు పోవుట అని యర్థము, ఈ విధముగ ఈ శ్లోకములోని చమత్కార మంతయు ఈ నాల్గవ పాదములో నున్నది గాన ఇది సూక్త్యైకదేశదృశ్యచమత్కారమునకు ఉదాహరణము.

శబ్దగతో యథా మమ చిత్రభారతే నాటకే—

ఇతశ్చ్యోతచ్చ్యూతచ్యుతమధుచయా వాన్తి చతురాః
సమీరాః సన్తోషం దిశి దిశి దిశన్తో మధులిహామ్.
నిశాన్తే కాన్తానాం స్మరసమరకేళి శ్రమముషో
విజృమ్భన్తే జృమ్భాకలిత కమలామోద సుహృదః. 19

శబ్దగతచమత్కారమునకు ఉదాహరణము నా చిత్రభారతమునందు ఎట్లనగా—

“ఇటు వైపు, కదలుచున్న చూతవృక్షములనుండి జారుచున్న మక రందసముదాయము గలవాయువులు ప్రతి దిక్కునందును తుమ్మెదలకు ఆనం దమును కలిగించుచు వీచుచున్నవి తెల్లవారుజామున కాంతల రతికేళిశ్రమను తొలంగించుచు వికసించిన పద్మముల సువాసనలలో కూడినవై విజృంభించు చున్నవి”.

ఈ శ్లోకములోని చమత్కార మంతయు శబ్దాలంకారముల నాశ్రయించి ఉన్నది గాన ఇది శబ్దగతచమత్కారమునకు ఉదాహరణము.

అర్థగతో యథా మమ లావణ్యవత్యామ్—

సదాసక్తం శైత్యం విమలజలధారాపరిచితం
ఘనోల్లాసః క్ష్మాభృత్పృథుకటకపాతీ వహతి యః.
విధత్తే శౌర్యశ్రీ శ్రవణ నవనీలోత్పల రుచిః
స చిత్రం శత్రూణాం జ్వలదనలతాపం భవదసిః. 20.

అర్థగతచమత్కారమున కుదాహరణము నా లావణ్యవతిలో ఎట్లనగా—

"ఘనోల్లాసము (గొప్పప్రకాశము, మేఘము వంటి విజృంభణము అని రెండర్థములు) కలదియు, రాజుల గొప్పసేనానివేశములపై పడునదియు (పర్వతముల విశాలములైన చరియలపై పడునదియు), శౌర్యలక్ష్మియొక్క చెవులయందలి నల్లకలువల వంటి కాంతి కలదియు, అగు నీయొక్క ఏ ఖడ్గము, నిర్మల మైన జలము వంటి ధారతో, పదునైన ప్రదేశముతో, పరిచితమైన (స్వచ్ఛమైన జలధారతో పరిచితమైన) ఎల్లప్పుడును సంబంధించి యున్న శైత్యమును (ఖడ్గపక్షమున "శితస్య భావః శైత్యం" — తీక్ష్ణత్వము అనియు, జలము పక్షమున "శీతస్య భావః శైత్యం" - చల్లదనము అనియు అర్థములు) వహించుచున్నదో అట్టి నీ ఖడ్గము శత్రువులకు మండుచున్న అగ్ని వలన కలుగు తాపము వంటి తాపమును కలిగించుచున్నది. చాల ఆశ్చర్యమ్ము

వి. ఇచట చమత్కారము అర్థములో నున్నది.

శబ్దార్థగతో యథా మమ పద్యకాదమ్బర్యామ్—

కించిత్ కుఞ్చిత కామకార్ముకలతామైత్రీ విచిత్రా భ్రువో
ర్నర్మోక్తిః స్మితకాన్తిభిః కుసుమితా ప్రాగల్భ్యగర్భా గిరః,
రాగోత్పన్నసిషఙ్గిభిః సరసతాసంవాదిభిర్విభ్రమై
రాయుష్యం పరమం తయా రతిపతేః ప్రాప్తం మృగాక్ష్యా వయః. 21.

శబ్దార్థములు రెండింటియందును ఉన్న చమత్కారమునకు ఉదాహరణము నా పద్యకాదంబరిలో ఎట్లనగా—

"మైత్రీవిచిత్రే భ్రువౌ" అను పాఠమున్నచో యుక్తముగా ఉండును.

"కనుబొమ్మలు కొంచెము వంచబడిన మన్మథుని ధనుర్లతతో మైత్రి చేత సామ్యముచేత విచిత్ర మైనవి. పరిహాసోక్తి చిరునవ్వు కాంతులచేత

పుష్పించినది. వాక్కులు ప్రాగల్భ్యముతో నిండినవి. రాగము యొక్క సంబంధము అనెడు అంబులపొది గలవియు, సరసత్వముతో కూడినవియు అగు విలాసలతో, ఆ మృగాక్షి రతిపతికి దీర్ఘాయుర్దాయకరమగు ఉత్తమ మైన వయస్సును (యౌవనమును) పొందినది.

వి. ఈ శ్లోకములో శబ్దార్థములు రెండింటియందును చమత్కార మున్న దని అభిప్రాయము.

అలఙ్కారగతో యథా మమ లావణ్యవత్యామ్:—

22. స్తనౌ స్తబ్ధౌ తీక్ష్ణం నయనయుగలం నిమ్నముదరం
భ్రువోర్వక్రా వృత్తిర్విహితమునిమారోఽధరమణిః
తథా సన్నే దైవాదియతి విషమే దుర్జనగణే
గుణీ మధ్యేహారః స్పృశతి తవ దోలాతరలతామ్.

అలంకారగతచమత్కారమునకు ఉదాహరణము నా లావణ్యవతిలో ఎట్లనగా—

"స్తనములు స్తబ్ధములుగా ఉన్నవి. ('స్తబ్ధః' అనగా గట్టిగా బలిసి యున్నది, మొండి పట్టు కలవాడు అని రెండర్థములు). నేత్రద్వయము తీక్ష్ణ ముగా నున్నది. ఉదరము నిమ్నముగా (పల్లముగా, నీచముగా అని రెండు అర్థములు) ఉన్నది. కనుబొమ్మల పద్ధతి వంకరగా నున్నది. మణి వంటి అధరోష్ఠము మునులను కూడా కొట్టునదిగా ఉన్నది. దైవవశముచే ఈ విధ ముగా విషమ మైన దుర్జనసముదాయ మొకచోట చేరుటచే, మధ్యలోనున్న గుణము గల (త్రాడు గల, మంచి గుణములు గల అని రెండర్థములు) నీ హారము ఉయ్యాల వలె ఊగుచున్నది."

**వి.** ఇచట 'స్తబ్ధ' 'తీక్ష్ణ' 'నిమ్న' 'వక్ర' 'గుణి' మొదలగు శబ్ద ములు శ్లిష్టము లగుటచే ఈ శ్లోకములోని చమత్కారము శ్లేషాలంకారములో నున్నదని భావము.

రసగతో యథా మమ కనకజానక్యామ్:—

23. అత్రార్యః ఖరదూషణ త్రిశిరసాం నాదానుబన్ధోద్యమే
రుద్ధానే భువనం త్వయా చకితయా యోద్ధా నిరుద్ధః క్షణమ్
సస్నేహాః సరసాః సహాసరభసాః సభ్రూభ్రమాః సస్పృహాః
సోత్సాహా స్త్వయి తద్బలే చ నిదధే దోలాయమానా దృశః.

రసగత మైన చమత్కారమునకు ఉదాహరణము నా "కనకజానకి" లో ఎట్లనగా—

"ఖరదూషణ త్రిశిరస్సులు నిరంతరము చేయు ధ్వని భువనమునంతను వ్యాపించి నపుడు వారితో యుద్ధము చేయ నడుకట్టిన ఆర్యుని (మా అన్న గారైన శ్రీరాముని) భయపడిన నీవు ఇచ్చటనే క్షణకాలము పాటు (యుద్ధము నకు పోకుండ) ఆపివేసితివి. అపు డాయన స్నేహముతో కూడినవియు, సరస ములును, హాసవేగముతో కూడినవియు, కనుబొమ్మల కదలికలతో కూడి నవియు, స్పృహతో కూడినవియు, ఉత్సాహభరితములును, ఇటు నటు కదలు చున్నవియు అగు చూపులను, నీపైనను, ఆ సైన్యముపైనను, ప్రసరింప చేసెను."

వి. సీతాదేవికి ఖరదూషణాదియుద్ధవృత్తాంతమును గుర్తు చేయుచు లక్ష్మ ణుడు చెప్పిన మాటలివి. ఖరదూషణాదులతో యుద్ధము చేయుటకై రాము డేకాకిగ వెళ్ళుచున్న సమయమున సీతాదేవి ఆతనిని అడ్డుపెట్టగా సస్నేహ ములు, సరసములు, సస్పృహములు అగు చూపులు ఆమెపై ప్రసరించినవి. సహాసరభసములు సభ్రూభ్రమములు, సోత్సాహములు అయిన చూపులు ఆ రాక్షససైన్యముపై ప్రసరించినవి. దోలాయమానము లైన చూపులు ఇరువురి పైనను ప్రసరించినవి. ఈ విధముగ ఇచట శృంగార-వీరరసముల సన్నివేశ ముండుటచే ఇచట చమత్కారము రసగత మైనది.

ప్రఖ్యాతవృత్తి(త్త)గతో యథా మమ శశివంశే—

24. అగ్రం గచ్ఛత యచ్ఛత స్వపృతనాం వ్యూహక్షితిం రక్షత
క్షోణీం పశ్యత నశ్యత ద్రుతతరం మామా స్థితిం ముఞ్చత.
యత్నాత్ తిష్ఠత పృష్ఠత స్తనుభిదాముగ్రా గతిః పత్త్రిణా
మిత్యాసీజ్జన భఞ్జనే రథపక్షే పార్థస్య పృక్త్వి శ్రుతిః.

('వృత్తి' కి బదులు 'వృత్త' అను పాఠమున్న బాగుండును) ప్రసిద్ధ మైన వృత్తమునకు (కథకు) సంబంధించిన ఔచిత్యమునకుదాహరణము నా "శశివంశము" నందు ఎట్లనగా—

"అర్జునుని రథమార్గము జనులను నశింపచేయుచున్నపుడు—'ముందుకు నడవండి; మీ సేనను అదుపులో ఉంచుకొనండి (యచ్ఛత); వ్యూహభూమిని రక్షించండి, భూమిని చూడండి; తొందరగా పారిపొండి; స్థితిని (ఉన్న చోటును) విడవకండి విడవకండి; ప్రయత్నపూర్వకముగా వెనుక వైపున నిలబడండి. శరీరమును ఛేదించు బాణముల తీరు చాల ఉగ్రముగా ఉన్నది" అని అత్యధికమైన కోలాహలము (శ్రుతిః) జరిగినది.

వి. మహావీరుడైన అర్జునుని ప్రసిద్ధవృత్తాంతము వర్ణింపబడినది గాన ఇచటి చమత్కారము వృత్తగత మైనది.

ఇత్యుక్త ఏష సవిశేషచమత్కృతీనాం
సారః ప్రకార పరభాగ విభావ్యమానః.
కర్పూరవేధ ఇవ వాఙ్మధుగన్ధయుక్తే
శ్చైత్రాసవస్య సహకారరసాధివాసః. 3.

ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్యక్షేమేన్ద్రకృతే కవికణ్ఠా
భరణే చమత్కారకథనం నామ తృతీయః సంధిః.

ప్రకార పరభాగముచే, అనగా ఉత్కృష్టప్రకారముచే అనుభవింపబడు సవిశేషములగు చమత్కారముల సారము ఈ విధముగ చెప్పబడినది.

ఈ చమత్కారం వాక్కు అనెడు మధువుకు గంధమును చేర్చుటకై చేసిన కర్పూరమిశ్రణము వంటిది. చైత్రమునందు తయారుచేయు మద్యమునకు తీయమామిడిపండ్ల రసముచే సంస్కారము వంటిది.

## కవికంఠాభరణములో చమత్కారకథన మను తృతీయ సంధి సమాప్తము

## గుణదోషవిభాగో నామ చతుర్థః సంధిః.

అథ గుణదోషవిభాగః—

కావ్యైకపాత్రవిలసద్గుణదోషదుగ్ధ
పాథఃసమూహపృథగుద్ధరణే విదగ్ధాః.
జానన్తి కర్తుమభియుక్తతయా విభాగం
చన్ద్రావదాతమతయః కవిరాజహంసాః. 1.

తత్ర శబ్దవైమల్యమర్థవైమల్యం రసవైమల్యమితి త్రయః కావ్యగుణాః. శబ్దకాలుష్యమర్థకాలుష్యం రసకాలుష్యమితి కావ్య దోషాః, సగుణం, నిర్గుణం, సదోషం, నిర్దోషం, సగుణదోషం చ కావ్యమ్.

గుణదోషవిభాగము ప్రారంభించబడుచున్నది. "చంద్రుడు వలె నిర్మల మైన బుద్ధి కలవారును, కావ్య మనెడు ఒక పాత్రలో ఉన్న గుణదోషము లనెడు పాలను నీళ్ళను వేరు చేయుటయందు నేర్పు గలవారును అగు కవు లనెడు రాజహంసలు ప్రయత్నసంపన్నులగుటచే (గుణదోషముల) విభాగ మును చక్కగ చేయుటకు సమర్థులు."

శబ్దవైమల్యము, (శబ్దములు నిర్మలముగా నిర్దుష్టముగా ఉండుట), అర్థ వైమల్యము, రసవైమల్యము అని కావ్యగుణములు మూడు. శబ్దకాలుష్యము,

అర్థకాలుష్యము, రసకాలుష్యము అనునవి కావ్యదోషములు. సగుణము, నిర్గుణము. సదోషము నిర్దోషము, సగుణదోషము (గుణదోషములు రెండును ఉన్నది) అని కావ్యము ఐదు విధములు.

శబ్దవైమల్యం యథా మమ పద్యకాదమ్బర్యామ్

25. తత్కాలోపనతే వయస్యనిధనే హా పుణ్డరీకేతి త-
న్మోహవ్యఞ్జనమశ్మభఞ్జనమలం జీవస్య సన్తర్జనమ్,
కుఞ్జవ్యాపి కపిఞ్జలేన కరుణం నిస్పష్టమాక్రన్దితం
యేనాద్యాపి చ తైః స్మృతేన హరిణైః శష్పం పరిత్యజ్యతే.

శబ్దవైమల్యమునకు ఉదాహరణముగా నా పద్యకాదంబరిలోని శ్లోక మెట్లనగా—

"మిత్రుడు మరణించినవెంటనే కపింజలుడు 'హా పుండరీకా'! అని అనుచు తన మోహము స్పష్టముగ తెలియునట్లుగాను, రాళ్ళు కూడా బ్రద్దలయేటట్లు (కరిగిపోవునట్లు) గాను, జీవునకే (తన ప్రాణాలకే) భయము కలుగు నట్లుగాను, పొదరిండ్లలో ప్రతిధ్వనించునట్లు గాను ఎంత కరుణముగా ఏడ్చె ననగా - ఈ నాడు కూడా ఆ ఏడ్పును స్మరించగనే లేళ్ళు గడ్డి తినుట మానివేయుచున్నవి."

వి. ఇచట ప్రయోగించిన శబ్దములన్నియు స్పష్టార్థములు, నిర్దుష్టములు గాన ఇది శబ్దవైమల్యమునకు ఉదాహరణము.

అర్థవైమల్యం యథా మమ శశివంశే—

26. స్నిగ్ధశ్యామలశాద్వలే ఫలతరుచ్ఛాయా నిపీతాతపే
చఞ్చద్వీచిచయోచ్ఛలత్కలకలే నిఃసంగగఙ్గాతటే.
అన్యోన్యాభిముఖోపవిష్టహరిణే స్వాస్థైర్యది స్థీయతే
తత్ కా శ్రీః కిము కాణ్డభగ్నరసికై రోమన్థహాస్య దత్తోఽఞ్జలిః.

అర్థవైమల్యమునకు ఉదాహరణము నా "శశివంశము"లో ఎట్లనగా—

"దట్టమైన పచ్చని పచ్చిక బీడులు కలదియు, ఫలవృక్షముల నీడచే త్రాగివేయబడిన ఎండగలదియు, కదలుచున్న తరంగముల కలకలధ్వనితో కూడినదియు, ఎదురెదురుగా కూర్చొని ఉన్న లేళ్ళు కలదియు, దుష్టసంగము లేవియు లేనిదియు అగు గంగాతటమున స్వస్థముగా కూర్చున్నవారికి ఇక ఐశ్వర్య మనునది ఏమి! హఠాత్తుగా నశించు సుఖముల చేత ఏమి ప్రయోజనము? మోహమునకు నీళ్ళు వదలినట్లే!"

వి. ఇచట అత్యుత్తమమైన అర్థముస్పష్టముగా ప్రతిపాదింపబడినది గాన ఇది అర్థవైమల్యమునకు ఉదాహరణము.

రసవైమల్యం యథా మమ పద్యకాదమ్బర్యామ్—

27. అథోద్యయౌ బాలసుహృత్స్మరస్య
శ్యామాధవః శ్యామల లక్ష్మభఙ్గ్యా,
తారావధూ లోచనచుమ్బనేన
లీలావిలీనాఞ్జన బిన్దుబిన్దుః.

రసవైమల్యమున కుదాహరణము నా 'పద్యకాదంబరి'లో ఎట్లనగా—

"ఇంతలో మన్మథుని బాల్యస్నేహితుడును, తార లనెడు నాయికలను ముద్దుపెట్టుకొనుటచే అంటుకొనిన కాటుకకలవాడు వలె నల్లని మచ్చను ధరించినవాడును అగు నిశావల్లభుడు (చంద్రుడు) పైకి వచ్చెను"

వి. ఈ చంద్రోదయ వర్ణనము శృంగార రసభరితము గాన ఇది రస వైమల్యమున కుదాహరణము.

శబ్దకాలుష్యం యథా భట్టశ్రీ శివస్వామినః—

28 ఉత్ఖాతప్రఖరా సుఖాసుఖసఖి ఖడ్గాసితా ఖేలగా
వైశ్శృఖిల్యఖలీకృతాఖిలఖలా ఖేక్షేటకైః ఖ్యాపితా.

ఖేటాదుత్ఖనితుం నిఖర్వమనసాం మార్ఖ్యం ముఖాత్ఖక్షటం
నిఃసంఖ్యాన్యనిఖర్వసర్వమణిభూరాఖ్యాతు సంఖ్యాని వః.

ఈ శ్లోకంలో శబ్దాడంబరమే కాని సరియైన అర్థమేదియు కనబడుట లేదు. "శ్లోకము వ్రాయుట పూర్తియైనది. ఇంక దీనిలో అర్థము పెట్టవలెను" అనే పద్ధతిలో వ్రాసిన శ్లోకము ఇది. అందుచే శబ్దకాలుష్యమునకు చక్కని ఉదాహరణము :

అర్థకాలుష్యం యథా తస్యైవ—

29. పిత్రాపి త్రాయతే యా న ఖలు ఖలధృతాజ్ఞానమాత్రాపమాత్రా
స్యోనస్యోనస్థితేర్ద్వారనునయవినమద్దామపాశాప్యపాశా.
వర్షావర్షాంబుపాతాత్త్రుటితతృణవసత్యక్రియాతాంక్రియాతాం
సారీ సారీష్టయాగ్రే సరదిహ జనతాం సాశ్నువానాం
శ్నువానామ్.

ఈ శ్లోకము కూడా అస్పష్టార్థమగుటచే ఇది అర్థకాలుష్యమునకు ఉదాహరణము.

రసకాలుష్యం యథా భట్టనారాయణస్య వేణీసంహారే భానుమత్యా నకులప్రాణిస్వప్నదర్శనే పాణ్డవనకులస్వైరసఙ్గమేర్ష్యా సదాభవత్చక్రవర్తిమహిష్యాః సామాన్య నీచవనితావత్.

రసకాలుష్యమునకు ఉదాహరణము ఎట్లనగా—

వేణీసంహారమునందు, భానుమతికి నకులము (ముంగిస) స్వప్నములో కనబడుటను వర్ణించునపుడు, చక్రవర్తికి పట్టపురాణియైన ఆమె విషయమున, సామాన్యనీచస్త్రీవిషయమునందు వలె, నకులుడనెడు పాండవునితో స్వైరసంగము చేసినదను ఈర్ష్య (దుర్యోధనునకు) కలిగినదని వర్ణించుటలో రసకాలుష్యమున్నది.

సగుణం యథా కాలిదాసస్య—

30. శ్యామాస్వఙ్గం చకితహరిణీప్రేక్షణే దృష్టిపాతం
గణ్డచ్ఛాయాం శశిని శిఖినాం బర్హభారేషు కేశాన్.
ఉత్పశ్యామి ప్రతనుషు నదీవీచిషు భ్రూవిలాసాన్
హన్తైకస్థం క్వచిదపి న తే చణ్డి సాదృశ్యమస్తి (మే. ఘ. 101)

సగుణమునకు ఉదాహరణము కాలిదాసుని శ్లోక మెట్లనగా—

"ప్రియంగులతలలో నీ శరీరమును, భయపడిన లేడిచూపులలో నీ చూపును, చంద్రునిలో నీ చెక్కిలి అందమును, నెమలి పింఛములలో నీ కేశములను, చిన్న చిన్న నదీతరంగములలో నీ కనుబొమ్మల విలాసను చూడ కలుగుచున్నాను. కాని, ఓ! చండీ! నీ పోలిక లన్నియు ఒక చోట కాన రాకున్నవి కదా! అయ్యో!"

వి ప్రియురాలి వియోగముతో బాధపడుచున్న యక్షుడు, ఆమెకు మేఘుని ద్వారా కుశలవార్త పంపుసందర్భములోని శ్లోక మిది. ఈ శ్లోకములో ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత మొదలైన గుణములు ఉన్నవి గాన ఇది సగుణమునకు ఉదాహరణము.

నిర్గుణం యథా చన్ద్రికస్య—

31. స్తనౌ సుపీనౌ కఠినౌ ఠినౌ ఠినౌ
కటిర్విశాలా రభసా భసా భసా.
ముఖం చ చన్ద్రప్రతిమం తిమం తిమమ్
అహో సురూపా తరుణీ రుణీ రుణీ.

నిర్గుణమునకు ఉదాహరణముగా చంద్రకుని శ్లోక మెట్లనగా—

"సౌందర్యము విషయమున ముఖము చంద్రుని తిరస్కరించునది. "మంథినిః సున్దరే" అని అమరము. 'మంథినౌ' అను నది 'మంథిని' శబ్దసప్త మ్యేకవచనరూపము. ధర్మపరత్వవివక్షచేత దీనికి 'సుందరత్వమునందు' అని

అర్థము చెప్పబడినది. పీనములు, కఠినములు అయిన స్తనములు సమముగా వర్తులముగా ఉన్నవి. (తినౌ). హారాద్యలంకారములతో కూడినవి (తినౌ). "వః శూన్యే వర్తులే హారే సామ్యే చ పరికీర్తితః" అని విశ్వనిఘంటువు. విశాల మైన కటి ప్రదేశము, వేగముచేత ఆఘనమును (ఇసుకతిన్నెను) ఆఘ సించుచున్నది (పరిహసించుచున్నది). ఈ విధముగ ఈ తరుణి ఏనుగయొక్క (గమన) శోభను తిరస్కరించుచున్నది. "కరికుంభే రుణే రుణః" అను శాశ్వతనిఘంటువు ననుసరించి 'రుణ' అనగా (గజ) కుంభము. కుంభము కలది 'రుణి' — గజము. దాని శోభ (ఈః) రుణీ, దానిని అడ్డుపెట్టునది 'రుణీరుణీ'. ఎంత ఆశ్చర్యము. (ఈ శ్లోకము అల్లమరాజు సుబ్రహ్మణ్య కవిగారు చాటుధారాచమత్కారసార మను గ్రంథములో చేసిన వ్యాఖ్య ననుస రించి ఇచట వ్యాఖ్యానింపబడినది).

వి. ఈ శ్లోకములో గుణము లేవియు లేవు గాన ఇది నిర్గుణమునకు ఉదాహరణము.

సదోషం యథా భట్ట శ్రీశివస్వామినః—

32. అద్యత్వావధి శిఢ్ఢి శిఢ్ఢి దృఢతాగూఢాని గుఢేతరాం
ప్రౌఢిం ఢౌకయ పిఢ్ఢి పిఢ్ఢి చ రుజం రూపాపరూఢాం తయా
మూఢం మూఢమమూఢయస్వ హృదయం వీఢ్వాధ
మూఢ్వా తమః
సోఽవ్యూఢామితి చ ప్రభాపరివృఢా వ్యూఢా ప్రదఢిమ్నేఽస్తు
వః.

సదోషమునకు ఉదాహరణముగా శ్రీ భట్టశివస్వామి శ్లోక మెట్లనగా—

ఈ శ్లోకములో అర్థస్ఫూర్తి లేకపోవుటయే పెద్ద దోషము.

సగుణదోషం యథా భట్టమయూరస్య—

34. అస్తవ్యస్తత్వ శూన్యో నిజరుచిరనిశానశ్వరః కర్తుమీశో
విశ్వం వేశ్మేవ దీపః ప్రతిహతతిమిరం యః ప్రదేశస్థితోఽపి.
దిక్కాలాపేక్షయాసౌ త్రిభువనమటతస్తిగ్మభానోర్నవాఖ్యాం
యాతః శాతక్రతవ్యాం దిశి దిశతు శివం శోచిషాముద్గమోవః,
వః (సూర్యశ 18)

గుణదోషములు రెండును కలదానికి ఉదాహరణముగా భట్టమయూరుని శ్లోక మెట్లనగా—

"ముల్లోకములందును సంచరించు సూర్యుని కాంత్యుద్గమము ఇపుడు తూర్పు దిక్కున ఉన్నది. దిక్కును, కాలమును పట్టి ఇది నవము (క్రొత్తది) అని చెప్పబడుచున్నది. ఈ కాంతిపుంజమున కెన్నడును అస్తవ్యస్తత్వమను నది ఉండదు సహజ మైన కాంతి కలది, అనగా పరాపేక్ష లేకుండగా ప్రకాశించుచున్నది. ఎల్లప్పుడును (అనిశ) అనశ్వరముగా ఉండునది. ఒక మూలనున్న దీపము ఇంటి నంతసు ప్రకాశింప చేసినట్లు ఇది ఒక్క ప్రదేశములో నున్నను ప్రపంచము నంతను ప్రకాశింపచేయును. అట్టి కాంత్యుద్గమము మిమ్ములను రక్షించుగాక."

వి. దీనిలో ప్రసాదగుణము లేకుండుట దోషము; సూర్యస్తుతి పర మగుట ఉపమాలంకార ముండుట గుణము.

ఇతి గదితగుణార్థీ త్యక్తనిర్దిష్టదోషః
కవిరుచిరపదస్థ శ్చక్రవర్తిత్వసిద్ధ్యై.
కిమపి కృతవివేకః సాధుమధ్యాధమానాం
నృప ఇవ పరిరక్షేత్ సంకరం వర్ణవృత్తేః. 2

ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్యక్షేమేన్ద్రకృతే కవికణ్ఠాభరణే
గుణదోషవిభాగశ్చతుర్థః సన్ధిః.

ఈ విధముగా పైన చెప్పిన గుణములను సంపాదించుకొనగోరుచు,

పైన చూపిన దోషములను పరిత్యజించుచు 'కవి' అనే మంచి స్థానమును పొందినవాడు, "కవిచక్రవర్తి" కూడ కావలెనన్నచో, ఆతడు సాధు-మధ్యమ-అధమ కావ్యముల లేదా కవుల విషయమున సరియైన వివేకమును సంపాదించి వర్ణవృత్తికి సంకరము లేని విధమున రాజు సంరక్షించినట్లు (కవుల తారతమ్యమును బాగుగా గుర్తించి) కావ్యరచనావృత్తిలో సాంకర్యము లేని విధముగ చూచుకొనవలెను.

వ్యాసదాసు డను నామాంతరము గల క్షేమేంద్రుడు రచించిన కవికంఠాభరణములో గుణదోషవిభాగరూప మగు చతుర్థసంధి

సమాప్తము

## పరిచయప్రాప్తిర్నామ పంచమః సంధిః

అథ పరిచయచారుత్వమాహ—

న హి పరిచయహీనః కేవలే కావ్యకష్టే
కుకవిరభినివిష్టః స్పష్టశబ్దప్రవిష్టః।
విబుధసదసి పృష్టః క్లిష్టధీర్వేత్తి వక్తుం
నర ఇవ నగరాన్తర్గహ్వరే కోఽప్యధృష్టః॥ 1

తత్ర తర్క - వ్యాకరణ-భరత - చాణక్య-వాత్స్యాయన-భారత - రామాయణ - మోక్షోపాయాత్మజ్ఞాన - ధాతువాదరత్నపరీక్షా — వైద్యక-జ్యోతిష - ధనుర్వేద-గజతురగపురుషలక్షణ - ద్యూతేన్ద్రజాల-ప్రకీర్ణేషు పరిచయః కవిసామ్రాజ్యవ్యఞ్జనః।

ఇపుడు (వివిధశాస్త్రాది) పరిచయమువలన కలుగు చారుత్వమును చెప్పుచున్నాడు—

"వివిధ శాస్త్రాదిపరిచయము లేకుండగనే కేవలము కావ్యరచనారూప మగు కష్టకార్యము చేయుటకు ఉపక్రమించిన కుకవి స్పష్టార్థము లగు

సామాన్యవిషయములను మాత్రమే తెలిసికొనగలిగి ఉండును. అట్టివానిని. పండితసభలో ఎవరైన ప్రశ్నించినచో దారి తెన్నులు తెలియని మహానగరంలో క్రొత్తగా ప్రవేశించినవాడు ఏమి చేయవలెనో తెలియక కొట్టుమిట్లాడినట్లు, ఏ సమాధానము చెప్పజాలక కంగారుపడును."

అందు-తర్కశాస్త్ర-వ్యాకరణశాస్త్ర-నాట్యశాస్త్ర-అర్థశాస్త్ర-కామశాస్త్ర - భారత-రామాయణ-మోక్షోపాయ-ఆత్మజ్ఞాన-ధాతు (లోహాదులు) వాద-రత్న పరీక్ష-వైద్య-జ్యోతిష-ధనుర్వేద-గజలక్షణశాస్త్ర - అశ్వలక్షణశాస్త్ర - పురుష లక్షణశాస్త్ర-ద్యూత-ఇంద్రజాలవిద్యలందును, తదితరములైన సాధారణ విద్యలందును పరిచయమున్నవాడు కవిసమ్రాట్టు అను బిరుదుకు అర్హుడు.

తర్కపరిచయో యథా మమ పద్యకాదమ్బర్యామ్—

35. యత్ ప్రాప్యం న మనోరథైర్న వచసా స్వప్నేఽపి దృశ్యం న యత్
తత్రాపి స్మరవిప్రలబ్ధమనసాం లాభాభిమానగ్రహః।
మోహోత్ప్రేక్షితశుక్తికారజతనవత్ప్రాయేణ యూనాం భ్రమం
దత్తే తైమిరికద్విచన్ద్రసదృశం ఖే నూనమాశా కృషిః॥

తర్కశాస్త్రపరిచయమున కుదాహరణముగా నా పద్యకాదంబరిలోని శ్లోక మెట్లనగా—

"మన్మథునిచేత మోసగింపబడిన మనస్సుకలవారు మనోరథములచేత గాని, మాటవరసకు గాని, పొందశక్యము కాని వస్తువును కూడా కోరుచుందురు. స్వప్నములో కూడ చూడని వస్తువును సంపాదింపవలె నని పట్టుదలతో ఉందురు. ఆశ ఆకాశములో వ్యవసాయము చేయుట వంటిది. అది సాధారణముగా, యువకులకు, మోహముచే ఊహింబడిన శుక్తికారజతము (ముత్యపు చిప్పను చూచి రజతమనుకొనుట) వంటి, దృష్టిదోషము కలవానికి కనబడే చంద్రద్వయము వంటి భ్రమను కలిగించును."

వి. మోహముచేత శుక్తికపై రజతమును ఆరోపించుట, ద్విచంద్ర భ్రాంతి - ఇట్టి విషయము లన్నియు న్యాయశాస్త్రాదులలో ఉండునవి గాన ఇచట వాటి ఉపయోగము కవికి ఉన్న న్యాయశాస్త్రజ్ఞానమును సూచించు చున్నది.

వ్యాకరణపరిచయో యథా భట్టముక్తికలశస్య—

37 ద్విగురపి సద్వన్ద్వోహం గృహే చ మే సతతమవ్యయీభావః
తత్పురుష కర్మధారయ యేనాహం స్యాం బహువ్రీహిః.

వ్యాకరణపరిచయమునకు ఉదాహరణముగా భట్టముక్తికలశుని శ్లోక మెట్లనగా—

"నేను ద్విగువును (రెండు ఎద్దులు కలవాడను) అయినను, ద్వంద్వ ముతో కూడినవాడను. నా యింటిలో ఎల్లప్పుడును అవ్యయీభావము, (ఖర్చు కాకుండుట) ఉన్నది. అందువలన ఓపురుషుడా: (తత్ + పురుష) దేనిచే నేను బహువ్రీహిని (చాలధాన్యము కలవాడను) అగుదునో అట్టి పనిని నిర్ణయించి చెప్పుము."

"న మే సతతమవ్యయీభావః" అను పాఠ మున్నచో బాగుండును. "నా యింటిలో ఖర్చు లేకపోవుట లేదు" అని అర్థము. ఈ శ్లోకములోని చమత్కార మంతయు 'ద్విగు' 'ద్వంద్వ' 'అవ్యయీభావ' 'తత్పురుష' 'కర్మ ధారయ' 'బహువ్రీహి' పదములను ప్రయోగించుటలో ఉన్నది. ఇది కవికి ఉన్న వ్యాకరణ శాస్త్రపరిచయమును సూచించుచున్నది.

భరతపరిచయో యథా భట్టశ్రీశివస్వామినః—

37. ఆతన్వత్సరసాం స్వరూపరచనామాసన్ది బిన్దూదయం
భావగ్రాహి శుభప్రవేశకగుణం గమ్భీరగర్భస్థితి.
ఉచ్చైర్వృత్తిసపుష్కరవ్యతికరం సంసారవిష్కంభకం
భిన్ద్యాద్వో భరతస్య భాషితమివ ధ్వాన్తం పయో యామునమ్.

భరత (నాట్యశాస్త్ర) పరిచయమునకు ఉదాహరణముగ భట్ట శ్రీ శివస్వామి శ్లోక మెట్లనగా—

"యమునాజలము భరతుని భాషితము (శాస్త్రము) వలె సరస మైన రూపరచనను చేయుచున్నది. (రుచిగల స్వరూపము అనియు సరస మైన రూపకముల రచన యనియు రెండర్థములు). ఆనందమును కలిగించు బిందువుల ఉదయము గలది. (జలబిందువులు, నాటకాదులలోని బిందువు అనియు రెండర్థములు). మనోహర మైనది (నాట్యశాస్త్రపక్షమున భావములను గ్రహించునది). మంగళకర మైన ప్రవేశగుణము కలది. ఈ నదిలో ప్రవేశించినచో పుణ్యము లభించు నని అర్థము. (నాట్యశాస్త్రపక్షమున-అంద మైన "ప్రవేశకము" కలది). లోతైన మధ్యభాగము కలది. (గంభీరమైన గర్భసంధి కలది). ఉన్నత మైన స్థితి కలది (వృత్తులు కలది). పుష్కరముల (పద్మములు వాద్యవిశేషములు అని రెండు అర్థములు) సంబంధము కలది. సంసారమును తొలగించునది. (బాగుగా నడచు విష్కంభకము కలది). అట్టి జలము మీ అంధకారమును తొలగించుగాక."

ఇచట యమునానదీవర్ణనసందర్భమున, నాట్యశాస్త్రములో చెప్పిన రూపరచన, బిందువు, భావము, ప్రవేశకము. గర్భము, పుష్కరము, విష్కంభకము అనునవి కూర్చబడినవి గాన ఇది కవికి గల భరతశాస్త్రప్రవేశమును సూచించుచున్నది.

చాణక్యపరిచయో యథా మమ పద్యకాదమ్బర్యామ్—

38. స్వామీ ప్రమాదేన మదేన మన్త్రీ
కోపేన రాష్ట్రం వ్యసనేన కోశః,
ఛిద్రేణ దుర్గం విషమేణ సైన్యం
లోభేన మిత్రం క్షయమేతి రాజ్ఞామ్.

చాణక్యపరిచయమున కుదాహరణముగా నా పద్యకాదంబరిలోని శ్లోక మెట్లనగా—

"రాజుల ప్రమాదముచేత ప్రభువు (తానే అనగా రాజు), మదముచేత మంత్రి, కోపముచేత రాష్ట్రము, దుర్వ్యసనము చేత ధనాగారము, చిన్న లోపముచేత దుర్గము, కష్టములు వచ్చుటచే సైన్యము, లోభముచేత మిత్రుడు క్షయమును పొందును."

ఈ శ్లోకములోని విషయములు అర్థశాస్త్రములో ప్రతిపాదింపబడినవి గాన దీనివలన కవికి చాణుక్యుడు రచించిన అర్థశాస్త్రముతో పరిచయ మున్నట్లు తెలియుచున్నది.

వాత్స్యాయనపరిచయో యథా భట్ట దామోదర గుప్తస్య—

39. అధరే బిన్దుః కణ్ఠే మణిమాలా కుచయుగే శశప్లుతకమ్
తవ సూచయన్తి సున్దరి కుసుమాయుధశాస్త్రపండితం
రమణమ్.

(కుట్టనీ. 402)

వాత్స్యాయన (కామశాస్త్ర) పరిచయమునకు ఉదాహరణముగ భట్ట దామోదరగుప్తుని శ్లోకమెట్లనగా—

"ఓ సుందరీ నీ అధరమునందు కనబడుచున్న బిందువు (ఒకవిధముగ చేసిన దంతక్షతమునకు బిందు వని పేరు), కంఠమునందలి మణిమాల, కుచయుగమునందలి శశప్లుతము ("మణిమాల" "శశప్లుతము" అనునవి ఒక పద్ధతిలో చేసిననఖక్షతములకు పేర్లు) నీ రమణుడు కుసుమాయుధశాస్త్రములో పండితు డని సూచించుచున్నవి."

భారతపరిచయో యథా మమ దేశోపదేశే (4-5)—

40. భగదత్తప్రభావాఖ్యా కర్ణశల్యోత్కటస్వనా
సేనేవ కురురాజస్య కుట్టనీ కిన్తు నిష్కృపా.

భారతపరిచయమునకు ఉదాహరణముగ నా దేశోపదేశములోని శ్లోక మెట్లనగా—

"కుట్టని (తార్పుడుకత్తె) కురురాజసేనవలె, భగదత్తమైన ప్రభావముతో, నిండినది, (భగదత్తుడనేవాని ప్రభావముతోకూడినది). చెవికి శల్యమువలె ఉండు తీవ్రమైన ధ్వని గలది (కర్ణునియొక్కయు, శల్యునియొక్కయు తీవ్రమైన ధ్వనితో కూడినది). కాని జాలిలేనిది (కృపాచార్యుడులేనిది)".

రామాయణపరిచయో యథా భట్టవాచస్పతేః

41. జనస్థానే భ్రాన్తం కనకమృగతృష్ణాన్వితధియా
వచో వై దేహీతి ప్రతిపదముదశ్రు ప్రలపితమ్.
కృతాలఙ్కాభర్తుర్వదనపరిపాటీషు ఘటనా
మయాప్తం రామత్వం కుశలవసుతా న త్వధిగతా.

ఇచట భగదత్త-కర్ణ-శల్య-కృపనామనిర్దేశము కవికి గల భారతపరిచయమును సూచించుచున్నది.

రామాయణ పరిచయమునకు ఉదాహరణముగా భట్టవాచస్పతి శ్లోకమెట్లనగా—

(సేవకునిపక్షమున అర్థము) కనక + మృగతృష్ణా + అన్వితధియా = బంగారమనే ఎండమావులచేత గ్రుడ్డిదిగా చేయబడిన బుద్ధితో, జనస్థానే = నగరములలో, భ్రాన్తం = తిరుగుట జరిగినది. దేహి + ఇతి = ఇమ్ము అని, ప్రతి పదం = ప్రతిపదమునందును, ఉదశ్రు = బయల్వెడుచున్న కన్నీళ్ళు కలుగునట్లుగా, వచః = వాక్కు, ప్రలపితంవై = పలకబడినది. కాభర్తుః = కుత్సిత ప్రభువుయొక్క, వదనపరిపాటీషు = ముఖకవలికలయందు, అలం = అత్యధికముగా, ఘటనా = ఘటన (నేత్రములను ఉంచుట), కృతా = చేయబడినది. మయా = నాచేత, రామత్వం = రామత్వము, ఆప్తం = పొంద బడినది. తు = కాని, కుశలవసుతా = కుశలమైన ధనము కలిగియుండుట, నఅధిగతా = పొందబడలేదు. (రాముని పక్షమున) కనకమృగ + తృష్ణా + అంధితధియా = బంగారులేడియందు ఆశచేత గ్రుడ్డిదిగా చేయబడిన బుద్ధి చేత, జనస్థానే = జనస్థాన మనెడు అరణ్యమునందు, తిరుగుట జరిగినది.

ప్రతిపదం = అడుగడుగునా, కన్నీళ్ళు కార్చుచు, వైదేహి + ఇతి = హా! వైదేహీ అని వాక్కు పలకబడినది, లజ్జాభర్తుః = రావణుని, వదనపరిపాటీ + ఇషు ఘటనా = ముఖపంక్తియందు బాణముల ఘటన, చేయబడినది.

పైన చెప్పినట్లుగా నాకును రామునకును అన్నీ సమముగనే ఉన్నవి గాని ఆయనకు ఉన్న "కుశలవసుత" మాత్రము నాకు లభింపలేదు అని సేవకుడు అనుచున్నాడు.

ఈ శ్లోకము కవికి గల రామాయణపరిచయమును సూచించుచున్నది

మోక్షోపాయపరిచయో యథా మమ ముక్తావల్యామ్—

42. నిరాసఙ్గా ప్రీతిర్విషయనియమో౽న్తర్న తు బహిః
స్వభావే భావానాం క్షయయుజి విమర్శః ప్రతిదినమ్.
అయం సంక్షేపేణ క్షపితతమసా మక్షయపదే
తపోదీక్షాక్లేశక్షపణనిరపేక్షః పరికరః

మోక్షోపాయపరిచయమునకు ఉదాహరణముగా నా ముక్తావళిలో ఎట్లనగా—

"ఆసక్తి లేని ప్రేమ, విషయములను (భోగములను) బైట నియమించుకొనుట కాక లోపల నియమించుకొనుట; పదార్థము లన్నియు నశించెడి స్వభావముగలవి అను విషయమును ప్రతిదినము విమర్శించుట, ఇదియే అజ్ఞానమును తొలగించుకొన్నవారు మోక్షపదమును సంపాదించుకొనుటకై చేయవలసిన, తపోదీక్షాదుల శ్రమతో పని లేని, పరికరము (ఉపాయాలంబనము)"

ఆత్మజ్ఞానపరిచితిర్యథా మమ చిత్రభారతనామ్ని నాటకే—

43. పృథుశాస్త్రకథారమ్భరోమన్థేన వృథైవ కిమ్
అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్త్వజ్ఞైర్జ్యోతిరాన్తరమ్.

ఆత్మజ్ఞాన పరిచయమునకు ఉదాహరణముగా నా చిత్ర భారత మనే నాటకములో ఎట్లనగా—

"వ్యర్థ మైన పెద్ద పెద్ద శాస్త్రముల వాద మనే బొంతలను నమిలి నెమరువేయుటచేత ఏమి ప్రయోజనము? తత్త్వజ్ఞులు:, ప్రయత్నపూర్వకముగ లోపల నున్న జ్యోతిని అన్వేషించవలెను.

ధాతువాదపరిచయో యథా రాజశేఖరస్య—

44. నఖదలితహరిద్రాగ్రన్థిగౌరే శరీరే
స్ఫురతి విరహజన్మా కోఽప్యయం పాణ్డుభావః.
బలవతి సతి యస్మిన్ సార్థమావర్త్య హేమ్నా
రజతమివ మృగాక్ష్యాః కల్పితాన్యఙ్గకాని.

ధాతువాదపరిచయమునకు ఉదాహరణముగా రాజశేఖరుని శ్లోక మెట్లనగా—

"గోటితో గిల్లిన పసుపుదుంపకణుపు వలె పచ్చనైన ఆమె శరీరము మీద, విరహము వలన కలిగిన తెలుపు వర్ణింపశక్యము కాని విధమున ప్రకాశించుచున్నది. ఆ తెలుపు ఎక్కువ అయినపుడు, ఆమె అవయవములు బంగారముతో కలిపి కరిగించిన వెండితో నిర్మించినట్లున్నవి. (ధాతువాద మనగా లోహములకు సంబంధించిన శాస్త్రము).

రత్నపరీక్షాపరిచయో యథా భట్టభల్లటస్య—

45. ద్రవిణమాపది భూషణముత్సవే
శరణమాత్మభయే నిశి దీపకః.
బహువిధాభ్యుపకారభరక్షమో
భవతి కోఽపి భవానివ సన్మణిః. (భ. శ. 5)

రత్న పరీక్షాపరిచయమున కుదాహరణముగా భట్టభల్లటుని శ్లోక మెట్లనగా—

"నీవలెనే, ఉత్తమమైన మణి, ఆపత్సమయములో ధనముగాను, ఉత్సవమునందు అలంకారముగాను, భయము కలిగినప్పుడు శరణముగాను, రాత్రి

యందు దీపకముగాను, అనేకవిధముల ఉపకారము చేయుటకు సమర్థ మగు చున్నది. (దీపకః అనగా మిత్రుని పక్షమున ప్రకాశింపచేయువాడు అని అర్థము).

వైద్యకపరిచయో యథా మమ పద్యకాదమ్బర్యామ్—

అఙ్గం చన్దనపఙ్కపఙ్కజబిసచ్ఛేదా వలీనం ముహు
స్తాపః శాప ఇవైష శోషణపటుః కమ్పః సఖీకమ్పనః
శ్వాసాః సావృతతారహారరుచయః సంభిన్నచీనాంశుకా
జాతః ప్రాగతిదాహవేదనమహారమ్భః స తస్యా జ్వరః.

వైద్యపరిచయమునకు ఉదాహరణముగా నా పద్యకాదంబరిలోని శ్లోక మెట్లనగా—

"శరీరము మంచిగంధము క్రిందను, తామరతూడుల క్రిందను కప్పబడి పోయినవి. తాపము, శాపము వలె, ఎండించి వేయుచున్నది కంపము సఖీ జనులకు కంపము కలిగించుచున్నది శ్వాసలు ముత్యాలహారముల కాంతులను కప్పివేయుచు, పట్టుచీరను ఎక్కువగ కదల్చివేయుచున్నవి. ఆమెకు అతి దాహ మును కలిగించు జ్వరము కలిగినది."

వి. ఇచట జ్వరలక్షణములు వర్ణింపబడుటచే వైద్యశాస్త్రపరిచయము సూచిత మగుచున్నది.

జ్యోతిఃశాస్త్రపరిచయో యథా విద్యానన్దస్య—

47. ద్యామాలోకయతాం కలాః కలయతాం ఛాయాః సమాచిన్వతాం
క్లేశ్యః కేవలమఙ్గులీర్గణయతాం మౌహూర్తికానామయమ్.
ధన్యా సా రజనీ తదేవ సుదినం పుణ్యః స ఏవ క్షణో
యత్రాజ్ఞాతచరః ప్రియానయనయోః సీమానమేతి ప్రియః.

జ్యోతిఃశాస్త్రపరిచయమునకు ఉదాహరణముగా విద్యానందుని శ్లోక మెట్లనగా—

"ఆకాశమువైపు చూచుచు, కలలు (సెకన్ వంటి అల్పకాలము) పరి

శీలించుచు, నీడలు కొలుచుచు, వ్రేళ్ళు లెక్కపెట్టుచు ఉన్న జ్యోతిష్కులు చేయునది ఇది అంతయు వ్యర్థమైన క్లేశము మాత్రమే. ప్రియుడు, ముందు తెలియకుండగ, ఎపుడు ప్రియురాలి దృష్టిలో పడునో ఆ రాత్రియే ధన్యమైనది; అదే సుదినము, ఆ క్షణమే పుణ్య మైన క్షణము".

ధనుర్వేదపరిచయో యథా మమ కనకజానక్యామ్—

48. ఆర్యస్యాస్త్రప్రయోగలాఘవవతీ సన్ధానసమ్బన్ధినీ
స్థాణుస్థానకసౌష్ఠవప్రణయినీ చిత్రక్రియాలఙ్కృతిః.
నిష్పన్దేన మయాతివిస్మయమయీ సత్యస్థితప్రత్యయా
సంహారే ఖరదూషణత్రిశిరసామేషైవ దృష్టా స్థితిః.

ధనుర్వేదపరిచయమునకు ఉదాహరణముగ నా "కనకజానకి" లో ఎట్లనగా—

"అస్త్రములను ప్రయోగించుటలో మంచి లాఘవము కలదియు, శర సంధానమునకు సంబంధించినదియు, స్థిరమైన నిలబడురీతియొక్క సౌష్ఠవముతో కూడినదియు, విచిత్రమైన క్రియయే అలంకారముగా కలదియు, ఆశ్చర్యకర మైనదియు, నిజమైన విశ్వాసము కలదియు, అగు ఆర్యుని (అన్నగారి) ఇట్టి స్థితినే నేను నిశ్చలుడనై, ఖరదూషణ త్రిశిరోసంహారసమయమున చూచియుంటిని."

గజలక్షణపరిచయో యథా మమ కనకజానక్యామ్—

49. కర్ణాభ్యర్ణవికీర్ణచామరమరుద్వ్యస్తీర్ణనిఃశ్వాసవాన్
శశ్వచ్ఛత్రవిరాజిరాజ్యవిభవద్వేషీ విలీనేక్షణః.
స్మృత్వా రాఘవకుఞ్జరః ప్రియతమామేకాకినీం కాననే
సన్త్యక్తాం చిరముక్తభోగకవలః క్లేశోష్మణా శుష్యతి.

గజలక్షణ పరిచయమున కుదాహరణముగా నా కనకజానకిలో ఎట్లనగా-
"చెవి దగ్గర విసరబడుచున్న చామరముల వాయువుచేత అధికమైన

నిట్టూర్పులు కలదియు (గజకర్ణాలంకారమునకు కూడ చామర మని పేరు). శంఖములతోటి,చక్రములతోటి, ప్రకాశించుచున్న రాజ్యవైభవమును ద్వేషించు చున్నదియు, మూయబడిన నేత్రములు గలదియు, అగు రాముడను ఏనుగు. అడవిలో వంటరిగా విడువబడిన ప్రియురాలిని స్మరించి, చిరకాలము నుంచి భోగము లనెడు కవలములు విడచి దుఃఖతాపముచేత ఎండిపోవు చున్నది."

క్రొత్తగా పట్టుపడిన ఏనుగ అడవిలోని తనప్రియురాలిని స్మరించుచు, ఆహారము మాని, నిట్టూర్చుచు, తనపై ఉంచబడిన రాజచిహ్నాదులను ద్వేషిం చుచు, శుష్కించు విధమున సీతను పరిత్యజించిన రాముడు శుష్కించు చున్నాడు అని చెప్పుటలో గజస్వభావజ్ఞానము బాగుగ సూచిత మగుచున్నది.

తురగలక్షణపరిచయో యథా మమామృతతరంగనామ్ని కావ్యే—

50. ఆవర్తశోభీ పృథుసత్త్వరాశిః
ఫేనావదాతః పవనోరువేగః.
గమ్భీరఘోషోఽద్రివిమర్దఖేదా
దశ్వాకృతిం కర్తుమివోద్యతోఽబ్ధిః.

51. ఉచ్చైః శ్రవాః శక్రముపాజగామ
స విశ్వసామ్రాజ్యజయప్రదోఽశ్వః.
జగ్రాహ హేలాఘనశబ్దశబ్ద
నివేదితాశేషశుభం తమిన్ద్రః. (యుగ్మమ్)

తురగలక్షణపరిచయమునకు ఉదాహరణము నా అమృతతరంగ మను కావ్యములో ఎట్లనగా—

"సుడులచేత ప్రకాశించుచున్నదియు, అధికమైన బలముయొక్క రాశియు (సముద్రపక్షమున-పెద్దవైన జంతువుల రాశియు), నురుగు వలె

(నురుగుచేత) తెల్లనిదియు, వాయువువంటి (వాయువుచేత) గొప్ప వేగము కలదియు, గంభీరమైన ధ్వని కలదియు, మందరపర్వతము రాపిడివలన కలిగిన ఖేదముచేత అశ్వాకారమును ధరించుటకై ప్రయత్నించుచున్న సముద్రమువలె ఉన్నదియు అగు ఉచ్చైఃశ్రవ మనెడు, విశ్వసామ్రాజ్యమును ఇచ్చెడు అశ్వము ఇంద్రుని దగ్గరకు వచ్చెను-ఆ ఇంద్రుడు, సకిలింపు అనెడు గంభీర మైన శంఖధ్వనిచేత సూచించబడిన సమస్తమైన శుభములు గల దానిని స్వీకరించెను.

'హేలాః'కు బదులు "హేషా" అను పాఠ మున్నచో బాగుండును.

పురుషలక్షణపరిచయో యథా కాలిదాసస్య—

52. వ్యూఢోరస్కో వృషస్కన్ధః సాలప్రాంశుర్మహాభుజః.
ఆత్మకర్మక్షమం దేహం క్షాత్రో ధర్మ ఇవాశ్రితః.
(రఘు. 1. 13.)

పురుషలక్షణపరిచయమునకు ఉదాహరణముగా కాలిదాసుశ్లోక మెట్లనగా—

"విశాలమైన వక్షఃస్థలముకలవాడును, ఎద్దు మూపురము వంటి మూపురము కలవాడును, సాలవృక్షము వలె ఉన్నత మైనవాడును, గొప్ప భుజములు కలవాడునుఅగు ఆ దిలీపుడు, తాను చేయదగిన కర్మకు తగిన దేహమును ఆశ్రయించిన క్షాత్రధర్మము వలె ఉండెను".

ద్యూతపరిచయో యథా చన్ద్రకస్య—

53. యత్రానేకే క్వచిదపి గృహే తత్ర తిష్ఠత్యథైకో
యత్రాప్యేకస్తదను బహవస్తత్ర నైకోఽపి చాన్తే.
ఇత్థం నేయౌ రజనిదివసౌ లోలయన్ ద్వావివాక్షౌ
కాలః కాల్యా సహ బహుకలః క్రీడతి ప్రాణిసారైః.

ద్యూతపరిచయమున కుదాహరణముగా చంద్రకుని శ్లోక మెట్లనగా—

"ఒక సమయమున చాలామంది ఉన్న ఇంటిలో (గదిలో) కొంత కాలమైన తరవాత ఒక్కడే ఉండును. ఒక్కడే ఉన్న ఇంటిలో చాలామంది వచ్చి చేరుదురు. చివరికి ఒక్కరూ ఉండరు. ఈ విధముగా, అనేకకళలు గల కాలుడు, కాలితో కలిసి, ఆడించదగిన రాత్రింబగళ్ళను రెండు పాచికలను వలె ఆడించుచు, ప్రాణు లనెడు పావులతో ఆడుకొనుచున్నాడు".

ఇంద్రజాలచరిచయో యథా శ్రీహర్షస్య—

54. ఏష బ్రహ్మా సరోజే రజనికరకలాశేఖరః శంకరోఽయం
దోర్భిర్దైత్యాన్తకోఽసౌ సధనురసిగదాచక్రచిహ్నైశ్చతుర్భిః
ఏషోఽప్యైరావణస్థస్త్రిదశపతిరమీ దేవి దేవాస్తథాన్యే
నృత్యన్తి వ్యోమ్ని చైతాశ్చలచరణరణన్నూపురా దివ్యనార్యః
(రత్నా 4. 11)

ఇంద్రజాలపరిచయమునకు ఉదాహరణముగా శ్రీహర్షుని శ్లోక మెట్లనగా—

"ఇదిగో, పద్మములో ఇతడు బ్రహ్మ. చంద్రకళ శిరోభూషణంగా ధరించిన శంకరుడు ఇడిగో. ధనస్సు, ఖడ్గము, గద, చక్రము అను చిహ్నములు గల నాలుగు హస్తములతో దైత్యాంతకుడైన శ్రీమహావిష్ణు విడిగో. ఐరావణముమీద ఉన్న దేవతాధిపతి ఇడిగో. ఇదిగో వీరందరును ఇతరదేవతలు. ఈదేవతాస్త్రీలు కదలుచున్న పాదములమీద ధ్వని చేయుచున్న నూపురములతో ఆకాశముమీద నాట్యముచేయుచున్నారు".

రత్నావళి నాటికలో ఒక ఐంద్రజాలికుడు వచ్చి వత్సరాజు సమక్షమున ఇంద్రజాలవిద్య చూపు సందర్భములోని శ్లోక మిది.

ప్రకీర్ణే చిత్రపరిచయో యథా భగవతో వ్యాసస్య—

అతథ్యాన్యపి తథ్యాని దర్శయన్తి విచక్షణాః
సమే నిమ్నోన్నతానీవ చిత్రకర్మవిదో జనాః.

ప్రకీర్ణములో అనగా ఇతరవివిధవిషయపరిజ్ఞానములో (Miscellaneous) చిత్రపరిచయమునకు ఉదాహరణముగా భగవంతుడగు వ్యాసుని శ్లోక మెట్లనగా—

"చిత్రకర్మ తెలిసినవారు సమప్రదేశమును నిమ్నోన్నతముగా నున్నట్లు చూపించినట్లుగా, నేర్పరులు, అసత్యవిషయములను కూడ సత్యమైనవాటినిగా చూపుదురు."

దేశపరిచయో యథా మమ శశివంశే—

56. భోజై ర్భజ్జనభీరుభిర్విలులితం వ్యామీలితం మాలవైః
మద్రైర్విద్రుతమేవ యాతమసకృన్మార్గాదధో మాగధైః
వఙ్గానామభిమన్యకఙ్కణరవై ర్వ్యాతే పురఃసూచితే
మీనైః సఙ్కుచితం పరస్పరధృతై ర్న్నిరన్ధ్రైరన్ధ్రైః స్థితమ్.

దేశపరిచయమున కుదాహరణముగా నా శశిదూతములోని శ్లోకము—

"అభిమన్యుని కంకణధ్వనులచేత (అభిమన్యు అనునది ఒక యుద్ధ గజముపకు పేరు కావచ్చును. దాని కాలి కంకణముల ధ్వని వినబడుటచే అని అర్థము) వంగసైన్యముల సముదాయము ఎదుట నున్నట్లు సూచింపబడగా, పరాజయమువలన భయపడిన భోజదేశీయులు జారిపోయిరి; మాలవదేశీయులు అంతర్ధానమైరి. మద్రదేశీయులు పారిపోయిరి. మగధదేశీయులు మార్గమునుండి దూరముగా తొలగిపోయిరి. మీనదేశీయులు (?) సంకోచము చెందిరి. ఆంధ్రులు ఒకరి నొకరు గట్టిగా పట్టుకొని, గుంపుగా నిలిచిపోయిరి."

వృక్షపరిచయో యథా మమ కనకజానక్యామ్—

57. జమ్బ్వాబిమ్బకదమ్బనిమ్బబకులప్లక్షాక్షభల్లాతక
ద్రాక్షాకింశుకకర్ణికారకదలీజమ్బీరకోదుమ్బరైః.

సా సంతానకబిల్వతిల్వతిలకశ్లేష్మాతకారగ్వధ
న్యగ్రోధార్జునశాతనాసనవనశ్యామాన్ దదర్శాశ్రమాన్.

వృక్షపరిచయమున కుదాహరణము నా "కనకజానకి" లో ఎట్లనగా—
పై శ్లోకములో 24 వృక్షముల పేర్లు చెప్పబడినవి గాన ఇది కవికి గల వృక్ష (నామః) పరిచయమును సూచించుచున్నది.

వనేచరపరిచయో యథా మమ తత్రైవ—

58. వామస్కన్ధనిషణ్ణశార్ఙ్గకుటిలప్రాన్తార్పితాధోముఖ
స్యన్దచ్ఛోణితలమ్బమానశశకాన్ పాణిస్థలచ్చామరాన్.
జ్యాస్యప్రోతకపోతపోతనిపతద్రక్తాక్తతూణీరకాన్
సాపశ్యత్ కరికుమ్భభేదజనితాక్రన్దాన్ పులిన్దాన్ పురః.

వనేచరపరిచయమునకు ఉదాహరణముగాఆకనకజానకిలోనే మరియొక శ్లోకము— (వనేచరు లనగా వనములలో నివసించు కిరాతులు మొదలైన వారు—.)

"పులిందులు తమ ఎడమ బుజాలకు తగల్చిన కొమ్ముతో తయారు చేసిన ధనస్సుల వంకరగా నున్న ప్రాంతమునందు కుందేళ్ళను తలక్రిందులుగా వ్రేలాడదీసినారు. వాటి ముఖములనుండి రక్తము కారుచున్నది. చేతులలో చామరములను (చమరీమృగముల వాలాగ్రములను) పట్టుకొని యున్నారు. నారికి గ్రుచ్చిన పావురాల రక్తముతో అంబులపొదులు తడియుచున్నవి. ఎన్నియో ఏనుగుల కుంభములను బ్రద్దలుకొట్టి అవి ఆక్రందించునట్లు చేసినారు. అట్టి పులిందులను, ఆమె తన ఎదుట చూచెను"

ఔదార్యపరిచయో యథా మమ చతుర్వర్గసంగ్రహే
(1. 26)

59. మాన్యః కులీనః కులజాత్కలావాన్
విద్వాన్ కలాజ్ఞాద్విదుషః సుశీలః.

ధనీ సుశీలాద్ధనినోఽపి దాతా
దాతుర్జితా కీర్తిరయాచకేన.

ఔదార్యపరిచయమునకు ఉదాహరణముగా నా చతుర్వర్గసంగ్రహము నుండి ఎట్లనగా—

"సత్కులమునందు పుట్టినవాడు గౌరవింపదగినవాడు. సత్కులము నందు పుట్టినవానికంటె కళలలో ప్రావీణ్య మున్నవాడు, వానికంటె పండితుడు, వానికంటె మంచి శీలము గలవాడు, వానికంటె ధనికుడు, వానికంటె గూడ దాతృత్వ మున్నవాడు ఎక్కువ గౌరవింపదగినవాడు యాచన చేయనివాడు దాతయొక్క కీర్తిని కూడ జయించును".

అచేతనచేతనాధ్యారోపపరిచయో యథా మచ్ఛిష్యమహాశ్రీభట్టోదయ సింహస్య లలితాభిధానే మహాకావ్యే—

60. ఇహ వికసదశోకాస్తోకపుష్పోపకారై
రయమతిశయరక్తః సక్తసుస్నిగ్ధభావః.
త్రిభువనజయసజ్జః ప్రాజ్యసామ్రాజ్యభాజః
ప్రథయతి పృథుమైత్రీం పుష్పచాపస్య చైత్రః.

అచేతనమునందు చేతనధర్మములను ఆరోపించి వర్ణించుటతో పరిచయమునకు ఉదాహరణముగా మా శిష్యుడైన మహాశ్రీభట్టోదయసింహుని 'లలితము' అనే మహాకావ్యములోని శ్లోక మెట్లనగా—

"ఇచట-వికసించిన అసంఖ్యాకము లైన అశోకపుష్పములచేత ఎక్కువ రక్త మైనదియు (ఎఱ్ఱగా నున్నది, అనురాగము గలది అని రెండు అర్థములు) అధిక మగు స్నిగ్ధత్వముతో (అందము, స్నేహము అని రెండర్థములు) కూడినదియు, మూడు లోకములను జయించుటకు ఉద్యుక్త మైన చైత్రము అతి విశాల మైన సామ్రాజ్యమును పొందిన పుష్పచాపుని ఘనిష్ఠ మైన మైత్రిని ప్రకటించుచున్నది".

వి. ఇచట అచేతన మైన చైత్రమునందు చేతనధర్మము లగు అను రాగ-స్నేహ-త్రిభువనవిజయసన్నద్ధత్వాదులు ఆరోపింపబడినవి గాన ఇది అచేతనచేతనాధ్యారోపప్రచయమునకు ఉదాహరణ మని అర్థము.

భక్తిపరిచయో యథాస్యైవ భక్తిభవనామ్ని మహాకావ్యే—

61. బాల్యాదేవ నిరర్గలప్రణయినీ భక్తిర్భవానీపతౌ
జన్మాభ్యాసవికాసవాసితమనః సంవాససందాయినీ
ప్రాయః ప్రాక్తనకర్మనిర్మితమహామోహాఙ్కురోపప్లవ
భవ్యానాం భవభీతిభఞ్జనసఖీ సంజాయతే సన్మతిః.

భక్తిపరిచయమునకు ఉదాహరణముగా ఆమహాశ్రీభట్టోదయ సింహుని భక్తిభవ మనే మహాకావ్యము లోని శ్లోక మెట్లనగా—

"పుణ్యాత్ములకు బాల్యమునుండియే పరమేశ్వరునియందు, భక్తిరూప మైన సద్బుద్ధి పుట్టును. ఈ భక్తిలోని ప్రేమకు ఎట్టి అడ్డును ఉండదు. జన్మనుండియు. అభ్యాసముచేత వికసించిన మనస్సులో నిలచి ఉండును. పూర్వకర్మలవలన కలిగిన మహామోహాంకురములను నశింపచేయును సంసార భయమును తొలగించు సఖురాలు ఈ భక్తి".

వివేకపరిచయో యథా మచ్ఛిష్యరాజపుత్రలక్ష్మణాదిత్యస్య—

62. ఆశాపాశవిముక్తియుక్తమమలం సన్తోషమాన్యం మనః
సేవాయాసవివర్జితం విహరణం మాయావిహీనం వచః.
చణ్డీశార్చనమాత్మశుద్ధిజననీ గఙ్గేవ సత్సఙ్గతిః
సోఽయం సంతరణే పరః పరికరః సంసారవారాంనిధేః

వివేకపరిచయమునకు ఉదాహరణముగా నా శిష్యు డైన రాజపుత్ర లక్ష్మణాదిత్యుని శ్లోక మెట్లనగా—

'ఆశాపాశముల బంధము లేనిదియు, నిర్మల మైనదియు సంతో

షముచేత పూజింపదగినదియు అయిన మనస్సు; ఇతరుల సేవ చేయుట అనెడు శ్రమ లేని ప్రవృత్తియు, మాయ లేని వాక్కు, పరమేశ్వరుని పూజించుట, గంగ వలె ఆత్మశుద్ధిని కలిగించు సత్సంగతి,— ఇది అంతయు సంసార సముద్రమును దాటుటకు ఉపకరించు సాధనసామగ్రి".

ప్రశమపరిచయో యథా మమ చతుర్వర్గ సంగ్రహే—

63. చిత్తం వాతవికాసిపాంసుసదృశం రూపం దినాన్తాతపం—
భోగం దుర్గతగేహబన్ధచపలం పుష్పస్మితం యౌవనమ్,
స్వప్నం బన్ధుసమాగమం తనుమపి ప్రస్థానపుణ్యప్రపాం
నిత్యం చిన్తయతాం భవన్తి న సతాం భూయో భవగ్రన్థయః.

ప్రశమపరిచయమునకు ఉదాహరణముగ నా చతుర్వర్గసంగ్రహము లోని శ్లోక మెట్లనగా—

"చిత్తము(ను) వాయువుచే ఎగురగొట్టబడిన పరాగముతో సమాన మైన దనియు (సమానమైనదిగాను), రూపము సాయంకాలపు ఎండ అనియు, భోగము దరిద్రుని ఇంటి వలె నిర్మాణము చపల (అస్థిర) మైనదనియు, యౌవనము చిరునవ్వుల (వికాసము) అనియు, బంధుసమాగమము స్వప్న మనియు, శరీరము ప్రయాణములో కనబడిన పుణ్య మైన చలివెందలి అనియు, నిత్యమును చింతించు సత్పురుషులకు మరల సంసారబంధములు ఉండవు."

ఇత్యుక్తా రుచిరోచితా పరిచయప్రాప్తిర్విభాగైర్గిరాం
దిఙ్మాత్రేణ విచిత్రవస్తురచనామైత్రీపవిత్రీకృతా.
యద్యస్త్యత్ర నవోపదేశవిషమే లేశోఽప్యుపాదేయతా
తత్సద్భిర్గుణకౌతుకాదవసరః శ్రోతుం సమాధీయతామ్.

అందమైనదియు, ఉచిత మైనదియు అగు పరిచయప్రాప్తి కావ్యము లలో ఎట్లుండవలెనో దిఙ్మాత్రముగ చెప్పబడినది, ఇది విచిత్ర మైన వస్తు

వుల (కథావస్తువుల లేదా వర్ణనావిషయముల) రచనతో సంబంధ ముండుటచే పవిత్ర మైనది. సూచనముగా ఉపదేశించిన ఈ విషయములందు కొంచె మైన ఉపాదేయత్వము (గ్రహింపవగియుండుట) ఉన్నచో, సత్పురుషులు, గుణములపై ఉన్న మేలుచే, దీనిని వినుటకు అవకాశమును ఇచ్చెదరు గాక".

కృత్వా నిశ్చలదైవపౌరుషమయోపాయః ప్రశస్త్యై గిరాం
క్షేమేన్ద్రేణ యదర్జితం శుభఫలం తేనాస్తు కావ్యార్థినామ్.
నిర్విఘ్నప్రతిభాప్రభావసుభగా వాణీ ప్రమాణీకృతా
సద్భిర్వాగ్భవమన్త్రపూతవిభవా శ్రోత్రామృతస్యన్దినీ 3

ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్యక్షేమేన్ద్రకృతే కవికణ్ఠాభరణే
పరిచయప్రాప్తిః పఞ్చమః సన్ధిః.

"వాక్కులు (కావ్యములు) ఆవిర్భవించుటకు నిశ్చల మైన దైవోపాయమును, పౌరుషోపాయమును ఉపదేశించి క్షేమేంద్రుడు ఏ పుణ్యమును సంపాదించెనో, దానిచేత, కావ్యమును కోరువారికి, విఘ్నములు లేని ప్రతిభా ప్రభావముచేత సుందర మైనదియు, సత్పురుషులచేత ప్రమాణముగా చేయబడినదియు వాగ్భవమంత్రముచేత పవిత్రీకృత మైన, అధికమైన శ్రోత్రామృతమును స్రవించునదియు అగు వాక్కు, కలుగుగాక."

**వ్యాసదాసు డను నామాంతరము గల క్షేమేంద్రుడు రచించిన కవికంఠాభరణములో పరిచయప్రాప్తి యను పంచమసంధి**

**సమాప్తము.**

కాశ్మీరేషు పృథుప్రతాపసవితుః కీర్త్యంశుతారాపతేః
ప్రౌఢారాతివనానలస్య ధనదస్యేవర్ద్ధిస్య భూమణ్డలే।

విశ్వాకారవతః పునః కలియుగే విష్ణోరివోత్సాహినో
రాజ్యే శ్రీమదనన్తరాజనృపతేః కావ్యోదయోఽయం కృతః

ఇతి కవికణ్ఠాభరణమ్ సమాప్తమ్.

"కాశ్మీరదేశమున గొప్ప ప్రతాపముచే సూర్యుడును, కీర్తికిరణములచే చంద్రుడును, ప్రౌఢమైన శత్రువనమునకు అగ్నియు భూలోకమునందలి కుబేరుడును, కలియుగమున మరల ప్రత్యక్షరూపమును దాల్చిన విష్ణువువంటి వాడును, ఉత్సాహవంతుడును అగు శ్రీ మదనన్తరాజ నృపతియొక్క రాజ్యమునందు ఈ కావ్యోదయము, అనగా కావ్యముపుట్టుటకు ఉపాయమును బోధించు కవికంఠాభరణము, రచింపబడినది.

కవికంఠాభరణము సమాప్తము.

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన కవికంఠాభరణాంధ్రభాషా
వ్యాఖ్యయగు బాలానందిని సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తస్యైవ జానకీజానే రర్ప్యతే పదపద్మయోః.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః

# సువృత్తతిలకమ్

## బాలానన్దిన్యాఖ్యయా ఆంధ్రభాషావ్యాఖ్యయా సహితమ్

### ప్రథమో విన్యాసః — వృత్తావచయః

గణపతిగురోర్వక్రీభూతాశశాఙ్కకలాఙ్కురః
స్ఫుటఫణిఫణారత్నచ్ఛాయాఛటాఛురణారుణః.
గిరిపతిసుతాసంసక్తేర్ష్యావిలాసకచగ్రహ
చ్యుతనఖశిఖాలేఖాకాన్తస్తనోతు సుఖాని వః. 1

నత్వా శ్రీతాతపాదాదీన్ శాస్త్రమన్త్రాది సద్గురూన్
సువృత్తతిలకవ్యాఖ్యామాంధ్ర్యాం కుర్వే యథామతి.

క్షేమేంద్రు డను మహాకవి సువృత్తతిలక మను ఛందోగ్రంథమును ప్రారంభించి, నిర్విఘ్నపరిసమాప్త్యై మంగళాచరణమును ఆచరించుచున్నాడు.

“గణపతి తండ్రియైన పరమేశ్వరుని శిరస్సుపై వక్ర మైన చంద్ర రేఖాంకుర మున్నది. ఆత డలంకారములుగ ధరించిన సర్పముల పడగలపై ఉన్న మాణిక్యముల కాంతులు ప్రసరించుటచే అది ఎఱ్ఱగా నున్నది. అందుచే అది—పార్వతితో ప్రణయ కలహ మేర్పడి నపుడు విలాసపూర్వకముగ ఆమె కచగ్రహముచేయగా(శివుని జుట్టు పట్టుకొనగా) పడిన గోటి గీరు వలె ఉన్నది. అట్టి చంద్రరేఖ మీకందరకును సుఖములను కలిగించుగాక”.

స్వచ్ఛన్దలఘురూపాయ త్రిజగద్గురవే నమః
స్పష్ట వామన వృత్తాయ మాయావక్రాయ చక్రిణే. 2

"స్వేచ్ఛగా చిన్న రూపమును ధరించినవాడును, మూడు లోకములకును గురువైనవాడును, ప్రసిద్ధమైన వామనావతారచరిత్ర కలవాడును, మాయచే వక్రతను చూపినవాడును అగు చక్రధారియైన శ్రీ మహావిష్ణువునకు నమస్కారము."

వి. ఇది వృత్తములను గూర్చి రచించిన గ్రంథ మగుటచే ఈ ప్రార్థనాశ్లోకములో, లఘువు, గురువు, వృత్తము, వక్రము అను ఛందః శాస్త్రమునకు సంబంధించు పదములు వచ్చునట్లు కూర్చినాడు క్షేమేంద్రుడు

నమశ్ఛన్దోఽనిధానాయ సువృత్తాచార వేధసే
తపః సత్యనివాసాయ వ్యాసాయామిత తేజసే.

వేదములకు నిధి యైనవాడును, మంచి నడవడికకును ఆచారమునకును బ్రహ్మయు, తపఃసత్యములకు నివాసస్థానమైన వాడును, అమితమైన తేజస్సు కలవాడును అగు వ్యాసునకు నమస్కారము.

క్షేమేన్ద్రేణ సుశిష్యాణాం సరస్వత్యాః ప్రసాధనమ్
సువృత్తతిలకం వర్ణరుచిరం క్రియతే ముఖే. 4.

మంచి శిష్యుల సరస్వతియొక్క ముఖమునందు వర్ణములచేత (రంగు చేత అని మరియొక అర్థము) సువృత్తతిలకము (బాగుగా గుండ్రముగా ఉన్న తిలకము అని రెండవ అర్థము అలంకారముగా క్షేమేంద్రునిచేత చేయ బడుచున్నది.

దృష్ట్వా ఛన్దాంసి సౌన్దర్యం విచార్యార్యప్రియః కృతః
ప్రసిద్ధకావ్యకర్ణ్యవృత్తానామేష సంగ్రహః. 5.

ఛందస్సులను అనగా ఛందః శాస్త్రగ్రంథములను చూచి, సౌందర్యమును గూర్చి బాగుగా ఆలోచించి, ప్రసిద్ధమైన కావ్యముల రచనయందు సమర్థులైన మహాకవుల (అనగా వారు ఎక్కువగ ఉపయోగించిన) వృత్తముల ఈ సంగ్రహము, ఆర్యులకు ప్రియమైనది. రచింపబడినది.

దీర్ఘే సంయోగపూర్వే చ గురుసంజ్ఞా ప్రకీర్తితా
అసంయోగగ్రహం హ్రస్వం లఘుసంజ్ఞం ప్రకీర్తితమ్. 6.

దీర్ఘమునందును (నకును) సంయుక్తాక్షరమునకు వెనుక నున్న హ్రస్వమునకును గురువు అని పేరు. సంయుక్తాక్షరము పరమునందు లేని హ్రస్వము గురువు.

త్రిగురుః ప్రాగ్గురుర్మధ్యగురురన్త్యగురుస్తథా
త్రిలఘుః ప్రాగ్లఘుర్మధ్యలఘురన్త్యలఘుస్తథా. 7.
మభజాః సనయా రేఫతకారా చేతి సంజ్ఞితాః
జ్ఞేయో లఘుర్లకారోఽత్ర గకారశ్చ గురుర్మతః. 8.

మూడు గురువులు గల గణము (మూడక్షరముల సముదాయము) మగణము మొదట గురు వున్నది భగణము మధ్య గురు వున్నది జగణము. చివర గురు వున్నది సగణము. మూడు లఘువు లున్నది నగణము. మొదట లఘు వున్నది యగణము. మధ్య లఘు వున్నది రగణము చివర లఘు వున్నది తగణము. ఈ శాస్త్రమున లకార మనగా లఘువు. గకార మనగా గురువు.

క్వచిద్వ్యక్తిప్తసంస్థానైః క్వచిదేకపదస్థితైః
సంయోగస్థైః క్వచిద్వృత్తముదాహరణముక్తకైః. 9.

(ఈ గ్రంథములో) కొన్ని చోట్ల వేరు వేరు పదములలో నున్న అక్షరములతోను, కొన్ని చోట్ల ఒకే పదములో ఉన్న అక్షరములతోను, కొన్ని చోట్ల సంయోగస్థానమునందు (సంధిస్థానములందు) ఉన్న అక్షరములతోడను ఉదాహరణములు ఇవ్వబడినవి. (భావము అస్పష్టముగా ఉన్నది)

## 1. తనుమధ్యా :-

పూర్వాక్షరద్వయాసక్తవిరామేణ షడక్షరా
తకారేణ యకారేణ తనుమధ్యాభిధీయతే. 10.

యథా మమ—

1. తేన ప్రవిభక్తా కామం వయసా సా
యేన ప్రవిలాసం ధత్తే తనుమధ్యా.

ఆరు అక్షరములు. తగణ-యగణములు. మొదటి రెండక్షరముల పై యతి. ఇది తనుమధ్యావృత్తము. ఉదాహరణమునకు నా శ్లోకము:—

ఆ తనుమధ్య (సన్నని నడుము గల ఆమె) నిజముగా ఆ వయస్సు చేత విభజింపబడిన అవయవములు కలది. కావుననే విలాసలు ధరించు చున్నది (చేయుచున్నది).

సంస్కృత శ్లోకములో విరామమనగా (దీనికి యతి అని కూడ పేరు) పదము పూర్తియగుట. అనగా ఎన్నవ అక్షరముపై విరామ మని చెప్పబడునో ఆ అక్షరముతో పదము పూర్తియై పోవలెను. ఆ పదము సమాసమధ్యమున నున్నను ఉండవచ్చును; అచ్ సంధిచే ఎదుట నున్న పదముతో కలిసినను యతి భంగము కాదు. పై ఉదాహరణశ్లోకములో రెండవ అక్షరముపై యతి గాన 'తేన' 'కామం' ఇత్యాదివిధముగ పదములు పూర్తియైపోయినవి. లక్ష ణములో చెప్పిన ప్రకారము తగణ-యగణములతో ప్రతిపాదమునందును ఆరేసి అక్షరము లున్నవి. ఇట్లే రాబోవు లక్షణోదాహరణముల సమన్వ యము చేసికొనవలెను.

ఛందఃశాస్త్రగ్రంథములలో వృత్తలక్షణములు చెప్పి, వాటికి ఉదా హరణములు చూపునపుడు ఆ వృత్తము పేరు ఆ ఉదాహరణములో వచ్చు నట్లు శ్లోకమును రచించుట అలవాటు. ఆ ప్రకారము ఈ ఉదాహరణములో 'తనుమధ్యా' అను పేరు వచ్చినది. వృత్తము పేర్లను శ్లోకములోని అర్థ ముతో అన్వయించు విధమున కూర్చుచుందురు.

## 2. కుమారలలితమ్ :-

సప్తాక్షరసమాయుక్తం జసాభ్యాం గురుణా తథా
అవిరామం విదుర్వృత్తం కుమారలలితాభిధమ్. 11.

కుమారలలిత మను వృత్తములో ఏడక్షరము లుండును జగణ-సగణ-గురువులు. యతి నియమము లేదు.

యథా మమ:-

జనం స్మృతిదశాప్తం గతానుగతికః కిమ్
న శోచతి జనోఽయం కుమారలలితం తత్.

ఉదాహరణమునకు నా శ్లోకము-

గతానుగతిక మైన ఈ జనము స్మృతిదశను పొందిన (స్మరించ దగిన అవస్థను పొందిన, అనగా మరణించిన) జనమును గూర్చి దుఃఖించుట లేదా? ఇట్లు దుఃఖించుట పిల్లల చేష్ట; అనగా అజ్ఞానవిలసితము.

కొందరు ఒక పద్ధతిలో ప్రవర్తించుచున్నప్పుడు గ్రుడ్డిగా ఆ పద్ధతిని అనుకరించువాడు గతానుగతికుడు.

## 3 విద్యున్మాల :-

మకారయుగపర్యన్తే యత్ సంయుక్తగురుద్వయమ్
విద్యున్మాలాభిధం తద్ధి వృత్తమష్టాక్షరం విదుః.

రెండు మగణములు; వాటి తరవాత రెండు గురువులు. ఇట్లు ఎనిమిది అక్షరముల వృత్తము విద్యున్మాల.

యథా మమ:-

3. మౌనం ధ్యానం భూమౌ శయ్యా గుర్వీ తస్యాః కామావస్థా
మేఘోత్సఙ్గే నృత్తాసక్తా యస్మిన్ కాలేవిద్యున్మాలా.

ఉదాహరణముగ నా శ్లోకము—

మేఘముల ఒడిలో మెరుపుల పంక్తి నాట్యము చేయుకాలములో (వర్షకాలములో) మాటలాడకుండుట, ఏదో ఆలోచన, నేల పై పండుకొనుట ఈ విధముగా ఆమె కామావస్థ చాలా తీవ్రముగా ఉన్నది.

## 4. ప్రమాణి :-

లఘోర్గురోశ్చ విచ్ఛిత్యా యత్రానన్త్ర్యసంగతిః
వృత్తప్రమాణనిపుణైః సా ప్రమాణీతి కీర్తితా. 13

ఏ వృత్తములో లఘుగురువులు ఒకదాని తరువాత ఒకటి వచ్చి అందముగా ఉండునో, దానిని వృత్తముల ప్రమాణము తెలిసినవారు ప్రమాణీవృత్త మందురు. (ఇది కూడా ఎనిమిది అక్షరాల వృత్తము)

యథా మమ :-

4. లఘు శ్రుతం మదోద్ధతం గురుశ్రమాయ కేవలమ్
న యత్ పరోపకారకృద్వృథైవ తత్ ప్రమాణ్యపి.

ఉదాహరణముగా నా శ్లోకము——

గర్వముచే ఉద్ధత మైన (అనగా గర్వాతిశయమును కలిగించు) పాండిత్యము (ఎంత ఉన్నను) తేలిక యైనదే (సారం లేనిదే). అది కేవలం గొప్ప శ్రమకు హేతు వగుచున్నది. లేదా మదహేతు వైన అల్పపాండిత్యమువలన కేవలము అధికశ్రమ మాత్రమే కలుగును. లేదా గురువుగారి శ్రమమాత్రమే మిగులును. పరోపకారము చేయనిది ఎంత ప్రామాణికమైనను వ్యర్థమే.

## 5 శ్లోకము (అనుష్టుప్) :-

పఞ్చమం లఘు సర్వేషు సప్తమం ద్విచతుర్థయోః
గురు షష్ఠం చ సర్వేషామేతచ్ఛ్లోకస్య లక్షణమ్. 14

అసంఖ్యే భేదసంసర్గాదనుష్టుప్ఛన్దసాం గణః
తత్ర లక్ష్యానుసారేణ శ్రవ్యతాయాః ప్రధానతా. 15

అన్ని పాదములలోను ఐదవ అక్షరము లఘువు. రెండు నాలుగు పాదాలలో ఏడవ అక్షరము లఘువు. అన్ని పాదములలోను ఆరవ అక్షరము గురువు. ఇది శ్లోకఛందస్సుకు లక్షణము. (ఇది కూడ ఎనిమి దక్షరముల ఛందస్సు).

అవాంతర భేదములను బట్టి అనుష్టుప్ఛందస్సులు అసంఖ్యాకములుగ నున్నవి. లక్ష్యానుసారముగా గ్రహించి, చెవికి ఇంపుగా ఉండుట అను విషయమునకు ప్రాధాన్యమును ఈయవలెను.

యథా భగవతో వ్యాసస్య—

5. తతః కుముదనాథేన కామినీగండపాణ్డునా
నేత్రానన్దేన చన్ద్రేణ మాహేన్ద్రీ దిగలంకృతా.
(మ. భా. ద్రో. 184. 46)

ఉదాహరణముగా భగవంతు డైన వ్యాసుని శ్లోకము—

అంతలో కలువలకు నాథుడును, యువతుల చెక్కిలి వలె తెల్లగా నున్న వాడును, నేత్రానందకరుడును అగు చంద్రునిచేత తూర్పు దిక్కు అలంకరింపబడినది.

## 6. భుజగశిశుభృత :-

నవాక్షరాపి ననమైరక్షరై రుపలక్షితా
భుజగాగ్రా శిశుభృతా కథితా వృత్తకోవిదైః. 16

నగణ-నగణ-మగణములతో, తొమ్మిది అక్షరములు గలది, 'భుజగ' అనునది మొదట గల 'శిశుభృత' - అనగా "భుజగశిశుభృత" అను వృత్తము'

యథా మమ—

6. న నమతి చరణౌ భక్త్యా కిమితి జడమతిర్లోకః
భవభయశమనౌ శమ్భోర్భుజగశిశుభృతావగ్రే.

ఉదాహరణముగా నా శ్లోకము :—

మూఢాత్ములైన ఈ జనులు, సంసారభయమును తొలగించునవియు, అగ్రమున సర్పశిశువులను ధరించినవియు అగు ఈశ్వరుని చరణములను, భక్తితో ఎందుకు సేవించకున్నారో కదా!

## 7. రుక్మవతి :—

సంయుక్తం భమసైరన్తే గురుణా చ దశాక్షరమ్
వృత్తం రుక్మవతీనామ కథితం వృత్తశాలిభిః. 17.

భగణ మగణ సగణములు, చివర గురువు. ఈ విధముగ పది అక్షరములు కల వృత్తము రుక్మవతి

యథా మమ :—

7. భగ్నమసత్యైః కాయసహస్రైర్మోహమయీ గుర్వీ భవమాయా
స్వప్నవిలాసా యోగవియోగా రుక్మవతీ హా కస్య కృతే శ్రీః

ఉదాహరణముగా నా శ్లోకము :—

అసత్యమైన వేలకొలది శరీరములు నశించిపోవుచున్నవి. మోహమయమైన ఈ సంసారమాయ చాల గొప్పది. స్వప్నము వంటి విలాస కలది, వచ్చుచూ పోవుచూ ఉండెడిది. బంగారము కలది అయిన ఈ లక్ష్మి ఎవరి కోసము!

## 8. ఇన్ద్రవజ్రా :-

తకారాభ్యాం జకారేణ యుక్తం గురుయుగేణ చ
ఇన్ద్రవజ్రాభిధం ప్రాహుర్వృత్తమేకాదశాక్షరమ్. 18

రెండు తగణములు, జగణము, రెండు గురువులు, ఇది పదకొండు అక్షరములు గల ఇంద్రవజ్రావృత్తము.

యథా మమ :-

8. తౌ జన్మ గూఢౌ చరణేన యస్య
కష్టౌ నివిష్టౌ హృది కామ కోపౌ.
తం దుస్సహాస్తా జ్వలదిన్ద్రవజ్ర
పాతోపమాః క్లేశదశా దహన్తి.

ఉదాహరణమునకు నా శ్లోకము—

పుట్టుకనుండియు గూఢముగా నున్నవియు, కష్టహేతువులును అగు కామకోపములు, ఆచరణము ద్వారా ఎవని హృదయములో ప్రవేశించునో, అనగా ఎవడు కామక్రోధములకు లొంగి ప్రవర్తించునో, వానిని, భరింప శక్యము కానివియు, ప్రజ్వలించుచున్న ఇంద్రుని వజ్రముయొక్క పాతముతో సమాన మైనవియు అగు దుఃఖదశలు పరివేశించును.

## 9. ఉపేన్ద్ర వజ్రా :-

జతజై ర్గురుయుగ్మేన సంసక్తైరుపలక్షితమ్
వదన్త్యుపేన్ద్రవజ్రాఖ్యం వృత్తమేకాదశాక్షరమ్. 19

జగణ-తగణ-జగణములు, రెండు గురువులు- ఈ విధముగ పదకొండు అక్షరములు గలది ఉపేంద్రవజ్ర.

యథా మమ :-

9. జితో జగత్యేష భవభ్రమస్తై
ర్గురూదితం యే గిరిశం స్మరన్తి.
ఉపాస్యమానం కమలాసనాద్యై
రుపేన్ద్రవజ్రాయుధవారినాథైః.

ఉదాహరణముగా నా శ్లోకము:-

బ్రహ్మ మొదలైన వారిచేతను, ఉపేంద్రదేవేంద్రవరుణులచేతను ఉపాసింపబడుచున్నవాడును. గురువుచే ఉపదేశింపబడినవాడును అగు శివుని ఎవరు స్మరింతురో వారిచే సంసారములో తిరుగుట జయింపబడినది.

## ఉపజాతులు

పదాన్తరవిన్యాసయోగై ర్బహుభిరేతయోః
వైచిత్ర్యజాతిరుచిరా భవన్త్యేవోపజాతయః. 20

ఒక శ్లోకములో ఒక పాదము ఇంద్రవజ్రావృత్తము. మరియొక పాదము ఉపేంద్రవజ్రావృత్తము-ఈ విధముగ కూర్చుటచే వైచిత్ర్యముతో సుందర మగు ఉపజాతివృత్తములు ఏర్పడును.

ఇచ్ఛానుసారముగా కొన్ని పాదములు ఇంద్రవజ్రావృత్తములోను కొన్ని ఉపేంద్ర వజ్రలోను; ఉండవచ్చును. ఈ విధముగ ఇంద్రవజ్రో పేంద్రవజ్రల కలయికచే ఏర్పడునవి ఉపజాతులు.

## 10. దోధకవృత్తము

భకారత్రయసంయుక్తమన్తే గురుయుగాన్వితమ్
కథితం దోధకం నామ వృత్తమేకాదశాక్షరమ్. 21

మూడు భగణములు, చివర రెండు గురువులు-ఈ విధముగ పదకొండు అక్షరములు గల వృత్తము దోధకవృత్తము.

యథా మమ;-

10. భో భవ విభ్రమ భఙ్గుర భోగా
గచ్ఛత నాస్త్యధునా మమ మోహః
తిష్ఠతి చేతసి చన్ద్రకలాభృ
ద్భక్త జనాభయదోఽథ కపాలీ.

ఉదాహరణముగా నా శ్లోకము;—

అశాశ్వతములైన ఓ సాంసారికభోగములారా! దూరముగా వెళ్ళి పొండు ఇపుడు నాకు మోహము లేదు. చంద్రకళను ధరించినవాడును, భక్తజనులకు అభయమును ప్రసాదించువాడును అగు శివుడు నా హృదయములో ఉన్నాడు.

## 11. శాలినీవృత్తము:-

పూర్వాక్షర చతుష్కాన్త విరతిర్మతతాన్వితా
గురుద్వితయయుక్తా చ శాలిన్యేకాదశాక్షరా. 22

మగణ-తగణ-తగణములు, రెండు గురువులు-ఈ విధముగ పదకొండు అక్షరములుండి, మొదటి నాల్గక్షరముల తరువాత యతి ఉన్నచో అది శాలినీవృత్తము.

యథా మమ:-

11. మత్తా గోష్ఠీగర్భగూఢప్రలాపా
ప్రౌఢా గాఢా లిఙ్గితా యౌవనేన.

మధ్వాతామ్రస్వేదమీలత్కపోలా
లోలా లీలాశాలినీ కస్య నేష్టా.

ఉదాహరణమునకు నా శ్లోకము:-

మత్తెక్కి ఉన్నదియు, గోష్ఠుల మధ్య మూఢమైన (అర్థములేని) మాట లాడుచున్నదియు, ప్రౌఢయు, యౌవనముచే గాఢముగా ఆలింగనము చేసికొనబడినదియు, మద్యముచే కొంచెము ఎరుపెక్కిన, చెమటతో నిండిన చెక్కిళ్ళు కలదియు, చంచలస్వభావయు, విలాసలతో ప్రకాశించునదియు అగు యువతి ఎవరికి ఇష్టురాలు కాదు?

## 12. రథోద్ధతావృత్తము:—

రనరై రన్వితం యుక్తం లఘునా గురుణా తథా
ఖ్యాతం రథోద్ధతా నామ వృత్తమేకాదశాక్షరమ్. 23

రగణ-సగణ-రగణములు, ఒక లఘువు, ఒక గురువు-ఈ విధముగా పదకొండు అక్షరముల వృత్తము రథోద్ధత.

యథా మమ:—

13. రమ్యనర్మకలభోగతర్జనీ
భ్రూలతేవ తరలారియోషితామ్.
వైజయన్త్యభిముఖీ రణేరణే
భాతి తే నరపతే రథోద్ధతా.

ఉదాహరణమునకు నా శ్లోకము:—

ఓరాజా (శత్రువుల) రమ్యమైన పరిహాసకథలను భోగములను జడిపించుచున్నదియు, శత్రుస్త్రీల భ్రూలత వలె చంచల మైనదియు, (వారి

భ్రూలత భయముచేతను, ఇది గాలికిని చంచలమైనవి). ప్రతియుద్ధము నందును ఎదురుగా నిలచునదియు, రథముపై గర్వముగా నిలచినదియు అగు నీ జండా ప్రకాశించుచున్నది.

## 13. స్వాగతావృత్తము:-

గురుద్వయయుతైరన్యే రనభైరుపలక్షితమ్.
గదితం స్వాగతా నామ వృత్తమేకాదశాక్షరమ్. 24

రగణ-నగణ-భగణములు, చివర రెండు గురువులు ఇట్లు పదకొండు అక్షరములు గలది స్వాగతావృత్తము.

యథా మమ:-

13. రత్నభఙ్గవిమలైర్గుణతుఙ్గై
ర్థినామభిమతార్పణసక్తైః.
స్వాగతాభిముఖనమ్రశిరస్కై-
ర్జీవ్యతే జగతి సాధుభిరేవ.

ఉదాహరణమునకు నా శ్లోకము-

రత్నపు ముక్కల వలె నిర్మలమైన వారును, గుణములచే ఉన్నతులును. యాచకుల కోరికలను తీర్చుటయందు ఆసక్తి కలవారును, స్వాగతమును చెప్పుటకై అభిముఖమైన వంగిన శిరస్సులు కలవారును అగు సత్పురుషులే ఈ జగత్తులో జీవించుచున్నవారు (వారి జీవనమే జీవన మని అర్థము)

## 14. తోటక వృత్తము:-

సకారైరన్వితం వృత్తం చతుర్భిర్యుగపత్త్రిభిః
ఉదితం తోటకం నామ వృత్తంద్వాదశాక్షరమ్. 25

నాలుగు సగణము లున్నచో పన్నెండు అక్షరముల తోటకవృత్తము

యథా మమ :-

సరసః స్మరసారతరో వయసః
సమయః స్మృతిశేషదశాపతితః.
గలితాఖిలరాగరుచిర్విజనే
పరితోఽట కపాలకరః సుమతే.

ఉదాహరణమునకు నా శ్లోకము—

సరస మైనదియు, మన్మథునిచే మిక్కిలి సారవంతమును అగు యౌవనము స్మృతిమాత్రశేష మైనది. అందుచేత ఓ సుమతీ! సమస్తరాగము లందును రుచి తొలగిపోయిన నీవు విజనస్థానమునవసించుచు, కపాలము చేత ధరించి, సంచరించుము.

## 15. వంశస్థవృత్తము :-

సంలక్షితం జతజరైర్ద్వాదశాక్షరమక్షరైః
ఛన్దోవిచక్షణా వృత్తం వంశస్థాఖ్యం ప్రచక్షతే. 26

జగణ-తగణ-జగణ-రగణములతో పండ్రెండుఅక్షరములు గల వృత్తము వంశస్థము.

యథా మమ—

జనస్య తీవ్రాతపజార్తివారణా
జయన్తి సన్తః సతతం సమున్నతాః.
సితాతపత్రప్రతిమా విభాన్తి యే
విశాలవంశస్థతయా గుణోచితాః.

ఉదాహరణమునకు నా శ్లోకము—

జనమునకు తీవ్ర మైన ఆతపము (మానసిక తాపాదికము, ఎండ అని రెండర్థములు) వలన కలిగిన పీడను తొలగించువారును, ఎల్లప్పుడును ఉన్నతులును అగు సత్పురుషులు సర్వోత్కర్షగా ఉన్నారు. శ్వేతచ్ఛత్రములతో సమాను లగు ఎవరు, విశాలమైన (ఉత్తమమైన, పెద్దదైన) వంశమునందు (కులము, వెదురు కఱ్ఱ) ఉన్నవారగుటచే గుణములకు (సద్గుణములు, త్రాళ్ళు) తగినవారుగా ఉన్నారో.

## 16. ద్రుతవిలమ్బితవృత్తము :-

> అభివ్యక్తం నభభరై ర్యక్షరై ర్ద్వాదశాక్షరమ్
> వదన్తి వృత్తజాతిజ్ఞా వృత్తం ద్రుతవిలమ్బితమ్. 27

నగణ-భగణ-భగణ-రగణములు; పండ్రెండు అక్షరములు. ఇది ద్రుత విలంబితవృత్త లక్షణము.

యథా మమ:-

16. నభసి భర్గగలచ్ఛవిభి ర్ఘనై
ర్ద్రుతవిలమ్బితగైః పరివారితః.
సితకరః కలహంస ఇవాభిత
స్తరతి సంవలితో యమునోర్మిభిః.

ఉదాహరణముగా నా శ్లోకము—

శివుని కంఠమువంటి కాంతి గల, శీఘ్రముగను, (ఒకప్పుడు) మందముగను ఎగురుచున్న మేఘములచే చుట్టువారుకొనబడిన చంద్రుడు, ఆకాశముపై యమునాతరంగములచే నలు మూలల ఆవరింపబడిన కలహంస వలె ఈదుచున్నాడు.

## 17. ప్రహర్షిణీ వృత్తము :-

సమున్నీతం మనజరగై శ్ఛిన్నం పూర్వాక్షరై స్త్రిభిః
త్రయోదశాక్షరం నామ్నా కీర్త్యయన్తి ప్రహర్షిణీమ్. 28

మగణ నగణ జగణ-రగణములు, చివరగురువు-ఈ విధముగ పదమూడక్షరములు గల వృతము ప్రహర్షిణీ వృత్తము. (పాదము చివర నున్న అక్షరము గురు వగు నని సంప్రదాయము, అందుచే పదమూడవ అక్షరము గురువు అని లక్షణములో చెప్పకపోయినను గురు వని గ్రహింపవలెను). దీనికి మొదటి మూడు అక్షరములపై యతి.

యథా మమ :-

17. మానౌజః సురభిగుణై ర్యశఃసితానాం
నిర్వ్యాజా నిజభుజవిక్రమాప్తా.
సర్వాశాప్రణయిజనోపజీవ్యమానా
భవ్యానాం భవతి పరప్రహర్షిణీ శ్రీః.

ఉదాహరణముగా నా శ్లోకము—

కపటము లేనిదియు, తమ భుజపరాక్రమముచే సంపాదింపబడినదియు అన్ని దిక్కుల యందలి మిత్రులచే అనుభవింపబడునదియు, అగు మానతేజస్సద్గుణములచే కల్గిన యశస్సుచే తెల్లగా నున్న ఉత్తమపురుషుల లక్ష్మి, ఇతరులకు కూడ ఆనందకరముగ ఉండును.

## 13. వసన్తతిలక వృత్తము :-

అభిజ్ఞాతం తభజజై రన్తాసక్తగురుద్వయమ్.
చతుర్దశాక్షరం వృత్తం వసన్తతిలకం విదుః. 29.

తగణ. భగణ-జగణ-జగణములు; రెండు గురువులు-ఇట్లు పదునాలుగు అక్షరముల వృత్తము వసంతతిలకము.

యథా సూ:-

తిద్భ్యాజి జన్మసచివే భగవత్యనజ్గే
ప్రాప్తే లసత్కుసుమమణ్డలపాణ్డురేణ,
భృఙ్గాళీకుటిలకున్తలసంనివేశా
కాన్తా వసన్తతిలకేన విభూషితా భూః

ఉదాహరణముగా నా శ్లోకము—

భగవంతుడైన మన్మథుడు వచ్చినపిదప, ఆతని జన్మసచివు డైన (పుట్టుకనుండియు మంత్రియైన) వసంతుడు అతనిని సేవించుచుండగా, పకాశించుచున్న పుష్పముల మండలముచే తెల్ల నైన వసన్తకాలానుగుణ మగు తిలకముచే (కుసుమమండలమే తిలకమని భావము) అలంకరింపబడి నదియు, తుమ్మెదల సముదాయమనెడు కుంతలముల కూర్పు గలదియు అగు భూమి మనోహరముగా నున్నది (ప్రకరణము తెలియకపోవుటచే అర్థము అస్పష్టముగా నున్నది.)

## 19. మాలినీ వృత్తము :-

అష్టాక్షరవిరామేణ యుక్తం ననమయైః స్యైః
వదన్తి మాలినీ నామ వృత్తం పఞ్చదశాక్షరమ్ 30

నగణ-నగణ-మగణ-యగణ-యగణములు-ఇట్లు పదిహేను అక్షరముల వృత్తము మాలిని. ఎనిమిది అక్షరములపై యతి.

యథా మమ

19. నననమయయవాణీ మేఖలాకృష్టికాలే
ప్రవిచలదివ శీలం నోత్సృజన్తి దుకూలమ్

తృణలవచలనేఽపి స్వైరిణీ శఙ్కమానా
దిశి దిశి కృతదృష్టిర్మాలినీ కస్య నేష్టా.

ఉదాహరణముగా నా శ్లోకము—

వడ్డాణము లాగు సమయమున "న, న, న, న," అని నకారములతో నిండిన వాక్కు కలదియు, (వలదు వలదు అనిపలుకుచున్నదియు) శీలమువలె చలించుచున్న పట్టుచీరను విడువనిదియు. గడ్డిపరక కదలినను భయపడుచున్నదియు, ప్రతి దిక్కున ప్రసరింపచేయబడిన దృష్టి కలదియు, పుష్పమాలలను ధరించినదియు అగు స్వైరిణి ఎవరికి ఇష్టురాలు కాదు?

## 20. నర్కుటవృత్తము :-

నజభైర్జజలైరన్తగురుభిర్నర్కుటాభిధమ్
వృత్తం చానష్టవిచ్ఛేదం విదుః సప్తదశాక్షరమ్ 31

నగణ-జగణ-భగణ-జగణ-జగణ-లఘు-గురువులతో పదిహేడు అక్షరములు గల వృత్తము నర్కుటము. దీనికి ఏడవ అక్షరముమీద యతి. (ఈ లక్షణములో నున్న 'అనష్టవిచ్ఛేదం' అనుదానికి ఏడవ అక్షరము మీద యతి అను అర్థము వృత్తరత్నాకరములో చెప్పిన యతినియమమును బట్టి చెప్పబడినది. గాని ఇచట ఉన్న ఈ పదము అస్పష్టార్థముగ నున్నది. క్షేమేంద్రు డిచ్చిన ఉదాహరణములో ఏడవ అక్షరముపై (మొదటిపాదములో) యతి కూడ లేదు. అందుచే దీనికి యతి నియమములేదని చెప్పుటకై 'అనష్ట విచ్ఛేదమ్' అని వ్రాసి ఉండును. వెనుక చెప్పిన మాలినీవృత్తములో ఎనిమిదవ అక్షరము మీద యతి ఉన్నది. దీనిలో లేదు అని అర్థమై యుండును. లేదా పాఠాంతర మేమైన ("అనిష్టవిచ్ఛేదం" వంటిది) ఉన్నదేమో తెలియదు.

యథా మమ:-

20. నిజభుజజైర్విశాలగుణవిక్రమకీర్తిభరైః
ప్రవిదధతా సుధాంశుధవలం భవతా భువనమ్.

కథయ కథం కృతేయమతిరాగవతీ జనతా
చరితమపూర్వమేవ తవ కస్య న నర్కుటకృత్.

ఉదాహరణముగా నా శ్లోకము—

నీ భుజములనుండి పుట్టిన విశాలము లైన గుణ-పరాక్రమ కీర్తి ధారములచేత ఈ లోకము నంతను చంద్రునివలె తెల్లనైన దానినిగా చేయుచున్న నీ చేత ఈ జనసముదాయము ఎక్కువ రాగము (ప్రేమ, ఎరుపు అను రెండర్థములు) కలదిగా ఎట్లు చేయబడినది? చెప్పుము. అపూర్వమైన నీ చరితము ఎవరికి ఆశ్చర్యమును కలిగించదు? (నర్కుట శబ్దమునకు ప్రసంగమును బట్టి ఆశ్చర్యమని అర్థము చెప్పబడినది.)

## 21 పృథ్వీ వృత్తము :-

జసౌ జసయలా గ్గ్వేన యుతావ్టనవసంవ్యాతిః
దశసప్తాక్షరా పృథ్వీ కథితా వృత్తవేదిభిః. 32

జగణ-సగణ-జగణ-సగణ-యగణ-లఘు - గురువులతో పదిహేడు అక్షరములు. ఎనిమిదవ అక్షరముపైనను, తరువాత తొమ్మిదవ (అనగా పదిహేడవ) అక్షరముపైనను యతి. ఇది పృథ్వీవృత్తము.

యథా మమ :-

21. జవాత్ స రజసా యుతః శ్రమవిసంస్థులాఙ్గః పథా
వ్రజన్ సతతసేవకః పిశునధామ వేశ్మ ప్రభోః.
కదాచిదవలోకనైః ఫలవివర్జితైర్మన్యతే
జడః కరసమర్పితామివ మదేన పృథ్వీమిమామ్.

ఉదాహరణముగా నా శ్లోకము—

(ప్రయాణ) వేగమువలన పరాగముచే కప్పబడినవాడై, మార్గమునందు

ప్రయాణము చేయుటచేత అలసటచే దుర్భలమైపోయిన శరీరము కలవాడై నిత్యసేవకుడు, చాడీలు చెప్పువారికి ఆటపట్టైన ప్రభువుయొక్క గృహమును చేరి, ఎట్టి ఫలమును ఇవ్వని, అప్పుడప్పుడు లభించే ప్రభుదర్శనములచే గర్వితుడై ఈ భూమియంతయు తన చేతిలో ఉంచబడినట్లు భావించును.

## 22. హరిణీ వృత్తము :-

నసమై రసలై ర్గేన యుక్తా సప్తదశాక్షరా
విచ్ఛిన్నా హరిణీ షడ్భిశ్చతుర్భిః సప్తభిస్తథా. 33

నగణ-సగణ-మగణ-రగణ-సగణ - లఘు - గురువులతో పదిహేడు అక్షరముల వృత్తము హరిణి, ఆరవ అక్షరముపైనను, తరువాత నాల్గవ (10) అక్షరముపైనను, తరువాత ఏడవ (17) అక్షరముపైనను యతి.

యథా మమః-

22. న సమరసనాః కాలే భోగాశ్చలం ఘనయౌవనం
కురుత సుకృతం యావన్నేయం తనుః ప్రవిశీర్యతే.
కిమపి కలనా కాలస్యేయం ప్రధావతి సత్వరా
తరుణహరిణీ సంత్రస్తేవ ప్లవప్రవిసారణీ

ఉదాహరణముగా నా శ్లోకము—

భోగములు కాలమునందు (అన్నికాలములందును) సమానమైన రుచి కలవికావు. మేఘమువంటి యౌవనము చంచలమైనది. ఈ శరీరము నశించుటకు పూర్వమే. పుణ్యము చేయండి అదేమో! ఈ కాలముయొక్క రీతి! ఇది భయపడి దుముకుతూ, పరిగెత్తుచున్న పడుచు ఆడలేడి వలె, చాల తొందరగా పరుగెత్తుచున్నది.

## 23 శిఖరిణీ వృత్తము

యమన్సైః సభ్తైర్గేన యుక్తా సప్తదశాక్షరా
షడ్డై కాదశవిచ్ఛేదవతీ శిఖరిణీ మతా 34

యగణ-మగణ-నగణ-సగణ-భగణ-లఘు-గురువులు, ఆరవ పద కొండవ (17) అక్షరములపై యతి, ఇట్లు పదిహేడు అక్షరముల వృత్తము శిఖరిణి.

యథా మమ :-

23 యథా మన్యుర్లీనః స చ విభవభగ్నః స్మరవ (మ) ద
స్తథా జానే జాతా శమసమయరమ్యా పరిణతిః.
ఇదానీం సంసారవ్యతికరహరా తీవ్రతపసే
వివిక్తా యుక్తా మే గిరివరమహీ సా శిఖరిణీ

ఉదాహరణమునకు నా శ్లోకము—

కోపము అణగిపోయినది. మన్మథమదము వైభవముతోపాటు భగ్నమై పోయినది లేదా వైభవముచేత అనగా సామర్థ్యముచేత, భగ్నమైనది. అనగా సామర్థ్యము లేకుండ భగ్నమైనది. దీనిని పట్టి శాంతిసమయముచేత రమ్యమైన పరిణామము కలిగినదని తలచెదను. ఇంక నాకిపుడు, తీవ్రతపస్సు చేయుటకై సంసారబంధమును తొలగించునదియు, శిఖరములతో కూడినదియు, అగు నిర్జనమైన గిరిశ్రేష్ఠముయొక్క పైభూభాగము తగినది.

## 24 మన్దాక్రాంతా వృత్తము :-

చతుః షట్సప్తవిరతి వృత్తం సప్తదశాక్షరమ్.
మన్దాక్రాన్తా మభనతైస్తతగైశ్చాభిధీయతే. 35

మగణ-భగణ-నగణ-తగణ-తగణ-గురు-గురువులు; పదిహేడు అక్షరములు. నాల్గవ-ఆరవ (10) ఏడవ (17) అక్షరములపై విరామము. ఇది మందాక్రాంతావృత్తము.

యథా మమ—

24 మధ్యే భఙ్గీవలనవితతాపాఙ్గసంసఙ్గభాజః
స్మర్యన్తే తే యది ధృతిముషః పక్ష్మలాక్షీకటాక్షాః,
తత్ కిం మిథ్యా నియమనిభృతైః కాననే ధీయతే ధీ
ర్మన్దాక్రాన్తా దశతి కిశితా పన్నగీ పాణిసక్తా.

ఉదాహరణముగా నా శ్లోకము—

వంపులచే విస్తృతములైన నేత్రాంతములతో సంబంధమును పొందునవియు, ధైర్యమును తొలగించునవియు అగు దట్టమైన కనురెప్పలు గల సుందరుల కటాక్షములను మధ్య మధ్య స్మరించే పక్షములో, మిథ్యా నియమములు అవలంభించి అరణ్యములో నివసించుటకై అభిలాష చూపుట ఎందులకు? (ఇట్లు చేయుటకు ఫలిత మేమనగా) మందముగా నడచివచ్చి, హస్తమునకు తగుల్కొనిన తీవ్రమైన సర్పము కఱచును. (అట్టివాడు చివరికి బాధలకే గురి యగు నని భావము).

## 25. శార్దూల విక్రీడితము :-

మసజైః సతతైర్గేన యుక్తమేకోనవింశవత్
శార్దూలక్రీడితం ప్రాహుశ్ఛిన్నం ద్వాదశసప్తభిః. 36

మగణ-సగణ—జగణ—సగణ—తగణ—తగణ గురువులతో పందొమ్మిది అక్షరములు. పండ్రెండవ అక్షరముపైనను, ఏడవ (19) అక్షరముపైనను యతి. ఇది శార్దూలవిక్రీడితము.

యథా మమ—

25. మాద్యత్సజ్జ సమాతతోగ్ర సుభటోద్భిన్నేభకుమ్భస్థల
శ్లిష్యన్మౌక్తికదన్తురః సరభసోద్వేల్లద్యశః కేసరః,
జృమ్భారమ్భ భయంకరవ్యతికరత్రస్తైః సముద్వీక్షితః
శత్రూణాం త్వదసిః కరోతి సమరే శార్దూలవిక్రీడితమ్.

ఉదాహరణముగా నా శ్లోకము—

మదించిన, సన్నద్ధులైన, ఉగ్రులైన గొప్పభటులచేత బ్రద్దలుకొట్టబడిన ఏనుగుల కుంభస్థలములనుండి విడివడుచున్న ముత్యములతో ప్రకాశించుచున్నదియు (ఎత్తుపల్లములతో నున్నదియు), తొందరగా పైకి ఎగురుచున్న కీర్తి యనెడు జూలు గలదియు, విజృంభణప్రారంభమున (పులి పక్షమున ఆవులించుట అని యర్థము) భయంకరమైన సంబంధమువలన భయపడిన (శత్రువులచే) చూడబడినదియు అగు నీ ఖడ్గము, యుద్ధమునందు శత్రువుల విషయమున, శార్దూలవిక్రీడితమును (శార్దూలము క్రీడ వంటి క్రీడను) చేయుచున్నది.

## 26. స్రగ్ధర :-

యుక్తం మరభనైర్యైశ్చ త్రిభిః సప్తాక్షరైస్త్రిభిః
ఛేదైశ్చ స్రగ్ధరావృత్తమేకవింశాక్షరం విదుః. 37.

మగణ-రగణ-భగణ-నగణములు, మూడు యగణములు ఈ విధముగ ఇరువదియొక్క అక్షరములతో స్రగ్ధరావృత్తము. ప్రతి ఏడవ అక్షరమునందును మూడు యతులు.

యథా మమ :-

26. సారారమ్భానుభావప్రియపరిచయయా స్వర్గరఙ్గాఙ్గనానాం
లీలాకర్ణావతంసశ్రియమతనుగుణశ్లేషయా సంశ్రయన్త్యా.
ఆభాతి వ్యక్తముక్తావిచకిలలవలీవృన్దకున్దేన్దుకాన్త్యా
త్వత్కీర్త్యా భూషితేయం భువనపరివృఢ స్రగ్ధరేవ త్రిలోకీ.

ఉదాహరణమునకు నా శ్లోకము:—

ఓ భువనశ్రేష్ఠుడా! నీ కీర్తి, శ్రేష్ఠమైన కార్యములను ఆరంభించుట యందలి (నీ) సామర్థ్యముతో ప్రియమైన పరిచయము కలది. గొప్ప గుణములతో (దారము అని రెండవ అర్థము) సంబంధము కలది. స్వర్గలోకము నందలి స్త్రీలకు కర్ణాలంకారముగ అగుచున్నది దీని కాంతి, స్వచ్ఛమైన ముత్యములు, వికసించిన లవలీపుష్పములు. మల్లిపూవులు, చంద్రుడు-వీటి వంటి కాంతి గలది. అట్టి నీకీర్తి చేత ఈ లోకత్రయముపుష్పమాలను ధరించి నట్లు ఉన్నది

ఇతి సరలతరత్వాత్సర్వకావ్యోచితత్వాత్
సుకవిపరిచితత్వాత్కీర్ణకర్ణామృతత్వాత్.
పరుషవిషమమాత్రాదుర్విరామోజ్ఝితేయం
ప్రచురరుచిర వృత్తవ్యక్తిరుక్తా హితాయ. 38

ఇంతవరకును ప్రతిపాదించినవృత్తములన్నియు, చాలా సరల మైనవి. అన్ని కావ్యములకును తగినవి. ఉత్తమకవు లందరికిని పరిచితములు. చెవులలో అమృతమును నింపునట్టివి. వీటిలో పరుషములు, విషమములు అయిన మాత్రలు కాని, దుష్టయతులు గాని లేవు. అందుచేత కవితాభ్యాసము చేయు వారి హితము కొరకై ప్రసిద్ధములును, సుందరములును అగు వృత్తముల వివరణము చేయబడినది.

ఇతి శ్రీప్రకాశేంద్రాత్మజవ్యాసదాసాపరనామ
శ్రీ క్షేమేన్ద్రవిరచితే సువృత్తతిలకే
వృత్తావచయో నామ
ప్రథమో విన్యాసః

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని యను
సువృత్తతిలకాంధ్రవ్యాఖ్యలో "వృత్తములను ఏరుకొనుట"
అను ప్రథమవిన్యాసము సమాప్తము.

## ద్వితీయ విన్యాసః-గుణదోషదర్శనమ్

కృతే ప్రసిద్ధవృత్తానాం లక్ష్యలక్షణసంగ్రహే
అధునా క్రియతే తేషాం గుణదోషప్రదర్శనమ్.

ఇంతవఱకును, కొన్ని ప్రసిద్ధవృత్తముల లక్షణములు చెప్పి లక్ష్యములు (ఉదాహరణములు) చూపబడినవి. ఇపుడు ఆ వృత్తములకు సంబంధించిన గుణములను దోషములను చూపుచున్నాము.

న షట్సప్తాక్షరే వృత్తే విశ్రామ్యతి సరస్వతీ
భృఙ్గీవ మల్లికాబాలకలికాకోటిసంకటే 2

ఆరు లేదా ఏడు అక్షరాల వృత్తములలో సరస్వతి, లేత మల్లెమొగ్గల ఇరుకైన అగ్రభాగమునందు ఆడుతుమ్మెద ఎట్లు విశ్రమింపజాలదో, అట్లే విశ్రమింపజాలదు (ఆరు ఏడు అక్షరాల వృత్తములు కవితకు అంతగా అనువుగా ఉండవని అర్థము).

సమాసైర్లఘువృత్తానామసమాసైర్మహీయసామ్
శోభా భవతి భవ్యానాముపయోగవశేన వా. 3

సమాసము లున్నచో చిన్న వృత్తములును; సమాసములు లేకపోయినచో పెద్ద వృత్తములును అందముగా ఉండును. కొందరు ఉత్తమకవుల ఉపయోగమును బట్టి కూడ వృత్తములకు అందము చేకూరును.

అనుష్టుప్ఛన్దసాం భేదే కైశ్చిత్సామాన్యలక్షణమ్
యదుక్తం పఞ్చమం కుర్యాల్లఘు షష్ఠం తథా గురు. 4
తత్రాప్యనియమో దృష్టః ప్రబన్ధే మహతామపి
తస్మాదవ్యభిచారేణ శ్రవ్యతైవ గరీయసీ. 5

అనుష్టుప్ఛందస్సుల సామాన్యలక్షణమున ఐదవ అక్షరము లఘువు

కావలె ననియు, ఆరవది గురువు కావలె ననియు చెప్పబడినది. కాని మహా కవుల రచనలలో కూడ కొన్నిచోట్ల ఈ నియమము పాటింపబడలేదు అందుచేత ఈ నియమముకంటె కూడ ప్రధానమైనది శ్రవ్యతాగుణము. అనగా వినుటకు ఇంపుగా ఉన్న పక్షాన ఈ నియమమును పాటింపకున్నను దోషము లేదు.

యథా కాలిదాసస్య :—

27. తదన్వయే శుద్ధిమతి ప్రసూతః శుద్ధిమత్తరః
దిలీప ఇతి రాజేన్దురిన్దుః క్షీరనిధావివ. (రఘు. 1–12)

ఉదాహరణమునకు కాళిదాసుని శ్లోకము:—

"తదన్వయే" మొ॥ ఈ శ్లోకము మొదటి పాదములోని ఐదవ అక్షరము (శు) గురువు, ఆరవ అక్షరము (ద్ధి) లఘువు. ఐనను చదువు చున్నపుడు శ్రవ్యత దెబ్బతినలేదు గాన ఇది యుక్తమే అని భావము.

పరిశుద్ధమైన ఆ వైవస్వతమనువంశమున, అధికముగా పరిశుద్ధుడైన దిలీపు డను రాజచంద్రుడు, తెల్లని క్షీరసముద్రమున, ఇంకను తెల్లని చంద్రుడు వలె, జనించెను.

ఉపజాతివికల్పానాం సిద్ధో యద్యపి సఙ్కరః
తథాపి ప్రథమం కుర్యాత్పూర్వపాదాక్షరం లఘు. 6

ఉపజాతివృత్తములు (ఇంద్రవజ్రోపేంద్రవజ్రవృత్తముల) సంకరముచే ఏర్పడునవే యైనను మొదటి పాదములోని మొదటి అక్షరము, లఘువగునట్లు చూచుకొనవలెను.

యథా శ్రీమదుత్పలరాజస్య –

28. హృతాఞ్జనశ్యామరుచస్త్వదైతే
స్థూలాః కిమిత్యశ్రుకణాః పతన్తి.

భృఙ్గా ఇవ వ్యాయతపఙ్క్తయో యే
తనీయసీం రోమలతాం శ్రయన్తి.

ఉదాహరణమునకు శ్రీమదత్పలరాజు శ్లోకము—

"హృతాఞ్జన" మె॥ ఉపజాతివృత్తము మొదటి పాదము లక్షణానుసారముగా ఇంద్రవజ్ర మైనను కావచ్చును. కాని అపుడు మొదటి అక్షరము గురువై పోవును. అట్లు కాకుండ ఉపేంద్రవజ్రపాదమును కూర్చి మొదటి అక్షరమును లఘువు చేయుటలో సొగసు ఉన్నదని భావము.

"నీ కాటుకయొక్క నల్లని కాంతిని హరించుచు, స్థూలములైన కన్నీటి బిందువులు రాలుచున్నవేమి? ఇవి దీర్ఘమైన పంక్తులు కట్టి, తుమ్మెదలవలె, సన్ననైన నీ రోమలతను ఆశ్రయించుచున్నవి (చేరుచున్నవి)".

సూత్రస్యేవాత్ర తీక్ష్ణాగ్రం శ్లోకస్య లఘునా ముఖమ్
కర్ణం విశతి నిర్విఘ్నం సరలత్వం చ నోజ్ఝతి. 7
గుర్వక్షరేణ సంరుద్ధం గ్రన్థియుక్తమివాగ్రతః
కరోతి ప్రథమం స్థూలం కించిత్ కర్ణకదర్థనామ్. 8

శ్లోకముయొక్క ముఖము, లఘువు చేత, తీక్ష్ణమైన (సన్నని) అగ్రము కలదై, దారముయొక్క ముఖమువలె, నిర్విఘ్నముగా, కర్ణమును (చెవి, సూదిబెజ్జము అని రెండర్థములు) ప్రవేశించును. సరలత్వమును విడవదు. (వంకర కాదు అని దారము పక్షమున అర్థము.)

గురువుచేత అడ్డగింపబడిన శ్లోకముఖము, మొదటనే స్థూలముగా నున్నదై కొనను ముడి ఉన్న దారము వలె, కొంచెము కర్ణమునకు బాధ కలిగించును.

యథా కాలిదాసస్య -

29. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః.

పూర్వాపరౌ వారినిధీ వగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః. (కు 1-1)

ఉదాహరణమునకు కాళిదాసు ఉపజాతివృత్త శ్లోకము:-

'అస్త్యుత్తరస్యామ్' మొ. ఇచట ప్రథమపాదప్రథమాక్షరము (అ) గురువగుటచే చెవికి ఇంపుగా లేదని అభిప్రాయము.

"ఉత్తరదిక్కున హిమవంతు డనే, దేవతాత్మ గల నగాధిరాజు పూర్వపశ్చిమసముద్రములోనికి వ్యాపించి, భూమికి మానదండము వలె ఉన్నాడు".

త్ర్యక్షరత్ర (త్ర్య)క్షరై రేవ చ్ఛేదై రాభాతి దోధకమ్
అతోఽల్పైరధికై ర్వాపి యతిం తాలమివోజ్ఝతి. 9

దోధకవృత్తము మూడేసి మూడేసి అక్షరముల మీద విరామ మున్న యెడలనే అందముగ నుండును అంతకంటె అల్పమైనను, అధికమైనను, (సంగీతములో) తాలము వలె యతి చెడిపోవును,

యథా మమ:-

30 సజ్జనపూజనశీలనశోభా
మర్జయ వర్జయ దుర్జనసఙ్గమ్.
దుస్తరసంసృతిసాగరవేగే
మజ్జనకారణవారణమేతత్.

ఉదాహరణముగా నా శ్లోకము:-

"సజ్జన" మొ. ఈ శ్లోకములో అన్ని పాదములలోను మూడేసి అక్షరాలకు పదములు విరుగుచున్నవి. అందుచే వృత్తము హృద్యముగ నున్నది. "సజ్జనుల పూజ చేయుటవలన కలుగు శోభను సంపాదించు కొనుము.

దుర్జనుల సంగమును విడుపుము. ఇదే, దాటరాని సంసారసాగరవేగమున మునిగిపోకుండగ చేయునది".

అతోఽల్పాధిక్యైర్యథా తజ్జ్యేరస్య -

31. త్వన్ముఖచన్ద్రనిరీక్షణవర్త్యా
యః సుతరామిహ నిర్మలనేత్రః.
సర్వజనస్య పురః స్థితమేతత్
సోఽన్తకవర్త్మ న పశ్యతి చిత్రమ్.

అంతరంటే అల్పము, అధికము అగుటకు ఉదాహరణముగా తండ్రి రుని శ్లోకము:-

"త్వన్ముఖ" మొ॥ ఇచట మొదటి పాదములో 'చన్ద్ర' అని రెండక్ష రముల పైన. 'నిరీక్షణ' అని నాలుగు అక్షరముల పైన యతి వచ్చుటచే వృత్తము సరిగా సాగుటలేదని భావము. ఇతరపాదములలో కూడా అట్లే.

"నీ ముఖచంద్రుని చూచుట అనెడు వర్తిచేత (నేత్రదోషమును తొల గించుకొనుటకు ఉపయోగించు కణిక) ఎవడు తన నేత్రములను పూర్తిగ నిర్మలము కావించుకొనునో, ఆతడు, అందరి ఎదుటను ఉన్నదే యైనను యముని మార్గమును చూడడు. ఆశ్చర్యము!"

శాలినీ శ్లథబన్ధైవ స్వభావేన విభావ్యతే
ఉత్తేజయేత్తాం యత్నేన మన్దదీపశిఖామివ

స్వభావముచేత శాలినీవృత్తము శిథిలబంధము గల (బింకములేని) వృత్తము. మందమైన దీపశిఖను ప్రయత్నపూర్వకంగా ఉత్తేజితము చేసినట్లు దానిని ప్రయత్నము చేసి ఉత్తేజితము (బిగువ కలుగునట్లు) చేయవలెను.

శ్లథా యథా మమ :-

32. ప్లోషక్లేశం ప్రోషితానాం దిశన్తీ
మానగ్లానిం మానినీనాం దధానా,

గాఢం సక్తా సద్గుణగ్లాని దానే
చన్ద్రిస్య శ్రీర్దుర్జనస్యేవ జాతా.

శాలినీవృత్తము శిథిలబంధముగా ఉండుటకు ఉదాహరణముగా నా శ్లోకము—

'ప్లోషక్లేశమ్' మొ॥ ఈ శ్లోకములోని పదములు పొడి పొడిగా చల్లినట్లు ఉండుటచే బంధము శిథిలముగా ఉన్నది.

"చంద్రుని కాంతి ప్రవాసులకు ఎండిపోవుటవలన కలుగుదుఃఖమును కలిగించుచున్నది మానవతుల మానమును తగ్గించుచున్నది. సద్గుణములగు పద్మాదులకు గ్లానిని కలిగించుటయందు ఎంతయు ఆసక్తి కలదై ఉన్నది. ఈ విధముగ దుర్జనుల ఐశ్వర్యము వలె ఉన్నది."

శత్రన్తాక్షర సంయోగైః కింఞ్చిత్కార్కశ్యకారిభిః
అన్తే విసర్జనీయైశ్చ శాలినీ యాతి దీప్తతామ్. 11

'శతృ' ప్రత్యయము చేర్చుటచే ఏర్పడిన అక్షరసంయోగములచేతను చివర విసర్గ లుండునట్లు చేయుట చేతను శాలినీవృత్తమునకు ఒక విధముగా దీప్తి (చురుకు) వచ్చును. ఏల ననగా ఇవి కొంచెము కాఠిన్యమును కలిగించును.

యథా మమ:-

33. లజ్జామజ్జల్లోలతారాన్తకాన్తా
స్తిర్యఙ్నిర్యత్కేతకీపత్రతీక్ష్ణాః.
మగ్నాశ్చిత్తే కస్య నిర్యాన్తి భూయః
ప్రేమోన్మీలత్పక్ష్మలాక్షీకటాక్షాః.

ఉదాహరణమునకు నా శ్లోకము:-

"లజ్జా" మొ॥ ఈ శ్లోకములో 'మజ్జత్' 'నిర్యత్' 'ఉన్మీలత్' అను

వక్రాంతపదములను ప్రయోగించగా వాటి సంధులచే వృత్తము నడకలో ఒక విధమగు బిగి యేర్పడినది.

"లజ్జలో మునిగిపోవుచున్న చంచల మైన నల్ల గ్రుడ్లచే అంతములందు సుందరమైనవియు, అడ్డముగా బయల్వెడలుచున్న మెఱుగురేకుల వలె తీక్ష్ణ మైనవియు అగు, ప్రేమతో వికసించిన పక్ష్మలాక్షీ కటాక్షములు (దట్టమైన రెప్పలు గల నేత్రములు గలది పక్ష్మలాక్షి) ఎవరి కైనను చిత్తములో లైన పిమ్మట మరల పైకి వచ్చునా?"

శ్లథస్స్వభావాన్మాధుర్యం శాలిన్యాః పరివర్జ్యతే
రుచిః ప్రయాతి మన్దాగ్నేః క్షీరేణాత్యన్తమన్దతామ్ 12

శాలినీ వృత్తము స్వభావముచేతనే శిథిలముగా నుండును. అందుచే దానిలో మాధుర్య గుణమును కూడా చేర్చుటకు ప్రయత్నించగూడదు. మంద మైన జఠరాగ్ని కలవానికి క్షీరము ఇచ్చి నట్లైతే వాని రుచి ఇంకను మంద గించును.

విసర్గయుక్తైః పాదాన్తైర్విరాజతి రథోద్ధతా
కలాపరిచయైర్యాతా లటభేవ ప్రగల్భతామ్. 13

సంగీత నాట్యాదికళలతో పరిచయ మేర్పడుటచే ఒక జాణ ఇంకను ప్రగల్భ యైనట్లు, రథోద్ధతావృత్తము, పాదాంతములందు విసర్గలున్నచో ఎక్కువ ప్రకాశించును.

యథా మమః–

అత్ర చైత్రసమయే నిరన్తరాః
ప్రోషితాహృదయకీర్ణపావకాః.
వాన్తి కాముకమనోవిమోహనాః
వ్యాలలోలమలయాచలానిలాః.

ఉదాహరణమునకు నా శ్లోకము;- "అత్ర" మొ. పాదాంతములందు

విసర్గ లుండుటచే నాలుగు పాదములదగ్గరను నిలిపి చదవవలసియుండుటచే ఒక సొగసు వచ్చినది.

"ఈ చైత్రమాసమునందు, ప్రోషితస్త్రీల హృదయములందు అగ్నిని విరజిమ్ముచున్నవియు, కాముకుల మనస్సులను మోహింప చేయునవియు, అగు, కదలుచున్న సర్పముల వలె నున్న మలయ వాయువులు నిరంతరముగ వీచుచున్నవి."

అవిసర్గైస్తు పాదాన్తైర్నిష్ప్రభైవ రథోద్ధతా
అప్రార్థనాప్రణయినీ మ్లానమానేవ మానినీ.

ప్రియుడు ప్రార్థించకపోయినను వానియందు ప్రణయమును చూపు, వాడిపోయిన మానము గల మానిని వలె, పాదాంతములందు విసర్గలు లేని రథోద్ధత సౌందర్యవిహీనమే.

యథా కలశకస్య –

35 అఞ్జలౌ జలమధీరలోచనా
లోచనప్రతిశరీరశారితమ్.
ఆత్తమాత్తమపి కాన్తముక్షితుం
కాతరా శఫరశఙ్కినీ జహౌ.

పాదాంతములందు విసర్గలు లేకపోవుటచే శోభావిహీనముగానుండు రథోద్ధతకు ఉదాహరణముగా కలశకుని శ్లోకము— "అఞ్జలౌ" మొ

"జలక్రీడాసమయమున, ఒక చపలనయన, ప్రియునిపై చల్లుటకై దోసిలితో ఎన్నోసార్లు నీరు తీసుకొన్నది. దానిలో ప్రతిబింబించిన తన నేత్రములను చూచి, అవి చేపలను భ్రాంతిచే ఉలికిపడి మాటిమాటికిని ఆ దోసిలిని విడిచి వేసినది."

సాకారాద్యైర్విసర్గాన్తైః సర్వపాదైః సవిభ్రమా
స్వాగతా స్వాగతా భాతి కవికర్మవిలాసినీ.

స్వాగతావృత్తమునందు అన్నిపాదములందు మొదట ఆకారము ఉండవలెను. చివర విసర్గయుండవలెను. ఇట్లున్న స్వాగత, స్వాగతముకలదై (మంచి నడకగలదై) కావ్యకర్మకు సంబంధించిన విలాసినిగా (కవితావిలాసినిగా) ప్రకాశించును.

యథా మమ:-

36. వ్యావలన్తి తరలా జలధారాః
పాన్థసఙ్గమధృతేః పరిహారాః
ప్రాన్తరత్నశిఖివిద్యుదుదారాః
ప్రావృషః స్మరపయోధరహారాః

ఉదాహరణమునకు నా శ్లోకము—"వ్యావలన్తి" మొ॥ నాల్గు పాదముల ప్రారంభమునందును ఆకారమున్నది పాదాంతములందు విసర్గ యున్నవి. అందుచే ఇది మధురముగా నున్నదని భావము.

"పాంథుల ప్రియా సంగమధైర్యమును పరిహరించునవియు, ప్రాంతములందు పొదిగిన రత్నములతో సమానమైన మెరుపులతో ప్రకాశించునవియు, వర్షర్తువుయొక్క విశాలమైన పయోధరముల (స్తనములు మేఘములు అని రెండర్థములు) హారములును అగు చంచల జలధారలు పడుచున్నవి"

న తు యథా మమైవ—

37. అమ్బరేఽమ్బుభరలమ్బిపయోదే
మత్తబర్హిరుచిరేఽద్రినితమ్బే.
పుష్పధామని కదమ్బకదమ్బే
కా గతిః పథిక కాలవిలమ్బే

కాని నాదే మరియొక శ్లోకమున్నట్లు ఉండగూడదు. "అమ్బరే"—మొ॥ దీనిలోని పాదముల ప్రారంభమున ఆకారము లేదు. అంతమున విసర్గలు లేవు. ఇట్లున్నచో స్వాగతావృత్తము అంతగా బాగుండదని భావము,

"ఓ పాంథుడా! ఆకాశము ఉదకభారముచే వ్రేలాడుచున్న మేఘములు కలదగుచుండగా, పర్వతనితంబము మదించిన నెమళ్ళచే సుందరముగా నుండగా, కదంబవృక్షముల సముదాయము పుష్పములకు నిలయమై యుండగా, కాలమునందు విలంబమైనచో (ఇంక ఆలస్యమైనచో) గతి యేమున్నది?"

ద్రుతతాలలయైరేవ వ్యక్తం రూక్షాక్షరైః పదైః
ప్రనర్తయతి యచ్చిత్తం తత్ తోటకమభీప్సితమ్. 16

ద్రుతతాలలయములు గలవియు, కటుపులైన అక్షరముల కలవియు అగు పదములతో ఏది చిత్తమును నర్తింపచేయునో అట్టి తోటకవృత్తమే ఇష్టమైనది,

యథా మమ :-

౩౨. మదఘూర్ణితలోచనమత్సరణాం
ఘనరాగమనఃజకరాభరణామ్.
కమలద్యుతి ముగ్ధవధూవదనం
సుకృతీ పిబతీహ సుధానసనమ్.

ఉదాహరణమునకు నా శ్లోకము — 'మద' మొ॥ ఈ శ్లోకము చదువుచున్నప్పుడు ద్రుతతాలలయములున్నట్లు చక్కగ నడచును గాన ఇది పైన చెప్పిన విధమున నున్నది.

"మదముచే త్రిప్పబడిన తుమ్మెదల వంటి నేత్రములు కలదియు, దట్టమైన రాగము కలదియు, మన్మథుని కలిగించు అలంకారములు కలదియు, (లేదా మన్మథుని చేతిలోని అలంకారమైనదియు), పద్మము వంటి కాంతి గలదియు, అమృతమునకు నిధియు అగు సుందర వధూముఖమును ఎవ్వడో పుణ్యాత్ముడే ఆస్వాదించగలడు"

అసమస్తపదైః పాదసంధివిచ్ఛేదసుందరమ్
సర్వపాదైర్విసర్గాన్తైర్వంశస్థం యాత్యనర్ఘతామ్. 17

సమసించని పదములు పాదసంధులయందు విరుగుటచేత సుందరముగా నుండు వంశస్థవృత్తము, విసర్గ అంతమునందు గల సర్వపాదములతో, మంచి విలువకలది అగును.

యథా భట్టబాణస్య—

39. జయన్తి బాణాసురమౌలిలాలితా
దశాస్యచూడామణిచక్రచుమ్బినః
సురాసురాధీశశిఖాన్తశాయినో
భవచ్ఛిదస్త్ర్యమ్బకపాదపాంసవః. (కాద. ప్రా 2)

ఉదాహరణమునకు భట్టబాణుని శ్లోకము—

"జయన్తి" మొ. ఇచట ప్రథమ తృతీయ పాదాంతములందలి పదములు తరువాత వచ్చు పాదములలోని పదములతో సమసించలేదు. అన్ని పాదముల చివరను విసర్గ యున్నది. వంశస్థవృత్తము ఇట్లుండవలెనని భావము.

"బాణాసురుని శిరస్సుపై లాలన చేయబడినవియు, దశకంఠుని శిరస్సుపై నున్న, మాణిక్యసముదాయమును చుంబించుచున్నవియు, దేవాధీశరాక్షసాధీశుల శిఖాంతములపై శయనించునవియు అగు, ఈశ్వరుని పాదపరాగములు తమస్సును భేదించుచున్నవై, సర్వోత్కర్షతో నున్నవి."

విపరీతం యథాస్యైవ—

40. నమామి భర్తుశ్చరణామ్బుజద్వయం
సశేఖరైర్మౌఖరిభిః కృతార్చనమ్.
సమస్తసామన్తకిరీటవేదికా
విటఙ్కపీఠోల్లుఠితారుణాఙ్గులి.

దానికి విరుద్ధముగా అతడే వ్రాసిన శ్లోక మెట్లనగా—

"నమామి" మొ. ఈ శ్లోకములో మూడవపాదములోని చివరి పదము నాల్గవ

పాదములోని పదముతో సమసించినది. పాదాంతములందు విసర్గలు లేవు. అందుచే ఇది అంత మధురముగా లేదని భావము.

"శిరోభూషణములతో కూడిన మౌఖరిపంశరాజులచేత చేయబడిన అర్చనము కలదియు, సమస్త సామంతరాజుల కిరీటము లనెడు వేదికపై దొరలుచున్న శ్రేణ్య కలదియు అగు శర్వుని పాదపద్మద్వయమును నమస్కరించుచున్నాను".

ప్రారమ్భే ద్రుతవిన్యాసం పర్యన్తేషు విలమ్బితమ్
బిభ్రత్యా సర్వపాదానాం భాతి ద్రుతవిలమ్బితమ్. 18

ప్రారంభమున శీఘ్రముగా నడచు విన్యాసము కలదై, చివర మందముగా నడచెడు ద్రుతవిలంబితము సర్వపాదముల శోభతో ప్రకాశించుచున్నది.

యథా మమ—

41. కమలపల్లవవారికణోపమం
కిమివ పాసి సదా నిధనం ధనమ్
కలభకర్ణచలాఞ్చలచఞ్చలం
స్థిరతరాణి యశాంసి న జీవితమ్.

ఉదాహరణమునకు నా శ్లోకము:-

'కమల' మొ. ఈ శ్లోకములలోని అన్ని పాదములందును ప్రారంభమున హ్రస్వాక్షరము లున్నవి. ప్రధానముగ ప్రథమ తృతీయపాదములలో మొదటి ఆరు అక్షరములును హ్రస్వాక్షరములు. అందుచే ప్రారంభములో ద్రుతోచ్చారణ ముండును. తరువాత దీర్ఘాక్షరములలో విలంబితోచ్చారణ ముండును. ఈ స్వభావమును సంరక్షించిననే దానికి ద్రుతవిలంబిత మను పేరు సార్థక మగును.

"తామరాకు (చిగురు) మీది జలబిందువుతో సమాన మైనదియు, ఏనుగ యొక్క కర్ణాంతము వలె చంచల మైనదియు అగు, ఎల్లప్పుడును దుఃఖహేతు వగు ధనమును ఏల రక్షించెదవు? కీర్తియే స్థిర మైనది. జీవితము కాదు."

ద్రుతహీనం విలమ్బితం యథా మమ –

42. నిపతతాం భ్రమతాం వినిమజ్జతాం
ప్రపతతాం పరివారశతైరధః.
తనుభృతాం భవ ఏవ భవార్ణవే
భయమయే భగవానవలమ్బనమ్.

ద్రుతము లేని విలంబితమునకు ఉదాహరణముగా నా శ్లోకమే ఎట్లనగా "నిపతతామ్" మొ. దీనిలో మొదటినుండియు దీర్ఘాక్షరములే అధికముగా ఉండుటచే విలంబితమే కాని ద్రుతము లేదని భావము.

"భయంకరమైన సంసార సముద్రములో పడి, తిరుగులాడి, మునిగి, వందలకొలది పరివారజనముతో క్రిందికి పోవుచున్న దేహధారులకు భగవంతుడైన శివుడే ఆలంబనము".

ఆకారమన్థరైః ప్రాయః పాదే పాదేఽక్షరైస్త్రిభిః
శేషాక్షరైర్ద్రుతతరైః ప్రహర్షాయ ప్రహర్షిణీ 19

ప్రహర్షిణీవృత్తములో అన్ని పాదములందును మొదటి మూడు అక్షరములును, సాధారణముగా ఆకారము ఉండుటచే మందముగా నడచును మిగిలిన అక్షరములు అతి శీఘ్రముగ నడచును. అట్టి ప్రహర్షిణి హర్ష జనకముగా నుండును.

యథా శ్రీహర్షదేవస్య–

43. దుర్వారాం కుసుమశరవ్యథాం వహన్త్యా
కామిన్యా యదభిహితం పురః సఖీనామ్
తద్ భూయః శిశుశుకసారికాభిరుక్తం
ధన్యానాం శ్రవణపథాతిథిత్వమేతి (రత్నా. 2 8)

ఉదాహరణముగా శ్రీహర్షదేవుని శ్లోక మెట్లనగా-"దుర్వారామ్" మొ.

ఈ శ్లోకములోని మూడు పాదములలో మొదట మూడు అక్షరములలో రెండేసి దీర్ఘాకారములుండి నడక మందముగా నుండి, తరువాతి అక్షరములలో శీఘ్రముగ ఉన్నది. అందుచేత ఈ వృత్తము హర్షదాయక మగుచున్న దని భావము.

"ఒక యువతి తన చెలికత్తెలతో చెప్పుకొనిన దుర్వార మన్మథవ్యథను శిశువులు, శుకములు, గోరింకలు మొదలగునవి అనువదింపగా, అది తమ చెవిలో పడినవారు ధన్యాత్ములు."

విపరీతం యథా మమ—

44. సంకోచవ్యతికరబద్ధభీతిలోలై
ర్నిర్యాద్భిర్భ్రమరభరైః సరోరుహేభ్యః।
ఆరబ్ధః క్షణమిత సన్ధ్యయా జగత్యా
ముత్పత్త్యై ఘనతిమిరస్యబీజవాపః॥

ఈ నియమమునకు విపరీతముగా నా శ్లోకము:-

"సంకోచ" మొ. దీనిలోని పాదములో మొదటి మూడక్షరముల నడక మందముగ లేదు. అందులకు కారణము ఆకారములు లేదా ఇతర దీర్ఘాక్షరములు లేకపోవుట.

"సాయంసంధ్యాసమయమున పద్మములు ముకుళీభవించునపుడు తుమ్మెదలు పద్మములలో కట్టుబడిపోవుద మనే భయముతో ఇటు అటు తిరిగి పోవుచున్నవి. దీనిని బట్టి సంధ్యాకాలము దట్టమైన చీకటి పుట్టుటకై (మొలచుటకై) విత్తనములు చల్లుచున్నదా అన్నట్లున్నది.

వసన్తతిలకస్యాగ్రే సాకారే ప్రథమాక్షరే
ఓజసా జాయతే కాన్తిః సవికాసవిలాసినీ॥

వసన్త తిలకవృత్తమున మొదటి అక్షరములో అకారముండి, ఓ

జస్సును (సమాసములను ఎక్కువగ) కూర్చినచో వికాస విలాసములతో కూడిన కాంతి ఏర్పడును.

యథా విద్యాపత్యపరనామ్నో రత్నాకరస్య-

45 కణ్ఠ శ్రియం కువలయస్తబకాభిరామ
దామానుకారి వికటచ్ఛవి కాలకూటమ్.
బిభ్రత్సుఖాని దిశతాదుపహారపీత
ధూపోత్థధూమమలినామివ ధూర్జటిర్వః.

ఉదాహరణముగ విద్యాపతి యను నామాంతరము గల రత్నాకరుని శ్లోకము:—

"కణ్ఠశ్రియమ్" మొ. ఈ శ్లోకము మొదటి అక్షరమైన 'క'లో 'అ' ఉన్నది. దీర్ఘ సమాసము ఉండుటచే ఓజోగుణ మున్నది.

"నల్లకలువల గుత్తులతో కట్టిన మాలను అనుకరించు వికటమైన కాంతి గల కాలకూటవిషము గలదై, పూజాసమయములందు (భక్తులు సమర్పించిన) ధూపమునుండి బయల్వెడలిన ధూమముచే మలిన మైనదా అన్నట్లున్న కంఠ కాంతిని వహించుచున్న శివుడు మీకు సుఖములను ఇచ్చుగాక".

అకారేఽపి కృతే పూర్వం బన్ధేఽల్పపదలేశలే
వసన్తతిలకం ధత్తే నిర్గన్ధి రమణీయతామ్. 21

ప్రారంభమున అకారమున్నను, బంధము చిన్న పదములచే పేశలమైన పక్షమున వసన్తతిలకము (వసంతమునకు అలంకారమైన పుష్పము అని కూడా అర్థము) సువాసన లేని సౌందర్యమును పొందును. అనగా దీర్ఘ సమాసము లున్నచో అందముతో పాటు సుగంధము కూడ ఉన్నట్లుండు నని అర్థము.

యథా పరిమలస్య—

46 అచ్ఛాసు హంస ఇవ బాలమృణాలికాసు
భృఙ్గో నవాస్వివ మధుద్రుమమఞ్జరీషు.

కో౽వన్తి భర్తురపరో రసనిర్భరాసు
పృథ్వీపతిః సుకవిసూక్తిషు బద్ధభావః.

ఉదాహరణముగా పరిమలుని శ్లోకము:—

"అచ్ఛాసు" మొ. ఈ శ్లోకములో ప్రారంభమున అకార మున్నది. కాని దీర్ఘసమాసములు లేకపోవుటచే ఓజస్సు లేదు

"స్వచ్ఛ మైన లేతతామరతూడులయందు హంస వలె, క్రొత్తవైన వసంతవృక్ష (చూత) పుష్పమంజరులయందు తుమ్మెద వలె, రసనిర్భరము లైన సుకవికావ్యములయందు ఆసక్తి గల రాజు, అవంతిరాజు తప్ప వేరెవ డున్నాడు?"

విసర్గహీన పర్యన్తా మాలినీ న విరాజతే
చమరీ ఛిన్నపుచ్ఛేవ వల్లీవాలూనపల్లవా. 22

అంతమునందు విసర్గలు లేని మాలినీవృత్తము, తోక తెగిన చమరీ మృగము వలె, చిగుళ్ళు త్రుంపివేసిన లత వలె ప్రకాశింపదు.

ఉదాహరణలను పట్టి చూడగా తృతీయచతుర్థపాదాంతములయందు విసర్గలుండవలె నని అభిప్రాయ మున్నట్లు తోచుచున్నది.

యథా భట్టవల్లటస్య:

47. వరమిహ రవితాపైః కిం న శీర్ణాసి గుల్మే
కిము దవదహనైర్వా సర్వదాహం న దగ్ధా.
యదహృదయజనౌఘైర్మ్లానవర్ణాసభిజ్ఞై
రితరకుసుమమధ్యే మాలతి ప్రోమ్భితాసి.

ఉదాహరణమునకు భట్టవల్లటుని శ్లోకము:—

'వరమిహ' మొ. ఈ మాలినీవృత్తము తృతీయచతుర్థపాదాంతములంద విసర్గలు లేకపోవుటచే సౌందర్యము లేదని భావము,

"ఓమాలతీ:తొడిమి అనగా ఏమో, ఆకు అనగా ఏమో తెలియని, హృదయము లేని జనులు నిన్ను తీసికొని వచ్చి ఇతరపుష్పములతో పాటు చేర్చి గ్రుచ్చినారు ఇంతకంటె, నీ పొదలోనే ఎండకు ఎండిపోయినను, లేదా దావాగ్నికి పూర్తిగా దగ్ధమైనను, చాల బాగుండెడిది:"

సంపూర్ణా సా యథా కాలిదాసస్య—

48 అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృఙ్గం
రతివలయపదాఙ్కే చాపమాసజ్య కణ్ఠే.
సహచరమధుహస్తన్యస్తచూతాఙ్కురాస్త్రః
శతమఖముపతస్థే ప్రాఞ్జలిః పుష్పకేతుః. (కు. స. 2. 66)

విసర్గలుండుటచే నిండుగ కనబడు మాలినికి ఉదాహరణముగా కాళిదాసుని శ్లోక మెట్లనగా — 'అథ' మొ. దీని తృతీయ చతుర్థ పాదాంతముల యందు విసర్గ లున్నవి గాన ఇది సంపూర్ణముగ, అందముగ నున్నదనిభావము.

"అంత ఆ మన్మథుడు, సుందరమైన స్త్రీల కనుబొమ్మల వలె అందమైన కొనలు గల ధనస్సును రతీదేవి యొక్క వలయముల నొక్కులు చిహ్నముగా గల కంఠమునందు తగల్చుకొని, కూడా వచ్చుచున్న వసంతుని చేతిలో చూతాంకురాస్త్రము నుంచి. నమస్కరించుచు దేవేంద్రుని సమీపించెను"

ద్వితీయార్ధే సమస్తాభ్యాం ప్రాదాభ్యాం మాలినీ వరా
ప్రథమార్ధే సమస్తాభ్యాం పాదాభ్యామవరా మతా. 23

ఉత్తరార్ధములోని పాదములు రెండును కలిసి ఉన్నచో మాలిని శ్రేష్ఠము. పూర్వార్ధములోని పాదములు రెండును కలిసి ఉన్నచో మంచిది కాదు.

ద్వితీయార్ధే సమస్తపాదా యథా గన్ధినకస్య—

49. కరతరలితబన్ధం కఞ్చుకం కుర్వతీనాం
ప్రతిఫలితమిదానీం దైపమాత్రమర్చిః.

స్తనతటపరిణాహే భామినీనాం భవిష్య-
న్నఖపదలిపిలీలాసూత్రపాతం కరోతి.

ద్వితీయార్ధములో సమస్త పాద యగు మాలినికి ఉదాహరణముగా గ్రన్థినకుని శ్లోకము— 'కర' మొ. ఈ శ్లోకములోని తృతీయ చతుర్థ పాదములు ('భవిష్యన్నఖ') సంధిలో కలియుటచే అందముగా నున్నది

"ఇపుడు (సాయం సమయమున) భామినులు తమ రవికెల బంధనములను శిథిలము చేయుచున్నారు అందుచే వారి విశాలస్తనతటముపై ఎఱ్ఱని దీపకాంతి ప్రతిఫలించుచున్నది. ఇది కొలది సేపటిలో చేయనున్న నఖక్షత లీలకు సూత్రపాతము చేయుచున్నట్లున్నది"

(చిత్తరువు మొదలగునవి వ్రాయువారు ముందుగా ఆనవాలుగా దారము, రంగుపిండి మొదలగువాటితో గుర్తులు పెట్టుకొందురు. దానికి సూత్రపాత మని పేరు)

ప్రథమార్ధే సమస్తపాదా యథా రాజశేఖరస్య—

50 ఇహ హి నవవసన్తే మఞ్జరీపుఞ్జరేణు
చ్ఛురణధవలదేహా బద్ధహేలం స్మరన్తి.
తరలమలిసమూహా హారిహుంకారకణ్ఠా
బహులపరిమలాలీ సున్దరం సిన్దువారమ్. (వి. శా. 1 30)

పూర్వార్ధములో సమస్తపాద యగు మాలినికి ఉదాహరణముగా రాజశేఖరుని శ్లోకము:—

'ఇహ' మొ. ఇచట ప్రథమద్వితీయపాదములు సంధిచే ("రేణుచ్ఛురణ") కలిపినవి. ఇట్లు కలియుట అందముగా లేదని ఆశయము.

"ఈ నవవసంతమునందు, పుష్పగుచ్ఛములలోని పుప్పొడి తగిలి తెల్లని దేహములు కలవియు, మనోహర మైన హుంకారధ్వని కలవియు అగు తుమ్మెదల సముదాయములు, అత్యధిక మైన పరిమలముతో సుందర మైన సిందువారమును విలాసపూర్వకముగా చేరుచున్నవి".

అజ్ఞోఽప్యలక్ష్యం మాలిన్యాం వీణాయా ఇవ విస్వరమ్
శ్రుత్వైవోద్వేగమాయాతి వాచా వక్తుం న వేత్తి తత్ 24.

వీణావాదనములోని అపస్వరమును వలె మాలిన్యవృత్తములోని, సంగా గుర్తింప శక్యము కాని విస్వరమును కూడా వినినంతనే, ఏమీ తెలియని వానికి కూడ ఉద్వేగము కలుగును. ఐతే అక్కడ ఆ దోష మేమిటో అతడు మాటలలో చెప్పలేకపోవచ్చును.

యథా భట్టేన్దురాజస్య—

51. రహసి హృతదుకూలా శీలితా తైలదీపే
త్వదుపగతసమృద్ధేః ప్రేయసీ శ్రోత్రియస్య.
వికిరతి పటవాసైర్గన్ధి కర్ణావతంసైః
శమయతి మణిదీపం పాణిఫూత్కానిలేన

ఉదాహరణమునకు భట్టేందురాజు శ్లోకము;—

'రహసి' మొ. దీనిలోని విస్వరత్వమును 25వ కారికలో వివరింప నున్నాడు.

"నీవలన మహైశ్వర్యమును పొందిన శ్రోత్రియుని ప్రేయసి. పూర్వము నూనె దీపాలలో పెరిగినది. ఇపుడు, రహస్యమునందు, ఆమె దుకూల మును హరించినపుడు, మాణిక్యదీపము వైపు పటవాసములను చిమ్ముచున్నది కర్ణభూషణములచే ఆదీపమును కొట్టుచున్నది. చేతులను కదల్చిన గాలిచేతను, నోటితో ఊదిన గాలిచేతను శాంతింపచేయుచున్నది."

తైలదీపాల అలవాటుచే, ఇది మణిదీప మను మాట మరచిన దని అర్థము. శరీరమునకు పూసికొను గంధచూర్ణము పటవాసము.

గురులఘ్వాదినియమాదవిభ్రష్టేఽపి లక్షణాత్
దోషస్త్వదుపగేత్యత్ర శ్రోత్రగ్రాహ్యోఽస్తి విస్వరః. 25

లక్షణములో చెప్పిన గురు-లఘ్వాదుల కూర్పునకు సంబంధించిన నియమమునకు భంగము లేకున్నను, 'త్వదుపగత' అనుచోట విస్వరరూప మగు దోష మొకటి ఉన్నది. అది చెవికి మాత్రమే తెలియును

ప్రథమం ద్వ్యక్షరై శ్ఛేదై స్తతస్త్రిచతురాక్షరైః
పఞ్చాక్షరైశ్చ పర్యన్తే నర్కుటం యాతి చారుతామ్. 26

నర్కుట వృత్తమున మొదట రెండేసి అక్షరముల పైనను, తరువాత మూడు-నాలుగు అక్షరముల పైనను, చివర ఐదు అక్షరముల పైనను పదముల విరుపు ఉన్నచో అందముగ ఉండును.

యథా వీరదేవస్య—

52. తవ శతపత్ర పత్ర మృదు తామ్ర తలశ్చరణ
శ్చల కలహంస నూపురవరధ్వనినా ముఖరః.
మహిషమహాసురస్య శిరసి ప్రసభం నిహితః
సకలమహీధరేన్ద్రగురుతాం కథమమ్బ గతః.

ఉదాహరణముగా వీరదేవుని శ్లోకము 'తవ' మొ దీనిలో వెనుక చెప్పినట్లు పదముల విరుపు ఉన్నట్లు సమన్వయించుకొనవలెను.

"ఓతల్లీ! నీ పాదము పద్మము రేకుల వలె మృదువైన, ఎఱ్ఱనైన అడుగు భాగము గలది. కదలుచున్న కలహంసల వంటి నూపురముల ధ్వనిచే మ్రోగుచున్నది. మహిషమహాసురుని శిరస్సుపై బలాత్కారముగ ఉంచబడినది. అట్టి సకలమహీధరేంద్రగురుత్వమును (సమస్తములైన పర్వతముల రాజుకంటె బరువుగా నుండుట, అట్టి పర్వతరాజగు హిమవంతుడు తండ్రిగా కలిగి యుండుట అని రెండర్థములు) ఎట్లు పొందినదోకదా!"

విపరీతం యథాస్యైవ—

53. సశిఖిశిఖేవ ధూమనిచితాఞ్జనశైలగుహా
సకపిశపన్నగేవ యమునోన్నతనీలశిలా.

మహిషమహాసురోపహిత భాసురశూలకరా
బహులనిశేవ భాసి సతడిద్ఘనమేఘయుతా.

పై నియమమునకు విపరీతముగ ఈతనిదే మరి యొక శ్లోకము—
"స శిఖి" మొ.

"మహిషమహాసురునిపై ఉంచబడిన శూలము చేతితో పట్టుకొనిన నీవు, అగ్ని జ్వాలతో గూడినదై ధూమముచే వ్యాప్తమైన అంజన శైలగుహ వలె కపిశవర్ణము గల సర్పముతో గూడిన, ఉన్నతమైన నీలశిలలు కల యమున వలె, త్రాడువంటి మెఱుపుతో కూడిన మేఘము గల కృష్ణపక్షరాత్రి వలె ఉన్నావు"

అసమాసైః పదైర్భాతి పృథ్వీ పృథ్వీ పృథక్ స్థితైః
సమాసగ్రన్థిభిః సైవ యాతి సంకోచఖర్వతామ్. 27

పృథ్వీవృత్తము సమాసములు లేని, విడివిడిగా ఉన్న పదములతో విశాలముగ ఉండును సమాసముల ముడులు వేసినచో అదియే సంకుచితమై పోయి, గూసుకలది వలె ఉండును.

పృథక్పదా యథా సాహిలస్య—

54. కచగ్రహమనుగ్రహం దశనఖణ్డనం మణ్డనం
దృగఞ్జనమవఞ్జనం ముఖరసార్పణం తర్పణమ్.
నఖార్దనమతర్దనం దృఢమపీడనం పీడనం
కరోతి రతిసఙ్గరే మకరకేతనః కామినామ్.

వేరు వేరు పదముల కూర్పు గల పృథ్వీవృత్తమునకు ఉదాహరణముగా సాహిలుని శ్లోకము— "కచగ్రహ" మొ. ఇందు దీర్ఘసమాసములు లేక వృత్తము విశాలముగ నున్నట్లు ఉన్నది.

"కాముకుల రతియుద్ధములో మన్మథుడు, జుట్టుపట్టి లాగుటను అనుగ్రహముగాను, దంతఖండనమును అలంకారముగాను, చూపులు వంచుటను అవంచనము గాను, ముఖరసమును అర్పించుటను సంతర్పణముగాను, గోళ్ళతో గీరుటను బాధింపకుండుటగాను, దృఢముగా పీడించుటను పీడింపకుండుటగాను చేయుచున్నాడు".

సమాసవతీ యథా మమ-

56. కచగ్రహసముల్లసత్క్రమలకోపపీడాజడ
ద్విరేఫకలకూజితానుకృతసీత్కృతాలఙ్కృతాః.
జయన్తి సురతోత్సవవ్యతికరే కురఙ్గీదృశాం
ప్రమోదమదనిర్భరప్రణయచుమ్బినో విభ్రమాః.

సమాసము ఉన్న పృథ్వీవృత్తమున కుదాహరణముగా నా శ్లోక మెట్లనగా - "కచగ్రహ" మొ. ఇది దీర్ఘసమాసయుక్త మగుటచే సంకుచితము వలె అయి అంతగా హృద్యముగ లేదని భావము.

"సురతోత్సవసమయమున మృగనయనల విలాసాలు. జుట్టుముడిని పట్టుకొని నపుడు బయల్వెడలుచున్న సీత్కారముచే ('స్స్' అను ధ్వని చేయుట సీత్కారము) అలంకరింపబడినవి. ఆ సీత్కారములు కమలములు ముకుళీభవించు నపుడు కలిగిన పీడచే జడము లైన తుమ్మెదల మధుర కూజితముల వలె నున్నవి మరియు ఆ విలాసలు ఆనందముతోడను, మదముతోడను నిండిన ప్రేమతో కూడినవి అట్టి విలాసాలు సర్వోత్కర్షగనున్నవి".

పృథ్వీ సాకారగమ్భీరై రోజఃసర్జిభిరక్షరైః
సమాసగ్రంథియుక్తాపి యాతి ప్రత్యుత దీర్ఘతామ్. 28

సమాసగ్రంథులున్నను పృథ్వీవృత్తము. ఆకారములతో కూడి గంభీరమైనవియు ఓజస్సును సృజించునవియు, అగు అక్షరములతో కూడినట్లయితే సంకోచఖర్వత్వమును పొందుటకు బదులు దీర్ఘత్వమును (విశాలత్వమును) పొందును.

యథా భట్టనారాయణస్య—

57 మహాప్రలయమారుతక్షుభిత పుష్కరావర్తక
ప్రచణ్డఘనగర్జిత ప్రతిరుతానుకారీ ముహుః.
రవః శ్రవణభైరవః స్థగితరోదసీకన్దరః
కుతోఽద్య సమరోదధేరయమభూతపూర్వః శ్రుతః.
(వే సం. 3. 4)

ఉదాహరణముగా భట్టనారాయణుని శ్లోకము:-

"మహాప్రలయ" మొ॥ ఈ శ్లోకములో అకారములు ఎక్కువగా ఉన్నవి. ర వంటి కటువర్ణములును, మహాప్రాణవర్ణములును, ఓజోవర్ధకములుగ నున్నవి. అందుచే దీర్ఘ సమాసయుక్తమైనను ఈ శ్లోకము బాగున్నది.

"ఏమిది! యుద్ధ సముద్రమునుండి చెవులకు భయంకరముగ నున్న దియు, భూమ్యాకాశమధ్యరంధ్రమును కప్పివేయుచున్నదియు, పూర్వ మెన్నడును లేనిదియు, మహాప్రలయవాయువుచే క్షోభింపచేయబడిన పుష్కరావర్తక మనెడు మేఘము గర్జితప్రతిధ్వని వలె నున్నదియు అగు ధ్వని మాటి మాటికిని వినవచ్చుచున్నదే!"

త్వరాతరల విచ్ఛేదైర్విభాతి హారిణీ పదైః
మన్థరైర్గ్రన్థిబద్ధేవ యాతి నిఃస్పన్దసఙ్గతామ్. 29

తొందరగా కదలెడు విచ్ఛేదములు గల పదములతో హారిణి చక్కగ ఉండును. ఆ పదవిచ్ఛేదములు మందముగా ఉన్నచో, ముడులుపడినట్లు సరియైన నడక లేకుండును.

తరలపదా యథా దీపకస్య—

58. తనుధనహార క్రూరస్తేనోత్కటాం వికటాటవీం
తరతి తరసా శౌర్యోత్సేకాత్ స్వసార్థవశాజ్జనః.

పురవరవధూలీలావల్గత్కటాక్ష బలాకులే
నగరనికటే పన్థాః పాన్థ స్ఫుటం దురతిక్రమః.

చంచల పదములు గల హారిణికి ఉదాహరణగా క్షేమేంద్రుని శ్లోకము— 'తను' మొ. ఇచట "తను—ధన—హర—క్రూర"— ఇత్యాదివిధమున చాల చోట్ల రెండేసి అక్షరములకు పదములు విరుగుటచే పద్యము నడక చంచల ముగ అందముగ నున్నది.

"ఓ పాంథుడా శరీరమును, ధనమును హరించు క్రూరులైన దొంగ లతో భయంకర మైన మహారణ్యమును కూడ, మానవుడు శౌర్యాతిశయము వలనను, కూడా ఉన్న జనసముదాయము సహాయము వలనను అనాయాసముగా దాటివేయవచ్చును. కాని, నాగరికస్త్రీల లీలాచపలము లగు కటాక్షము లనెడు సైన్యముచే వ్యాకుల మైన నగరసమీపమునందలి మార్గము మాత్రము దాటుటకు చాల కష్టమైనది."

మన్థరైర్యథా భట్టేన్దురాజస్య—

59. గుణపరిచయస్తీర్థే వాసః స్థిరోభయపక్షతా
వపురతిదృఢం వృత్తం సమ్యక్ సఖే తవ కిం పునః.
సరతి సుమతే యస్త్వాం పాతుం దృశా వినిమేషయా
బడిశ! విషమం తస్యాక్షేపం కరోషి సహాసుభిః.

మందమైన విచ్ఛేదములు గల హారిణికి ఉదాహరణముగా భట్టేందు రాజు శ్లోకము — 'గుణ' మొ. దీనిలోని విచ్ఛేదములు వెనుకటి శ్లోకమునందు వలె తరలములు కావనిభావము.

"ఓ బడిశమా! (చేపలను పట్టు గాలము), నీకు గుణపరిచయము (త్రాడుతో పరిచయము సద్గుణముల పరిచయము అని రెండర్థములు) ఉన్నది. తీర్థమునందు నివాసము, రెండు పక్షములు (పార్శ్వములును) స్థిరము లుగా నున్నవి. శరీరము చాలా దృఢ మైనది. కాగా వృత్త మైనది అనగా వర్తులాకార మైనది, (నీ నడవడి మంచిది అని రెండవ అర్థము) కాని.

ఓసుమతీ! రెప్పపాటు లేని కంటితో నిన్ను త్రాగుటకై (సాదరముగా చూచుటకై) వచ్చినవానిని (దేవలకు రెప్పపాటు ఉండదని చెప్పుదురు) ప్రాణాలతోపాటు అన్యాయముగా లాగివేయుచున్నావు"

త్రిషు పాదేషు విశ్రాన్తలీలాస్సైరరితా పదైః
అన్తే తరఙ్గితగతిర్హారిణీ హారిణీ తరామ్ 30

మొదటి మూడు పాదములలో పదములు మెల్లగా నడచుటచే సుందరముగ నుండు హరిణీవృత్తము, చివరి పాదమున శీఘ్రముగ నడచినచో అది చాల మనోహరముగ నుండును

యథాస్యైవ—

60 ఉపపరిసరం గోదావర్యాః పరిత్యజతాధ్వగాః
సరణి మపరో మార్గస్తావద్భవద్భిరవేక్ష్యతామ్.
ఇహ హి విహితో రక్తాశోకః కయాపి హతాశయా
చరణనలినన్యాసోదఞ్చన్నవాఙ్కురకఞ్చుకః. 60.

ఉదాహరణముగా ఈతని (భట్టేందురాజు) శ్లోకము:-

"ఉపపరిసరం" మొ. మొదటి మూడు పాదములలో దీని నడక అనుస్వారదీర్ఘాదులచే మందముగను, నాల్గవపాదమున శ్రీఘ్రముగను ఉన్నదని భావము.

"ఓ! బాటసారులారా! గోదావరీ ప్రాంతమునందున్న మార్గమును పరిహరించండి. మరి యొక మార్గమును చూచుకొనండి. ఇక్కడ ఎవరో ఒక నిర్దయురాలు పాదపద్మన్యాసముచే రక్తాశోకవృక్షమును నవాంకురములు తొడుగునట్లు చేసినది".

శిఖరిణ్యాః సమారోహోత్సాహజైవౌజసః స్థితిః
సైవ లుప్తవిసర్గాన్తైః ప్రయాత్యత్యన్తమున్నతిమ్. 31.

శిఖరిణీ వృత్తమును అధిష్ఠించుటవలన (గ్రహించుటవలన) సహజము గానే ఓజస్సు ఉండును. విసర్గలు లోపించిన అంతములు గల పదాలతో ఆ ఓజస్సు అత్యున్నతిని పొందును.

యథా ముక్తాకణస్య—

61. యథా రన్ధ్రం వ్యోమ్నశ్చల జలదధూమః స్థగయతి
స్ఫులిఙ్గానాం రూపం దధతి చ యథా కీటమణయః.
యథా విద్యుజ్జ్వాలోల్లసనపరిపిఙ్గాశ్చ కకుభ—
స్తథా మన్యే లగ్నః పథిక తరుఖణ్డే స్మరదవః.

ఉదాహరణముగా ముక్తాకణుని శ్లోకము—

"యథా" మొ. ఈ శ్లోకము కవికంఠాభరణములో ద్వితీయసంధిలో ఆరవ శ్లోకముగ వెనుక (పు 155) వచ్చినది.

విపరీతా యథా భట్టశ్యామలస్య:—

62. ధృతో గణ్డాభోగే మధుప ఇవ బద్ధోఽఞ్జలిపరే
విలాసిన్యా ముక్తో బకులతరు మాపుష్పయతి యః.
విలాసో నేత్రాణాం తరుణసహకారప్రియసఖః
స గణ్డూషః సీధోః కథమివ శిరః ప్రాప్స్యతి మధోః.

దీనికి విపరీత మైన ఓజఃస్థితికి ఉదాహరణముగా భట్టశ్యామలుని శ్లోకము - "ధృతోగణ్డాభోగే" మొ॥

మొదటిశ్లోకములో శిఖరిణీ వృత్తమును బట్టియే సహజముగా ఓజస్సు లభించినది. రెండవ శ్లోకమున 'ధృతో' 'బద్ధో' మొదలగు విసర్గలోపము వలన, (విసర్గకు బదులుగా ఓకారాదేశాదులు వచ్చిన రూపముల ప్రయోగము వలన) ఈ ఓజస్సు ఉన్నతిని పొందిన దని క్షేమేంద్రుని అభిప్రాయమై

ఉండును. ఇలాంటి స్థలములలోని చమత్కారతారతమ్యము తాదృశసహృదయైకవేద్యము. ఈ రెండవశ్లోకము అర్థము (భావము) అస్పష్టముగా నున్నది

"పద్మవివరమున బంధింపబడిన తుమ్మెదల వలె, విశాలగండమునందు (పుక్కిట) ధరింపబడిన ఏ మద్యగండూషము (పుక్కిటిలో పట్టిన మద్యము) విలాసవతిచే (వకులవృక్షముపై) విడువబడినదై, వకులవృక్షమును పుష్పింపజేయునో, అట్టి మద్యగండూషము, తరుణ సహకారవృక్షముల ప్రియసఖుడైన నేత్రవిలాసము, వసంతముయొక్క శిరస్సును ఎట్లు పొందును?"

"స్త్రీణాంస్పర్శాత్ప్రియఙ్గుర్వికసతి వకులః సీధుగణ్డూషసేకాత్
పాదాఘాతాదశోక స్తిలకకురవకౌ వీక్షణాలిఙ్గనాభ్యామ్.
మన్దారో నర్మవాక్యాత్పటుమృదుహసనాచ్చమ్పకో వక్త్రవాతా
చ్చూతో గీతాన్నమేరుర్వికసతి చ పురో నర్తనాత్కర్ణికారః."

అను ప్రసిద్ధశ్లోకములో చెప్పినట్లు స్త్రీ సీధుగండూషసేకముచేత వకులము పుష్పించునని కవిసమయము.

శిఖరిణ్యాః పదైశ్ఛిన్నైః స్వరూపం పరిహీయతే
ముక్తాలతాయా నిఃసూత్రముక్తైర్ముక్తాఫలైరివ. 32.

దారము లేకపోవుటచే ముత్యములన్నియు జారిపోగా, ముత్యాలహారము స్వరూపమే లోపించినట్లు, పదములన్నియు చిన్న ముక్కలుగా విడిపోయిన యెడల శిఖరిణీవృత్తము రూపమే లోపించును.

యథా భట్టభవభూతేః—

63. అసారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం
నిరాలోకం లోకం మరణ శరణం బాన్ధవజనమ్.
అదర్పం కన్దర్పం జననయననిర్మాణమఫలం
జగజ్జీర్ణారణ్యం కథమసి విధాతుం వ్యవసితః.

(మా. మా. 5 50)

ఉదాహరణమునకు భట్టభవభూతి శ్లోకము:—

"అసారం" మొ. దీనిలో పదము లన్నియు చిన్న చిన్న తునకలుగా ఉండుటచే శిఖరిణీవృత్తమున కుండవలసిన సహజ సౌందర్యమే లోపించిన దని భావము

"ఏమిది! ఈ మాలతిని సంహరింపదలచిన నీవు సంసారమును అసారమును గాను, త్రిలోకములను అపహరింపబడిన రత్నముకలవాటిని గాను, లోకమును వెలుతురు లేనిదానిని గాను, బాంధవులను మరణమే శరణము కల వారిని గను, మన్మథుని గర్వవిహీనుని గాను, జనుల నేత్రసృష్టిని నిష్ఫల మైనదానినిగను ఈ జగత్తును జీర్ణారణ్యముగను చేయుటకై సమకట్టినావు!"

> శ్లోకేఽస్మిన్ సచమత్కార సరసాస్వాదశాలిని
> కేవలం శిఖరిణ్యైవ స్వరూపమపహారితమ్. 33.

ఈ శ్లోకములో చమత్కారజనక మైన రసాస్వాద మున్నది. ఐతే శిఖరిణీవృత్తము మాత్రము తన స్వరూపమును కోల్పోయినది.

> మన్దాక్రాన్తా విసద్భిశ్చతుర్భిః ప్రథమాక్షరైః
> మధ్యమశ్చేఽతి చతురే మన్దాక్రాన్తా విరాజతే. 34.

మొదటి నాలుగక్షరములను (దీర్ఘానుస్వారాదులతో) మెల్లిగా నడిపించి, మధ్య మున్న ఆరు అక్షరములనునేర్పుగా కూర్చినచో మందాక్రాంతావృత్తము చక్కగా ఉండును.

యథా కాలిదాసస్య—

64\. బ్రహ్మావర్తం జనపదమథ చ్ఛాయయా గాహమానః
క్షేత్రం క్షత్త్రప్రధనపిశునం కౌరవం తద్భజేథాః.
రాజన్యానాం శితశరశతైర్యత్ర గాణ్డీవధన్వా
ధారాసారైస్త్వమివ కమలాన్యభ్యవర్షన్ముఖాని.
(మేఘ. 1. 51)

ఉదాహరణమునకు కాళిదాసుని శ్లోకము:— "బ్రహ్మావర్తమ్" మొ.

ఈ శ్లోకములో పాదాలలోని మొదటి నాలుగు అక్షరములు దీర్ఘసంయోగాదులచే మెల్లగ నడచినవి. తరువాత వచ్చు ఆరక్షరములును చేరికగా పలుకుటకు వీలుగా ఉన్నవి. ఈ విధముగ దీని నడకలో ఒక సొగసు ఉన్నది.

"అటు పిమ్మట బ్రహ్మావర్త మను జనపదమును నీడతో ప్రవేశించి, క్షత్రియుల నాశనమును సూచించు ఆ కౌరవక్షేత్రమును సేవింపుము. ఇచట అర్జునుడు వాడి యైన వందలకొలది బాణములతో, నీవు అవిచ్ఛిన్నములైన వర్షధారాపాతములతో కమలములను అభిషేకించినట్లు, రాజుల ముఖములను అభిషేకించెను."

ఆదిమధ్యే తుల్యా యథాస్యైవ—

65 కశ్చిత్కాన్తావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః।
యక్షశ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు
(మేఘ. 1. 1.)

ప్రారంభమునందును, మధ్యమందును తుల్యముగానున్నది (అంతగా రుచిరముగ లేనిది) ఈ కవిదే మరి యొక శ్లోకము:—

"కశ్చిత్కాన్తా" మొ. ఈ భేదము కూడ క్షేమేంద్రాది సహృదయైక వేద్యము.

"తన కర్తవ్యమునందు ప్రమత్తుడై ఒక సంవత్సరముపాటుఅనుభవింపదగిన, కాంతావిరహముచేదుర్భరమైన ప్రభుశాపముచేత అస్తమించిన మహిమగల ఒక యక్షుడు, సీతాదేవి స్నానముచేయుటచే పవిత్ర మైన ఉదకములు గల, దట్టముగా ఉన్న ఛాయావృక్షములుగల, రామగిర్యాశ్రమములందు నివసించెను."

సాకారాద్యక్షరైః పాదపర్యన్తైః సవిసర్గకైః
శార్దూలక్రీడితం ధత్తే తేజో జీవితమూర్జితమ్. 35.

ఆకారముతో కూడిన ఆద్యక్షరములతోడను, విసర్గలతో కూడిన పాదాంతములతోడను, శార్దూలవిక్రీడితవృత్తము, అత్యధికమైన తేజోరూపమైన జీవితమును ధరించును.

యథా భట్టశ్యామలస్య—

66. ఆలానం జయకుఞ్జరస్య దృషదాం సేతుర్విపద్వారిధేః
పూర్వాద్రిః కరవాలచణ్డమహసో లీలోపధానం శ్రియః.
సఙ్గ్రామామృతసాగరప్రమథనక్రీడాకృతౌ మన్థరో
రాజన్! రాజతి వీరవైరివనితావైధవ్యదస్తే కరః.

ఉదాహరణముగా భట్టశ్యామలుని శ్లోకము:– "ఆలానమ్" మొ. ఇచట ప్రారంభమున ఆకారమున్నది. పాదాంతములందు విసర్గలున్నవి.

"ఓరాజా! నీహస్తము, జయ మనెడు ఏనుగను బంధించుస్తంభము. ఆపత్సముద్రమునకు ఱాళ్ళతో నిర్మించిన సేతువు. ఖడ్గసూర్యునకు ఉదయపర్వతము, లక్ష్మికి విలాసార్థమైన తలగడ. యుద్ధ మనెడు అమృతసాగరమునుమథించుట యనెడు క్రీడను చేయుటలో మందరము వీరులైన శత్రువుల స్త్రీలకు వైధవ్యము నిచ్చునది."

విపరీతం యథా లాటడిణ్డీరస్య—

67. చిత్రం తావదిదం సురేన్ద్రభవనాన్మన్దాకినీపాథసా
కేనాప్యుత్తమతేజసా నృపతినా క్ష్మామణ్డలం మణ్డితమ్.
నాతశ్చిత్రతరం నిశాకరకలాలావణ్యదుగ్ధోదధే
ర్యా మేర్యద్భవతా విరిఞ్చనగరీ కీర్తిప్లవైః ప్లావ్యతే.

దీనికి విపరీతముగా లాటడిండీరుని శ్లోకము:—

"చిత్ర" మొ. ఈ శ్లోకములో పాద ప్రారంభమున అకార ఆకారములు లేవు. అంతమున విసర్గలు లేవు గాన ఇది అంతగా మనోహారి కాదనిభావము.

"ఉత్తమతేజఃశాలియైన ఒక రాజు (భగీరథుడు) స్వర్గమునుండి మందాకినీ జలమును తీసికొనివచ్చి భూమండలమును అలంకరించినాడు; ఇది ఆశ్చర్యకరమే. ఐతే. నీచే చంద్రకళాసదృశలావణ్యము గల పాలసముద్రముగా నేర్పడిన భూమినుండి, కీర్తిప్రవాహములచే, బ్రహ్మలోకము ముంచెత్తివేయబడుచున్నది. ఇంతకంటె ఎక్కువ ఆశ్చర్యకరమైనది మరొకటి లేదు."

విసర్జనీయస్యోత్వేన పదైర్నిమ్నోన్నతైరివ
శార్దూలక్రీడితం యాతి పాఠే సాయాసతామివ 36.

విసర్జనీయమునకు ఉత్వము వచ్చి పదములు ఎత్తుపల్లములవలె (ఎగుడు దిగుడుగా) అయిపోవుటతో శార్దూలక్రీడితము, చదువుతున్నపుడు ఆయాస పడుచున్నట్లుండును.

యథా ముక్తాకణస్య:—

68. లీలాచామరడమ్బరో రతిపతేర్బాలాఽమ్బుదశ్రేణయో
రాగోద్దణ్డశిఖణ్డినో ముఖవిధూద్భూతాస్తమో విభ్రమాః.
సౌగన్ధ్యోద్ధత ధావదాకులవలన్మత్తాలిమాలాకులో
ధమ్మిల్లో హరిణీదృశో విజయతే స్రస్తో రతివ్యత్యయే.

ఉదాహరణమునకు ముక్తాకణుని శ్లోకము:—

"లీలా" మొ ఈ శ్లోకములో ఏడు స్థానములలో విసర్గమునకు ఉత్వము వచ్చి, గుణముచే ఓకారముగా మారినది. చదువుతున్నపుడు ఆయాసము వచ్చుచున్నట్లుండునని ఆశయము.

"రతివ్యత్యయమునందు-పురుషాయితనమునందు-విడిపోయిన మృగ

నయనయొక్క కేశపాశము మన్మథుని విలాసార్థమైన చామరమువలె, ముఖ చంద్రుని నుండి ఆవిర్భవించిన తమశ్ఛటల వలె ఉన్నది, సువాసనకు పరు గెత్తికొని వచ్చుచున్న వ్యాకులముగా ఎగురుచున్న తుమ్మెదల పంక్తిచేత (లేదా పంక్తి వలె) వ్యాకుల మైనది. అట్టి కేశపాశము సర్వోత్కర్షగ నున్నది."

విచ్ఛిన్నపాదం పూర్వార్ధే ద్వితీయార్ధే సమాసవత్
శార్దూలక్రీడితం భాతి విపరీతమతో౽ధమమ్ 37.

శార్దూలవిక్రీడితమునందు, పూర్వార్ధములో పాదములు విడిగా ఉన్నచో ఉత్తరార్ధములో సమస్తములై ఉన్నచో అందముగా ఉండును. దీనికి విపరీత మైనయడల అది అధమము.

పూర్వార్ధే యథా భట్టభవభూతేః—

69. అజ్ఞానాద్యది వాధిపత్యరభసాదస్మత్పరోక్షం హృతా
సీతేయం ప్రవిముచ్యతాం శఠ మరుత్పుత్రస్య హస్తే౽ధునా.
నో చేల్లక్ష్మణముక్తమార్గణగణచ్ఛేదోచ్ఛలచ్ఛోణిత
చ్ఛత్రచ్ఛన్న దిగన్తమన్తకపురం పుత్రైర్వృతో యాస్యసి.

పూర్వార్ధములోని ప్రథమద్వితీయపాదములు సమసించకుండుటకు ఉదా హరణముగా భట్టభవభూతి శ్లోకము:—

"అజ్ఞానాత్" మొ. 'హృతా' అనుపదముతో ప్రథమపాదము విచ్ఛిన్న మైనది. "శోణితచ్ఛత్ర" అనునపుడు తృతీయపాదాంతచతుర్థ పాదాదులు సమసించినవి, ఇట్లుండవలె నని అర్థము.

"మేము లేనపుడు, అజ్ఞానమువలననో అధికారగర్వమువలననో సీతను హరించితివి. అయినదేదో అయినది. ఓ శఠుడా! ఇపుడామెను హనుమంతుని ద్వారా పంపివేయుము. అట్లు కానిచో, పుత్ర సమేతుడవై, లక్ష్మణుడు విడ

చిన బాణములు భేదించుటచే పైకి ఎగిసిన రక్తచ్ఛత్రములచే కప్పబడిన దిగంతములు గల యమపురమునకు వెళ్ళగలవు.''

విపరీతం యథా రిప్సోః—

70. స్నాతుం వాఞ్ఛతి కిం ముధైవ ధవళక్షీరోదఫేనచ్ఛటా
ఛాయాహారిణి వారిణి ద్యుసరితో డిణ్డీర విస్తారిణి.
ఆస్తే తే కలికాలకల్మషమషీప్రక్షాలనైకక్షమా
కీర్తిః సంనిహితైవ సప్తభువనస్వచ్ఛన్దమన్దాకినీ.

దీనికి విపరీతముగ రిప్సుకవి శ్లోకము:—

"స్నాతుం" మొ. "తెల్లని క్షీరసముద్రము యొక్క నురుగుల కాంతిని హరించునదియు, అధికమైన నురుగు కలదియు అగు ఆకాశగంగాజలమున స్నానము చేయవలెనని ఎందుకు వ్యర్థముగా కోరుచున్నావు. కలికాల పాపములనెడు మసిని ప్రక్షాళనచేయుటలో అనితరసాధారణమైన సామర్థ్యము కలదియు, ఏడు లోకములందును స్వేచ్ఛగా విహరించు మందాకినియు ఐన నీ కీర్తి సమీపముననే ఉన్నది కదా?.''

ఆద్యన్తయోర్గుణోత్కర్ష కాన్త్యా సర్వాతిశాయినోః.
శార్దూలక్రీడితం ధత్తే మధ్యే తద్గౌరవోన్నతిమ్. 38.

గుణోత్కర్షవలన కలిగిన కాంతిచే అన్నింటిని మించినఆద్యంతముల మధ్య శార్దూలవిక్రీడితము గౌరవముయొక్క ఉన్నతిని పొందును.

యథా కాలిదాసస్య—

71. గాహన్తాం మహిషా నిపానసలిలం శృఙ్గైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదమ్బకం మృగకులం రోమన్థమభ్యస్యతు.
విస్రబ్ధైః క్రియతాం వరాహపతిభిర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రాన్తిం లభతామిదం చ శిథిలజ్యాబన్ధమస్మద్ధనుః.
(శా. 2. 6.)

ఉదాహరణముగా కాళిదాసు శ్లోకము - "గాహన్తామ్" మొ. ఇచట "గాహన్తామ్" అని ఎట్లు ప్రారంభము చేయబడినదో అట్లే "విశ్రాన్తిం" ఇత్యాదివిధమున ముగింపు చేయుటలో ఈ శార్దూల విక్రీడితమున కొక సొగసు వచ్చినది.

"మహిషములు కొమ్ములచే మాటిమాటికిని కొట్టబడిన సరోజలమును ప్రవేశించుగాక. లేళ్ళ సముదాయము నీడలక్రింద గుంపుగుంపులుగా కూర్చుండి నెమరువేయుగాక. వరాహపతులు చిన్న చెరువులలో నిర్భయముగా తుంగకాయలను నములుగాక. మా ధనస్సు కూడ శిథిల మైన నారికల్దై విశ్రాంతిని పొందుగాక".

ఆద్యన్తాకారవిరహాత్పర్యన్తే చావిసర్గతః
శార్దూలక్రీడితం స్వస్య రూపం నైవోపలభ్యతే.

("శార్దూలక్రీడితస్యాస్య" అనుపాఠమున్నచోయుక్తము). ఆద్యంతము లందు ఆకారము. పాదాంతములందు విసర్గలు లేకపోయినచో శార్దూల విక్రీడితస్వరూపమే లేకుండ పోవును.

యథా శ్రీయశోవర్మణః—

72. యత్త్వన్నేత్రసమానకాన్తి సలిలే మగ్నం తదిన్దీవరం
మేఘైరన్తరితః ప్రియే తవ ముఖచ్ఛాయానుకారీ శశీ.
యేఽపి త్వద్గమనానుకారిగతయస్తే రాజహంసా గతా
స్త్వత్సాదృశ్య వినోదమాత్రమపి మే దైవేన న క్షమ్యతే.

ఉదాహరణమునకు శ్రీయశోవర్మశ్లోకము—"యత్" మొ. దీనికి ఆద్యంతములందు ఆకారము లేదు. పాదాంతములందు విసర్గ లేదు. అందుచే అంత గంభీరముగా లేదని భావము.

"ఓ! ప్రియురాలా! నీ నేత్రములతో సమానమైన కాంతి గల నల్ల కలువ నీటిలో మునిగిపోయినది. నీముఖకాంతిని అనుకరించు చంద్రుడు మేఘ

షులచే కప్పివేయబడినాడు నీ నడకను అనుకరించునడక గల రాజహంసలు కూడ వెళ్ళిపోయినవి నీ పోలికలను చూచి వినోదము చెందుదామన్నను. దైవము సహింపకున్నది."

సుకుమారరసస్యాత్ర రక్షాయై వృత్తముద్ధతమ్
వాక్పాకేనైవ గలితం కవినా నీతమల్పతామ్. 41.

శార్దూలవిక్రీడితము ఉద్ధతమైన వృత్తము. సుకుమారమైన విప్రలంభశృంగారమును రక్షించుకొనుటకై కవి ఈ వృత్తము పాకమును పల్చన చేసినాడు. దానితో ఇది అల్పమైపోయినది.

ఆకారగురుయుక్తాదిపర్యన్తా న్తవిసర్గిణీ
అసంఖ్యాతవిరామా చ స్రగ్ధరా రాజతే తరామ్. 41.

ఆదియందును, అంతమందును ఆకారము కలదియు అంతములందు విసర్గకలదియు, దగ్గరదగ్గరగ విరామములు లేని స్రగ్ధర చాలా ప్రకాశించును.

యథా రాజ శేఖరస్య—

తామ్బూలీనద్ధ ముగ్ధ క్రముకతరులతాప్రస్తరే సానుగాభిః
పాయం పాయం కలాయీకృత కదలిదలం నారికేలీఫలామ్భః.
సేవ్యన్తాం వ్యోమయాత్రా శ్రమజలజయినః సైన్యసీమన్తినీభి
ర్దాత్యూహవ్యూహకేలీకలితకుహుకుహూరావకాన్తా వనాన్తాః.
(బా. రా 1.63)

ఉదాహరణముగా రాజశేఖరుని శ్లోకము - "తామ్బూలీ" మొ. ఈ శ్లోకము మొదటి అక్షరమునందును చివరి అక్షరమునందును ఆకారమున్నది. పాదాంతములందు విసర్గలున్నవి. "గురుయుక్త" అను పదమునకు గురువైన సంయుక్తాక్షరము అంతమునందు గల అని కూడ అర్థము చెప్పవచ్చును. ఈ శ్లోకము చివర 'న్తాః' అను సంయుక్తాక్షరము, గురువు, ఉన్నది.

"తమ సహచరులతో కూడిన సైనికవనితలు, తాంబూలీలతలతో అల్లుకొనిన అందమగు పోకచెట్ల నీడలలోని ఆస్తరణములపై, దొన్నెలుగా చేసిన అరిటాకులతో నారికేళఫలజలమును త్రాగి త్రాగి, ఆకాశప్రయాణమున కలిగిన చెమటబిందువులను తొలగించునవియు, కాకసమూహముల క్రీడలలో బయల్వెడలిన కుహూకుహూధ్వనులతో మనోహరములును అగు వనాంతములను సేవింతురుగాక" (సీతాస్వయంవరమునకై సేనాసమేతముగ మిథిలాప్రాంతము చేరిన రావణుని మాటలివి.)

విపరీతం యథా చక్రకస్య—

74. సత్యం పాతాలకుక్షింభరి చిరవిలసద్దిక్కరి ప్రీణితాభ్రం
శ్రీగర్భ శ్వభ్ర మభ్రంలి హాలహరి హరిస్థానమప్యేవ కించిత్.
కల్పాన్తే వ్యాప్తవిశ్వం పరికటతి సరిన్నాథ పాథస్త్వదీయం.
కిం త్వేతత్ కుమ్భయోనేః కరకుహరదరీపూరమాచా
మతోఽభూత్.

దీనికి విపరీతముగా చక్రకవి శ్లోకము:—

"సత్యమ్" మొ. ఈ శ్లోకప్రారంభావసానములలో ఆకారము లేదు, పాదాంతములందు విసర్గలు లేవు, అందుచే దీని కంత శ్రావ్యత లేదని భావము.

"ఓ! సముద్రమా! నీ జలము పాతాలకుక్షిని నింపుచున్నది! నిజమే. దీనిలో దిగ్గజములు చాలకాలమునుండి విహరించుచున్నవి. మేఘాలను సంతోషపెట్టుచున్నది. సంపదలు లేదా లక్ష్మి గర్భమునందు గల గోతులు కలది. ఆకాశమునంటు తరంగములు కలది. కొంచెము (భాగమున) విష్ణువునకు స్థానము. కల్పాంతమున ప్రపంచము నంతను వ్యాపించి ధ్వని చేయును. కాని ఇంత జలముకూడ ఆచమనము చేయబోయిన అగస్త్యుని చేతిలోని పల్లపుభాగమును నింపునంతది మాత్రమే అయినది.

ఆద్యన్తాకారవిరహాద్వ్యక్తదోషః స్ఫుటోఽపి యః
అవిలుప్తైర్విసర్గాన్తైః స్రగ్ధరాయాం సమీహతే.

స్రగ్ధరావృత్తములో ఆద్యంతములందు ఆకారము లేకపోవుటవలన బంధమునందు దోషము స్పష్టముగ కానవచ్చును కాని అంతములం దున్న విసర్గలు లోపించకున్నచో ఆ దోషము కొంతవరకు సర్దుకొనును.

యథా మమ—

75 శౌర్యశ్రీకేశపాశః కరిదలనమిలన్మౌక్తికవ్యక్తపుష్పః
క్షోణీరక్షాభుజఙ్గః కులశిఖరిలుఠత్కీర్తినిర్మోక పట్టః.
శత్రువ్రాతప్రతాపప్రలయ జలధర స్ఫారధారాకరాలః
ప్రీత్యై లక్ష్మీకటాక్షః కువలయవిజయీ యస్య పాణౌ
కృపాణః.

ఉదాహరణముగా నా శ్లోకము:—

"శౌర్యశ్రీ" మొ ఈ శ్లోకములో ఆద్యంతములందు ఆకారము లేక పోయినను విసర్గలు లోపించకుండ ఉండుటచే దీని నడక బాగున్నదని భావము.

"అతని చేతిలోని ఖడ్గము శౌర్య లక్ష్మియొక్క కేశపాశము. ఏనుగులను (కుంభములను) బ్రద్దలు కొట్టుటచే వచ్చిన ముత్యములు దీనిని పుష్పముల వలె అలంకరించుచున్నవి. ఇది, కులపర్వతములపై దొరలుచున్న కీర్తి యనెడు కుబుసము గల, భూరక్షక మగు సర్పము. శత్రుసముదాయముల ప్రతాపమునకు ప్రలయకాలమేఘముయొక్క విస్తృతధార వలె భయంకర మైనది. లక్ష్మియొక్క కటాక్షము. భూవలయమును జయించునది. అట్టి ఈ ఖడ్గము ఆనందకరముగ నున్నది. లేదా - అగుగాక."

ఏవముద్దేశలేశేన వృత్తానాం దర్శితః క్రమః
అనయైవ దిశా సర్వం జ్ఞేయం తద్జ్ఞైర్యథోచితమ్ 43.

ఈ విధముగ వృత్తములను చెప్పిన క్రమములో కొన్ని వృత్తముల పద్ధతి చెప్పబడినది. ఈ మార్గముననే అన్నింటిని యథోచితముగ తెలుసు కొనవలెను.

మన్దాక్రాన్తా భవేన్మధ్యే శాలినీ పూరితాక్షరా
ఉపేన్ద్రవజ్రం వంశస్థం పర్యన్తైకాక్షరాధికమ్. 45
ఇత్యాది దర్శితం నేహ స్వతఃసిద్ధో హ్యయం క్రమః
న వేత్తి తదవృత్తజ్ఞస్తద్జ్ఞస్య క్వోపయుజ్యతే.. 45

మధ్యలో పూరింపబడిన అక్షరములు గల శాలినీవృత్తము మందాక్రాంతావృత్త మగును, చివర ఒక అక్షరము అధిక మైనచో ఉపేంద్రవజ్ర వృత్తము వంశస్థవృత్త మగును.

ఇలాంటి విషయములను ఇచ్చట చెప్పలేదు. ఈ క్రమము స్వతః సిద్ధమే కదా? వృత్తజ్ఞానము సరిగా లేనివానికి ఇది చెప్పినను అర్థము కాదు. తెలిసిన వానికి చెప్ప ఉపయోగము లేదు.

శాలినీవృత్తములో మ-త-త-గ-గలు ఉండును. దీనికే మొదటి నాలుగక్షరముల తరువాత ఆరు అక్షరములు (5 లఘువులు, గురువు)చేర్చినచో మందాక్రాంత మగును. ఉదా. "మత్తా గోష్ఠీగర్భమూఢప్రలాపా" - శాలినీ వృత్తము "మత్తాగోష్ఠీ" "విరహగురుణా". "గర్భమూఢప్రలాపా", మందా క్రాంత. జ-త-జ-గు-గు-లు ఉపేంద్రవజ్ర దీనికే చివర ఒక అక్షరము చేర్చినచో జ-త-జ-ర లతో వంశస్థ మగును. ఇట్టి విషయములు వృత్త జ్ఞానము కలవానికి ఎవరు చెప్పకుండగనే తెలియు నని భావము.

ఇతి పరిచితనానావాఙ్మయవాణీగుణానాం
విదితవివిధదోషోద్దేశలేశాన్తరాణామ్.
ఇద (య) మతిశయసూక్ష్మైర్వృత్తచర్చావిచారై
రభిహితమభిగమ్యం యోగితుల్యాశయానామ్. 46

నానారూపము అగు వాణీగుణములు తెలిసిన వారును, దోషములలోని అల్పభేదములను గూడ గ్రహింపగలవారును, యోగులతో తుల్య మైన ఆశయము కలవారును అగు ధీమంతులు గ్రహింపదగిన ఈ వృత్తములను గూర్చిన చర్చ మిక్కిలి సూక్ష్మములైన విచారములతో చేయబడినది.

## ఇతి శ్రీప్రకాశేన్ద్రాత్మజవ్యాసదాసాపరనామ శ్రీక్షేమేన్ద్ర విరచితే సువృత్తతిలకే గుణదోష దర్శనం నామ ద్వితీయో విన్యాసః

## తృతీయో విన్యాసః వృత్త వినియోగః

ప్రబన్ధం సుతరాం భాతి యథాస్థానం వివేచకః (నివేశితైః)
నిర్దోషైర్గుణసంయుక్తైః సువృత్తైర్మౌక్తికైరివ. 1

తగినస్థానములందు ఉంచబడినవియు, దోషరహితములును, గుణములతో (త్రాడుతో) కూడినవియు అగు మంచి వృత్తములతో (ఇది 'మౌక్తికైః' అనుదానికి విశేషణమైనపుడు-"బాగుగావర్తులాకారములోఉన్నవి" అనిఅర్థము) ముత్యములతో వలె, ప్రబంధము (కావ్యము-కంఠహారము అని రెండర్థములు) చాల ప్రకాశించును.

శాస్త్రం కావ్యం శాస్త్రకావ్యం కావ్యశాస్త్రం చ భేదతః
చతుష్ప్రకారః ప్రసరః సతాం సారస్వతో మతః. 2

శాస్త్రము, కావ్యము, శాస్త్రకావ్యము, కావ్యశాస్త్రముఅని సారస్వత ప్రక్రియ నాలుగువిధములని పండితులు అంగీకరింతురు.

శాస్త్రం కావ్యవిదః ప్రాహుః సర్వకావ్యాఙ్గలక్షణమ్
కావ్యం విశిష్టశబ్దార్థసాహిత్యసదలఙ్కృతి. 3

సమస్త మైన కావ్యాంగములకు లక్షణ మైన దానిని శాస్త్ర మని కావ్య

వేత్తలు చెప్పుదురు. విశిష్టములైన శబ్దార్థముల సాహిత్యము, ఉత్తమమైన అలంకారములు కలది కావ్యము.

వి. క్షేమేంద్రుని అభిప్రాయము ప్రకారము శాస్త్రమనగా ఇచట అలంకారశాస్త్ర మని అర్థము.

శాస్త్రకావ్యం చతుర్వర్గప్రాయం సర్వోపదేశకృత్
భట్టిభౌమకకావ్యాది కావ్యశాస్త్రం ప్రచక్షతే. 4

ధర్మార్థకామమోక్షరూపచతుర్వర్గప్రధానమై సకలవిధములగు ఉపదేశములను చేయునది శాస్త్రకావ్యము (రామాయణమహాభారతాదులుఉదాహరణముగాగ్రహింపవచ్చును). భట్టికావ్య-భౌమకకావ్యాదులు కావ్యశాస్త్ర మని చెప్పుదురు.

వి. భట్టి మహాకవి వ్యాకరణనియమములను సూచించుచు రావణవధ మను మహాకావ్యమును రచించెను అది కావ్యరూపమున నున్న వ్యాకరణ శాస్త్రము గాన దీనికి కావ్యశాస్త్రమని పేరు. భౌమకరచితమగు రావణార్జున కావ్యము కూడ అట్టిదే.

తత్ర కేవలశాస్త్రేఽపి కేచిత్ కావ్యం ప్రయుఞ్జతే
తిక్తౌషధరసోద్వేగే గుడలేశమివోపరి. 5.

చేదుమందు మీద బెల్లము చల్లినట్లు. కొందరు, కేవలశాస్త్రములోకూడ కావ్యమును ప్రయోగింతురు.

యథా వైద్యకే వాగ్భటస్య—

76. మధు ముఖమివ సోత్పలం ప్రియాయాః
కలరసనా పరివాదినీ ప్రియేవ
కుసుమచయమనోహరా చ శయ్యా
కిసలయినీ లతికేవ పుష్పితాగ్రా.

వాగ్భటునివైద్యశాస్త్రములో కావ్యప్రయోగమునకు ఉదాహరణము:—
"ముఖమివ" మొ.

"తేనె ఉత్పలములతో కూడిన ప్రియురాలి ముఖమువంటిది. కలరసన (ఒకఔషధమైయుండును?) ఎల్లప్పుడును నిందించుచుండు ప్రియురాలివంటిది. పుష్పసముదాయముతో మనోహరమైన శయ్య, చిగుళ్ళతో నిండినది, పుష్పించిన అగ్రభాగము కలది అయిన లతవంటిది."

వి. ఆయుర్వేద శాస్త్ర గ్రంథములో కూడ కావ్యములోవలె అలంకారాదులు ప్రయోగింపబడినవి గాన శాస్త్రమునందు కావ్యప్రయోగమునకు ఉదాహరణము.

శాస్త్రం కుర్యాత్ ప్రయత్నేన ప్రసన్నార్థమనుష్టుభా.
యేన సర్వోపకారాయ యాతి సుస్పష్టసేతుతామ్. 6

శాస్త్రమును అనుష్టుప్ వృత్తములో అర్థము స్పష్టముగా ఉండునట్లు రచించవలెను. అపుడది (జ్ఞానసముద్రతరణమునకు) సుస్పష్టసేతువై సర్వోపకారక మగును.

కావ్యే రసానుసారేణ వర్ణనానుగుణేన చ
కుర్వీత సర్వవృత్తానాం వినియోగం విభాగవిత్. 7

విభాగమును సరిగ తెలిసికొని, రసానుసారముగాను, వర్ణనానుగుణముగాను, కావ్యమునందు అన్ని వృత్తములను వినియోగించవలెను.

శాస్త్రకావ్యేఽతిదీర్ఘాణాం వృత్తానాం న ప్రయోజనమ్
కావ్యశాస్త్రేఽపి వృత్తాని రసాయత్తాని కావ్యవిత్. 8

శాస్త్రకావ్యములో అతిదీర్ఘములైన వృత్తములను ప్రయోగింపకూడదు. అట్లే కావ్యశాస్త్రములో కూడ కావ్యవేత్త రసానుగుణము లైన వృత్తములనే ప్రయోగించవలెను.

పురాణప్రతిబిమ్బేషు ప్రసన్నోపాయవర్త్మసు
ఉపదేశప్రధానేషు కుర్యాత్సర్వేష్వనుష్టుభమ్. 9

పురాణములకు ప్రతిబింబములును అనగా పురాణముల రీతిలో ఉండునవియు, ప్రసన్నమైన ఉపాయములకు మార్గములును, ఉపదేశ ప్రధానములును అగు అన్ని కావ్యములయందును అనుష్టుప్‌చందస్సును ప్రయోగించవలెను.

నానావృత్తవిశేషాస్తు కవేః శక్తస్య శాసనాత్
యాన్తి ప్రభోరివాత్యన్తమయోగ్యా అపి యోగ్యతామ్. 10

అత్యంతము అయొగ్యము లైన వివిధవృత్తవిశేషములు కూడా సమర్థుడైన కవియొక్క శాసనమువలన, సమర్థుడైన ప్రభువుయొక్క శాసనము వలన అయోగ్యులయిలైన వారు కూడ యోగ్యులయినట్లు, యోగ్యము లగును.

ఉగ్రగోగ్రహసంగ్రామే తత్కాలసదృశోపమాః
దృష్టాస్త ఏవ వైరాటేస్త ఏవాశ్వాః కిరీటినః. 11

గోగ్రహణసందర్భమునందు జరిగిన ఉగ్రసంగ్రామమునందు, ఉత్తరుడు తన గుఱ్ఱములనే అర్జునునికి తగిన వాటినిగా చెప్పుచు, వాటిని ఆ సమయమునకు తగిన విధముగ ఉత్తమోపమానములు కలవాటినిగ చూచెను.

వి. గోగ్రహణమునందు, కురుసైన్యమును చూచి భయపడి పారిపోవుచున్న ఉత్తరునికి ధైర్యము చెప్పి అర్జునుడు తనకు సారథ్యము చేయుటకు అతనిని ఒప్పించెను. అప్పుడు ఉత్తరుడు ఉత్సాహముతో, తన రథమునకు కట్టిన గుఱ్ఱములు శైబ్య-సుగ్రీవ-మేఘపుష్ప-బలాహకము లను శ్రీకృష్ణుని గుఱ్ఱములవంటి వనియు, అట్టి గుఱ్ఱములు కట్టిన రథము అర్జునునకును, అర్జునుడు ఆ రథమునకును తగియున్నవనియు అనెను. అర్జునుడని తెలిసిన తరువాత ఉత్తరుడు (అంతకుముందు, ఆరథమునే విడచి పారిపోదలచినవాడు) ఆగుఱ్ఱములనే శ్రీకృష్ణుని గుఱ్ఱములతో పోల్చెను. ఇది ఆ గుఱ్ఱములకు అర్జు

సుని పట్టి వచ్చిన గౌరవము. అట్లే కవి సమర్థుడైనపుడు ఏ వృత్త మైనను చక్కగనే నడచు నని భావము.

తథాప్యవస్థాసదృశైః సాధుశబ్దపదస్థితాః
సువృత్తైరేవ శోభన్తే ప్రబన్ధాః సజ్జనా ఇవ. 12

అట్లయినను. ప్రబంధములు, స్వజనుల వలె సాధుశబ్దపదములలో ఉన్నవై, (సజ్జనుల పక్షమున మంచి శబ్దములందును, పదవులందును ఉన్న వారై) అవస్థకు తగిన మంచి వృత్తములతోడనే (మంచినడవడికలతోడనే) ప్రకాశించును.

వృత్తరత్నావళీ కామాదస్థానే వినివేశితా
కథయత్యజ్ఞతామేవ మేఖలేవ గలే కృతాః 13

ఇష్టము వచ్చినట్లు అస్థానమునందు ఉంచబడిన వృత్తరత్నముల పంక్తి; మెడలో వేసుకొనిన వడ్డాణము వలె, ఆ వ్యక్తి అజ్ఞుడనే విషయమును ప్రకటించును.

న హి నామ నవోన్మేషికుచాయాశ్చారుచక్షుషః
చిరత్యక్తస్మరాచారే జరాజీర్ణకచే రుచిః. 14

నూతనముగా అంకురించుచున్న కుచములు గల, అందమైన నేత్రములు గల లలనకు, ఏనాడో మన్మథవ్యవహారము నంతను విడిచిపెట్టిన, ముసలితనముచే జీర్ణ మైన కేశపాశము గల పురుషునియందు రుచి ఉండదు కదా!

తస్మాదత్ర యథాస్థానే వినియోగాయ సంగతిః
ఉదాహరణదిఙ్మాత్రైర్దర్శితాభిమతా సతామ్. 15

అందుచే ఇచట దిఙ్మాత్రముగ ఉదాహరణములను జూపి తగు స్థానములలో వృత్తములను ఎట్లు వినియోగించవలెనో, పండితులకు అంగీకారమైన మార్గము తెలుపబడినది.

ఆరమ్భే సర్గబన్ధస్య కథావిస్తరసంగ్రహే
శమోపదేశవృత్తాన్తే సన్తః శంసన్త్యనుష్టుభమ్. 16

మహా కావ్య ప్రారంభమందును. కథావిస్తరమును సంగ్రహించి నపుడును, శమమును ఉపదేశించు కథను చెప్పునపుడును, అనుష్టుప్ ప్రయోగమును సత్పురుషులు ప్రశంసింతురు.

ఆరమ్భే యథా భర్తృమేణ్ఠస్య :-

77. ఆసీద్దైత్యో హయగ్రీవః సుహృద్వేశ్మసు యస్య తాః
ప్రథయన్తి బలం బాహ్వోః సితచ్ఛత్రస్మితాః శ్రియః.

కావ్యారంభమున అనుష్టుప్ ప్రయోగమునకు ఉదాహరణముగా భర్తృమేంఠుని శ్లోకము ఆ "సీత్" మొ. ఇది (భర్తృమేంఠుని హయగ్రీవవధ మహాకావ్యములోని మొదటి శ్లోకము. మొత్తము ప్రథమ సర్గ మంతయు రఘువంశ ప్రథమ సర్గ వలె ఈ వృత్తములోనే ఉండి యుండును. ఈ కావ్యము ఇపుడు అలభ్యము)

"ఎవ్వని మిత్రుల గృహములలో శ్వేతచ్ఛత్రములతో నవ్వుచున్న ఐశ్వర్యములు ఎవని బాహుబలమును ప్రకటించు చున్నవో అట్టి హయగ్రీవుడనే దైత్యుడు ఉండెను"

కథాప్రసఙ్గే యథాఽభినన్దస్య—

78. తస్యాం నిజభుజోద్యోగ విజితారాతిమణ్డలః
ఆఖణ్డల ఇవ శ్రీమాన్ రాజా శూద్రక ఇత్యభూత్.

కథా విస్తర సంగ్రహము చేయునపుడు అనుష్టుప్ ప్రయోగమునకు ఉదాహరణముగా అభినందుని శ్లోకము "తస్యామ్". మొ (అభినందుడు కాదంబరీకథా సారము వ్రాసెను. ఇతడు కాశ్మీరదేశీయుడు ఏడవశతాబ్ది చివరివాడు. ఇది దానిలోని శ్లోకము)

"ఆ నగరిలో, తన భుజోద్యోగముచేత జయింపబడిన శత్రు మండలము కలవాడును దేవేంద్రుడు వలె శ్రీమంతుడును అగు శూద్రకుడనే రాజు ఉండెను".

శమోపదేశే యథా మమ :-

79 పృథుశాస్త్రకథాకన్థారోమన్థేనవృథైవ కిమ్
అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్త్వజ్ఞైర్జ్యోతిరాన్తరమ్.

శమమును ఉపదేశించునపుడు అనుష్టుప్ ప్రయోగమునకు ఉదాహరణముగా నా శ్లోకము "పృథు" మొ ఇది. కవికంఠాభరణములో 43వ శ్లోకముగ (పేజి 189) వచ్చినది.

శృఙ్గారాలమ్బనోదారనాయికారూపవర్ణనమ్
వసన్తాది తదఙ్గం సచ్ఛాయముపజాతిభిః. 17

శృంగారరసమునకు ఆలంబనమైన ఉదారనాయిక యొక్క రూపమును వర్ణించునపుడును, దానికి అంగమైన వసంతాదులను వర్ణించునపుడును ఉపజాతి వృత్తముల ప్రయోగము అందముగా ఉండును

రూపవర్ణనం యథా కాళిదాసస్య—

80. మధ్యేన సా వేదివలగ్నమధ్యా
వలిత్రయం చారు బభార బాలా.
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపానమివ ప్రయుక్తమ్. (కు. సం 1. 39)

నాయికా రూపవర్ణనమునందు ఉపజాతి ప్రయోగమున కుదాహరణముగా కాళిదాసు శ్లోకము — "మధ్యేన" మొ.

"వేదివలె సన్నని నడుము గల ఆ బాలతన నడుమున మూడు వళులను

ధరించెను. అవి మన్మథుడు ఆరోహించుటకై యౌవనముచే ఏర్పరుపబడిన మెట్ల వలె ఉన్నవి".

వసన్తవర్ణనం యథాఽస్యైవ-

81. బాలేన్దువక్రాణ్యవికాసభావా
ద్బభుః పలాశాన్యతిలోహితాని।
సద్యో వసన్తేన సమాగతానాం
నఖక్షతానీవ వనస్థలీనామ్. (కు. సం. 3. 29)

వసంతవర్ణనమునకు ఉదాహరణముగా ఈతనిదే మరియొక శ్లోకము:- "బాలేన్దు" మొ.

"ఇంకను వికసించకపోవుటచే బాలచంద్రుడు వలె వక్రమైన, చాల ఎఱ్ఱగా నున్న పలాశ కోరకములు, అపుడే వసంతుని సమాగమము పొందిన వనస్థలుల నఖక్షతముల వలె ప్రకాశించినవి".

రథోద్ధతా విభావేషు భవ్యా చంద్రోదయాదిషు
షాడ్గుణ్యప్రగుణా నీతిర్వంశస్థేన విరాజతే.

చంద్రోదయాది విభావములను వర్ణించునపుడు రథోద్ధతావృత్తము శ్రేష్ఠము. (సంధి - విగ్రహ - యాన - ఆసన - ద్వైధీభావ - సమాశ్రయములను ఆరుగుణములతో ఒప్పారు రాజనీతి వంశస్థవృత్తము చేత ప్రకాశించును.

చంద్రోదయే యథాఽస్యైవ-

82. అఙ్గులీభిరివ కేశసంచయం
సంనియమ్య తిమిరం మరీచిభిః।
కుడ్మలీకృతసరోజలోచనం
చుమ్బతీవ రజనీముఖం శశీ.

చంద్రోదయ వర్ణనములో రథోద్ధతా వృత్త ప్రయోగమునకు ఉదాహరణముగా ఈతనిదే (కాళిదాసుదే) ఒక శ్లోకము-"అఙ్గులీభిః" మొ.

"వ్రేళ్ళచేత కేశములను తొలగించి పట్టినట్లు కిరణములచేత చీకటిని సంనియతము చేసి, చంద్రుడు, ముకుళములుగా చేయబడిన పద్మములనే నేత్రములుగల రాత్రిముఖమును (సాయంసమయమును)చుంబించుచున్నట్లున్నాడు."

నీతిర్యథా భారవేః :-

**శ్రియః కురూణామధిపస్య పాలనీం**
**ప్రజాసు వృత్తిం యమయుఙ్క్త వేదితుమ్.**
**స వర్ణిలిఙ్గీ విదితః సమాయయౌ**
**యుధిష్ఠిరం ద్వైతవనే వనేచరః** (కి. రా. 1. 1.)

రాజనీతిని వర్ణించునపుడు వంశస్థవృత్త ప్రయోగము నకు ఉదాహరణముగా భారవి శ్లోకము "శ్రియః" మొ. (నీతిప్రతిపాదనాత్మక మగు ప్రథమ సర్గ అంతయు ఈ వృత్తములోనే నడచినది).

"రాజ్యపరిపాలన విషయమున దుర్యోధనుడు ప్రజలలో ఎట్లు ప్రవర్తించుచున్నాడో తెలిసికొనుటకై పంపబడి, వృత్తాంతములను తెలిసికొనిన, సన్యాసివేషములో ఉన్న వనేచరుడు, ద్వైతవనములో, యుధిష్ఠిరుని వద్దకు వచ్చెను."

**వసన్తతిలకం భాతి సంకరే వీరరౌద్రయోః**
**కుర్యాత్ సర్గస్య పర్యన్తే మాలినీం ద్రుతతాలవత్. 19**

వీరరౌద్రముల సంకరము ఉన్నప్పుడు వసంతతిలకవృత్తము అందముగా ఉండును. సర్గాంతమునందు, ద్రుతతాలమును వలె, మాలినీ వృత్తమును కూర్చవలెను.

వీరరౌద్రయోర్యథా రత్నాకరస్య—

84. జృమ్భావికాసితముఖం నఖదర్పణాన్త
రావిష్కృతప్రతిముఖం గురురోషగర్భమ్.
రూపం పునాతు జనితారిచమూవిమర్శ
ముద్వృత్తదైత్యవధనిర్వహణం హరేర్వః. 84

వీరరౌద్ర రస సంకరమునందు వసంతతిలక వృత్తప్రయోగమునకు ఉదాహరణముగా రత్నాకరుని శ్లోకము— "జృమ్భా" మొ.

"ఆవలించుటచే వికసించిన ముఖము కలదియు, అద్దములవంటి గోళ్లలో కనబడుచున్న ముఖ ప్రతిబింబము కలదియు, అధికమైన రోషము గర్వమందు కలదియు, శత్రు సేనలకు భయమును కలిగించునదియు, దుర్మార్గుడైన దైత్యుని (హిరణ్యకశిపుని) వధను నిర్వహించునదియు అగు విష్ణువు యొక్క రూపము మిమ్ములను రక్షించుగాక."

సర్గాన్తే యథా కాలిదాసస్య—

85. అవచితబలిపుష్పా వేదిసంమార్గదక్షా
నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ.
గిరిశముపచచార ప్రత్యహం సా సుకేశీ
నియమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః. (కు. సం. 1. 60)

సర్గాంతమునందు మాలినీ వృత్త ప్రయోగమునకు ఉదాహరణముగా కుమారసంభవ ప్రథమ సర్గాంతమున కాళిదాసు శ్లోకము "అవచిత" మొ.

"సుకేశి యైన ఆ పార్వతి, పూజకై పుష్పములు కోయుచు, వేదికను చక్కగా తుడుచుచు, నియమవిధికి ఉపయోగించు జలమును బర్హిస్సును తీసుకొని వచ్చుచు శివుని శిరస్సుపైన నున్న చంద్రుని కిరణములు శ్రమను తొలగించుచుండగా, ప్రతిదినమునను, ఈశ్వరునికి ఉపచారములు చేసెను."

సంగీతగోష్ఠిలోని ద్రుతతాలములో నడచు చివరి ముక్తాయింపు వలె, సర్గాంతమున మాలినీ ప్రయోగము అందమును చేకూర్చునని భావము.

ఉపపన్నపరిచ్ఛేదకాలే శిఖరిణీ మతా
ఔదార్యరుచిరౌచిత్యవిచారే హారిణీ యథా. 20

తాను నమ్మి చెప్పదలచిన విషయమును నిర్ణయించి ఖచ్చితంగా చెప్పుటలో శిఖరిణీవృత్తము యుక్తముగా నుండును. ఔదార్యముతో అందమైన ఔచిత్యమును గూర్చి విచారించుటలో హారిణీవృత్తము శ్రేష్ఠము.

ఉపపన్నపరిచ్ఛేదే యథా భర్తృహరేః -

86 భవన్తో వేదాన్తప్రణిహితధియామత్ర గురవో
విచిత్రాలాపానాం వయమపి కవీనామనుచరాః.
తథాప్యేవం బ్రూమో న హి పరహితాత్పుణ్యమపరం
న చాస్మిన్ సంసారే కువలయదృశో రమ్యమపరమ్.

ఉపపన్నపరిచ్ఛేదమునకు ఉదాహరణముగా శిఖరిణీవృత్తములో, భర్తృహరిశ్లోకము:- "భవన్తః" మొ.

"మీరు వేదాంతములపై చిత్తమును నిలిపిన వారికి గురువులు. మేము కూడ విచిత్రవాక్కులుగల కవులకు అనుచరులము. అయినను మేము ఈ విధముగ వక్కాణించుచున్నాము - ఈ సంసారమునందు పరహితమును మించిన పుణ్యములేదు. కువలయనేత్రలను మించిన మరియొక రమ్యవస్తు వేదియును లేదు."

ఇందులో కవి తాననుకొన్న విషయమును నిశ్చయపూర్వకముగా చెప్పినాడు. ఇట్టి విషయములలో శిఖరిణీవృత్త విన్యాసము అందముగ నుండును.

ఔదార్యేఽప్యస్యైవ—

87. విపులహృదయైరన్యైః కైశ్చిజ్జగజ్జనితం పురా
విధృతమపరైర్దత్తం చాన్యైర్విజిత్య తృణం యథా.
ఇహ హి భువనాన్యన్యే ధీరాశ్చతుర్దశ భుఞ్జతే
కతిపయపురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః.

ఔదార్య విషయమున కూడ ఉదాహరణముగా భర్తృహరిదే మరి యొక శ్లోకము హారిణీ వృత్తములో:— "విపుల" మొ.

"పూర్వము విశాలహృదయు లెవ్వరో ఈ జగత్తును సృజించినారు. మరికొందరు దీనిని పాలించినారు. మరికొందరు దీనిని జయించి గడ్డిపరకను వలె దానము చేసినారు. మరికొందరు ధీరులు ఈ చతుర్దశ భువనములను అనుభవించు చున్నారు. ఏవో కొన్ని పురములపై ఆధిపత్యము లభించగానే మానవులకు ఈ మదజ్వరము ఎందుకో!"

ఔదార్యముతో (ఉన్నతభావముతో) కూడిన ఇట్టి సద్విచారమును నిబంధించుటకు హారిణీవృత్త ప్రయోగము ఉచితమని భావము.

సాక్షేపక్రోధధిక్కారే పరం పృథ్వీ భరక్షమా
ప్రావృట్ప్రవాసవ్యసనే మన్దాక్రాన్తా విరాజతే. 21

క్రోధములో ఆక్షేపపూర్వకముగ ధిక్కరించునపుడు పృథ్వీవృత్తము ఆ భారము నంతను వహింప సామర్థ్యము కలది. వర్షకాల ప్రవాసదుఃఖ వర్ణనమున మందాక్రాంత చాల అనుకూలముగ ఉండును.

సాక్షేపే యథా యశోవర్మణః —

88. స యస్య దశకన్ధరం ధృతవతోఽపి కక్షాన్తరే
గతః స్ఫుటమవన్ధ్యతామధిపయోధి సాన్ధ్యో విధిః.
తదాత్మజ ఇహాఙ్గదః ప్రహిత ఏష సౌమిత్రిణా
క్వ స క్వ స దశాననో నను నివేద్యతాం రాక్షసాః.

సాక్షేపధిక్కారమున పృథ్వీవృత్త ప్రయోగమునకు ఉదాహరణ ముగా యశోవర్మ శ్లోకము— "సయస్య" మొ.

"దశాననుని కక్షాంతరములో ఉంచుకొన్నను సముద్రము దగ్గర ఎవని సాంధ్యవిధికి ఎట్టి విఘ్నమును కలుగలేదో, ఆతని కుమారుడైన ఈ

అంగదుడు లక్ష్మణునిచే పంపబడినాడు. ఓరాక్షసులారా! చెప్పండి; ఎక్కడ? ఆ దశాననుడు ఎక్కడ?"

రావణుని సాక్షేపధిక్కారము చేసినట్లు వర్ణించు ఈ వాక్యమును పృథ్వీ వృత్తములో నిబంధించుటచే దీని శోభ ఇనుమడించిన దని భావము.

ప్రావృట్ప్రవాసే యథా కాలిదాసస్య—

89. తస్మిన్నద్రౌ కతిచిదబలావిప్రయుక్తః స కామీ
నీత్వా మాసాన్ కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః.
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ. (మే ఘు. 1. 2)

వర్షకాలప్రవాస వర్ణనమున మందాక్రాంతా ప్రయోగమునకు ఉదాహరణముగ కాలిదాసు శ్లోకము:— "తస్మిన్" మొ.

"భార్యావియుక్తుడైన ఆ కాముకుడు బంగారు వలయము జారిపోవుటచే శూన్యమైన ముంజేయి కలవాడై, ఆ పర్వతమున, కొన్ని మాసములు గడిపి ఆషాఢ ప్రారంభదివసమున చరియలపై దంతములతో అడ్డముగాపొడుచుచు ఆడుచున్న ఏనుగు వలె చూడముచ్చటగానున్న, పర్వతసానువులపై నున్న మేఘమును చూచెను."

శౌర్యస్తవే నృపాదీనాం శార్దూలక్రీడితం మతమ్
సావేగపవనాదీనాం వర్ణనే స్రగ్ధరా మతా. 22

రాజాదుల శౌర్యమును స్తుతించు నపుడు శార్దూల క్రీడితమును ఉపయోగింపవలెను. వేగముతో వీచు పవనము మొదలగు వాటిని వర్ణించుటకు స్రగ్ధర మంచిది.

శౌర్యస్తవే యథా శ్రీ చక్రస్య

90. నేతుం నౌభిరిభా న యాన్తి దృతిభిస్తార్యాః కియన్తో హయా
స్త్రజ్ఞానుద్వయసేన దేవ పయసా సైన్యం సముత్తార్యతామ్.

నోచేద్భఙ్గభయద్రుతారివనితానేత్రప్రణాలీలుఠ
ద్బాష్పామ్బుఃప్లవపూరితోభయతటీ ద్రాగ్వర్త్స్యతీరావతీ.

శౌర్యమును స్తుతించు నపుడు శార్దూల విక్రీడిత ప్రయోగమున కుదాహరణముగా శ్రీచంద్రుని శ్లోకము:- "నేతుమ్" మొ.

"ఏనుగలను నావలమీద తీసుకొని వెళ్ళుట కుదరదు. చిన్న తెప్పలమీద ఎన్ని గుఱ్ఱము లని దాటించగలము అందుచేత, ఓరాజా! మోకాలుబంటి నీటిమీదుగా సైన్యమును దాటింప చేయుము అట్లు కాని పక్షమున-పరాజయభయముచేత పారిపోయిన శత్రువుల వనితల నేత్రము లనెడు గొట్టములనుండి దొరలుచు వచ్చిన కన్నీటి ప్రవాహముచే నింపబడిన రెండు తటములును గల ఇరావతి శీఘ్రముగ వృద్ధిపొందగలదు."

సావేగపవనే యథా మమ పవన పఞ్చాశికాయామ్ :-

91. ప్రేఙ్ఖచ్ఛఙ్ఖాభిఘాతస్ఫుటదలితచలచ్ఛుక్తినిర్ముక్తముక్తా
ముక్తావ్యక్తాట్టహాసాః స్మరనృపసకలద్వీపసంచారచారాః.
సర్పత్కర్పూరపూరగ్రహణకరచితా దిగ్వధూకర్ణపూరా
ధావన్త్యాధ్మాతవిశ్వా రతవిఘటితవధూబన్ధవో గన్ధవాహాః

వేగముగా వీచు గాలిని వర్ణించు నపుడు స్రగ్ధరావృత్తప్రయోగమున కుదాహరణముగా పవనపంచాశికలో నా శ్లోకము:- "ప్రేఙ్ఖత్" మొ.

"దొర్లు చున్న శంఖముల ఆఘాతముచే బ్రద్దలైన. అనేకము లైన ముత్యపుచిప్పలనుండి బయటపడిన ముత్యములచే విడువబడిన (చేయబడిన) స్పష్టమైన అట్టహాసము కలవియు, సకలద్వీపములందును సంచరించు మన్మథుని గూఢచారులును, కదలుచున్న కర్పూరసముదాయమును గ్రహించుటయందాసక్తి గల హస్తములతో వ్యాప్తమైనవియు (చేతులలో పట్టుకొని విసరినట్లు కర్పూరపూరమును ఎగురగొట్టుచున్నవని యర్థము చెప్పుకొనవలెను) దిక్కు లనెడు స్త్రీల కర్ణాభరణములును, సురతమునందు శ్రమపడిన

స్త్రీలకు బాంధవులును అగు వాయువులు ప్రపంచము నంతను పూరించుచు వీచు చున్నవి."

దోధకతోటకనర్కుటయుక్తం
ముక్తకమేవ విరాజతి సూక్తమ్.
నిర్విషయస్తు రసాదిషు తేషాం
నిర్నియమశ్చ సదా వినియోగః. 23.

దోధక-తోటక-నర్కుటవృత్తములతో కూర్చిన కావ్యము ముక్తక రూపమునందు మాత్రమే ప్రకాశించును. అనగా ఈ వృత్తములను ముక్తకములలో (వెనుక ముందు శ్లోకములతో సంబంధము లేక స్వతంత్రముగ ఒక భావమును బోధించు శ్లోకము ముక్తకము) మాత్రమే ఉపయోగించవలెను. ఈ రసమునకు దీనిని ఉపయోగించవలె నని గాని, ఈ విధముగ వీటిని వినియోగించవలె నని గాని ఈ వృత్తముల విషయమున నియమము లేదు.

శేషాణామప్యనుక్తానాం వృత్తానాం విషయం వినా
వైచిత్ర్యమాత్రపాత్రాణాం వినియోగో న దర్శితః. 24

ఇక్కడ చెప్పని వృత్తములకు ప్రత్యేకించి చెప్పదగిన విషయమేదియు లేదు. వాటివలన వైచిత్ర్యము మాత్రమే కలుగును. అందుచే వాటి వినియోగమును చెప్పలేదు.

ఇత్యేష వశ్యవచసాం సర్వవృత్తప్రసఙ్గినామ్
ఉక్తో విభాగః సద్వృత్తవినివేశే విశేషవాన్. 25.

ఈ విధముగ, వశ్యవాక్కులగు, సర్వవృత్తములను ప్రయోగించ గలిగిన మహాకవులు మంచి వృత్తములను ప్రయోగించుటలో ఉన్న విశేషముతో కూడిన విభాగము చెప్పబడినది.

ఏకస్మిన్నేవ యైర్వృత్తే కృతో ద్విత్రేషు వా శ్రమః
న నామ వినియోగాస్తే దరిద్రా ఇవోత్సవే. 26.

ఒకే వృత్తమునందు గాని, రెండు మూడు వృత్తములందు గాని పరిశ్రమ చేసినవారు, ఉత్సవసమయములందు దరిద్రులు వలె, వినియోగ మునకు (వివిధవృత్తవినియోగమునకు) తగినవారు కాదు.

వృత్తే యస్య భవేద్యస్మిన్నభ్యాసేన ప్రగల్భతా
స తేనైవ విశేషేణ స్వసందర్భం ప్రదర్శయేత్. 27.

అభ్యాసము ఎక్కువగా చేయుటచే ఎవనికి ఏ వృత్తమునందు ప్రాగల్భ్యము కలుగునో ఆతడు ఆ విశేషముచేతనే తన కావ్యమును రచింపవలెను.

ఏకవృత్తాదరః ప్రాయః పూర్వేషామపి దృశ్యతే
తత్రైవాతిచమత్కారాదన్యత్రారబ్ధపూరణాత్. 28.

సాధారణముగా ప్రాచీన కవులలో గూడా ఒకే వృత్తము నందు ఆదరము కనబడుచున్నది. వారు ఆ వృత్తములో వ్రాసినపుడే ఎక్కువ చమత్కార మున్నది. మిగిలిన వృత్తములు ప్రారంభించితిమి కదా అని పూర్తి చేసినట్లుండును.

అనుష్టుప్ సతతాసక్తా సాభినన్దస్య నన్దినీ
విద్యాధరస్య వదనే గులికేవ ప్రభావభూః. 29.

అభినందుని అనుష్టుప్ నిరంతరాయముగ నడచునది. ఆనందజనకమైనది. విద్యాధరుని నోటిలోని మంత్రితగుళిక వలె ప్రభావమునకు ఉత్పత్తిస్థాన మైనది.

ఒక విధ మైన ఔషధగుళికను నోటిలో పెట్టుకొని విద్యాధరులు అలౌకిక శక్తిమంతు లగుదురు. అభినందుని అనుష్టుప్‌లో కూడ ఆ గుళికలో నున్నంత శక్తి ఉన్న దని భావము.

స్పృహణీయత్వచరితం పాణినే రుపజాతిభిః
చమత్కారైకసారాభిరుద్యానస్యేవ జాతిభిః. 30.

జాతి (విరజాజి) తీగలచే ఉద్యానవనము వలె, చమత్కారముచే నిండిన ఉపజాతులతో పాణిని రచనకు స్పృహణీయత్వము లభించినది.

("ఇది చాలా బాగున్నది; మాకు కావలెను" అని దేనిని అందరును కోరుకుందురో అదిస్పృహణీయము). పాణిని జాంబవతీ పరిణయమనుకావ్యమురచించెననిప్రసిద్ధి.

> వృత్తచ్ఛత్రస్య సా కాపి వంశస్థస్య విచిత్రతా
> ప్రతిభా భారవేర్యేన సచ్ఛాయేనాధికీకృతా. 31

వంశస్థ వృత్త మనెడు ఛత్రముయొక్క వైచిత్ర్యము అనిర్వచనీయమైనది. (వెదురుకఱ్ఱమీద నిలబడిన గుండ్రని ఛత్రము అని మరియొక అర్థము). ఛాయతో (కాంతి, నీడ అని రెండర్థములు) కూడిన ఆ వంశస్థవృత్తఛత్రము చేత భారవియొక్క ప్రతిభ ఇనుమడింపచేయబడినది.

> వసన్తతిలకారూఢా వాగ్వల్లీ గాఢసఙ్గినీ
> రత్నాకరస్యోత్కలికా చకాస్త్యాననకాననే. 32

వసంతతిలకమును అధిష్ఠించినదియు, బిగువుగా అలముకొన్నదియు, అగు రత్నాకరుని కవితాలత, బయల్వెడలిన మొగ్గలు కలదై (అత్యంతాసక్తిని కలిగించునదై) (పఠితల) ముఖము లనెడు అరణ్యమునందు ప్రకాశించుచున్నది.

> భవభూతేః శిఖరిణీ నిరర్గలతరఙ్గిణీ
> రుచిరా ఘనసన్దర్భే యా మయూరీవ నృత్యతి. 33.

భవభూతియొక్క శిఖరిణి నిరర్గల మైన నదీప్రవాహము. రుచిరమైన ఆ శిఖరిణి వర్షకాలమునందు మయూరివలె నృత్యము చేయును.

> సువశా కాలిదాసస్య మన్దాక్రాన్తా ప్రవల్గతి
> సదశ్వదమకస్యేవ కామ్బోజతురగాఙ్గనా. 34.

కాలిదాసునకు పూర్తిగా వశమైన మందాక్రాంత నేర్పుగల అశ్వశిక్షకునికి వశమైన, కాంభోజ దేశమునకు చెందిన ఆడగుఱ్ఱము వలె చక్కగ నడచును

శార్దూలక్రీడితైరేవ ప్రఖ్యాతో రాజశేఖరః
శిఖరీవ పరం వక్త్రైః సోల్లేఖైరుచ్చశేఖరః. 35.

ఉన్నతమైన శిఖరములు గల పర్వతము, సుందరములు, వర్ణనార్హములును అయిన శార్దూలగమనములచేత వలె, రాజశేఖరుడు శార్దూలవిక్రీడితములను బట్టియే ప్రసిద్ధు డాయెను.

ఇత్యేవం పూర్వకవయః సర్వవృత్తకరా అపి
అస్మిన్ హార ఇవైకస్మిన్ ప్రాయేణాభ్యధికాదరాః. 36

పూర్వకవులు సర్వవృత్తములను ఉపయోగించు వారైనను, సాధారణముగ ముత్యాల హారమునందువలె, ఈ ఒక్క వృత్తమునందే ఎక్కువ ఆదరము చూపినారు.

అనగా ఈ శార్దూల విక్రీడితమునందు ఎక్కువ ఆదరము చూపినా రని అర్థము. లేదా ఒక్కొక్క రవి, వెసుర చెప్పిన విధముగ, ఒక్కొక్క వృత్తముపై మక్కువ చూపినా డని అర్థము చెప్పవచ్చును. గాని శ్లోకములోని వాక్య నిర్మాణము మొదటి అర్థమునకే అనుగుణముగ ఉన్నది.

సువర్ణార్హప్రబన్ధేషు యథాస్థాననివేశినామ్
రత్నానామివ వృత్తానాం భవత్యభ్యధికా రుచిః. 37.

సువర్ణములకు తగిన కావ్యములలో (బంగారు అలంకారములలో) తగిన స్థానములలో ఉంచిన వృత్తముల అందము, రత్నముల అందము వలె, అధిక మగును,

తస్మాద్యథాయం వినియోగమార్గః
ప్రదర్శితో వృత్తనివేశనేషు.
తథైవ కార్యః కవిభిః కృతజ్ఞై-
రవశ్యవాచాం నియమస్తు నాయమ్. 38.

కావున, కృతజ్ఞులైన (రచించిన కావ్యములోని సౌందర్యమును గుర్తింపగలిగిన కవులు, ఆయా వృత్తములను వినియోగించుటలో మేము చెప్పిన మార్గమునే అనుసరింపవలెను. వాక్కు వశము కానివారికి ఈ నియమములు వర్తించవు. అనగా వారు ఏమ కేవృత్తము బాగుగా నడచునో ఆ వృత్తములోనే వ్రాయుట మంచిదని భావము.

ఇత్యారురుక్షోః ప్రథమోపయుక్తం
ప్రవృత్తవాచశ్చ వివేకకారి.
మహాకవేరప్యతిసూక్ష్మతత్త్వ
విచారహర్షప్రదమేతదుక్తమ్. 39

ఇంతవరకు చెప్పిన ఈ వృత్తవినియోగ మార్గము, కవిత్వపదవిని అధిష్ఠింపదలచిన వానికి ప్రారంభదశలో ఉపయోగ కరముగా ఉండును. కవితారచన అలవాటు పడిన వానికి వివేకమును కలిగించును. అతిసూక్ష్మములైన తత్త్వవిచారములు ఉండుటచే మహాకవికి కూడ ఆనందమును కలిగించును.

ఇత్యౌచిత్యప్రచురరచనావిశ్రుతశ్రవ్యవృత్త
వ్యక్తిః శక్తిప్రసృతవచసాం దర్శితా సద్గ్రహేణ.
క్షేమేన్ద్రేణ ప్రణయివిపదాం హర్తురాశ్చర్యకర్తు-
ర్భూభృద్భర్తుర్భువనజయినోఽనన్తరాజస్య రాజ్యే. 40.

## ఇతి శ్రీ ప్రకాశేన్ద్రాత్మజవ్యాసదాసాపరనామ శ్రీ క్షేమేన్ద్ర విరచితే సువృత్తతిలకే వృత్తవినియోగో నామ తృతీయో విన్యాసః

## ఇతి సువృత్తతిలకమ్.

మిత్రుల ఆపదలను తొలగించువాడును, ఆశ్చర్యకరము లగు విషయములను చేయువాడును, భువన విజేతియు అగు అనంతరాజుయొక్క రాజ్యమునందు క్షేమేంద్రుడు, ప్రతిభచే ప్రసరించిన వాక్కులు గల మహాకవుల, ఔచిత్యముతో ప్రకాశించు, ప్రసిద్ధమైన శ్రవ్యము లైన వృత్తముల వివరణమును సంగ్రహముగ చేసెను.

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిన్యాఖ్య యగు సువృత్తతిలక వ్యాఖ్యలో వృత్తవినియోగ మను తృతీయ విన్యాసము సంపూర్ణము

## సువృత్తతిలకము సంపూర్ణము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తస్యైవ జానకే జానేః పదయోరియమర్ప్యతే.

దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కేవలం కరణం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః

# శ్లోకానుక్రమణిక

| శ్లోకము | పేజి |
|---|---|
| ఉచితార్థ | 14 |
| ఉచితేన | 130 |
| ఉచితేనై | 81 |
| ఉచితైరే | 84 |
| ఉచ్చైఃశ్రవాః | 193 |
| ఉత్ఖాతప్ర | 178 |
| ఉత్పత్తిర్భ | 106 |
| ఉద్దామోత్క | 28 |
| ఉపజాతి | 228 |
| ఉపదేశ | 162 |
| ఉపపన్న | 275 |
| ఉపపరి | 251 |
| ఉపసర్గే | 6 |
| **ఊ** | |
| ఊరుమూల | 18 |
| **ఏ** | |
| ఏకమైశ్వ | 145 |
| ఏకవృత్తౌ | 280 |
| ఏకస్మిన్నే | 279 |
| ఏకేనకే | 165 |
| ఏతస్మాజ్జ | 76 |
| ఏతస్యాఃస్మ | 21 |
| ఏతాం నమః | 146 |
| ఏవముద్దే | 263 |
| ఏష బ్రహ్మ | 195 |

| శ్లోకము | పేజి |
|---|---|
| **ఓ** | |
| ఓంస్వస్త్యశ్రం | 145 |
| **ఔ** | |
| ఔచిత్యర | 10 |
| ఔచిత్యస్య | 2 |
| **క** | |
| కచగ్రహ | 247 |
| కచగ్రహ | 248 |
| కటుక్వణ | 15 |
| కణ్ఠక్రియ | 241 |
| కణ్ఠేకృత్వా | 41 |
| కణ్ఠేఘేమ్మ | 5 |
| కమలప | 238 |
| కరతర | 243 |
| కర్ణాటీద | 103 |
| కర్ణాభ్యర్ణ | 192 |
| కర్ణోత్తాలి | 118 |
| కశ్చిత్కాన్తా | 254 |
| కామః కామం | 138 |
| కాలౌచిత్యే | 96 |
| కావ్యం హృది | 110 |
| కావ్యక్రియే | 146 |
| కావ్యస్యాల | 2 |
| కావ్యార్థసా | 107 |

| శ్లోకము | పేజి |
|---|---|